అంఆ

# అమ్మ సచ్చరిత్ర

మొదటి భాగము




**ఎ. కుసుమకుమారి** ఎమ్.ఎ., బి.ఇడి.
ఆంధ్రా యూనివర్సిటీ హైస్కూల్
విశాఖపట్నం

# కృతిసమర్పణ



శ్లో॥ అవిద్యానా మన్తస్తిమిర మిహిరద్వీప నగరీ
జడానాం చైతన్యస్తబక మకరన్దస్రుతి ఝరీ
దరిద్రాణాం చింతామణి గుణనికా జన్మజలధౌ
నిమగ్నానాం దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి

ఓయమ్మా! నీ పాదరజము అజ్ఞానులకు జ్ఞానమును చీకటికి సూర్యుడున్నదీవి పట్టణముగను, మూఢులకు జ్ఞానమనెడి పూగుచ్ఛమునకు పూదేనె ప్రవాహముగను, దరిద్రులకు చింతామణిగను, సంసార సముద్రమున మునిగిన వారలకు వరాహరూపియైన విష్ణువుయొక్క కోఱగను అగుచున్నది. అట్టి లలితామూర్తియైన మాతృశ్రీ అనసూయామహాదేవి పాదపద్మములకు భక్తి పూర్వకముగా ఈ చిరుకానుకను సమర్పించుకుంటున్నాను.

- అయ్యగారి కుసుమాచక్రవర్తి



# AMMA SACHARITRA

"బ్రహ్మాండావన తత్పరా పరిణత ప్రజ్ఞాధురీణా శివా
శ్రీ నాగేశ్వర పాదపద్మ యుగళీచింతా సుధాస్వాదినీ
శ్రుత్యంత స్తవనీయ దివ్య చరితా శ్రీరాజరాజేశ్వరీ
భూయా దర్కపురీశ్వరీ శుభకరీ మాతానసూయా సతీ"

– శ్రీ పన్నాల రాధాకృష్ణశర్మగారు


Writer
**A. Kusuma Chakravarthy** M.A., B.Ed.
Andhra University High School
Visakhapatnam

అంఆ
**Amma Sacharitra**

కృతిసమర్పణ: అమ్మ పాదపద్మములకు

ద్వితీయముద్రణ:
2007 ఫిబ్రవరి, 17
నాన్నగారి ఆరాధనోత్సవం-ధాన్యాభిషేకం

ప్రతులు : 1000

వెల: రూ. **100/-**

ప్రతులకు
**ఎ.ఎస్. చక్రవర్తి**
అమ్మమందిరం
పెదవాల్తేరు
విశాఖపట్నం - 17
ఫోన్: 0891-2530346

ఆర్థిక సహకారం:
**శ్రీ విశ్వజననీ పరిషత్**
జిల్లెళ్ళమూడి
బాపట్లమండలం
గుంటూరు జిల్లా

ముద్రణ :
**సత్యం ఆఫ్‌సెట్ ఇంప్రింట్స్**
47-7-45, నెహ్రూబజార్ లైన్,
ద్వారకానగర్, విశాఖపట్నం -16.
ఫోన్స్: 0891-2735878, 6648538

# అమృతాశీస్సులు

డాక్టర్ ప్రసాదరాయకులపతి
రిటైర్డ్ ప్రిన్సిపాల్, హిందూకాలేజి, గుంటూరు
శ్రీనాథపీఠ నిర్వహణాధ్యక్షులు, గుంటూరు

మాతృశ్రీ జీవిత మహోదధిలో తరంగాలు జిల్లెళ్ళమూడి అమ్మభక్తులకు సుపరిచితమైన గ్రంథం. అమ్మ బాల్యం నుండి కొంతవయస్సు వచ్చేవరకు జరిగిన అపురూప సంఘటనలు ఇందులో ఉన్నవి. వీటిని బట్టి అమ్మ చిన్నతనం నుండి అసామాన్యమైన వ్యక్తి అని దేవీశక్తి మూర్తిభవించిన ఒక విశిష్ట మహిళ అని గోచరిస్తుంది. సకలజనులను తన బిడ్డలుగా భావించగలిగిన ఒక తపస్వినిగా, యోగినిగా ఆమె కన్పిస్తుంది. శైవవాఙ్మయంలో అక్కమహాదేవి అనే శివభక్తురాలుంది. ఆమె శివుని తన బిడ్డగా భావించేది. బాలశివుని లాలించి ఆట పాటలతో మురిపించి వాత్సల్యంతో చూచేది. పరమేశ్వరారాధనలో అది ఒక మార్గం. కామోత్కరంఠతతో గోపికలు, ప్రేమతో పాండవులు, భక్తితో నారదాదులు, భయము వల్ల కంసుడు, వైరంతో శిశుపాలాదులు తరించారని భాగవతం చెపుతున్నది. అలానే ఇదీ ఒక మార్గం. అయితే అమ్మ సమస్త జనులను శిశువులుగా వాత్సల్యంతో చూచింది. ప్రేమ దివ్య భావన. వాత్సల్యప్రేమ భావనతో విశ్వాన్ని భావించిన అనసూయామాత దివ్యమూర్తి అనటంలో సందేహించవలసిన పని లేదు.

అటువంటి ఆ మాతృమూర్తి బాల్యాన్ని తెలియజేసే గ్రంథం ఒకటి వచ్చినందువల్ల ఆమెను గూర్చిన చాలా విశేషాలు తెలసుకొనే అవకాశం కలిగింది. లోకంలో ఒక వ్యక్తి మహనీయమూర్తిగా కీర్తించబడిన స్థితి వచ్చినపుడు వారి బాల్యాన్ని గురించి ఎన్నో కల్పనలు బయలుదేరుతాయి. ఇవీ అటువంటివి అవునా కాదా అనే సందేహానికి సమాధానమేమిటంటే అవన్నీ అమ్మచేత సత్యముగా అంగీకరించబడినవి అని చెప్పబడినవి–ధృవీకరించబడినవి. ఆమె సత్యనిష్ఠ ఎరిగిన వారికిది ప్రామాణికము. ఇక ఆమెను గూర్చిన యోగుల దర్శనాలు, నాడీ శాస్త్రగ్రంథాలు, జ్యోతిష విజ్ఞానుల ఆభాషణలు దీనికి అనుకులంగానే ఉన్నవి. చాలా చిన్నతనంలో జరిగిన సంఘటనలు

వాల్మీకి దానిని "సీతాయాశ్చరితం మహత్" అన్నాడు. అంటే అది సీత చరిత్ర అలాగే ఇది మాతృశ్రీ అనసూయాదేవి చరిత్ర. రామాయణంలో ఏ శ్లోకమైనా పవిత్రమైనదే. అలాగే అమ్మ కథామహోదధిలో ఏ తరంగమైనా పవిత్రమైనదే.

సోదరికుసుమచక్రవర్తి అమ్మ సచ్చరిత్ర వ్రాసింది. అమ్మ సత్‌చిత్-ఆనందస్వరూపిణి. అమ్మది సచ్చరిత్ర కావటంలో ఆశ్చర్యమేముంది? అమ్మ జీవితం ఒక మహోదధి. అందులో తరంగాలు లెక్కించడం ఎవరివల్ల కాగలదు. కాకపోతే ఆ తరంగాలలో తడిసిపోగలము. ఆ రకంగా కొన్ని తరంగాలను స్పర్శించగలం. ఆ మహోదధిలో ఆ రకంగా తెలియాడగలం. అమ్మది వాత్సల్యమహోదధి, ప్రేమమహోదధి, అనురాగమహోదధి. అటువంటి మహోదధిని మన మనస్సనే కవ్వంతో చిలుక లేకపోయినా అమ్మ కరుణతో అమృతాన్ని ఆస్వాదించిన మహనీయులెందరో ఉన్నారు. వారు మన దృష్టిలో సామాన్యులుగా కనిపించినా మునులు, ఋషులు దేవతలువాళ్ళు. వాళ్ళు అమ్మతో (భగవతితో) అనుభవించిన అనుభూతులకు ఇచ్చిన రూపమే ఈగ్రంథంలోని రచనలన్నీ.

"మీరు కానిది నేనేదీకాదు" అని అమ్మ తాను దేవతయై హైమను దేవతనుచేసి, మనందరినీ దేవతబిడ్డలుగా చేసింది. చెల్లని రూపాయలను కూడా చెల్లుబడి చేసింది. ఈ అమ్మ, సచ్చరిత్ర మొదటిభాగంలో తన పుట్టుకతోనే ఎంతోమందికి ముక్తి ప్రసాదించిన అమ్మ పెరిగి పెద్దదవుతూ అందరికీ సుగతేనని తేటతెల్లం చేసింది. మరిడమ్మ తాతమ్మ, గొల్లనాగమ్మ, అమ్మ పెంపంకంలో ఎంత ఆనందాన్ని అనుభవించారో-జిజ్ఞాసతో చిదంబరరావు తాతగారు మరొక నరుడైనాడేమో ఈ నారాయణివద్ద. అంకదాసు, మస్తాను, మంత్రాయి. మౌలాలి, శ్యామల, గంగరాజు పున్నయ్య, గుండెలరావు, మంచినీళ్ళబిందెలు మోసుకొనే వెంకటప్పయ్య ఒకరేమిటి ఈ విధంగా చెపితే గ్రంథమంతా ఉదహరించాల్సిందే. వీరంతా అమ్మలోని దైవీశక్తిని అనుభవించి తరించినవారే. ఆఖరికి తండ్రి సీతాపతి తాతగారు, అన్న రాఘవరావు మామయ్య కూడా అమ్మను పూజించి తరించిన వారే. అమ్మను చిన్నప్పుడు పనిమనిషిగా చూచినవారే లోకవ్యాప్తి చెందిన అమ్మను చూచి బెల్లం చుట్టూ ఈగలు మూగినట్లు మూగినవారే.

అమ్మలో శిక్షణే తప్ప శిక్షించటంలేదు. సంస్కరించటమే తప్ప

బహిష్కరించటంలేదు. బురదత్రొక్కి వస్తే కడుగవలసిన బాధ్యత తల్లిదేనని విశ్వమాతృత్వానికి ప్రతీకగా నిల్చింది. అందుకే వాసుదాసస్వామి వద్దకు అమ్మ వెళ్ళినప్పుడు ఎవరు నన్ను ద్వేషించినా, ప్రేమించినా నేను అందరినీ ప్రేమించేటట్లు ఆశీర్వదించమని అడిగింది. అంతేకాదు తటస్థపడిన రామయ్యను అతని వదిన రాజమ్మను సంస్కరించి రంగమ్మ సంసారాన్ని ఒడ్డుకు చేర్చింది.

నాన్నగారి కుటుంబాన్ని సర్వవిధాల చిన్నప్పటినుండే ఆదుకున్నది. కష్టసుఖాల రెంటినీ సమానంగా చూచిన జ్ఞాని. పతిని ఆధారంగా చేసుకొని పంచభూతాలను జయించిన పతివ్రత, పరమసాధ్వి అమ్మ. ఇతరులు చెప్పింది విన్నట్లున్నా తాను అనుకున్నదే చేయించగల సర్వసమర్థ, భర్తచేతకూడా తల్లిగా భావింపబడటమే పతివ్రతకు పరాకాష్ఠ అని ఆరకంగా జీవించిన దైవశక్తి సంపన్నురాలు.

కుసుమక్కయ్య ఇప్పటిదాకా ప్రచురించిన 900 పేజీల తరంగాలని కుదించి 300 పేజీలలో ఇమిడ్చింది. రామాయణాన్ని ఎంతమంది వ్రాయలేదు. ఎందుకు వ్రాశారంటే ఎవరి అనుభూతి వారిదికనుక. అలాగే కుసుమకూడా తరంగాలు కుదించి అందించింది. అయితే భాష తరంగాలలో వాడిన భాషనే తీసుకొన్నది. భావాలు సరే మారేదేముంది? కుసుమకు తనదైన భాషలో చెప్పగల శక్తి ఉన్నది. కాని ఒకసారి తరంగాలు చదివినవారు ఆ ప్రభావంనుండి బయటపడటం కష్టం. దాని శక్తి అంతటిది. కుసుమకూడా ఆ శాబ్దిక మోహంలోనే పడిపోయింది.

ఏమైనా అమ్మ చరిత్రను పదిమంది చేత చదివించాలనే తపన సాధ్యమైనంత తక్కువ కాలంలో చదివించాలనే ఆలోచన కుసుమను యీ విధంగా వ్రాయటానికి పురికొల్పిందనుకొంటాను. అమ్మ చరిత్రను సమగ్రంగా ఒక వంద పేజీలలో తనదైన శైలిలో వ్రాస్తే ఇంకా ప్రజలకు ఉపయోగపడుతుందని భావిస్తాను.

మామిడి చెట్లకు పూత, పిందెలు, కాయలు, పండ్లుంటాయి. అయితే అందులో ఎంతపూత పిందెలుగా, కాయలుగా, పండ్లుగా మారుతున్నాయి. అలాగే సృష్టిలో ఎన్ని పూలు పూయడంలేదు. ఎన్ని భగవంతుని పాదాలచెంతకు చేరగల్గె అదృష్టాన్ని పొందగలుగుతున్నాయి.

కుసుమక్కయ్య అలా భగవతి పాదాలకు సుగంధ భరితంగా తననుతాను

ఒక కుసుమంగా సమర్పించుకున్నది. అంతకంటే జీవితానికి ధన్యత ఏమున్నది?

ఇక ఈ చరిత్ర వ్రాయడం సామాన్యమైన విషయంకాదు. అమ్మేరహిాయై, భాస్కరరావు అన్నయ్యాయై వ్రాసిన చరిత్ర ఇది. అయితే సోదరి కుసుమ ఈ చరిత్రమూడు భాగాలుగా సేకరించి ప్రచురించింది. దాదాపు వెయ్యి పేజీల పైన ఈ చరిత్ర సాగింది. ఈ మొదటి భాగం ప్రతులు అయిపోవటంతో ఇప్పుడు శ్రీవిశ్వజననీ పరిషత్ ఈ ప్రచురణకు ఆర్థిక సహాయం చేయటానికి ముందుకు రావటం సంతోషం

కుసుమకు అమ్మ రక్షణతోపాటు శ్రీశైలం పూర్ణానందస్వామి ఆశీస్సులు, కుర్తాళం శంకరాచార్య జగద్గురు శ్రీసిద్ధేశ్వరానంద భారతీస్వామి వారి అనుగ్రహము అపారంగాఉ న్నాయి. చిన్నప్పుడు

**"మూకం కరోతి వాచాలం, పంగుం లంఘయతే గిరిం**
**యత్కృపా తమహం వందే పరమానంద మాతరం"**

అని విన్నాను. నిజమే లేకపోతే ఆపరేషన్ అయిన కాలుతో అడుగు తీసి అడుగు వేయలేని కుసుమ శ్రీ సిద్ధేశ్వరానందభారతీమహాస్వామితో కలిసి ఓంకారేశ్వర కొండ ఎక్కడమేమిటి? మైళ్ళకు మైళ్ళు ఆయాక్షేత్రాలలో నడవటమేమిటి? లక్షలకు లక్షలు మంత్రజపం చేయడమేమిటి? సాధుసంగంబు సకలార్థసాధకబు. శ్రీ చక్రవర్తిగారి ప్రోత్సాహాన్ని, వారి అన్యోన్య దాంపత్యాన్ని అభినందించాల్సిందే.

కుసుమను గూర్చి, చక్రవర్తిగారిని గూర్చి ఈరోజు ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. వారి గుండెగుడిలో అమ్మ కొలువు దీరి ఉన్నది. అంతేకాక ఇంట్లో ఒక గుడిని నిర్మించారు అమ్మకు. ఇక ప్రొద్దున సాయంత్రం పూజలు నివేదనలు నిమిషం తీరికలేని బాధ్యతలు - అమ్మ చెప్పిన ధాన్యాభిషేక కార్యక్రమబాధ్యత, అస్మదాదులు అభ్యర్థించిన 'విశ్వజనని'కి చేయూత, మధ్యలో రోగార్తులైన వారికి హెూమియోమందులు, ఏపనిచేసినా అమ్మ చింతనతోనే ఇదీ ఆ దంపతుల నిత్యకృత్యం. వీటన్నిటి మధ్య ఈ రచనావ్యాసంగాన్ని ఈ వయసులో ఎలా సమర్థించుకుంటున్నారో ఆశ్చర్యం. ఏదైనా అమ్మ ప్రేరణ, సంకల్పమే కనుక కుసుమను ఈరకమైన సేవలో ఉపయోగించుకుంటున్నది. ఇంతకన్నా సంతోషించవలసిన విషయమేమున్నది.

---★ ★ ★---

# ప్రస్తావన

జిల్లెళ్లమూడి అమ్మపేరుతో లోకమున మహాజనుల కారాధనీయమైన అనసూయాదేవి అవతార రహస్యమును వివరింప ప్రయత్నింతుము. మాతృశ్రీ అనసూయామహాదేవిని కొందరు సాక్షాత్తు రాజరాజేశ్వరిగా పూజించుచున్నారు మరికొందరు గాయత్రిగా, మరికొందరు చిన్నమస్తకమగు ప్రచండ చండికయే అని సుప్రమాణంగా ప్రభోదించారు. కేవలం మానవులకే కాదు చరాచరజీవకోటిని మాతృత్వ భావనతో చూడగల దివ్యత్వమును పొందినది. లలితనారాధించు వారికి లలితగా దర్శనమిచ్చును. సామాన్య లోకమునకు మాత్రం ఆమె వాత్సల్య స్వరూపిణియగు అమ్మ.

మరియొక దర్శనము, నిదర్శనము శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారు వరహానాడితాళపత్రగ్రంథంలో అమ్మ జాతకమును గూర్చి వ్రాసినది. శతజన్మ (?) దుర్లభమగు వక్రత్రయ మహాయోగమున అకలుషమయిన ఈ శరీరం అత్రిజాయ (అనసూయ) అంశగల పేరుతో ఉదయించినదని తెలియచేసారు.

ఆమె నివాసము ఎందరో స్త్రీ, పురుషులుండుట కనువుగా అలరారును. విద్వద్గోష్టులతో, తపస్వులతో ఆరామతరుసంపన్నమై కోలాహలముగా వుండును. అనేక సిద్ధుల నిచ్చు మహానిష్టాన్వితమగు క్రతువు అందు జరగగలదు. ఆమె జగన్మాత. పరమేకరుణామయి. వాత్సల్య స్వరూపిణి. లోకమునుద్ధరింపనరుదెంచిన ఆదిశక్తి.

ఆమె పండితులతోను, పామరులతోను సమానమగు ఆత్మీయతతో మాట్లాడును. పామరులు ఆమె సంభాషణచే పరమవశులగుదురు. అందలి మార్దవమునకు ముగ్ధులగుదురు. పండితులు తమ శాస్త్రపరిజ్ఞానముచే జాగ్రత్తగా ఆలోచించి కఠినాతికఠినములనుకొని ఏవో ప్రశ్నలు వేయుదురు. ఆమె వెంటనే ఏమియూ ఆలోచింపక నెమ్మదిగా మృదువుగా ఒక మాటయో, ఒక చిన్న వాక్యములోనో సమాధాననమిచ్చును. అది సర్వవేదాంత సారము కాచి వడబోసినట్లుండును. ఆ అడిగిన విద్వాంసుడు దిగ్భ్రాంతుడగను, తానంతదూరము ఆలోచించి వేసిన క్లిష్టప్రశ్నకు అంత సులభముగ, సుభోధకముగ ఆమె సమాధానమెట్లు చెప్పెను. దీనికెంత పాండిత్యం కావలెను. ఆమె ఏ జగద్గురువు దగ్గర శాస్త్రమభ్యసింపలేదే? అసలేమీ

చదువుకోలేదే. మరి ఇట్లు చెప్పగల్గుట దేనివలన. దానికి మరియేమియూ చెప్పలేకుండా వున్నామే? అది మన మనస్సుకెంతో నచ్చినట్లుగా వున్నదే? కావున ఏదియో దైవ సంబంధమగు ప్రజ్ఞయేకాని మానుషమగు ప్రతిభకాదు. దానిలో అతనికి దైవ భావనకల్గును.

యోగి తన దర్శనముచే తెలుసుకొనిన దానిని విద్వాంసుడు తన ప్రజ్ఞచే తెలిసికొన ప్రయత్నించును. ఆ పండితులు, యోగులు చూసిన నిర్ణయమే అమ్మ అవతారమూర్తియని "మహాపండితులు, మంత్ర శాస్త్రవేత్త విద్వత్కవి, దేశికోత్తముడు, శ్రీ నాధపీఠ నిర్వహణాధ్యక్షులు అయిన ఆచార్య ప్రసాదరాయకులపతులు తమ 'అంబికా సాహస్రి' లో అమ్మ గురించి వ్రాసిన ప్రస్థావనలోని కొంత భాగమును ఇక్కడ ప్రచురించవలసిన అవసరం ఎంతైనా వుంది. పాఠకులకు ఇది ఎంతగానో ఉపకరిస్తుందని నా ఉద్దేశ్యం."

జిల్లెళ్ళమూడి అమ్మగా ప్రసిద్ధికెక్కిన మాతృశ్రీ అనసూయ మహాదేవి జీవిత చరిత్రకు సమగ్రరూపమే ఈ పుస్తకము. సంభాషణలతో వుంటే పాఠకులకు అవగాహన కష్టంగా వుందని నాతోటి ఉపాధ్యాయిని శ్రీమతి హెచ్. సరోజనమ్మ గారు, మా కోడలు అయ్యగారి ఉమాదేవి వారి వారి అభిప్రాయాన్ని తెలియచేసారు. అమ్మవల్ల నేను ఆ మహోదధిలో ఎన్నెన్నో అనూహ్యమైన అనుభవాలను పొందగలిగాను. అట్టి అదృష్టాన్ని అందరికీ అందజేయాలన్న తపనే జీవితమహోదధిలో తరంగాలకు సంక్షిప్త గ్రంథముగా దిద్దుకోవటానికి ముఖ్యాంశమయినది.

అవ్యాజమైన ప్రేమ, వాత్సల్యం, కరుణ, పవిత్రతకు మారుపేరు అమ్మ. అందుకే వేదకాలం నాటి ఋషులు, దైవాన్ని తల్లిగా దర్శించారు. భక్తితో సేవించి తరించారు. అందుకే "మాతృదేవోభవ" అని మనుశృతి వాక్యం. "అరక్షితం తిష్ఠతి దైవ రక్షితం" అన్నట్లు అమ్మ సంసారంలో ఉంటూ, తరించే మార్గం లోకానికి అందించింది. ఆ మార్గంలో పయనిస్తూ మన గమ్యానికి చేరుకోవటానికి ప్రయత్నించాలి.

శ్రీ ప్రసాదరాయకులపతిగారి 'అమృతాశీస్సులు', శ్రీ పి.ఎస్.ఆర్. ఆంజనేయులుగారి అమ్మ సేవలో కుసుమ చక్రవర్తి ఈ పుస్తకంకు వన్నె తెచ్చిందనటంలో ఎటువంటి సందేహం లేదు. వారికి సర్వదా కృతజ్ఞతాపూర్వక కుసుమాంజలి.

అమ్మ చరిత్రను అందరికీ తెలియచేయటానికి ఈ గ్రంథం ఉపయోగపడగలదని ఆశిస్తున్నాను. మాతృశ్రీ జీవిత మహోదధిలో, తరంగాలలో అందరూ మునకలు వేయాలి. అందులోని అనర్ఘ్యరత్నాలను అందరం అందుకోగలగాలి.

ఈ రచనకు స్ఫూర్తిని, ప్రోత్సాహాన్ని అందించిన మా శ్రీవారు ఎ.ఎస్. చక్రవర్తిగారికి మనసా, వాచా, కర్మణా కృతజ్ఞతాంజలిని ఘటిస్తున్నాను.

శ్రీ విశ్వజననీ పరిషత్ వారు ఆర్థిక సహాయమందించిన వారికి కృతజ్ఞతాభి వందనాలు సమర్పిస్తున్నాము.

ఈ గ్రంథాన్ని సకాలంలో, సర్వాంగసుందరంగా ముద్రించిన వారికి, వారి యాజమాన్యానికి, సిబ్బందికి నా ధన్యవాదాలు.

ఇట్లు

*అమ్మ చరణసేవలో,*

**అయ్యగారి కుసుమాచక్రవర్తి**

# ఇందులో...

## ఇందులో...

# అంతా అమ్మ సచ్చరిత్ర

## 1. అవతరణ

1923 మార్చి 28వ తేది రుధిరోద్గారీ చైత్ర శుద్ధ ఏకాదశి బుధవారం అరుణోదయ కాలం నాలుగు గంటల ముప్పది నిముషములకు చెన్నకేశవస్వామి ఆలయంలో జేగంటలు మ్రోగుతున్నాయి. పక్షులు ప్రపంచానికి మేలుకొలుపులు పాడుతున్నాయి. జగతి చీకటి ముసుగు కప్పుకొని కాంతులు ప్రసవించడానికి నొప్పులు పడుతున్నది. మందమలయానిలాలు ఉపచారం సల్పుతున్నాయి. దేవాలయం నుండి బయలుదేరిన మంగళవాద్యాలు లోకానికి శుభ సందేశమిస్తున్నాయి.

ఆసమయంలో "మన్నవ"లో ఒక సామాన్యగృహాన ఒక సాధారణమైన ఆడపిల్లయై రాజరాజేశ్వరి ఆవిర్భవించింది. "మన్నవ" గుంటూరు జిల్లాలో పొన్నూరు తాలుకాలోని కుగ్రామం. అమ్మ జననీజనకులు రంగమ్మ - సీతాపతిగార్లు. సీతాపతిగారు మన్నవ గ్రామకరణం. అమ్మ జననకాలంలోనే కొన్ని అద్భుతాలు జరిగాయి. ఎన్నెన్నో శుభనిమిత్తులు కనిపించాయి.

అమ్మ భూమిమీద పడగానే మంత్రసాని గొల్లనాగమ్మ బొడ్డు కోయటానికి చాకు, దారం తీసుకుంది. బొడ్డుకు ఎన్నిచుట్లు చుట్టినా మామూలు దారం మిగిలింది. ఇంతపెద్ద దారం ఎక్కడిదని విసుక్కుంటూ చాకు పట్టుకున్నది. చాకు చాలా పొడవుగా త్రిశూలం మాదిరి కనపడుతూ చేతికి అమరలేదు. ఆశ్చర్యంతో బొడ్డువంక చూడగా బొడ్డులోని బుడుపు శంఖం వలె కనిపించింది. ఇంకా తరచి చూచేటప్పటికిక బొడ్డు కమలంవలె అతి కోమలంగా అందులో ఎవరో సర్వాలంకార శోభిత అయిన దేవతా స్త్రీ నిలుచున్నట్లు కనిపించింది.

అమ్మ ఆశ్లేషా నక్షత్ర నాల్గవపాదంలో జన్మించింది. అది శాంతి జరిపించవలసిన నక్షత్రం. నక్షత్రం తిరిగేలోగా శాంతి చేసుకుందామని సీతాపతిగారు అనుకున్నారు. అమ్మకు పురిటిస్నానం చేయించేందుకు గ్రామంలో ఉన్న 500 ఇళ్ళకు పురిటి చమురు పంపితే (నూనె, సున్నిపిండి, కుంకుడుకాయలు, పసుపు, పంచదార చిలకలు) అనుకోకుండా 108 బిందెలు నీళ్ళు తెచ్చారు. 108 బిందెలలో 108 చెంబుల నీళ్ళు తీసి అమ్మకు స్నానం చేయించారు.

అమ్మను స్నానానంతరం జల్లెడలో పడుకోబెట్టారు. అంతలో ఒక పెద్ద నల్లకుక్క వచ్చి అమ్మతలవద్ద కొద్దిసేపు పడుకుంది. తరువాత పాదాలచెంతకు వచ్చి ఆ చిన్నిపాదాలపై తన ముట్టెను పెట్టి పదినిమిషాలు హాయిగా నిద్రపోయింది. కుక్కను చూచి అందరూ కంగారుపడి అరచి వెళ్ళగొట్టారు. కుక్కలేచి జల్లెడ చుట్టూ ప్రదక్షిణం చేసి వెళ్ళిపోయింది. పదినిమిషాలలో మళ్ళీ తిరిగి అమ్మ మంచం దగ్గరకు వచ్చి అమ్మ కక్కిన పాలునాకి మంచానికి అయిదు జానల దూరంలో పడుకొని కన్నులు తెరచి అమ్మవంక చూస్తూ ప్రాణం వదిలింది.

కుక్క ముఖంలో తేజస్సు తగ్గలేదు. అంతకుముందు ఏజబ్బూలేదని అంతా ఆశ్చర్యపోయారు. ఏ ఋణానుబంధమో, ఏ శాపవిమోచనమో ఆ కుక్క అమ్మ పాదస్పర్శచేత పునీతమై ముక్తిపొందింది.

అమ్మ జననానికి పూర్వం సీతాపతిగారు ఒక చెట్టుక్రింద కూర్చుని వుండగా వారి మనోనేత్రానికి ఒక బాలిక కనిపించింది. పరిశీలిలనగా చూచేలోపల ఆ బాలిక చెన్నకేశవస్వామిగా, రాజ్యలక్ష్మి అమ్మవారుగా రూపాంతరం పొందింది. ఆయన ఆశ్చర్యానందాలతో తలమునకలవుతుండగా తిరిగి బాలికగా రూపుదాల్చింది.

మరొకనాడు సీతాపతిగారికి ఒక స్వప్నం వచ్చింది. అందులో ఒకపెద్ద ముత్తైదువ వారింటిలోని సామాను అంతా బయటపడేసి నట్టింట ఒక కుర్చీ వేసుకొని కూర్చున్నది. ఆమె నొసట పెద్ద కుంకుమ బొట్టుంది. ఎవరునీవు? అని అడిగితే "అమ్మను" అంది.

27వ రోజున హెూమశాంతి, నామకరణ మహెూత్సవం జరిగింది. ఆ నామకరణం జరిపిన సుముహూర్త బలమో, ఆ అక్షరాలలోని పవిత్రతా బలమో, ఆకర్షణో మరేమిటో నేడు యావజ్జగతికీ ఆ అక్షరాలు చిరస్మరణీయమైనాయి. మధురమై అమృతోపమానమైనాయి.

ఆ అదృష్టవంతమయిన అక్షరాలు "అనసూయ' అక్కడ కూర్చున్న అందరూ ఒకేసారి అనుకోకుండా "మన అమ్మపేరు అనసూయ" అన్నారు. "అమ్మపేరు ఎప్పుడూ అలాగే ప్రతిధ్వనిస్తే బాగుంటుందని" అమ్మ తల్లిదండ్రులు మనసారా కోరుకున్నారు. ఆ పుణ్యదంపతుల ఆశయం నెరవేరటానికి ఎంతో కాలం పట్టలేదు. మరివారి పుణ్యఫలమే అవనికే ఆరాధ్యం అయిన అమ్మకు జననీజనకులయ్యారు.

తరువాత ఆ పేరుకు అమ్మే అర్థం చెప్పి ఆనందపరిచింది. రాగద్వేషాసూయలను పారద్రోలేదే అనసూయట. అదే అమ్మతత్వమట. మంచివాళ్లలో కూడా తప్పులు ఎంచటం అసూయ. అసూయకానిది అనసూయ. ధర్మరాజుకు లోకం అంతా తిరిగి చూచినా ఒక్కచెడ్డవాడూ కనపడలేదు. అలాగే దుర్యోధనునికి ఒక్క మంచివాడూ కనిపించలేదన్న విషయం పురాణ ప్రసిద్ధం. చెడ్డవారిలో కూడా మంచినే చూడటం అమ్మతత్వంలోని విశిష్టత. అందువల్లే "తల్లికితప్పే కనిపించదని" అమ్మ ఉద్ఘాటించింది. ఈ తత్వమే అమ్మను 'స్వభావమధుర'ను చేసింది. ఆ గుణాన్నే అమ్మ మనకు మాటల ద్వారా, చేతల ద్వారా బోధించింది. ఈ సందేశాన్ని మనకు అందించి అమ్మమనకు ఆరాధ్యమైంది, ఆదర్శమైంది. దానిని ఆచరణలో పెట్టగలిగిననాడే మానవజన్మ సార్థకతను సంతరించుకుంటుంది.

అమ్మ జన్మించిన 29వ రోజు సాయంకాలం వేడుక నిమిత్తం ముత్తైదువులతో, మంగళవాద్యాలతో అమ్మమ్మ కామేశ్వరమ్మ బావికి వెళ్ళింది. నూతిలో చేదవేసి చేయవలసిన వేడుకలు చేసి బిందెతో నీళ్ళు చంకనబెట్టుకొని మేలిముసుగు వేసుకొని ఊరేగింపుతో అమ్మమ్మ తిరిగి ఇంటికి బయలుదేరింది.

ఇంటిదగ్గరకు రాగానే ఉయ్యాలలోవున్న అమ్మ పిలిచినట్లు అమ్మమ్మకు పెద్దకేక వినిపించింది. ఉయ్యల దగ్గరకు వెళ్లి చేస్తే అమ్మ పక్కన డొక్కనానుకొని తేలు పడుకుని వుంది. తల్లి బిడ్డమీద వేసినట్లుగా అమ్మ చేయి తేలుపొట్టమీద వేసివుంది. ఆ దృశ్యం చేసి అమ్మమ్మ కంగారుపడి తాతగారి కోసం వీధిలోకి పరిగెత్తింది. వీధిలోనివారందరూ చుట్టూ చేరారు.

అంతలో షేకు నల్లఖాసింసాహెబ్ వచ్చి అందర్నీ అవతలకు పంపి, అమ్మమ్మను ఇంటికి తీసుకువచ్చి అమ్మను చేతికిచ్చి పాలివమ్మా అన్నాడు. అమ్మమ్మ పాలు ఇస్తుండగానే తేలు మెల్లగా పాకి అమ్మపాదం మీదకెక్కింది. పాలిచ్చి పడుకోబెట్టి గుడ్డకప్పుబోగా తెల్లని అమ్మపాదం మీద నల్లని తేలు మెరుస్తూ కనిపించింది.

అమ్మమ్మ ఉలిక్కిపడింది. ఆపాదమస్తకం భయంతో గజగజలాడింది. ఒకప్పుడు ఒక జ్యోతిష్కుడు అమ్మమ్మతో "నీకు పూర్యజన్మలో మార్జాల హత్యాదోషం తగిలింది. పిల్లలు పుట్టినా దక్కరని" చెప్పాడు. దానికి తగినట్లుగా అమ్మను గర్భాన ధరించాక ముగ్గురు పిల్లలు మరణించారు. దానితో అనుక్షణం అమ్మగూడా ఏమవుతుందో అన్న సందేహము, భయమే.

అంతలో మరిడమ్మ తాతమ్మ యాజిలి నుంచీ వచ్చింది. ఆ కేకలు విని సరాసరి ఉయ్యాల వద్దకు వచ్చి అమ్మ పాదం దగ్గర చచ్చి ఉన్న తేలును తీసివేసింది.

తాతగారు భోజన సమయంలో రోజూ ఒక పిల్లికి భోజనం పెట్టేవారు. ఆ రోజు అది రాలేదు. రోజూ వచ్చేది "ఎందువల్లరాలేదో అని అమ్మమ్మగారు అన్నారు". ఋణం తీరితే అన్నీ అంతేలే" అంటూ ఉయ్యల దగ్గరకు వచ్చారు. పిల్లి ఉయ్యాల్లో పడుకొని సర్పాకృతితో తోకనుపైకి ఎత్తి అమ్మ ముఖం వంకచూస్తూ ఉన్నది. తాతగారు దాన్ని చూచి "అమ్మయి పక్కలో పామ(్రా" అని కేకవేశారు.

మరిడమ్మ తాతమ్మ వచ్చి ఎందుకు నాయనా అంతకేక వేశావని అడిగింది. ఉయ్యాలలో పిల్లిని చూపించి చేతితో తట్టారు. పిల్లిలేచి క్రిందకు దిగి ఉయ్యాలచుట్టూ ప్రదక్షిణంచేసి అరగంటసేపు అరుస్తూ మళ్ళీ ఉయ్యాల్లోకి దూకి అమ్మపాదాలమీద తనమూతినానించి ఒకసారి పెద్దధ్వనితో శ్వాసలాగుతూ అమ్మ పాదాలమీదనే ప్రాణం వదిలింది.

పుట్టిన పదకొండవ రోజున పెద్దతాతమ్మను పంపించింది. గొల్లనాగమ్మ వచ్చి పుట్టినప్పటినుంచీ అన్నీ చావులుగానే వున్నాయి. ఆ చావులుకూడా విచిత్రపు చావులు అంది. అమ్మ, అమ్మమ్మ గర్భాన చేరినప్పటి నుంచీ 28వ రోజులోపల కుటుంబంలో, బంధువర్గంలో పదకొండుగురు మరణించారు.

అమ్మ లోకజనని, వంశపావని కదా! అందుకే ఆమె జననానికి ముందు తరువాత కూడా అంత మందికి ముక్తి కలిగింది. మానవులేకాక పశుపక్ష్యాదులు, క్రిమికీటకాలు తనబిడ్డలే అంటుంది. జంతువులు కూడా అమ్మ బిడ్డలే కాబట్టి వాటికి అమ్మ ముక్తిని ప్రసాదించిన విషయం తేటతెల్లమవుతుంది.

స్వర్ణోత్సవాల్లో లక్షా ఏభైవేలమంది అమ్మ ప్రసాదం స్వీకరించారు. ఇంకా పదార్థాలు మిగిలితే ఏమిచేయమంటావని అమ్మను అడిగారు. పక్కనేవున్న డ్రైన్‌లో కలపమంది. ఆ డ్రైన్‌కు అమ్మ "ఓంకారనది" అని పేరు పెట్టింది. మీకు లెక్కకు వచ్చేది మనుష్యులే. నాకు పశుపక్షాదులు, క్రిమికీటకాలు కూడా లెఖ్ఖే అని చెప్పింది. కోటి ప్రాణులకుపైనే ఆ ప్రసాదం వినియోగింపబడిందని తెలియచేసింది.

అమ్మ పుట్టటానికి పూర్వమే అమ్మతల్లి రంగమ్మగారికి ముగ్గురు పిల్లలు మరణించారు. ఆ మనోవేదనతో అమ్మమ్మ అమ్మకు పాలివ్వటానికి, పెంచటానికి కూడా సంశయము వెలిబుచ్చింది. దానికి గొల్లనాగమ్మ, పిల్లను నేనుపెంచుతాను. ప్రస్తుతానికి నీవు పాలివమ్మ అని అన్నది. అమ్మ పుట్టిన ముప్పదియవరోజునుండీ సీతాపతి తాతగారి మేనత్త మరిడమ్మ తాతమ్మ అమ్మను మేలుకొలుపులతో లేపుతూ జోలపాటలతో నిద్రపుచ్చుతున్నది. గొల్లనాగమ్మ రోజూ ఉగ్గుపోస్తూ పాలుపడుతున్నది.

అమ్మకు రెండు నెలలు నిండి మూడవనెల వచ్చింది. అమ్మచేత ముద్దకుడుముల వేడుక చేసి అమ్మను నాగమ్మ చేతిలో పెడ్తానని తాతమ్మ అంది "తల్లిదండ్రులకు పిల్లపుట్టినట్లే లేదు. కొంతకాలం గడిస్తే ఏమైనా మార్పు వస్తుందేమో అంతదాకా నీవు పెంచవలసినదే" అని తాతమ్మ అమ్మను నాగమ్మకు అప్పజెప్పింది.

అమ్మను అందుకున్న నాగమ్మ హర్షపులకిత అయింది. తాతమ్మ నానబోసిన బియ్యం బుట్టలోకి వడేసి వారింట్లో పనిచేసే ఖాదర్‌బీని పిలిచి బియ్యంలో పోటువేయంది. తాతమ్మ మాట ఖాదర్‌బీకి వినిపించక. ఏదో పనిచేసుకుంటున్నది.

తాతమ్మకు పోటుశబ్దం వినిస్తుండడంతో ఖాదర్‌బీయే దంపుతోందని అనుకున్నది. జల్లెడ తీసుకుని బయటకురాగా ఖాదర్‌బీ కనిపించలేదు. బియ్యం జల్లెడ పట్టనవసరంలేకుండా పిండి తయారై పోసిన బియ్యానికి మించిన పిండి వచ్చింది. ఆశ్చర్యంతో తాతమ్మ రోటికి చెవి ఆనించితే రోటిలోనుంచే పోటు శబ్దం వినిపించింది.

అమితమైన ఆశ్చర్యం, ఆనందాలతో మిళితమై తాతమ్మ తాను దైవస్వరూపంగా కొలిచే తనగురువు గారైన మల్లెల్లరత్తమ్మగారే తనకు ఆవిధంగా సహాయపడుతున్నారని భ్రమించింది.

8గం॥ల వేళ అమ్మమ్మ మజ్జిగ చేసిన వెన్న చెయ్యిని అమ్మపాదాలకు రాచింది. ఆ చేతినే అరికాలుకు కూడా రాచి తనకు తెలియకుండానే ఆచేతిని తన కళ్లకు అద్దుకుంది. నాగమ్మ అమ్మకు స్నానం చేయించి లోపలకు తీసుకువచ్చి పడుకోపెట్టింది. అమ్మకు బొట్టుపెడదామని అమ్మమ్మరాగా అమ్మముఖాన బొట్టు ఎఱ్ఱగా మెరుస్తూ ఉన్నది. నాగమ్మను అడిగితే తాను పెట్టలేదన్నది. తాతమ్మను అడగగా "నీకు అనుభవమయిందీ. వెనుకటికి సక్కుబాయికి శ్రీకృష్ణ పరమాత్మ సహాయం చేసినట్లుగా మనకు నా గురువుగారైన మల్లెల్ల రత్తమ్మగారు సాయపడుతున్నదేమో" అని చెప్పింది.

తాతమ్మ బెల్లం తరిగి పొయ్యిమీద పెట్టింది. ఎంతసేపటికీ కట్టెలు మండకపోవడంతో విసుగుచెంది పొయ్యిలో నీళ్లుపోసి అన్నింటికీ ఆతల్లే చేసుకుంటుందని" గిన్నెపై మూత పెట్టింది. రాజరాజేశ్వరి అమ్మవారిపేరుతో ముత్తైదువును పెట్టుకొని అక్షింతలు వేసుకుందామని కాకుమాను లక్ష్మాయమ్మను పిలిచింది. ఆమె అంధురాలు పిల్లను చూడలేదు కాబట్టి, అమ్మమ్మ అమ్మను ఆమె చేతికి అందించింది. ఆమె, అమ్మను ముద్దుపెట్టుకొనబోగా మెరుపుమెరిసింది. అమ్మకన్నులనుండి కాంతి కిరణాలు ఆమె కన్నులలో గుచ్చుకున్నాయి. ఆ కాంతిలో ఐదు సంవత్సరాల బాలిక కనిపించింది. చేతిలోపిల్ల చేతిలోనే వున్నది.

అమ్మా! మరిడమ్మా! నీ సన్నిధికి వచ్చిన వేళ ఎంతమంచిదమ్మా! ఎంత అదృష్టం! నీ శక్తివల్ల ఒక దివ్య దర్శనం అయింది" అని లక్ష్మాయమ్మ అన్నది. దానికి మరిడమ్మగారు ఉదయంనుండీ అన్నీ దివ్యదర్శనాలే. అమ్మదయవల్ల అంతా చిత్రవిచిత్రంగానే జరుగుతున్నాయి" అంటూ గిన్నెమూత తీయగానే పాకం వచ్చి పొయ్యి సన్నంగా మండుతున్నది. తల్లిదయను స్మరిస్తూ అత్యంతానందంతో తాతమ్మ

చలిమిడి చేసింది. నివేదనకు తనగురువుగార్రైనా మల్లెల్ల రత్తమ్మగారి ఫొటో దగ్గరకు తెచ్చి, అమ్మమ్మను పిల్లను కూడా తీసుకు రమ్మంది.

తాతమ్మ ఉదయం నుంచీ జరిగిన విచిత్ర సంఘటనలన్నీ తన గురువుగారి మహిమలే అని అమ్మమ్మకు చెప్పింది," కావు! కావు అంటూ కాకులు పడిపోయిన గోడమీదగా కట్టిన పట్టాలపై ఎగిరి లోపలకు వచ్చాయి. కాకులు కావు, కావు మనటంలో తాతమ్మ చెప్పిన మాటలు-నిజంకావు అని, అమ్మతో తమను 'కావు' అంటే రక్షించమనీ కావచ్చు.

సాయంకాలం ఆరుగంటలకు వేడుక ప్రారంభమయింది. అమ్మమ్మ మనస్సులో "ఇదే నా చివరి వేడుక" అని తోచింది. ఇదేమిటి ఇట్లా అనిపించిందని బాధపడింది. బారసాల నాడు వచ్చిన బంధువులందరూ వచ్చారు. బామ్మ అనగా అమ్మ అత్తగారు (మేనత్త) వచ్చింది. అందరి మనస్సుల్లో కారణం తెలియకుండానే సముద్రపు పోటులాగా ఒక దుఃఖపు కెరటం పెల్లుబికింది. ఐదు నిమిషాలనంతరం దానంతటదే అంతరించిపోయింది.

వేడుక అనంతరం అమ్మకు హారతి ఇచ్చి అక్షింతలు వేసి ఎఱ్ఱనీళ్ళుతీసి లోపలకు తీసుకువెళ్ళారు. పేరంటం పూర్తి అయింది. రాత్రి ఏడున్నర గంటలకు గొల్లనాగమ్మను పిలిచి "ఈరోజు మంచిది" అమ్మయిని ఇంటికి తీసుకువెళ్ళమని నాగమ్మ ఒడిలో అమ్మను పెట్టింది మరిడమ్మ తాతమ్మ. ఆక్షణంలో దుఃఖభారంతో తాతమ్మ సర్వావయవాలు కంపించినాయి. అంతఃకరణ శోకసాగరమే అయినా కుడికన్ను వెంట ఒకే ఒక అశ్రుకణం జారి అమ్మభ్రుకటిలో పడింది. ఆ బిందువు అప్పుడే అవతరించిన కృష్ణుని వసుదేవుడు చీకటిలో రేపల్లెకు ప్రయాణం చేస్తున్న పురాణ ఘట్టం దృశ్యమానమై అంతలోనే అదృశ్యమయింది.

అమ్మను తన ఒడిలో పెట్టగానే గొల్లనాగమ్మకు కోటికొండలు ఒకేసారి తనమీద పడినట్లయి అంతలోనే జొన్నబెండులా అతితేలికగా అనిపించింది. వేడుక సమయంలో అమ్మకు నల్లగాజులు వేయించారు. బంధువులు గొల్లగాజులా అని మేలమాడగా "గొల్లయింటికే పోతున్నదిగా" అని అమ్మమ్మ విషాదస్వరంతో సమాధానమిచ్చింది.

నాగమ్మ ఇంటిముందుకు పోగానే పెద్ద త్రాచు ఆడుకుంటూ అమ్మను

ఎత్తుకునిఉన్న నాగమ్మ ముందుకు వచ్చి పడగను ముందుకు వంచి సాష్టంగ నమస్కారం చేసినట్లు పడుకుంది. ఇరుగుపొరుగువారు కర్రలతో కొట్టటానికిరాగా ఆపాము అదృశ్యమయింది.

అమ్మను లోపలకు తీసుకువెళ్ళి మంచంమీద పడుకోబెట్టగానే ఏడుపు మొదలుపెట్టింది. ఎదురు ఇంటిలోవున్న చాకలి లక్ష్మయ్య ఉయ్యాల మంచం తెచ్చి ఇచ్చాడు. అందులో పడుకో బెట్టినా ఏడుపు ఆపలేదు. మంచం మీద మెత్తగా పక్కవేసి పడుకో బెట్టారు. ఏడుపు ఇంకా ఎక్కువైంది. నాగమ్మకు విసుగుపుట్టి వాకిట్లో గంగరావి చెట్టుకు తన పాతనీలిరంగు చీరెను కట్టి దానిలో పడుకోబెట్టింది. అమ్మ ఏడుపుమానింది. ఇన్నింటిలోకీ చిరిగిపోయిన నాకోకే సుఖంగావుందా అమ్మ" అని నాగమ్మ మురిసిపోయింది.

ఔను! మహావిచిత్రం. సర్వ ఐశ్వర్యాలకు అధిపతి అయిన పరమేశ్వరునికి పరమదరిద్రులంటే ప్రేమ ఎక్కువ కదా!

★ ★ ★

# 2. మాతృత్వప్రకటన

అమ్మ మూడవనెల నుండీ గొల్లనాగమ్మ ఇంట్లోనే పెరుగుతున్నది. ఎనిమిదవ మాసంలో అమ్మ పారాడుతూ, పారాడుతూ నాగమ్మ తింటున్న కంచంలోని మెతుకులను నోట్లో పెట్టుకుంది. అదే అమ్మ అన్న ప్రాసన. తప్పు, తప్పు, వద్దు, వద్దంటూ అమ్మ నోట్లోని మెతుకులను తీసివేయటానికి విఫలయత్నం చేసింది నాగమ్మ.

నాగమ్మ తప్పు-వద్దు అనడంలో బ్రాహ్మణ బాలిక గొల్లఇంట్లో అన్నం తినడం ఆచారవిరుద్ధమనేగానీ, అమ్మ అన్నం తినటం తప్పుఅనిగానీ అమ్మను అన్నం తినవద్దని గానీ నాగమ్మ ఉద్దేశ్యంకాదు. ఏది ఏమైనా అన్నం కోసం- అమ్మ చేసిన మొదటి ప్రయత్నమే వారించబడినది. అదీకాక అన్నీ వేడుకలు ఎంతో ఉత్సాహంతో జరిపే సాంప్రదాయక కుటుంబంలో అమ్మకు అన్న ప్రాసన జరుపబడలేదు. అమ్మకు భోజనం అవసరం లేదని గుర్తించి ఆతల్లిదండ్రులు ఆ వేడుకను విస్మరించారేమో అనూహ్యం.

"అన్నం నన్ను వదిలింది కానీ నేను అన్నాన్ని వదలలేదని తరువాత కాలంలో అమ్మ ధృవీకరించింది.

మూడవనెల పిల్ల అప్పటినుంచీ సంవత్సరంన్నర వరకూ నాగమ్మయింట్లోనే పెరిగింది. అమ్మ వాళ్ళు పాలుపడితే తాగేది. పాలకోసంకానీ, అన్నం కోసంగానీ ఎప్పుడూ అడగలేదు.

మరిడమ్మ తాతమ్మ తానువచ్చింది కాబట్టి పిల్లను ఇంటిదగ్గర దింపమని చెప్పింది. రోజూ నాగమ్మనే పిల్ల దగ్గర కొంతసేపు వుండి వెళ్ళమంది.

మరిడమ్మగారు ఎప్పుడూ సత్కాలక్షేపం చేసేది. ఆమె యోగాభ్యాసానికి, ధ్యానానికి అవసరమయిన కాలంలో తప్ప మిగిలిన సమయంలో యిరుగుపొరుగు వారిని చేర్చుకొని తత్వవిచారణ జరిపేది. పురాణ కథలకు సంబంధించిన పాటలు వారికి నేర్పుతుండేది.

ఆమె తత్త్వ విచారణలో ఎంత నిష్ణాతురాలో, యోగాభ్యాసంలో ఎంత అనుభవజ్ఞురాలో అంత గొప్పగాయకురాలు. కమ్మని కంఠము చక్కని పాట. ఆమె ఏ పనిచేస్తున్నా పాటలు పాడుతూనే వుండేది. ఉచ్ఛ్వాస నిశ్వాసలవలె ఆమెకు పాట

సహజమైపోయింది. ఆమె ఏమి పాడుతున్నా శ్రోతలు మంత్రబద్ధులవలే నిశ్చేష్టులయ్యేవారు.

ఆమెలోని మరో ప్రత్యేకత ఆమె సహనం. కుటుంబ నిర్వహణలో ఆమె ప్రదర్శించే సహనానికి సరిహద్దులులేవు. ఎవరికి ఏవేళలో ఏమికావలసివస్తే అది తయారుచేసి పెట్టేది.

ఈ తత్వ విచారణానురక్తి, యోగాభ్యాసం, పురాణకాలక్షేపం, విశాలహృదయం, సేవాసక్తి, త్యాగబుద్ధి అమ్మకు మరిడమ్మగారినుండి సంక్రమించినవని అనడానికి వీలులేకపోయినా అతి బాల్యదశ నుండే అహర్నిశం ఆమె పక్కలోనో, ఒడిలోనో పెరిగిన అమ్మకు గుణాలు సంప్రాప్తించినవని అనేకులు ఊహాగానాలు చేసేవారు. ఎటువంటి క్లిష్టపరిస్థితిలో కూడా ఆమె కష్టపడటంగానీ, విసుగు చెందటంకానీ ఎరుగదు.

ఆరవయేటనే పతివిహీన అయిన ఆమె, అందరి సంతానాన్నీ, ఆత్మ సంతానంగానూ, అందరి సంతృప్తిని ఆత్మ సంతృప్తిగా భావించి అనేకులకు సేవలు చేసింది.

ఒకరోజు అమ్మ చినతాత చిదంబరరావు గారు బాపట్ల నుండీ "మన్నవ" వచ్చేటప్పటికి ఒక చెయ్యి తలక్రిందా, మరోచెయ్యి గుండెలమీద పెట్టుకుని ఏదో ఆలోచిస్తూ నిశ్చలమై ఉన్న అమ్మను చూచి 'చల్లనిమూర్తి మంచియోచన' అని అనుకున్నారు. చిన్నతనం నుంచీ అమ్మలోని దివ్యత్వాన్ని గుర్తించిన మహా మనీషి చిదంబరరావుగారు. ఆయన బాపట్లలో న్యాయవాది, కవి.

19 నెలల వయస్సులో అమ్మ ఎదురింటి దానిమ్మ చెట్టుక్రింద పద్మాసనం వేసుకొని నల్లగ్రుడ్డు పైకిపోనిచ్చి-అరమోడ్పు కన్నులతో ధ్యాననిమగ్నఅయింది. ఆతరువాత కొద్దిరోజులకే తెనాలిలో ఉన్న అమ్మ తాతగారు వెంకట సుబ్బారావు గారింటికి వెళ్ళింది. దొడ్లో ఒక దానిమ చెట్టు క్రింద ఎడమకాలును ముందుకుచాచి కుడికాలును వెనక్కు మడతవేసి దానిమ్మ పూవు చేతిలో పట్టుకొని శ్వాస ఆపివేసి నల్లగుడ్డు లోపలకు పోనిచ్చి, చేపనిద్రలాగా అరమోడ్పు కన్నులతో కూర్చుంది. అమ్మ పెదతల్లి అన్నపూర్ణమ్మగారు చూచి ఏమిటమ్మా! అలాగ కూర్చున్నావని అడిగింది.

దానికి అమ్మ 'శాంభవీ ముద్రలే' అని నిర్లిప్తంగా చెప్పింది. 19 నెలల వయస్సులోనే శాంభవీ ముద్రలేయడం అనూహ్యం, మానవతీతం.

అమ్మమ్మ తిరిగి 'మన్నవ' ప్రయాణం అయి రైల్వే స్టేషన్‌కు వెడ్తుండగా దోవలో కాషాయాంబరధారి అయిన ఒక వృద్ధుడు అమ్మమ్మతో "నీ బిడ్డ భగవంతుడు. నీకు ఇక జన్మలేదని" చెప్పాడు. దారిలో అమ్మమ్మ పండ్లుకొన్నది. అందులోంచి రెండు పళ్లు అమ్మ బండీవానికి ఇచ్చింది. బండివాడి కళ్ళలో ఆనందం, కృతజ్ఞతాభావం వెల్లివిరిసింది. చిన్న పిల్ల అని ఆలోచించకుండా నమస్కారం చేసాడు. ఔను మరీ రెండు సవంత్సరాలు కూడా నిండని, విరిసీ విరియని పుష్పంలాంటి అమ్మ మాతృత్వపు పరిధులను కూడా అధిగమించింది.

స్టేషన్‌కు వెళ్ళే దారిలో ఒక గుడ్డి ఆమె, ఆమె గుడ్డికూతుళ్ళు, కుంటికొడుకు ఆడుక్కుంటున్నారు. అమ్మ వారిని చూచింది. హృదయం కరుణారస ప్లావితమయింది. ఎంత డబ్బు ఉన్నా ఇచ్చేదాన్ని అనుకుంటూ తనచేతికివున్న బంగారు గాజుతీసి, ఆ బిక్షకి చేతిలో వుంచింది.

అమ్మమేనమామ చంద్రమౌళి సీతారామయ్యగారు రెండు టికెట్లు తెచ్చి అమ్మమ్మ చేతిలో వుంచారు. అదిచూచి అమ్మమ్మ "మీ మామయ్య నిన్నుకూడా పెద్దమనిషి క్రింద జమకట్టాడని" నవ్వుకుంది. అదివిని అమ్మ ఎవరికోసమో, ఎందుకు తెచ్చాడో అని నవ్వింది. అడక్కుండా పెట్టేదే అమ్మ అని కదా! అమ్మ నిర్వచనం. ఇంతలో టికెట్టు కలెక్టరు టిక్కెట్లు పరీక్షిస్తున్నాడు. బండి ఆగింది. కంగారుగా ఒక యువతి ఆపెట్టెలోకి ఎక్కింది అంతవరకూ అమ్మమ్మ పక్కనకూర్చున్న అమ్మ అమ్మమ్మ ఒడిలోకూర్చుని ఆయువతిని కూర్చోమంది. అమ్మమ్మ ఒళ్లోనుండి అమ్మను క్రిందకు దించి కాలునొప్పిగావుంది, ప్రక్కన కూర్చోమంది. దానికి అమ్మ టికెట్లు లేనివాళ్ళు కొంచెం స్థలంకూడా ఆక్రమించకూడదని అంది.

ఆ చిన్ననోట నుంచీ వచ్చిన పెద్దమాటకు ఆదరాబాదరా రైలు ఎక్కిన ఆమె ఉలిక్కిపడింది. ఆమెపేరు శాంతమ్మ, "నీకు టికెట్టు లేకపోవటమేమిటి! ఇదిగో అని అమ్మమ్మ ఒకటికెట్టును అమ్మ చేతికి ఇచ్చింది. ఇది "నాది కాదమ్మ ఆమెది" అంటూ అమ్మ ఆ టికెట్టును శాంతమ్మకిచ్చింది. అంతలో టికెట్టుకలెక్టరు వచ్చి శాంతమ్మ

ముందు నిల్చున్నాడు. ఆమె టికెట్టును చూపించిరి. ఏమీ తెలియని ఉద్యోగి ఏమీ గ్రహించకుండానే ముందుకు సాగిపోయాడు.

బొటబొటరాలే కన్నీటితో శాంతమ్మ అమాంతం అమ్మను తన గుండెలకు అదుముకుంది. భగవంతుడే రక్షిస్తాడని అనుకున్నాను. మధ్యలో ఈ చిట్టితల్లి రక్షిస్తుందనుకోలేదని" అన్నది. పక్కనే వున్న ఒకామె రక్షించినవాళ్ళే భగవంతుడని ఎందుకు అనుకోకూడదు అని అన్నది. సంభాషణ జరుగుతూనే వుంది. అమ్మమ్మకు కునుకు పట్టింది. అమ్మ తన చేతిని వున్న బంగారుగాజు తీసి శాంతమ్మ చేతిలో పెట్టి అవసరాలకు వాడుకోమంది. ఎక్కడిదీ వాత్సల్యపూరితమైన అనుగ్రహం! నిడుబ్రోలులో రైలు దిగాక అమ్మమ్మ అమ్మ చేతులు చూచింది. రెండుగాజులూ లేవు. ఆదుర్దాగా తాతగారితో చెప్పింది. ఆయన నిర్లిప్తంగా "పోతేపోనీ పిల్ల భద్రంగా వున్నదిచాలు" అని అన్నారు.

బండి "మన్నవ" వైపు బయలుదేరింది. పొన్నూరు వూరిబయటకు వెళ్ళేటప్పటికి అమ్మ మలవిసర్జనకు వెళ్ళాలంది. అమ్మమ్మ అమ్మను బండీదించి కూర్చోబెట్టింది. అమ్మబండి ఎక్కే సమయంలో ఇక్కడ బాగుంది. ఇక్కడే వుందాం అన్నది. ఇక్కడ యిల్లులేదుగా ఎట్లావుంటాం అని అమ్మమ్మ అన్నది. మీరు వెళ్లండి నేను ఇక్కడే వుంటాను. మరినీకు ఇల్లు వాద్దా? అమ్మలేకుండా చిన్నపిల్లలు ఉండవచ్చునా? అని అమ్మమ్మ అడిగింది. ఏం? నీవు లేనప్పుడు నేనే అమ్మనై వుంటాగా అని అమ్మ అంది. ఏం మాటలమ్మా తాలు మాటలేదు. అని అమ్మమ్మ అంది. "తోలునోరు కాదుకదా! తాలుమాటలేదు" అని అమ్మ పలికింది.

ఔను ఆ శరీరం రక్తమాంసాదులతో నిర్మితమే అయినా ప్రతికణమూ ఎట్లా దివ్యమయినదో, అట్లాగే పలికిన ప్రత్యక్షరమూ సత్యమయినది. ఏ ఒక్కటీ పొల్లుమాటగానీ, తాలుమాటగానీ ఆనోటినుండిరాదు. భవిష్యత్తులో అమ్మ ఎన్ని ఎన్ని సూక్తులను మనకోసం వెదజల్లిందో! ఆ జల్లులో పునీతమయ్యే అదృష్టం మనకు పట్టింది.

★ ★ ★

# 3. అమ్మమ్మ అంతిమయాత్ర

అమ్మకు మూడవ సంవత్సరం జరుగుతున్నది. కార్తీకశుద్ధ ఏకాదశి. రాత్రి పదిన్నర అయింది. అమ్మకు జ్వరం మండిపోతున్నది. పక్కలో అమ్మమ్మపడుకుంది. మరిడమ్మ తాతమ్మ వచ్చి చూచింది. అమ్మమ్మ చెక్కిళ్ళు కన్నీట తడిసిన సెలయేళ్ళయ్యాయి.

అమ్మకు జ్వరం వచ్చినప్పటినుంచి అమ్మమ్మ మనసు మనసులో లేదు. ఆమె ఆవేదనను అర్థంచేసుకున్న తాతమ్మ మౌనస్వామివారు క్రొత్తగా వేసిన రాజ్యలక్ష్మీయంత్ర ప్రభావం వలన అన్ని జబ్బులు నయమవుతున్నాయి. నీకు దిగులెందుకు అమ్మాయిచేత మనం కూడా ప్రదక్షిణాలు చేయిద్దాం" అని అమ్మమ్మకు ధైర్యం చెప్పింది.

తాతమ్మ మాటలువిని జ్వరంతో పడుకున్న అమ్మ చివాలున లేచి "అది రాజ్యలక్ష్మీ యంత్రంకాదు. రాజరాజేశ్వరీ యంత్రం" అని చెప్పింది. ఆ పలుకులు ఎంతో మృదుమధురంగాను, శాంతంగాను, స్పష్టంగాను ఉన్నాయి. కానీ అమ్మమ్మ "చిన్న పిల్లకు పెద్ద ఆలోచనలెందుకమ్మా" అన్నది. దానికి అమ్మ తొణకకుండా, వెతుక్కోకుండా "పెద్దవాళ్ళు చిన్న ఆలోచనలు చేస్తున్నారు కనుక అంది" సరేలే అన్నీనీకే అన్నది అమ్మమ్మ, "ఔను! అన్నీ నావే కనుక" అని అమ్మ నిర్ధారించింది.

అప్పుడు అమ్మ చెప్పిన మాటలు ఎవరి మనసుకూ పట్టలేదు. కాని 1958 దేవీ నవరాత్రులలో అమ్మ మన్నవ వెళ్ళినప్పుడు మన్నవ కృష్ణశర్మ మొదలగు వారికి ఆయంత్రం చూపి ఋజువు చేసింది. అది రాజరాజేశ్వరీ యంత్రమే గ్రామస్తులాశ్చర్య పోయారు. రాజ్యలక్ష్మి అమ్మవారి విగ్రహం క్రింద రాజరాజేశ్వరి యంత్రం. ఈ విషయాన్ని అమ్మ మూడు సవంత్సరాల పిల్లగా వున్నప్పుడే నిర్ధారించింది. ఇటువంటి సంఘటనలవల్లే అమ్మ యొక్క దైవత్వం ప్రస్ఫుటమయింది.

అమ్మమ్మకు ఆరోగ్యం సరిగాలేనందున బాపట్లలో వైద్యం చేయించే నిమిత్తం అమ్మమ్మ ప్రయాణమయింది. గ్రామ జనం అధికభాగం అక్కడే వున్నారు. అందరికీ అమ్మమ్మ తిరిగి రాదనే భావం బలంగా ఏర్పడింది. అందరి మనస్సుల్లోనూ, మాటల్లోనూ తాతగారియందు సానుభూతి, పిల్లలయందు కరుణ స్ఫురించాయి.

వీళ్లను కూడా నామెడకు కట్టి పోతుందేమో! ప్రతి తరానికి తప్పదు కాబోలని తాతమ్మ కూడా విచారగ్రస్త అయింది.

అమ్మ తాతగారి కలవరాన్ని, తాతమ్మ కలతను గమనించింది. గ్రామజనుల మనోగత భావాన్ని అర్థంచేసుకుంది. కాని అమ్మ హృదయంలో భయదుఃఖాలకు తావులేకపోయింది. మనుసు నిర్వికారంగానూ, నిశ్చలంగానూ ఉంది. అక్కడే మానవునికి, దైవానికీ గలతేడా! ఆ తరువాత కాలంలో హైమ నిర్యాణమప్పుడు, నాన్నగారు స్వర్గస్థులైనప్పుడు కూడా అట్టి నిర్వికార, నిశ్చలస్థితిలో వుండి, అమ్మ అందర్నీ ఆశ్చర్యచకితులను చేసింది.

అమ్మమ్మ తనకంటినీరు తాతగారైన సీతాపతిగారి కంట పడకూడదనే ఉద్దేశంతో, శోకంతో సంకులసమరం చేసి విఫలమై మొదలు నరికిన చెట్టువలె, దెబ్బతిన్న పిట్టవలె తాతగారి పాదాలమీద వాలిపోయింది. శోకప్రవాహం కట్టలు తెంచుకుంది. తాతగారి కన్నులు వినీలమై ఆషాఢ పయోధరాలై అమ్మమ్మ తలను తడుపుతున్నాయి.

తాతగారి చంకలో వున్న అమ్మ తన చిన్నచేత్తో తాతగారి కన్నీరుతుడుస్తూ "తప్పు నాన్న అమ్మను లేవమను" అన్నది. కారే కన్నీరు తుడుచుకొని తాతగారు అమ్మమ్మను లేవదీసి ఆమె తలను తన గుండెలకు హత్తుకుని ఫర్వాలేదు నయమవుతుంది" అయినా నీదేముంది. నా కళత్రయ యోగం మంచిదయితేనీకు తగ్గుతుందని" ఓదార్చారు.

దుఃఖోపహతురాలైన అమ్మమ్మ భారంగా నడుస్తూంటే అక్కడ చేరిన జనుల హృదయాలు ఆర్ద్రమై పోయాయి. అమ్మమ్మ మేనా ఎక్కింది. భర్త, కొడుకుకంటే ఎంతసేపూ చిన్నదైన అమ్మ గురించిన ఆలోచనే. అమ్మా! నేనుపోతే నీవు ఎక్కడ వుంటావమ్మా? అని అమ్మమ్మ అడిగింది. దానికి అమ్మ "అంతటా అని, మీరెక్కడ వుంచితే అక్కడ, ఎవరివద్దనైనా సరే మీ ఇష్టం" అన్నది. ఎవరైనా అంటే వాళ్ళు నిన్ను సరిగా చూడద్దా అని అమ్మమ్మ అంది. "నేను వారిని సరిగా చూడాలిగా" అంది. కాదమ్మ పెద్దవాళ్లే సరిగా చూడాలి అని అమ్మమ్మ అన్నది. అది కాదమ్మా! సరిగా చూచినవాళ్ళే పెద్దవారు" ఆమాట వినేటప్పటికి పొన్నూరులో 19 నెలల

పిల్లగా వున్నప్పుడే "నీవుపోతే నేనే అమ్మనై వుంటానుగా" అన్నమాట స్ఫుటంగా వినిపించింది. బయలుదేరిన కొంతసేపటికి మేనా ఆగింది. మేనా మోసే చాకలాళ్ళు, చెప్పులు విడిచి చేతులు జోడిస్తున్నారు. అమ్మమ్మకూడా అంజలి ఘటించింది. ములుకుదురు గ్రామంలోని చెన్నకేశవస్వామి దేవాలయం. ఆ దేవాలయ గోపురం మీద అమ్మ? తనవంకనే చూస్తూ నవ్వుతూ చేతులు చాపింది. ఆ చేతులు చాపటం తల్లి పిల్లకోసం చాపినట్లుగా వున్నది. అమ్మమ్మ నిశ్చేష్ఠ అయింది. తెప్పరిల్లి ఒడిలోకి చూచుకున్నది. అమ్మమామూలుగానే ఒడిలో పడుకొనివుంది. మేనా బాపట్లలో అమ్మ చినతాతగారైన చిదంబరరావుగారి ఇంటిముందు ఆగింది.

మర్నాడు నుంచీ డాక్టరు దేశిరాజు అప్పారావుగారి వద్ద చికిత్స మొదలైంది. క్రమంగా రెండునెలల్లో అమ్మమ్మ ఆరోగ్యంలో మంచి మార్పుకలిగింది. అందరికీ ధైర్యం వచ్చింది. అమ్మ విషయంలో మాత్రం ఎవ్వరికీ శ్రద్ధకనిపించలేదు. శ్రద్ధ కలిగిన తాతమ్మ నిజామాబాదు వెళ్ళింది. అమ్మకు నాలుగవ సంవత్సరం వెళ్ళి రెండు మాసాలు అయింది.

చిదంబరరావుగారికి వాడుకగా కట్టెలువేసే మంగతాయారు చిదంబరరావుగారి భార్య అయిన అన్నపూర్ణమ్మగారిని డబ్బులు అవసరమని అడిగింది. ఆమె లేవన్నది. తాయారు వెళ్ళిపోయింది. చిల్లరడబ్బులే కదా అత్తయ్యా. ఏ గూట్లోనయినా చూడకపోయావా దొరికేవేమో! పాపం. ఎంతో అవసరమయితే కానీ తాయారు అడగదత్తయ్యా అని అమ్మ సలహాచెప్పింది. చిన్నపిల్లవు నీకెందుకు? అని విసుక్కుంటూనే అన్నపూర్ణమ్మగారు వెళ్ళి వెతికింది. ఒకగూట్లో దొరికాయి. అంతజాలిగలదానవు నీవే ఇచ్చిరా అని డబ్బులు అన్నపూర్ణమ్మాగారు అమ్మకు ఇచ్చింది.

అన్నపూర్ణమ్మ గారిని మేనమామకే ఇచ్చి వివాహము చేసారు. అందుకే ఆమెను అత్తయ్య అని, ఆయన్ని తాతయ్య అని అమ్మ పిలిచేది. తాయారును వెతుక్కుంటూ అమ్మ బయలుదేరింది. ఒక చిల్లర కొట్లో తాయారు అప్పుకోసం వర్తకుని ప్రాధేయపడుతున్నది. వర్తకుడు కసురుకున్నాడు. మీరు ఇవ్వకపోతే యింకెవరిస్తారు? అని తాయారు అంది. అందరికీ ఎవరిస్తారు, ఆ దేవుడే అని హేళనగా అంటూ వుండగా అమ్మ పరుగెత్తికెళ్ళి తాయారు దోసిట్లో డబ్బు పోసింది. వర్తకుడు ఆశ్చర్యంతో కొయ్యబారిపోయాడు. తాయారు ఆనందంతో నిశ్చేష్టురాలైంది. అప్పటిదాకా

కనుగొలుకుల్లో నిలచిన నీరు జలజలా రాలింది. తాయారు అమ్మను "మా ఇంటికి వస్తావా అని యింటికి తీసుకువెళ్ళింది". గబగబా కొన్ని వేరుశనగకాయలు ఒలిచి అమ్మ ఒడిలో పోసి బెల్లంగడ్డచేతికిచ్చి వంటపనిలో నిమగ్నమయింది.

అమ్మ తాయారుకు చెప్పకుండా మెల్లమెల్లగా నడిచి సముద్రపు ఒడ్డుకు వెళ్ళింది. అంతలో ఒక జాలారి అమ్మవద్దకు వచ్చాడు. చిన్నపిల్ల, ఒంటరిది. చుట్టూ ఎవ్వరూలేరు. ఒంటినిండా సొమ్ములు చూచిన జాలరి మనస్సులో ద్వేషం తలెత్తింది. లాలనగా అమ్మను ఎత్తుకొని జామపండు తినిపిస్తూ ఒంటినవున్న సొమ్ములన్నీ ఒలుచుకున్నాడు. అన్నీ కలసి బాగా బరువుగావున్నాయి. కానీ ఈ పిల్ల ఎవరితోనన్నా చెపితే సొమ్ముతోపాటు తన ప్రాణం కూడా దక్కదు అని భయపడ్డాడు. ఆ పిల్లను నామరూపాలు లేకుండా చేయాలన్న క్రూరమైన ఆలోచన మొలకెత్తటం, వేళ్ళు తన్నుకొని మహావృక్షమై అతని హృదయమంతా పరుచుకోవటం ఒకే లిప్తకాలంలో జరిగాయి.

అమ్మమౌనంగా చూస్తూ వున్నది. భయంతో కేకలువేయలేదు. దుఃఖంతో శోకాలు పెట్టలేదు. ద్వేషంతో తిరగబడలేదు. జామపండు తినిపిస్తున్నప్పుడు ఎట్లావున్నదో! సోమ్ములు ఒలుచుకుండేటప్పుడూ అంతస్థిమితంగానూ వున్నది. (అలాగే నక్సలైట్స్ పడిదోచుకు పోయినప్పుడు అంతస్థిమితంగానే వున్నది. వారు దొరికిన తరువాత గుర్తుపట్టటానికి రమ్మని ఆవరణలో వారిని పోలీసులు పిలిచారు. వాళ్ళు తన పిల్లలే కాబట్టి వారిని గుర్తుపట్టినా తెలియనట్లే వుండమని ఆదేశించింది. కొంతమంది అడిగితీసుకుంటారు, కొందరు మారాంచేసి తీసుకుంటారు, మరికొందరు హరంచేసి తీసుకుంటారు. నక్సలైట్స్ అదర గండం పిల్లలుగా అమ్మవర్ణించేటప్పటికి ఆశ్చర్యపోవటం అందరివంతూ అయింది. పైగా వారికి ఆలస్యమవుతుంది. మీ వ్రతం (అనసూయ వ్రతం) తొందరగా కానీయమని అంది. అందరూ వంటయింట్లో వారికి ఆలస్యమవుతుందని అనుకున్నారుకాని నక్సలైట్స్ పథకం వేసుకున్నారని వాళ్ళకు ఆలస్యం అవుతుందని అలా అందని ఎవ్వరికీ తెలియదు.

రోజూ క్రింద పడుకునే నాన్నగారు శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావు గారి పడకను పై అంతస్తుకు మార్పించి నక్సలైట్సును క్షమించింది. తాను సర్వమాతృత్వానికి ప్రతీకగా నిలచింది. ఆ తరువాత నక్సలైట్సు అమ్మను శరణుజొచ్చారు.)

ఆ జాలారి రెండు చేతులా అమ్మను ఎత్తి సముద్రంలోకి బలంగా విసిరేసాడు. ఒకమెరుపు మెరిసింది. ఆ మెరుపు కాంతిలో సముద్రమే కాదు! జగత్తంతా ఒక్కసారి తళుక్కుమంది. కత్తిఝుళిపింపులాంటి ఆ కాంతికి కరుడు కట్టిన జాలారిగుండెలోని చీకటిరాశి చిన్నాభిన్నమైంది. అమ్మా! అని ఒక్కసారి కెవ్వున కేకవేసి ఆవేశంతో సముద్రపు లోతుల్లోకి వెళ్ళాడు. కెరటాలు కసిగా, నిర్ధయగా అతడిని పడవేశాయి. అతను వూపిరి ఆడక వుక్కిరి బిక్కిరి అయ్యాడు. అప్పుడు రెండు చేతులు నీటినుండి లేవతీసి పైకెత్తి విసిరివేశాయి. జాలారి కళ్లు తెరచి చూచేటప్పటికి అమ్మ మామూలుగానే కూర్చున్నది. కానీ ఆ ముఖంలో, ఆ కన్నుల్లో వెలిగే జ్వాలను అతడు చూడలేక పోయాడు. అమాంతం అమ్మ పాదాలమీదపడి వెక్కివెక్కి ఏడిచాడు.

అమ్మ అతడి వీపురాస్తూ లేనాన్నా ఎందుకు ఏడుస్తున్నావు అని ఏమీ తెలియనట్లుగా అడిగింది. తప్పుచేశానమ్మా! నాతప్పుకాయమ్మా! అంటూ చెంపలు వాయించుకొని ఒలుచుకున్న నగలన్నీ ఒకొక్కటే అలంకరిస్తున్నాడు. అప్పుడు అమ్మ "నీవు వొలిచింది నీసొమ్మే నాయినా! నీవు బ్రతికివచ్చావు. నా కంతేచాలు. నాకదే సొమ్ము, నీకిదే సొమ్ము తల్లికి బిడ్డసొమ్ము, బిడ్డకు డబ్బుసొమ్ము అంటూ ఆ నగలను అతనికే ఇచ్చేసింది. ఆశ్చర్యం ! అమ్మ ఒంటిమీద నగలన్నీ యధాప్రకారంగానే ఉన్నాయి. ఆ జాలారి అమ్మను ఆ రాత్రికి తన ఇంటికి తీసుకు వెళ్ళి గోరుముద్దలు తినిపించి తన ఇంట్లోనే పడుకోబెట్టుకున్నాడు. బిడ్డమీద అమ్మకు కలిగిన వాత్సల్యమో, వాడు చేసుకున్న అదృష్టమో మరి వాడిలో పశ్చాత్తాపం ఏరులై పారింది. మానవుడి మనోభిష్టం నెరవేరాలంటే ఆర్తితో కూడిన భక్తికావాలి. కానీ ఇక్కడ అవ్యాజ కరుణా స్వరూపమే అమ్మ కనుక అతనిని బయటపడవేసింది. బిడ్డ బురద పూసుకు వచ్చినా శుభ్రపరచవలసింది తనే అంటుందికదా! కరుడు గట్టిన క్రౌర్యం అనే బురదతో నిండిపోయిన జాలారికి తనయొక్క కరుణా విశేషంచే పశ్చాత్తాపాన్ని కలిగించి అతనిని పునీతుడ్ని చేసింది.

అమ్మమ్మకు 7వ నెల వచ్చింది. అమ్మమ్మ ఆరోగ్యం పుంజుకుంది. తాతగారితో "నాకు కొంచెం నిమ్మళించింది కదా! యింటికివెడదామా" అని అమ్మమ్మ అడిగింది. అలవాటు ప్రకారం డాక్టరుగారు వచ్చి చూచి మామూలుగా మందు పంపారు. అమ్మమ్మ ఆ మందుతీసుకున్న క్షణం నుంచి కడుపులో బాధ మొదలైంది. అందరూ

చుట్టూ చేరారు. డాక్టరుగారు వచ్చారు. నొప్పికి మూలం ఆయనకూ తెలియలేదు. డాక్టరు తుమ్మలపల్లి హరినారాయణగారిని పిలవటానికి సీతాపతి తాతగారు తెనాలి వెళ్ళారు. సాయంకాలం నాలుగు అయింది. అమ్మమ్మ "తానిక బ్రతకనని స్పష్టంగా చెప్పి సీతాపతి తాతగారి గురించి ఆయన అమాయకుడు ధర్మరాజులాంటివాడు. పిల్లవాడు అల్లరివాడు పిల్లకేమో నోట్లోనాలుకలేదు. ఎవరు ఎలా బ్రతుకుతారో. ఈ నాచిట్టితల్లి బ్రతికితే" - అమ్మను గుండెలకు హత్తుకుని బావురుమంది. బ్రతికితే కూడూగుడ్డా వున్నచోట ఇవ్వండి. మొత్తం నా బంగారం దానికే ఇవ్వండి అని పినతండ్రి చిదంబరరావుగారితో చెప్పి అమ్మను, మామయ్యను ఆయన చేతుల్లో పెట్టింది. ఆయనగారు రాలేదా-రాలేదా అంటూనే అమ్మమ్మ శాశ్వతంగా కన్నుమూసింది.

తెనాలి వెళ్ళిన తాతగారికి అమ్మమ్మ చచ్చిపోయిందన్న పిడుగులాంటి కబురు తెలిసి కుప్పలా కూలిపోయారు. తన చేతులు ఎవరో నరికివేసినట్లు, తనకాళ్ళు ఎవరో విరగ్గొట్టినట్లు, తనహృదయాన్ని ఎవరో కొల్లగొట్టినట్టు, తన మనస్సును ఎవరో చితకపొడిచినట్లు, తనను ఎవరో మహాసముద్రంలోకి విసిరినట్లు తాతగారు దుర్భర శోక విచలితులైనారు.

అంతలో చిదంబరరావుగారు అమ్మను ఎత్తుకుని అక్కడకు వచ్చారు. సీతాపతిగారు అమాంతం అమ్మను ఎత్తుకుని తన గుండెలకు హత్తుకుని "మీ అమ్మ చచ్చిపోయిందమ్మా" అని వెక్కివెక్కివేశారు. అమ్మయొక్క నిర్లిప్తత చూచి అమ్మకు అర్థంకాలేదనుకుని" మీ అమ్మపోయిందమ్మా" అన్నారు. అమ్మ చిన్నగా "ఎక్కడికి నాన్నా? అంది. "ఔను ఎక్కడికి?" తాతగారు గొణుకున్నారు.

"అసలు ఎక్కడనుంచి వచ్చింది నాన్నా" అని అమ్మ అడిగింది. "అమ్మ చచ్చిపోయిందమ్మా" అన్నారు. చచ్చిపోవడమంటే అంటూ తాతగారి కళ్ళల్లోకి నిశితంగా చూసింది. ఎలా చెప్పాలని ఆలోచిస్తుంటే, అమ్మ చిదంబరరావుగారితో "అసలు వీళ్ళు ఎక్కడనుంచి వస్తారని అడిగింది. "తల్లి గర్భంనుంచి "అమ్మా" అన్నారు. అయితే తల్లులందరి గర్భాల్లో ఎప్పుడూ పిల్లలు వుంటారా" అని ప్రశ్నించింది. "ఉండరని" అన్నారు. "మరి తల్లి గర్భంలోకి ఎలా వస్తారు" అంది. "దేవుడు పంపిస్తాడమ్మా" అన్నారు.

"పోవడమంటే ఎక్కడకు పోతారు". "శ్మశానంలోకి", "శ్మశానానికి

తీసుకువెళ్ళకపోతే ఉన్నట్లేనా?" అయితే అమ్మను ఇక్కడే వుంచేద్దామని అంది. "ఏం ప్రశ్నలమ్మా ఇవి" అన్నారు చిదంబరరావు గారు. "చెప్పు తాతయ్యా ఎక్కడకు పోతారని" అడిగింది. దైవంలో కని" జవాబు చెప్పారు.

"దైవం పంపిన మనిషి, దైవం ఇష్టప్రకారం దైవంలోకి పోతే మధ్యలో మనకు ఏడుపెందుకు తాతయ్యా? అని అడిగింది. ఎవరు చెప్పారు నీకు ఈ వేదాంతం అని" ఆశ్చర్యపోయారు. సీతాపతిగారు తనదుఃఖం మరచిపోయి ఆశ్చర్యంగా చూచారు.

"ఎవరు మా అమ్మ? పోయింది మా అమ్మా? ఈ శరీరమా ఈ శరీరమే అయితే పోలేదు. పోయిందే మా అమ్మ అయితే దానిని ఇదివరకు చూడలేదు. మరెందుకు ఈబాధ" అని అంది.

అమ్మమ్మను మంత్రోక్తంగా స్నానంచేయించారు. ఆ కళేబరానికి ఏవేవో అలంకారాలు చేస్తుంటే అమ్మ సన్నగా నవ్వుకుంది. చరమయాత్రకు సర్వసన్నద్ధమై సమలంకృతమైన ఆ శరీరానికి అందరూ నమస్కారాలు చేసి సజల నేత్రాలతో, బరువు గుండెలతో వీడ్కోలు చెప్పారు. అమ్మను నమస్కరించమన్నారు. అమ్మ కదలబోతుండగా తాటిమట్ట రాలి అమ్మమీద పడింది. వెంకట్రావుగారు తలపైకెత్తి చూచారు. పైన ఎవరూలేరు. మట్ట ఎండలేదు పండనూలేదు, కానీ మట్టరాలింది. కారణమేమిటని వెంకట్రావుగారు అనుకుంటుంటే 'అకారణమే కారణం' అని అమ్మ చిన్నగా అంటూ చిట్టిచిట్టి అడుగులు వేసుకుంటూ వెళ్ళి మోకాళ్ళు నేలకు ఆన్చి అమ్మమ్మ రెండు పాదాలకు నమస్కరించింది. ఆ దృశ్యాన్ని చూచిన అసంఖ్యాక నేత్రాలు జలజలా స్రవించాయి.

మమకారంతో, అనురాగాలతో, అనేక లౌకిక బంధాలతో అనేకులకు అత్యంతమూ, ప్రీతిపాత్రమయిన ఒకవ్యక్తి కొద్దిక్షణాలలో అగ్ని జ్వాలలలో దగ్ధమై, భస్మమై శాశ్వతంగా రూపాంతరమైపోతుంది. కళేబరంపైన పసుపు, కుంకుమ, పూలు చల్లుకుంటూ అందరూ బయలుదేరారు.

గగన మండలంలోకి నిర్లిప్తంగా దృష్టులను సారిస్తున్న అమ్మను పిలిచి వెంకట్రావుగారు అమ్మపోతున్నదమ్మా అన్నారు అందరూపోతున్నారుగా అంది అమ్మ. వాళ్ళునడుస్తున్నారు. ఆమెను మోస్తున్నారు. మనందరిలో వున్నశక్తి ఇప్పుడు ఆమెలోలేదు. అందుకని ఆమెపోయింది.

సాయింకాలందాకా వెంకట్రావుగారే అమ్మ వెంటవున్నారు. దీపపువత్తి ఒక మూరపొడవుపైగా వెలుగుతున్నట్లు, అందులో అమ్మమ్మ కనిపించింది. వెంటనే చిదంబరరావుగారిని పిలిచి "అమ్మకాలిపోతున్నది తాతయ్యా అంది. ఆ దీపపు వత్తిలోకి నిశ్చలంగా చూస్తూ ఆ సాయంకాలం శ్మశానంలో జరిగిన సంఘటన యావత్తూ వివరంగా అమ్మవర్ణించింది. ఎప్పుడూ శ్మశానం చూడని, ఆనాడు అసలు ఆ వైపుకే వెళ్ళని అమ్మ ఆదృశ్యం వర్ణిస్తుంటే చిదంబరరావుగారు అమితాశ్చర్యంతో అమ్మవంక చూస్తూండిపోయారు.

నాలుగురోజులు తరువాత చిదంబరరావుగారింట్లో పిల్లి మృత్యువును ఆహ్వానిస్తూవుంది. దాన్ని అమ్మ చూచి చిదంబరరావుగారిని పిలిచింది. పిల్లి అలా ఎందుకుపడుకుంది తాతయ్యా అని అడిగింది. చావుకు సిద్ధమయిందమ్మా అన్నారు. మరణయాతనతో పిల్లి శరీరం మొత్తం కదులుతున్నది. పొట్ట ఎగురుతున్నది. ముక్కు అదురుతున్నది.

ముక్కు ఎందుకిట్లావున్నదని అడిగింది అమ్మ. పిల్లి కళ్ళలో అమ్మ కనపడుతున్నది. అంతలో పిల్లి శ్వాస ఆగిపోయి, పిల్లి కన్నుల్లో అమ్మ మసకేసింది. ఏమయింది తాతయ్యా అని అమ్మ అడిగింది. పిల్లి చచ్చిపోయిందమ్మా అన్నారు. ఇదా చచ్చిపోవటమంటే శ్వాస ఆగిపోవడమా అంది అమ్మ. "శ్వాస ఆగితే ప్రాణం పోతుందమ్మా" అన్నారు. అందరికీనా అంటూ తనముక్కు దగ్గరవేలుపెట్టుకొని చూచుకుంటూ శ్వాసను బంధించింది. చిదంబరరావుగారు చూస్తుండగానే అమ్మకూ లోకానికీ సంబంధం విచ్ఛిన్నమై నిర్వ్యాపారఅయింది.

చిదంబరరావుగారు మొదట గాభరాపడినా అనుక్షణం అమ్మను, అమ్మమాటను, చేతనూ, అలౌకికతనూ, అమ్మలోని సముజ్వలధీశక్తినీ, అద్భుత చైతన్యాన్నీ అవలోకిస్తున్నందున అతి సులభంగా అమ్మపొందిన సమాధిస్థితినీ, శరీరంపై అమ్మకుగల అధికారాన్ని అర్థంచేసుకొని ఆశ్చర్యం, ఆనందంతో తన్మయులయ్యారు.

జ్ఞాన స్వరూపిణి అయిన అమ్మకు జ్ఞానసముపార్జన ఏమిటి? సాధ్యమే తానయిన అమ్మకు సాధన ఎందుకు?

"సాధ్యమే తానైన అమ్మను, సాధనే తానైన అమ్మను ఏరీతినర్చింతునో అమ్మను ఏ కరణి భజియింతునో" అని మనందరం పాడుకుని మురిసిపోదాం.

★ ★ ★

# 4. అవనియే ఆరాధ్యదైవం

రంగమ్మగారి పినతండ్రి చంద్రమౌళి చిదంబరరావుగారు. వారు బాపట్లలో న్యాయవాది, పండితుడు, కవి, వేదాంతి. అమ్మలోని అతిమానుషశక్తిని గ్రహించినవ్యక్తి. అమ్మమ్మగారి మరణం తరువాత అమ్మ నాలుగో సంవత్సరం నుంచి ఎక్కువగా బాపట్లలో చిదంబరరావు తాతగారివద్దనే పెరిగింది.

పువ్వు పుట్టగనే పరిమళించినట్లు చిన్నతనంనుండే అమ్మలో మానవాతీత లక్షణాలు బహిర్గతమైనాయి. అమ్మ మహామేధావి. ఏకసంథాగ్రహి, చిన్నతనంనుండే అమ్మలో జిజ్ఞాస, తార్కిక వైభవం వేయిరేకులుగా విప్పారి అందరినీ ఆశ్చర్యచకితులను చేసాయి. ఆ వయస్సులోనే ఒక్కొక్క విషయం అమ్మ వివరిస్తుంటే ఉపనిషద్వాణి వింటున్నట్లున్నదని విస్తుపోయేవారు. అమ్మ అన్నప్రతిమాటా క్రియారూపం ధరించడం గమనించి, ఆశ్చర్యపోయేవారితో" తోలునోరు కాదుకదా! తాలుమాటరావటానికి" అని పలికి నిరుత్తరులను చేసింది.

పసివయస్సునుండే అమ్మ తన దగ్గర ఏమి ఉన్నా దానిని ఇతరకులకు ఇచ్చేది. తనకోసం పెట్టించుకున్న అన్నం, పిండివంటలు బిచ్చగాళ్ళకూ, సమస్తజీవరాసులకు సంతోషంగా పెట్టేది. తానుమాత్రం ఏమీ తినేదికాదు. ఆ రోజుల్లోనే "వాళ్లుతింటే నేను తిన్నట్లే" అని సర్వమాతృత్వానికి ప్రతీకగా నిలచింది. రెండున్నర సం॥ల వయస్సులోనే తన దగ్గరవున్న బంగారు నగలను, ఇతరుల అవసరాలను కనిపెట్టి రైలు స్టేషన్‌దారిలో గుడ్డి ఆమెకు, రైలులో శాంతమ్మకు, బాపట్లలో ముసలివానికీ అయాచితంగా ఇవ్వటం చూస్తే అమ్మ యొక్క దయార్ధ్ర హృదయం అవగతమవుతుంది.

(ఆ తరువాత కాలంలో తన బిడ్డ లెందరెందరి కుటుంబాలనో, నిలబెట్టటానికి తన నగలను కుదవబెట్టిన కరుణామయి అమ్మ)

ఒకనాడు తన ఒంటిన ఉన్న బట్టలను ఒక పేదపిల్లకు ఇచ్చి తాను దిగంబరియై నిల్చుని అందరినీ దిగ్భ్రాంతులను చేసింది. అమ్మలోని వాత్సల్యం, ప్రేమ, కరుణ, త్యాగం, సహనం ఆనాడే వర్షాకాలవాహినులై వెల్లువలైనాయి.

అమ్మ తన ఐదవ ఏట తనస్నేహితురాళ్ళు నాగలక్ష్మి పంగలూరి అనసూయలతో

కలిసి బాపట్లలో భావన్నారాయణస్వామి దేవాలయంకు వెళ్ళింది. ఎప్పుడూ ఒక్కటెంకాయన్నా తెచ్చుకోవేమి? అని నాగలక్ష్మీ ప్రశ్నించింది. "మట్టితెచ్చిందిగా" అని పంగలూరి అనసూయ అంది. కొబ్బరికాయ తెచ్చినవారి వెంట యీ యిసుకరాదా అంటూ అమ్మ వారిద్దరి పాదాలవంకా చూచింది. వారి పాదాలకు మట్టి అంటుకునే వుంది.

నేలపై నడుస్తాము కనుక మట్టికాని, యిసుకకానీ కాళ్ళకు అవుతుంది. నేలమీద నడవనివారు వుంటారా? మనుష్యుల్లో చాలామంది నేలపైనే నడుస్తారు. ఏకొద్దిమందో కార్లల్లో, సైకిళ్ళపై వెడ్తున్నా అవీ నేలపైనే వెళతాయి. పశువులన్నీ నేలపైనే నడుస్తున్నాయి. పక్షులు చెట్లపై వాలినా, చెట్టుకు భూమే ఆధారంగావుందంటూ అమ్మ వారిద్దరికీ వివరిస్తూ తాను తెచ్చిన పూలు, దళాలు నేలమీద పెట్టింది. అది చూచిన అర్చకుడు కోపగించాడు. నేలపై మొలచిన చెట్టుకు పూసిన పూలు నేలమీద పడితే తప్పేమిటి? అని అమ్మ ప్రశ్నించింది. పూజారి అమ్మమాటకు జవాబు చెప్పేవాడో, లేదో కానీ చాలామంది లోపలికి రావటంతో అర్చకునికి ఆ పరీక్ష తప్పింది.

ఆ రాత్రి దేవాలయ ఆవరణలో స్థానాచర్యులవారు రామాయణపురాణం చెప్పారు. అందులో అంతా ధర్మప్రబోధమే. పురాణప్రవచనం కాగానే అమ్మ ఆచార్యులవారు వద్దకు వెళ్ళి "ధర్మం అంటే ఏమిటి? చేసేది ధర్మమా? చెప్పేది ధర్మమా? చూసేది ధర్మమా, అసలు ధర్మమంటే ఏమిటి? అని అడిగింది. చిన్న పిల్లవు నీకెందుకమ్మా ఈ ప్రశ్నలు అంటూ ముందుకు సాగిపోయారు. అడిగే ప్రశ్నలకు సమాధానం యివ్వాల్సిన ధర్మం మీకులేదా? అన్న అమ్మ ప్రశ్న శ్రోతలు పలికే ప్రశంసా వాక్యాల శ్రవణంలో ఆయనకు చేరనేలేదు.

అమ్మ వెళ్ళి మండపంలో కూర్చుంది. అంతలో బాపట్ల సుబ్బారావు గారు వచ్చారు. దేవునికి పూజచేసే పసుపు, కుంకుమ, దేవునికి పెట్టేసొమ్ములు, కట్టే గుడ్డలు, పెట్టే నివేదనలు, పాత్రలు వాటన్నింటి పుట్టుక ఎక్కడ? అని ఆయన్ని ప్రశ్నిస్తూ తానే భూమిలోనుండే అని సమాధానం చెప్పుకున్నది. ఇంతకూ, ఆ పూజ చేయించుకునే దేముడు ఎక్కడ పుట్టాడు? అని బాపట్ల సుబ్బారావు గారిని అమ్మ అడిగింది. గుళ్ళోవున్న విగ్రహాలా? సుబ్బారావుకి సందేహం కలిగింది. విగ్రహాలంటే

దేముడు కాదా? అని అడిగింది. దానికి ఆయన సమాధానం చెప్పలేక, చిన్నపిల్లవు నీకెందుకు యీదేవుడు, దయ్యాలు ఇంటికి వెళ్లమని ఆయన వెళ్ళిపోయారు.

అందరూ వెళ్ళిపోయాక అమ్మ తిన్నగా గర్భగుడిలోకి వెళ్ళి ఒకమూల నుంచుంది. అర్చకుడు అమ్మను చూడక తలుపులువేసి వెళ్లిపోయాడు. అమ్మ రాజ్యలక్ష్మి అమ్మవారి విగ్రహం దగ్గరకు వెళ్ళి "ఆయన దేముడంటే విగ్రహాలా అన్నాడే? దేముడు వేరు, విగ్రహాలు వేరా? విగ్రహాలే దేవుడా? అని ఆలోచించుకుంటూ–విగ్రహం కళ్ళకు పెట్టిన డిప్పలను తీసి కన్నులకోసం చూచింది. కనిపించలేదు. కట్టిన గుడ్డలు విప్పదీసింది. రాయి మాత్రం మిగిలింది. రాతికి పూసిన రంగులు చేతికి జిడ్డుగా తగిలాయి. అమ్మ పిలిచింది. రాయి పకలలేదు. కదిలించింది. కదలలేదు. అమ్మవారు అన్నీ ఉన్నప్పుడు ఒక రకం తీసినప్పుడు యింకోక రకం అని తనలోతానే అనుకుంది.

"ఈ సొమ్ములు చేసినవాడు దేవుడా? ఈ చీరదేవుడా? ఈ రాయి చెక్కినవాడు దేవుడా? వాటన్నింటినీ దేవుడనుకున్నవాడు దేవుడా? అసలీ పదార్థాలన్నీ ఇచ్చిన భూమి దేవుడా? ఈ భూమిని ఎందుకు పూజచేయకూడదు. భూమి అన్నింటికీ ఆధారంకదా? అనుకుంటూ మూలన ఉన్న గుప్పెడు మట్టిని చేతికి తీసుకొని ఆ మట్టివంక తదేకంగా చూస్తూ అమ్మా!

నీలో పుట్టి నీలో పెరిగి నీలో లయమయ్యే వస్తువులన్నిటికీ పూజచేస్తూ నిన్ను గుర్తించనివ్వకుండా చేస్తున్నావా?

దున్నినా, తన్నినా సహిస్తున్నావు. మంచీచెడూ విబేధం లేకుండా అన్నింటినీ భరిస్తున్నావు. నీ గుండెల్లో ఎన్ని అగ్నిపర్వతాలున్నాయో! వాటిని నీలోనే దాచుకొని నిశ్చలంగా కనిపిస్తున్నావని ప్రస్తుతించింది.

కొందరు నీకోసం దారుణ, రణ, మారణ హెూమాలు చేసి నీ అనుంగు బిడ్డల కుత్తుకలు కోసినా నీ రమణీయ శరీరం రక్తసిక్తం చేసినా, నీ గుండెలను గొడ్డలితో వ్రయ్యలు చేసినా ఈ షణ్మాత్రం చలించవు, వారిని నిరసించవు, నిందించవు. వారిని ఖండించవు. దండించవు. పైగా ఆదుర్మార్గులకు నీచల్లని ఒడిలో స్థానమిచ్చి, సేదదీర్చి అమ్మలో ఆవేశం, ఆవేదనా పొంగిపోయాయి. కొంచెంసేపు మౌనంగా

భూమివంక చూస్తూ "ఎందుకమ్మా నీకీ సహనం? ఎవరు గుర్తిస్తారు నీ ఔదార్యం? నీ హృదయం ఎవరికి అర్థమవుతుంది? అని ప్రశ్నించింది.

అమ్మా! నిస్వార్థమూ, నిరుపమానమూ అయిన నీ చరిత్ర ఎంత పవిత్రమైనది. త్యాగం నిండిన, రాగం పండిన నీ జీవితం ఎంతో దివ్యమయినదని ప్రశంసించింది.

"అందుకే సర్వజగత్తుకూ నీవే మాతృమూర్తివంటాను. ఈ సమస్త జనులు నిన్నే పూజించాలంటాను" అని అమ్మ అసందిగ్ధంగా ప్రకటించింది.

ఆనాడు భూమిలో అమ్మకు సాక్షాత్కరించిన తత్వమాధుర్యబిందువే, సింధువై విరాడ్రూపంతో లోకాన్నంతటినీ ఆకర్షించింది. తర్వాత లోకం అమ్మ భూదేవి యొక్క అవతారమేనని విశ్వసించి ఆరాధించింది. అమ్మ భూమిని దేవతగా అభివర్ణించింది. అట్టి భూమిని స్వర్గతుల్యంగా చేయటంకాని, నరకంగా మార్చటంకానీ మానవుల ప్రవర్తనే కారణభూతమౌతుంది.

అత్యాశలకు పోయా దారుణ, మారణ హెూమాలకు తావివ్వకుండా సుఖశాంతులతో ఓలలాడాలి. మనకు పంటలు, ఖనిజాలు సమస్తం భూమినుండే లభ్యమవుతున్నాయి. దానిని రక్తసిక్తం చేయకుండా పవిత్రభావాన్ని మనం పెంపొందించుకోవాలి. అమ్మ ఇచ్చిన సందేశాన్ని ఆచరించి నేలనాలుగు చెరగులా వ్యాప్తి చెందేలా చూడవలసిన బాధ్యత మనమీద వున్నది. అందువల్లే కొందరు కవులు అమ్మను "మేదినీ స్వరూపిణీ" అని "అవనికన్న పావని" అని స్తుతించి గానంచేసి ఆనందించారు.

ధరిత్రీ–ధరిత్రీ; సర్వజగద్ధాత్రీ

చరాచర సకల జీవన జనయిత్రి–అని స్తుతిస్తూ అమ్మదేవాలయ ముఖద్వారం వద్దకు వచ్చింది. అదే సమయానికి అర్చకుడు రంగాచార్యులు తలపు తెరిచాడు ఎదురుగా అమ్మ తేజోవిలసితమూ, రమణీయమూ అయిన ఆ ముఖము, నేత్రద్వయము తళుక్కుమని అతని దృష్టినాకర్షించాయి. ప్రశాంత సుందరము, ప్రసన్న దరహాసభాసురమూ అయిన ఆమూర్తితోపాటు అనంతకాంతి వెల్లువ అతని హృదయాన్ని నింపివేసింది. తాను నిత్యము ఆరాధించే అమ్మవారుగా భావించాడు.

ఆ అద్భుత దృశ్యవీక్షణముతోనూ అపూర్వ భావావేశంతోనూ అప్రతిభూడైపోయాడు. మంత్రబద్ధుని వలె అమ్మపాదాలపై వాలిపోయాడు. అమ్మ మృదుకరంతో అతని శీర్షోపరిభాగాన్ని ఒక్కసారి స్పృశించింది. అంతే అతడు ఏ లోకానికి వెళ్ళాడో, ఏ ఆనందసార్ణవపులోతులను పరిశోధిస్తున్నాడో దేహంలో ఈషణ్మాత్రం చలనంలేదు.

రంగాచార్యులు కళ్ళుతెరిచాడు. ఎదుట అమ్మ కనిపించలేదు. గబగబా రాజ్యలక్ష్మీ అమ్మవారి విగ్రహం వద్దకు పరిగెత్తాడు. నిజమయిన దర్శనమిచ్చావు తల్లీ అని తన్మయుడైపోయాడు.

అంతలో దేవాలయ ధర్మకర్త దేశిరాజు రంగారావుగారు వచ్చారు. వస్త్రవిహీనయై అలంకార రహితమైన విగ్రహాన్ని చూచారు. ఏం రంగాచార్యులుగారు ఈ రోజు దిగంబరోత్సవమా! అని వ్యంగ్యంగా ప్రశ్నించారు. పారవశ్యం వలన శరీరం స్వాధీనంలో లేకపోయినా లేచివెళ్ళి యింకొక చీరె తీసుకువచ్చి కట్టాడు. ఆభరణాల కోసం అన్వేషించగా కనిపించలేదు.

అమ్మా ఈ రీతిలో నుండి అలంకారంతో (ఆభరణాలతో) సహా నాలో ప్రవేశించావా! నీవు మాత్రం నాతోనే వుండమ్మా. నా కళంకం పోయేటట్లుగా అలంకారానికి ఆభరణాలివ్వమ్మా అని దీనాతి దీనుడై ప్రార్థిస్తుండగా సొమ్ములున్న స్థలం మనస్సులో స్ఫురించింది. వెంటనే వాటిని తెచ్చి అలంకరించాడు.

దొంగిలించింది తెచ్చిపెడ్తున్నావా! నీకు రావలిసింది లెక్క చూచుకోమని ధర్మకర్త దేశిరాజు రామారావు చెప్పారు "నాకు రావలసినది తరువాత చూచుకుందాము. ముందుగా మీ నగలు లెక్కచూచుకోండి" అని అన్నారు. "నాకీ ఉద్యోగం పోయినా సరే నీ రూపు మాత్రం మరుపురాకుండా చేయమ్మా" అని నమస్కారం చేసి బయటకు నడిచాడు.

రంగాచార్యులవారు దేవాలయ ప్రాంగణం దాటి రాగానే ఎదురుగా అమ్మవారి పోలికలు అమ్మముఖంలో గమనించి నీవు ఎవరి అమ్మాయివని ప్రశ్నించాడు. ఎప్పుడు ఎక్కడవుంటే వారి అమ్మాయిని అని అన్నది. అయితే ఇప్పుడు మా అమ్మాయివా అని అడిగారు. అనుకుంటే కానా! అని అమ్మ తిరిగి ప్రశ్నించింది.

అమ్మను చూచాను ఈవేళ. మా అమ్మసామాన్యం కాదు. అని కన్నులు మూసుకొని పరవశుడైనాడు. కన్నులు తెరచిన రంగాచార్యులకు అమ్మ కనిపించక అమ్మ ముఖంలో అమ్మవారి పోలికలు, అమ్మ మాటల్లోని అర్థగాంభీర్యం స్ఫురణకు వచ్చి అదృశ్యమైన అమ్మను అన్వేషిస్తూ వీధివెంట పరిగెత్తారు. అమ్మ రైల్వే స్టేషనుకు ఎదురుగా వున్న నేరేడు చెట్టు క్రింద కూర్చుంది.

అమ్మా! నిన్ననాకు కనిపించింది నీవేనా? నిజం చెప్పు అని రంగాచార్యులుగారు అడిగారు. "నేను ఎప్పుడు కనబడ్డాను నీవు నిజం చెప్పు. నా సొమ్ములు కాజేయటానకి వచ్చావా? గుడిలో అమ్మవారిని కాజేసినట్లు అని అడిగింది. అమ్మా! అమ్మా! పొరపాటు పడ్డాను. కనపడ్డది ఉదయం ఎనిమిది గంటలకమ్మా. గుడిలో జరిగిన విషయం ఎవ్వరికీ తెలియదు.

నీ నోటివెంట ఎలా వచ్చిందమ్మా! ఆ కనపడ్డది నీవేనా? నిన్ను నేను అర్థం చేసుకోలేకపోతున్నాను, ఎవ్వరూ అర్థంచేసుకోలేరు. అంటూ అమ్మ పాదాలమీద పడి మాయ కప్పుకమ్మా అని రోదించారు. "అమ్మా! నన్ను తొందరగా నీలో కలుపుకో తల్లీ" అని ప్రార్థించారు. రంగాచార్యులుకు దారిపొడుగునా "నీకేం ఫరవాలేదు నీ ఉద్యోగం నీకు వస్తుందని" వినిపించింది.

అమ్మ దేశిరాజు రంగారావు గారింటికి వెళ్ళింది. వారికి అమ్మ పెద్ద ముత్తైదువువలె కనిపించింది. ఎవరమ్మా నీవు! అని ప్రశ్నించారు. రంగాచార్యులుగారి బంధువును అని అమ్మ సమాధానమించింది. ఆయన నీకేమవుతాడని రంగారావుగారు అంటే కొడుకు అవుతాడు. వాళ్ళ అమ్మ నేను అక్కచెల్లెళ్ళం అని చెప్పింది. వారింటినుంచి వస్తున్నావా అమ్మా? అని అడిగారు.

కాదు! వాడి ఇంటికి వెడ్తున్నాను. ఎవరో వాడి ఉద్యోగం తీసివేశారుట. వాడు చాలా మంచివాడు యోగ్యుడు. ఆ గుడికి వాడిచేత అర్చకత్వం జరిపించుకునే యోగ్యతలేదు అని అమ్మ స్పష్టంగా చెప్పింది.

ఆ మాటలు రంగారావుగారికి ఆకాశవాణి వలే ఎవరో అదృశ్యదేవత పలికినట్లుగా అనిపించింది. వెంటనే తన నిర్ణయాన్ని మార్చుకొని, రంగాచార్యులు వారికి ఇవ్వవలసిన జీతం కంటే పదిరూపాయలు ఎక్కువ తీసుకొని పూలుపళ్ళు

కొనుక్కొని రంగాచార్యులగారికి క్షమాపణ చెప్పి పైకం చేతిలో పెట్టారు. పూలు పళ్ళు తీసుకొని అమ్మవారికి పూజచేసి నివేదన చేయమన్నారు. ఇదేమీ అర్ధంకాక రంగాచార్యులు నిశ్చేష్టులై నిలబడి వుండగా కిటికీలో నుండి వీధిలో వెడ్తున్న అమ్మ కనిపించింది. అమ్మా! అని ఒక్క పరుగున వీధిలోకి వచ్చారు. వీధిలో అమ్మ కనిపించక నైరాశ్యోపహతుడై "అమ్మ నీ బిడ్డతో నీవే దాగుడు మూతలు ఎందుకమ్మా? నీ దర్శనం పూర్ణంగాను, శాశ్వతంగాను ప్రసాదించమ్మా, నేనీ ఊయలలూగ లేనమ్మా నాకీ మాయ తొలగించవమ్మా, నన్ను నీ ఒడిలోకి తీసుకోమ్మా" అని విలపించారు. "ఇప్పుడు నీవు నా ఒడిలోనే ఉన్నావు నాన్నా! నా ఒడివిడిచి ఎవరూ ఎక్కడకూ పోలేరు" అని రంగాచార్యులవారికి అదృశ్యవాణి వినిపించింది.

★ ★ ★

# 5. అందరికీ సుగతే

ఐదు సందవత్సరాల అమ్మ విరిసీవిరియని మనసు కలిగి ఉండాల్సిన బాలిక జీవితంలోని నిమ్నోన్నతాలు, లోకంలోని న్యూన్యతాధిక్యాలు-సర్వం చవిచూచిన పరిపూర్ణమైన అనుభవం కలిగిన పెద్దముత్తైదువువలె ఆలోచనా నిమగ్నులయినట్లు ఆకాశంలోకి అవలోకిస్తూ గంభీర వదన అయి మందగమన అయింది.

యూనియన్ ఆఫీసువద్దకల మట్టిచెట్టు క్రింద ఆసీనకాబోయింది. ఒకపోలీసు ఏ అమ్మయి నీపేరేమిటి? అని పదిసార్లు పిలిచాడు. అమ్మ విననట్లేవుంది. శృతిపెంచిన కంఠంతో నీపేరేమిటి? అతని కంఠంలో కర్కశత్వం గర్జించింది. పిలిచావుగా అదే నాపేరు అబ్బాయి? అని అమ్మ అన్నది. అబ్బాయట తనవయస్సెక్కడ? ఆమె వయస్సెక్కడ అందుకే అడిగాడు. అబ్బాయిఏమిటి? అని పోలీసు అన్నాడు. వెంటనే అమ్మ అమ్మాయ్ ఏమిటి అని ప్రశ్నించింది. నీవు అమ్మాయివి కనుక అని అన్నాడు. నీవు అబ్బాయివి కనుక అని అమ్మఅంది. ఏయ్ నేను పోలీసును అని అన్నాడు. ఏయ్ నేను అనసూయను అన్నది. పోలీసు, జాగ్రత్త నీకు జైలు కావాలా? కారాగారం అనే ఉద్దేశ్యంతో అన్నాడు. జయజయధ్వానాలు అన్న అర్థంలో అమ్మ జైలుకొడతావా అప్పుడే వద్దులే అని అంది. ఆ శబ్దచమత్కారం అతనికి అర్థంగాక 'ఆ' అన్నాడు. అమ్మ 'ఈ' అన్నది. అతనికి మరీ అయోమయమై 'ఈ' అంటూన్నావేమిటి అన్నాడు. దానికి అమ్మ "నీవు 'ఆ' అంటే దాని తరువాత 'ఈ' కదా అని అన్నానంది. ఆ తరువాత ఈ అని నీకెవరు చెప్పారు. అన్నాడు" ఎవరూ చెప్పలేదు. శబ్దాలు పుట్టింది పలకటానికేగా అంది. వీటిని గ్రహించేశక్తి ఒకటే" అని వివరించింది.

ఆ వివరణను వినే సహనం ఆ పోలీసుకు లేదు. ఆ మాటల్లోని మాధుర్యాన్ని ఆస్వాదించేందుకు సంస్కారం కావాలి కదా! అమ్మ కంఠసీమ నలంకరించి యున్న పులిగోరుపట్టుకు లాగాడు. అదిరాలేదు. గట్టిగా గుంజాడు రాలేదు. "నీ చెయ్యి నొప్పి పుడుతుంది. నేను గొలుసు ఇస్తాను కాని ఒక సంగతి అడుగుతాను చెప్తావా" అంది. అతనిలో ఆశచావక గొలుసు ఇస్తానంటే చెప్తానన్నాడు. ఎందుకివ్వను "మాటంటే మారు మాటలేని మాట ఆ మాటనే మంత్రం" అంటారు.

అమ్మ మెడలోనుండి పులిగోరు తీసి చేతిలో పెట్టుకొని ఇంతకీ అసలు నీ

ఉద్యోగం ఏమిటి? అని అడిగింది. ఎవరు ఏలోపాలు చేసినా, కనిపెట్టడం వారిని జైల్లో పెట్టడం అని పోలీసు చెప్పాడు. లోపమంటే ఏమిటి? అమ్మ అడిగింది. దొంగతనం చేసినా, ఒకరు ఒకరిని కొట్టినా, చంపినా అన్నాడు, ఐతే ఇపుడు నీవు చేసిన పని ఏమిటి? దొంగతనం కాదా? నిన్నెవరు పట్టుకుంటారు. ఇంకొక పోలీసు పట్టుకుంటాడా? మీకు తప్పు లేదని వదిలిందా ప్రభుత్వం" అని అడిగింది.

మృదువైన అమ్మ కంఠంలో కాఠిన్యం పలికింది. ఆశ్చర్య చకితుడు, భయకంపితుడు అయి అమ్మముఖంలోకి చూచాడు. అతి సుందరమయిన అమ్మముఖం స్థానే అరుణోదయకాంతి గోచరించింది. అతడు దిగ్భ్రమ చెందాడు. ఆకాంతి పలుచబడి అమ్మముఖం కనిపించింది. వణుకుతున్న చేతులతో ఆ పులిగోరు గొలుసును అమ్మ మెడలో వేసి, అమ్మను తన ఇంటికి తీసుకువెళ్ళాడు. ఆ పోలీసు పేరు మస్తాను. అతని పిలుపందుకుని కొందరు పోలీసులు మస్తాను ఇంట్లో సమావేశమయ్యారు.

మస్తాన్ ఉర్దూలో వారికి జరిగింది వివరిస్తూ అమ్మమాట తప్పుచెప్పాడు. అమ్మ వెంటనే అబద్ధం చెప్పకు ఉన్నది ఉన్నట్లు చెప్పు. ఉన్నది ఉన్నట్లుగా చెప్పలేవుకూడా. జరిగింది జరిగినట్లు చెప్పు" అంది. ఆ మాటకు విని అందరూ బిత్తరపోయారు. అమ్మకేదో మహత్తర శక్తులున్నాయని భావించారు. రాత్రి 12గం.ల వరకూ వారింటివద్ద వున్నది. తరువాత వారు అమ్మను ఇంటి దగ్గర దింపారు. అమ్మ చినతాతగారు చిదంబరరావుగారు భోజనానికి కూర్చుంటూ అమ్మను అన్నం తినటానికి రమ్మన్నారు. ఆ-కలిలేదు, అని అమ్మ అంది. దానికి తాతగారు ఏ-కలి లేదు అన్నారు. "ఈ కలిలో నాకాకలి లేదు" అని అమ్మ సమాధానమిచ్చింది. మనస్సు సునిశితం మాటలు చురుకు అని అనుకున్నారు చిదంబరరావుగారు.

మస్తానుకు, అతని స్నేహితుడు అంకాదాసుకు అమ్మ మొట్టమొదట చెప్పినమాట "మారుమాటలేని మాట" మంత్రమయింది. వృత్తి ధర్మాన్ని ఇంకా నిష్టగా అనుసరించ నిశ్చయించుకున్నారు. ఒకరోజు మస్తాను "అమ్మా! వచ్చి రాని మాటలతో మాకు నీతి, నిజాయితీ వ్యక్తపరచి ధర్మం బోధించి మమ్మల్ని తరింపచేయటానికి వచ్చావా అమ్మా అని నాకు తరించే సమయంవచ్చే నా మనస్సు నీ మెడలోని పులిగోరు మీదకు పోయిందని అన్నాడు. ఆ నీతి నిజాయితీయే దేముడని అమ్మ అన్నది. ఆ దేముని క్రమం తప్పక మేము ఆరాధిస్తామమ్మా" అని అన్నారు.

మర్నాడు తోటలోకి వెళ్ళగానే మస్తాను తనపై ఉత్తరీయం తీసి నేలపై పరిచి మహమ్మదీయ ఆచారంలో నమస్కారం చేసాడు. అంకదాసు సాష్టాంగ నమస్కారం చేసాడు. వారుతెచ్చిన పంచదారబూందీ అమ్మ చేతిలో పెట్టారు. అమ్మ పొట్లం విప్పదీసింది. మస్తాను, అంకదాసు కళ్ళుమూసుకొని ధ్యాననిమగ్నులయ్యారు. కళ్ళు తెరచి చూచేటప్పటికి పొట్లాంలో బూందీలేదు. ఒక ముసలమ్మ దానిని తిన్నట్లు ఇద్దరికీ కనిపించింది. ముసలమ్మగా కనిపించా వెందుకమ్మా! అసలు నీవెవరమ్మా! అని అంకదాసు శోకరుద్ధకంఠంతో అడిగాడు. "నాకేమీ తెలియదు నాన్నా మీరు కళ్ళు మూసుకున్నప్పుడు ఎవరైనా ముసలమ్మ వచ్చితిన్నదేమో" అంటూ వారి కన్నులకు గంతలు కట్టే ప్రయత్నం ఆరంభించింది.

నిజమే తిన్నది అమ్మకాదు. ముసలమ్మే కానీ ముసలమ్మ రావటం వెళ్ళడం రెండూ చూడలేదు. మరి ఆ ములసమ్మ ఎవరూ అని మస్తాను సందిగ్ధంలో పడ్డాడు. ముసలమ్మ ఎవరోకాదు అమ్మే అని అంకదాసు నమ్మకం. అమ్మ తనకు తెలియదంటుంది కదా! అంటే మాయకప్పుతున్నదని అన్నాడు. ఆ మాయకప్పటం దైవ లక్షణం అనుకుంటూ లేకపోతే ఐదు సంవత్సరాల పిల్లచుట్టు మనం తిరగడమేమిటి? ఈ స్వల్పకాలంలో మనకీ అనుభవాలేమిటి? అమ్మ దైవం అవునో కాదో కానీ అమ్మ కనపడ్డప్పటి నుంచీ నాలో పెద్దమార్పు వచ్చింది. ఏనాడు ఎవరికీ దణ్ణం పెట్టని నాకు పదే పదే దణ్ణం పెట్టబుద్ధి పుడుతున్నది. ఎప్పుడూ అమ్మనే చూస్తూ ఉండాలనిపిస్తుంది. అమ్మ మనతోనే వుండాలని అనిపిస్తుంది. కాని అది ఎలా వీలవుతుంది అని అంకదాసు అన్నాడు. దానికి మస్తాను మన మనేదిపోయి అంతా అమ్మేఅయితే అన్నాడు. అంతా అమ్మ అయితే యిక అమ్మను చూచేదేముంది? అమ్మ అమ్మగాను, మనం పిల్లలుగానూ ఉన్నప్పుడే ఆనందం. అందుకే అమ్మ "లడ్డు అవటంలోకన్నా లడ్డూ తినటంలోనే రుచి" అని అంది. ఇదే పెద్దలు చెప్పే జీవన్ముక్తి లక్షణం. ఇదే భక్తి వారిద్దరూ మాట్లాడుకుంటున్నా తనకేమీ సంబంధంలేనట్లు నిర్వికారంగా కూర్చున్నది.

చీకటి పడటంతో అమ్మను ఇంటి దగ్గర దింపటానికి బయలుదేరారు. దారిలో రైలు పట్టాలకివతలగా ఒక ముసలివాడు ఎగాదిగా అమ్మవంక, వారిద్దరివంకా చూచి, అమ్మ పాదాలపై సాష్టాంగపడ్డాడు. ఎంతసేపటికీ లేవలేదు. మస్తాను అతనిరెక్క

పట్టుకొని లేవతీసాడు. అతనిలో చలనం లేదు నోటివెంట నురుగుచారలున్నాయి శరీరమంతా చల్లగావుంది. అతను చనిపోయాడు. ఇది వరకు ఇతను నీకు తెలుసా అమ్మా! అని అడిగారు. అతను బిక్షాటనకకు వచ్చినప్పుడు పరిచయం "ఇద్దరం కలసి బజారుకు వెళ్ళాము. అతనికి నా మెడలోని బంగారపుతాడు మొలనున్న బంగారం బిళ్ళ ఇచ్చి బ్యాంకులో తాకట్టుపెట్టి డబ్బు తీసుకోమని చెప్పాను, చిల్లరకొట్లో వెచ్చాలు ఇప్పించి మిగిలిన డబ్బు వృధాచేసుకోవద్దని చెప్పాను" అని అంది.

అమ్మకు డబ్బు గురించి ఎంత జాగ్రత్త! ఆధ్యాత్మిక విషయాల్లో ప్రతి చిన్న విషయంగురించి ఎంత శ్రద్ధతీసుకుంటుందో, ప్రాపంచిక వ్యవహారాలకు అంతవిలువనూ ఇస్తుంది అమ్మ - అమ్మకు ఆధ్యాత్మికమని, ప్రాపంచికమని బేధంలేదు కనుక. ముసలివాడివి రాత్రిళ్ళు జాగ్రత్త తేళ్ళు పాములు తిరుగుతుంటాయి అని ముందుగా చెప్పింది.

ఆ పరిచయమే ఈ అదృష్టానికి మూలం. నీ పాదాలపై పడి ప్రాణాలు వదిలి ధన్యుడయ్యాడు. అందువల్ల అతని శరీరం ముక్తి పొందిందమ్మా; పూర్వం పురాణాలలో లేని విశేషాలు నీ చరిత్రలో కనపడుతున్నాయి. దుష్టశిక్షణలేని అవతారం. అందరికీ రక్షణే. శిక్షణ కూడా రక్షణేనాయనా! అని తరువాత జరుగవలసిన కార్యక్రమాన్ని చూడమని వారికి చెప్పింది. అమ్మ బయలుదేరేముందు. "నీవు లేకున్నా నిన్ను గుర్తించటానికి నీవుధరించిన ఆకృతి ఉన్నది అంటూ శవాన్ని ముద్దుపెట్టుకుంది.

అంతలో శవం కదిలినట్లయింది. అమ్మా! ఈ సంఘటనకు అర్ధమేమిటమ్మా! ఆముసలివాని మీద ప్రేమ వల్ల చనిపోయినా బ్రతికించావా! చనిపోయిన అతనిని పునర్జీవిని చేయడం ద్వారా మాలో విశ్వాసజ్యోతిని వెలిగిస్తున్నావా? లేక మరేమయిన ప్రయోజనం ఉద్దేశించావా? అని అంకదాసు అమ్మను అడిగాడు.

మస్తాను "ఇతను ఏమీ తెలియనివాడు. ఏమీ ప్రార్ధన చేయనివాడు. ఇతడు యాచించినది ముష్టికాని ముక్తికాదు. ఉదర పోషణకు తంటాలుపడేవానికి ఉత్తమగతులా అని అన్నాడు. మస్తాను మాటలు అంకదాసు చెవి దూరలేదు. అతడు మరోలోకంలో ఉన్నాడు. అతని దృష్టి అమ్మవంకనే గాని అతడు అవలోకించింది. కొండలు-కోనలు, అడవులు-అంబోధులు, నదులు-నిధులు, మనుష్యులు-జంతువులు, పక్షులూ-పురుగులు ఎన్నో ఎన్నెన్నో అతని శరీరం

జలదరించింది. మనసు వివశమయింది. క్రమేణా దృశ్యం అదృశ్యమయింది. కృష్ణుడు ఈ అమ్మ నిజమేనా అమ్మ నిజమేనా అమ్మా అని అరిచాడు. ఆనాటి కృష్ణుడే ఈనాటి ఈ అమ్మ. అవతారాలు వేరుకావచ్చు. కాని శక్తి ఒక్కటే ప్రయోజనం ఒక్కటే అని అనుకున్నాడు.

"దయామయీ! ఈ అల్పునిపై యింత కరుణ ఎందుకమ్మా? నేను దుర్మార్గుడినమ్మా, నేను ఏనాడు భగవంతుని పూజించలేదు. ఈ అద్భుత దర్శనమేమిటమ్మా! పతితులు పరమదుర్మార్గులు కూడా పరుసవేదిలాంటి నీదివ్య స్పర్శలో పావనులౌతారా అని అమ్మను ప్రశ్నిస్తూ" అంకదాసు ప్రాధేయపడ్డాడు.

అజ్ఞానులకు జ్ఞానం ఎలా కలుగుతుందని మస్తాను అమ్మను అడిగాడు. మీకు కలిగనట్లుగానే అని అమ్మ అన్నది. మాకు నీదయవల్ల కలిగిందమ్మా! అని అన్నారు. అందరికీ ఒకరిదయ వల్లనే జ్ఞానము అజ్ఞానం రెండూ. అంతలో ముసలివాడులేచి కూర్చున్నాడు. అంకదాసు ఆనందం ఆశ్చర్యం పట్టలేక "తాతా ఏ సంజీవితో బ్రతికావు అన్నాడు. "అమ్మే సంజీవి. జీవన సంజీవిని" అని మస్తాను అన్నాడు.

అమ్మ ముసలివానివీపు నిమురుతూ "నాయనా మంచినీళ్ళు త్రాగుతావా" అని అడిగింది. "ఇంకేమీ వద్దమ్మా ఈ అనుభవం చాలమ్మా! ఎంతవిచిత్రమయిన అమ్మవమ్మా! నీ విచ్చిన డబ్బు కూడా నా కవసరంలేదు. కొంతఖర్చు అయింది. అదీ ఒకతప్పు చేయడానికి. త్రాగి మాంసం తినాలని కొనుక్కొని చేసుకోవటం చేతకాక పారేసుకున్నాను". నాయనా నా దగ్గరకు తెచ్చుకోలేకపోయావా? నేను చేసిపెట్టేదాన్ని అంటుండగానే అమ్మచేతిలో మాంసంముక్క కనిపించింది. ఆముక్కను చూచి ఉలిక్కిపడి అంకదాసు మీదపడ్డాడు.

ఎవరి అనుభవంవారిది. ఒకరికిచ్చిన అనుభవం మరొకరికి ఇవ్వదు. ఎదురుగా వున్న ఏమీ కనిపించదు. అని మస్తాను అనుకొని "తాతా అసలు ఏమిజరిగింది? అని అడిగాడు. "చీకట్లో నడుస్తుంటే దారిలో త్రాచుపాము కాటువేసింది. మంత్రం వేయించుకుందామని స్టేషన్ దగ్గరకు పోదామనుకున్నాను. అమ్మ ఇక్కడ వుందని తెలిసి బయలుదేరాను. పాముకాటు వేసినప్పుడు దీపం చూస్తే ప్రమాదమని చీకటిలో దారి కనిపించక యాతన పడ్తుంటే, దీపంలేకనే దారికనిపించింది. సరాసరి అమ్మవద్దకు వచ్చాను. నిన్ననే అమ్మ దర్శనమయింది. దయ చూపించింది. పాము కరుస్తుందని

హెచ్చరించింది. కానీ నేను నమ్మలేదు. రాత్రి నేను చనిపోయినట్లు అమ్మ బ్రతికించినట్లు కల వచ్చింది. నేను అమ్మను అర్ధంచేసుకోలేదు. మూఢుణ్ణి అమ్మ కరుణించింది. అమ్మకు ప్రేమించడం, కరుణించడం సహజం. కానీ మన అర్హతను బట్టికాదని ఇప్పుడు తెలుసుకున్నాను" అని చెప్పాడు.

ముసలివాని కథను, వ్యధను విన్న మస్తాన్‌కు తనగతజీవితం యావత్తూ ఒక్కసారి వచ్చి కనులముందు నిల్చున్నది. దుఃఖము పొంగిపొరిలింది. ఆవేశం అణుచుకోలేక "నీవు మంచిపనులుచేయక పోయినా చెడ్డపనులు చేసి వుండవు. నేను చేసినవన్నీ పాపాలే. కట్టుకున్న భార్యను అగచాట్లు పాలుచేసాను. తమ్ములకు అన్యాయం చేసాను. కాని అమ్మకు మనమంచిచెడ్డలతో నిమిత్తం లేదన్నమాట. మనం పాపంచేసినా అమ్మదర్శనమయిన తరువాత దానికి స్థానమేది? సూర్యోదయం అయిన తరువాత చీకటి వుంటుందా? శోకోద్ధృతం వలన, భావావేశంవలన మస్తాను కంఠం మూగపోయింది".

పక్కనే వున్న అంకదాసు పెద్దగా "లీలావతీ, లీలావతీ అని కేకలు వేసాడు" నాపేరు అనసూయ నాయనా" లోకంలో ఇన్ని పేర్లుండగా ఆపేరునే ఎందుకు కోరుకున్నావమ్మా? ఆపేరుకు అర్ధమేమిటమ్మా అని అడిగాడు. అమ్మ ఏమిచెప్తుందో అని ముగ్గురు అమ్మవంకచూస్తున్నారు. తెల్లచీర, తెల్లరెవిక తొడుక్కుని సొమ్ములు, ముఖాన బొట్టు కూడాలేకుండా తల విరబోసుకొని పద్మాసనం వేసుకొని అమ్మకనిపించింది. "రాగద్వేషాసూయలను పారద్రోలేదే అనసూయ అదే అనసూయత్వం. ఈ అనసూయ తత్వం" అని అంది. అంకదాసు అర్ధంకాక మళ్ళీ అడిగాడు. ఇంటికి వెళ్ళాక చెప్తానన్నాడు మస్తాను.

"అమ్మనే చెప్పనీయవోయ్ నీవుచెప్పినా అట్లావుండదు. ఆధ్వని ఆపాతమధురం. ఆతత్వమే అమ్మ అయి వివరిస్తుంది కనుక అర్ధంకావటం సులభం. ఈ వివరణ చాలా అందంగాను, ఆనందంగానూ ఉన్నదని మస్తాను అన్నాడు. ఇంతలో ముసలివాడు 'అమ్మోయ్' అని అరిచాడు. ఏమిటి అన్నది అమ్మ నెమ్మదిగా. "పాము పాము నిన్ను చుట్టేస్తున్నది. కరుస్తుంది అని గాభరాగా అరిచాడు. తాతకు ముందుపాము అమ్మనుచుట్టేస్తున్నట్లూ తర్వాత అమ్మ పాము రూపంగా మారిపోయినట్లు ముఖం మాత్రం అమ్మలాగా దర్శనమయింది. వెంటనే అతనికి

భయం తగ్గి భక్తి కలిగి "నీవు సాక్షాత్తు దైవానివేనమ్మా" అని అన్నాడు. "అతడు ఏమి చూస్తున్నాడో మనకు కనబటడంలేదు". నీకు కలిగిన అనుభవాలు నాకులేవు. నా అనుభవాలు నీకు లేవు. మొదటిరోజు వయస్సుకు మించి చురుకుగా కనిపించింది. మరుసటిరోజు అసాధారణవ్యక్తి అనిపించింది. క్రమేణా దైవత్వం ప్రస్ఫుటమయింది. అమ్మ దగ్గరకు తలా ఒక కారణంతో చేరినా అనుభవాలు వేరు అయినా ఫలితం ఒక్కటే.

మనం చూడకపోయినా భావిప్రపంచం అమ్మదివ్య లీలలు పూర్తిగా చూడగల్గుతుంది. లోకంలో ప్రతి ఒక్కరూ అమ్మను దైవంగా గుర్తించి తరించాలని నా ఆశయం అని మస్తాను కోరుకున్నాడు. అతను మనస్ఫూర్తిగా కోరుకున్న కోరిక ఫలించటానికి ఎంతో కాలంపట్టలేదు. అమ్మ దగ్గరికి ఎవరు ఏకారణాలతో చేరినా అందరినీ తన ఒడిని చేర్చుకున్న కారుణ్యమూర్తి అమ్మ. మనలా ప్రభావితులైన వారెందరెందరో అమ్మను గుర్తించటానికైనా, తరించటానికైనా కారణం అమ్మ అనుగ్రహమే కదా!

వారికి కలిగిన అనుభవాలు తనకు లేవన్న తాతతో "నీకు ఏదితోస్తే అది నిజం నాన్నా. నీకు కనబడ్డదాన్ని బట్టేగా నీకుతోచేది, నీకు కనిపించేది. నీవు చెప్పేదీ అన్నీ ఒకటే అంది. "ఎప్పుడూ ఇలా పాములాగానే దర్శనమీయమ్మా! మరొక రూపంలో అయితే గుర్తించలేనేమో!" అని తాత అన్నాడు. అప్పుడు ఆ శక్తియిచ్చే. దర్శనమిస్తుందని మస్తాను చెప్పాడు. చెప్పేది, చేసేది, చూసేది అన్నీ అమ్మ, అనేనా, దానినే మనోవాక్కాయకర్మలంటారు.

అమ్మ వారితో రేపు తను మన్నవ వెళ్తున్నానని చెప్పింది. ఇంక కనపడవా అమ్మా అని అంకదాసు బావురుమన్నాడు. అంతటావున్న అమ్మవెళ్ళి వస్తానంటున్నదిగా "రూపం పరిమితంకానీ శక్తి అనంతం" అని మస్తాను ఆమాట అంటుండగానే ఒక్కసారిగా అరుణోదయమయింది. తాత దీనవదనుడై" ఇంతకూ నాగతేమిటమ్మా! అని అడిగాడు. వాళ్ళ గతే నీగతి. అందరికీ సుగతే" అని అమ్మ హామీ ఇచ్చింది. అది విని వారు హర్షపులకితగాత్రులయ్యారు. అమ్మ ఆమాట అనగానే అంకదాసుకు అమ్మఅందరినీ ఒడిలో వేసుకున్నట్లుగా దృశ్యమాన మయిందని అన్నాడు. అత్యల్ప వ్యవధిలోనే అనేక అద్భుతాలు చూచిన మస్తాను అందుకేమీ విస్తుపోక

ఆశ్చర్యమేమున్నది? వడేసిలాగి ఒడిలో వేసుకుంటుంది. ప్రపంచమంతా ఆ ఒడిలోనే వాలాలి. ఇందాకనగా తెల్లవార వచ్చిందనుకుంటే ఇంత పొద్దున్నదేమిటి? మనకు ఎంతవరకూ చెప్పదల్చుకుంటే అంతవరకూ పొద్దువుంటానే ఉంటుందని మస్తాను అన్నాడు.

"మీరు ముగ్గురూ అటు వెళ్ళండి. నేను ఇటువెళ్తాను" అని అమ్మ అంది. "ఎందుకమ్మా! నీవు మాతో రావచ్చుగా" అని అంకదాసు వేడుకున్నాడు. మనలాంటి వాళ్ళు ఇంకా ఎంతమంది ఉన్నారో మూలమూలలా" అని మస్తాను వారించాడు. మూడు రోజులకే ఇంత చరిత్ర జరిగిందే! భూమిమీదకు వచ్చిన ఈ ఐదు సంవత్సరాలలో ఎంతమందిని తరింపచేసిందో" అని అంకదాసు లెక్కవేస్తుండగా, 'పుట్టకముందులేదు? ఇది తెలిసింది'. అది తెలియంది అని మస్తాను పూర్తిచేసాడు.

ఇది తెలిసింది. అది తెలియందని మస్తాను అన్నమాటకు సమాధనంగా అమ్మ "తెలియంది తెలియ చేయటానికే నా రాక" అని తన దోవన తాను వెళ్ళింది. ఏమిటి? ఇది అమ్మావతారమా! అనుకుంటూ మస్తాను, అంకదాసు, తాత మరొకవైపుకు వెళ్ళిపోయారు.

★ ★ ★

# 6. శబ్దమంజరి

పోలీసులిద్దర్నీ, పునర్జీవుతుడైన తాతను ఒకదిక్కుగా పంపి అమ్మ ఆసుపత్రి పక్కగా నడుస్తున్నది. అమ్మమ్మకు జబ్బుచేసినప్పుడు వైద్యంచేసిన డాక్టరుగారి దగ్గర కాంపౌండరుగా పనిచేస్తునాన కృష్ణమాచారిగారు అమ్మను చూచి అమ్మా ఎక్కడనుండీ వస్తున్నావని అడిగాడు. వాళ్ళ డాక్టరుగారింట్లో అమ్మగురించి వింతగా చెప్పుకున్నారట. అదివిని అమ్మను చూడాలనుకోగానే అమ్మ దర్శనమయిందని విస్ఫారిత నయనాలతో అమ్మను చూస్తూ చెప్పాడు. ప్రొద్దున్నే ఆసుపత్రికి వెళ్తున్నారేమిటిని అమ్మ అడిగింది. “మీ అమ్మగారి కేసులాంటిదే వచ్చింది. రాత్రి ఆ కేసు చూస్తున్నంత సేపూ నీవే గుర్తుకు వచ్చావు. డాక్టరు గారింట్లో అమ్మ గురించి విన్నప్పటినుండీ ఆయనలో కలిగిన భావాలన్నీ కలసిరాత్రి అంతా అమ్మగురించే ధ్వనింపచేసాయి. ధ్యానమే కాకుండా దర్శనంకూడా అయింది.

వెంటనే అమ్మ “అవును నాయనా! ‘ధ్యాసే ధ్యానం’ అని అంది. కృష్ణమాచారికి ఆధ్యాత్మిక చింతన అంటే చాలా ఇష్టం. కానీ ఉద్యోగధర్మం నెరవేర్చవలసి రావటంతో సాధనకు అవకాశంలేక పోతోందని బాధపడ్డాడు. దానికి అమ్మ “ఆ యోగ్యత కలిగినప్పుడు మీరు చేసే సాధన చతుష్టయ సంపత్తివలన కలిగే ఫలితమే మన ఈ సంభాషణ”. అమ్మా! నన్ను కరుణించావమ్మా” అని ఆవీధిలోనే అమ్మ పాదాలకు సాష్టాంగనమస్కారంచేసి యింటికి వెళ్ళి శూలనొప్పి వచ్చి ‘అమ్మా’ అంటూ అంతిమశ్వాస వదిలాడు.

అమ్మ ఇంటికి వెళ్లాక అమ్మ చినతాతగారు చిదంబరరావుగారు అమ్మను అన్నం తిన్నావా? అని అడిగారు. దానికి అమ్మ ఆకలి వేయలేదని చెప్పింది. రోజూ ఆకలిగాలేదని, ఆకలి వేయలేదని అంటావు. ఆకలి వేయటంలేదా? లేక ఆకలి అని అనుకోవటంలేదా? అని అడిగారు. అమ్మ జవాబేవేమీ చెప్పకుండా వంటమనిషి రాఘవమ్మగారిని అన్నం కాస్త పెట్టమని అడిగింది. ఒక ఆకు తీసుకువచ్చి గిన్నెలో అన్నం తీసి ఆకులో పెట్టుకొని అమ్మ దొడ్లోకి వెళ్ళింది. రోజూ ఒక వరాహానికి అన్నం పెట్టటం అమ్మకు అలవాటు. అమ్మకు క్రిందటి రెండురోజులూ అంకదాసు, మస్తానులతో గడిచిపోయాయి. అందువల్ల వరాహానికి అన్నంపెట్టలేదు. కనీసం కనిపించలేదు. ఆ వరాహం కళ్ళల్లో దిగులు, దైన్యం, ఆర్తి అమ్మకు స్పష్టంగా

కనిపించింది. వెంటనే అమ్మ వరాహాన్ని దగ్గకు పిలిచింది. గబగబా అది అమ్మ పాదాల దగ్గరకు వచ్చి ముట్టెను పాదాల మీద ఆనించి, ఆఘ్రణించి కన్నులు పైకెత్తి అమ్మ ముఖం వంకచూచింది. కన్నులు జలజలా స్రవిచాయి. జాలిగా, ప్రేమగా, లాలనగా అమ్మ ఆ వరాహం వీపు నిమిరి విస్తరి ముందుకు లాగి దగ్గరకూర్చుని అన్నం కలిపిపెట్టింది. అంతలో ఎక్కడనుంచో పిల్లలన్నీ వచ్చి కొన్ని పాలుతాగుతూ, కొన్ని ఆడకుంటూన్నాయి. అందులో ఒకటి ఎగిరి అమ్మ ఒడిలో కూర్చున్నది. అది చూచి చిదంబరరావుగారు పరమాశ్చర్యంతో కేకవేసి "పందులతో ఆడుకుంటున్నావా? నిన్నుకూడా పందిపిల్ల అని అంటారు" అని అన్నారు. దానికి అమ్మ అంటే తప్పేమిటి తాతగారు మనం వంట ఇంట్లో వుంటాము. అవి పాకీదొడ్లో వుంటాయి మనకు వంట ఇల్లు ఎంతో వాటికి పాకీదొడ్డీ అంతే" అని అన్నది.

అమ్మ తండ్రి సీతాపతిగారు వచ్చి అమ్మను మన్నవ వెళ్దాం రమ్మన్నారు. మరిడమ్మ తాతయ్య వచ్చేటట్లయితే వస్తానని అమ్మ చెప్పింది. దానికి సీతాపతిగారు మరిడమ్మ తాతమ్మగారి దగ్గరకు వచ్చి" అత్తయ్య నీవు వస్తేకాని అమ్మాయిరాదుట, మరి నీవువస్తావా"? అని అడిగారు.

తాతమ్మ మూడుతరాల నుండీ తల్లితండ్రీలేని పిల్లలకు పరిచర్యలు చేస్తూనే వున్నది. ఇప్పుడుకూడా యీ పిల్లలకు తానే బాధ్యత వహిస్తే సీతాపతిగారు పెళ్లిచేసుకోరనే ఉద్ధేశ్యంతో "సంవత్సరీకాలకు వస్తాను. బారుకు వుండి వండిపెట్టలేను. నీకునిండా నలభై సం॥లు లేవు. నీవు పెళ్ళిచేసుకుంటే పిల్లకాపరానికి వచ్చేదాకా వండిపెడతాను" అని అన్నది.

సీతాపతిగారు పెళ్ళికి పూర్తిగా విముఖంగా వున్నారు. "ఏమయినా సరే నేను పెళ్ళి చేసుకోనని తన అభిప్రాయాన్ని తెలియచేసారు", ఏమైనా సరే తాతమ్మ రానిదే నేనురానని అమ్మ చెప్పింది. వారివాదన విన్న చిదంబరరావు గారు ప్రస్తుతం పదమ్మా అందరం వెళ్దామని అన్నారు. అమ్మ వంట ఇంట్లోకి వెళ్ళి ఆకులో అన్నం పెట్టుకొని దొడ్లోకి పరిగెత్తింది. పడుకున్న వరాహం అమ్మను చూచి ఆనందంతో ఎవరైనా ఇంటికి వస్తే ప్రేమతో పలకరించినట్లు దగ్గరకు వచ్చింది.

అమ్మ తాను తెచ్చిన అన్నం దానికి పెట్టింది. అమ్మ ఒకచేత్తో దానివెన్ను రాస్తూ మరొక చేతితో దానిచేత అన్నం తినిపించింది. తొమ్మిది పిల్లల్లో నాలుగు

పాలుతాగుతున్నాయి. మిగిలిన అయిదు పిల్లలూ తల్లితోపాటు నిద్రపోతున్నాయి. మిగిలిన రొమ్ములకు పాలుచేపుకొని ఉన్నాయి. అమ్మ చిన్నగ్లాసు తీసుకువచ్చి రెండు రొమ్ములు పిండింది. అమ్మ పాలుపిండుతుంటే వరాహం ఎంతో తృప్తిగా తీసుకోమన్నట్లుగా చూస్తూవుంది. గ్లాసు నిండిన తరువాత కూడా రొమ్ములు స్రవిస్తుంటే అమ్మ వెంటనే నోరుపెట్టి రెండు రొమ్ములనుండి రెండు గుటకలు త్రాగింది.

చిదంబరరావు తాతగారు అనసూరి అని పిలిచారు. అమ్మ ఏమిటి తాతగారు అంటే ఏమీలేదమ్మా నీవేమి చేస్తున్నావో అని ఆంధ్రపత్రిక చదవటంలో నిమగ్నులయినారు. ఏమిటి తాతగారు అంత దీక్షగా చదువుతున్నారని అడిగింది అమ్మ. ఆంధ్రపత్రిక అని చెప్పారు. ఆంధ్రపత్రిక అంటే ఏమిటని అమ్మ అడిగింది. ఆంధ్ర అంటేదేశం అన్నారు. వెంటనే అమ్మ దేశపత్రికా? పత్రిక అంటే అడిగింది. పత్రిక అంటే పత్రం అమ్మ! అన్నారు. పత్రం అంటే పచ్చడి నూరుకునేదా అనిఅంది.

అది తాతగారు వినక పత్రికా పఠనంలో మునిగిపోయారు. ఆ పెద్దపెద్ద అక్షరాలు ఏమిటి తాతగారు అని అడిగింది. ఆంధ్రపత్రిక అని చెప్పారు. తలనొప్పిగా వుందని అమ్మను అమృతాంజనం తెచ్చిపెట్టమన్నారు. ఆలోగా పాము, పాము అంటూ నౌకరు కఱ్ఱకోసం పరుగెత్తాడు. అమ్మ దొడ్లోకి వెళ్ళింది. పెద్దపడగ గొధమ వన్నె కోడెత్రాచుని అమ్మ చూచిలోపలికి వెళ్ళింది. నౌకరు తాతగారు కఱ్ఱతీసుకు వచ్చారు. పాము కనిపించలేదు. అది మామూలు పాము కాదని దేవతాసర్పం. నాగేంద్రుడని తాతమ్మ అంది. అదే సమయంలో రాఘవరావుగారు, నాగేశ్వరరావుగారు వచ్చారు. తాతమ్మ నాన్నగారిని నాగేంద్రా అని పిలిచింది. అమ్మ అమృతాంజనం కళ్ళకు రాసుకుంది. తాతగార్ని "ఈమందు ఎవరు తయారుచేసారని" అడిగింది. నాగేశ్వరరావు పంతులుగారు తయారు చేసారని తాతగారు చెప్పారు.

అమ్మ అనుకుంది. అంతా నాగేంద్ర మయం. నిద్రలేస్తూనే నాలుగు దిక్కులా అదేనామం వినిపిస్తుంది. ఒకవైపున బావ (నాగేశ్వరరావు), మరోవైపున త్రాచుపాము నాగేంద్రుడు, అంతా నాగేంద్రమయం. ఆ భావనతో మనసంతా ఆనందమయంకాగా ఈరోజు మన్నవ ప్రయాణమేమో అనుకుంటుండగా మన్నవనుంచీ నల్లఖాసీం వచ్చాడు.

అమ్మను చూచి ఆనందంతో "మనవూరు రావా అమ్మా! నీకోసం గొల్లనాగమ్మ

ఏడుస్తున్నది. ఊరు చిన్నపోయింది. చిన్నప్పుడు అమ్మను పెంచిందికదా! ఆ మమకారం. తాతమ్మతో "అసలు నాలుగు బజార్లకు మన ఇల్లు మధ్యకావటం, యిల్లు తాళంపెట్టి దీపం పెట్టకపోవటం వలన ఊరే పాడుబెట్టినట్లుందని తన బాధను వ్యక్తం చేసాడు.

పాకీ మనిషి లోపలకు వస్తుండగా తట్టలోని చీపురు వాకిలి తలుపుకు తగిలింది. ఆశబ్దం వినిపించి రాఘవమ్మ గారికి చీపురు వంటికి తగిలినట్లయింది. గిరుక్కున వెక్కు తిరిగి ఎక్కడ పాకీ అమ్మాయని అడిగింది. పాకీది ఎందుకు వచ్చిందో ఆపనే చేస్తున్నదని అమ్మ జవాబిచ్చింది. అంతలో పాకీమనిషి తిరిగి వచ్చింది. నీకుకళ్ళు పోయినాయా? ఎక్కడెక్కడో చిమ్మిన చీపురు తలుపుకేసి కొట్టావా అని రాఘవమ్మగారు గబగబా అరిచింది. ఇక్కడ చిమ్మినదైతే తగిలినా ఫరవాలేదా"? అని అమ్మ ఫక్కున నవ్వింది. రాఘవమ్మగారికి కోపం వచ్చి "తెలియనిదానివి తెలియనట్లుండమ్మాయ్" అని అన్నది. తెలియనిదానికి తెలియక పోవటమే వృత్తి తెలసుకుండే దానికి ప్రతీదీ తెలసుకోవటమే" అని అమ్మ అన్నది. రాఘవమ్మగారు కన్నులెర్రచేసి పాకీ మనిషివంక చూచింది. నేనేమీ చేయలేదు దొరసాని." ఆ కంఠంలో వేడికోలువున్నది. పాకీ మనిషి నడచినంతమేరా పసుపునీళ్ళు చల్లి ఆ తలపును కూడా శుద్ధిచేసింది.

ఆతరువాత రెండు రోజుల వరకూ పాకీ మనిషి రాలేదు. దానిని గురించిన ఆందోళన, ఆదుర్దా గంటగంటకు ఎక్కువైనాయి. "పాకీది పనికి మాలినదైనా దానిని గురించిన ఆందోళ మాత్రం మహాపవిత్రంగా ఉన్నదని" అమ్మ అనుకుంది. అమ్మ చీపురు, సీనారేకు డబ్బా తీసుకొని పాకీ దొడ్డి బాగుచేసి వచ్చింది. రాఘవమ్మగారు ముఖం చిట్లించుకుంటూ ముక్కుమూసుకుంటూ లోపలకు వెళ్ళింది. ఆశ్చర్యం దొడ్డి శుభ్రపరచి వుంది.

ఆశ్చర్యానందాలతో గబగబా చిదంబరరావుగారి వద్దకు వచ్చి పాకీది వచ్చి చిమ్మిందండీ మనం సరిగా చూడలేదు అని అన్నది. చిదంబరరావుగారు కూడా ఆశ్చర్యపోయారు. "ఏమో ఎప్పుడు వచ్చారో, ఎవరు వచ్చారో, పాకీది చిమ్మినదానికంటే శుభ్రంగా ఉన్నదని రాఘవమ్మగారు అన్నది. తాతగారు చిమ్మేది పాకీయా, పాకీది చిమ్ముతుందా అసలు పాకీ అంటే ఏమిటని అమ్మ ప్రశ్నించింది. చిమ్మేది పాకీ అమ్మా యానాది వాళ్ళు-వాళ్ళు వృత్తి వల్లనే వాళ్ళకు ఆపేరు వచ్చింది.

ఇంతకూ దొడ్డి ఎవరు చిమ్మారనుకుంటూ పైకి అన్నారు అమ్మ ఎవరు చిమ్మితే ఏమీ–చిమ్మేది పాకీ అన్నారుగా అని అమ్మ అంది. అవునమ్మా ఎవరైనదీ తేలవద్దు? డబ్బులివ్వాలి కదా! అన్నారు తాతగారు. చిమ్మిన మనిషి వచ్చి చెప్తే ఆలోచించకుండా ఇస్తారా? అంది. అలాగే అన్నారు తాతగారు. "నేనే చిమ్మానని అమ్మ అంటే ఆమాటలు ఆయన నమ్మలేదు. అయినా ఒప్పుకున్న ప్రకారం రూపాయి ఇవ్వబోయారు. నమ్మి ఇస్తున్నారా? అంది. నమ్మలేదమ్మా అన్నారు. నమ్మలేని అమ్మనా అని బిగ్గరగా అని అమ్మలేని అమ్మనా అని చిన్నగా అన్నది. చిన్నగా అన్న ఆమాట చిదంబరరావుగారికి వినిపించింది. ఆయన కరుణాహృదయం స్పందించింది. అమ్మను దగ్గరకు లాక్కుని తనపొట్టమీద పడుకోబెట్టుకున్నారు. అమ్మను దింపిరెండు రూపాయలు అమ్మచేతిలో పెట్టబోయారు. అమ్మ ఆడబ్బుతీసుకోకుండా "నాకు వద్దు కానీ పాకీ అమ్మాయి ఒక్కపూట చిమ్మితే ఎంత ఇస్తాం చెప్పండి అంది. అది నెలలలెఖ్ఖ అంటే నెలలో పూట విడదీయండి అన్నది. దానికి ఆయన అర్ధణా అన్నారు. ఇదేనా మొన్న లక్షణాచార్యులుగారు వచ్చినప్పుడు మాట్లాడుతూ అర్థం, ప్రాణం అన్నారు. అదేనా అని అమ్మ అడిగింది. అబ్బ నీకెక్కడ దొరుకు తాయమ్మా యీ పదాలు. ప్రాణం కూడా యిదేనా–మొన్న అమ్మ పోయినప్పుడు ప్రాణం పోయిందంటిరే యిదే పోయిందా అని అడిగింది. కాదమ్మా ప్రాణమంటే ఎంత తీపో డబ్బంటే అంత తీపని అర్థమమ్మా, అన్నారు. ప్రాణమున్నంతవరకూ డబ్బు అవసరమనేమో అని అమ్మ అన్నది. అది విని తాతగారు ఇది యింకా బాగుందని అనుకుంటూ సాత్విక స్వభావం అనిలోపల అనుకున్నారు. మెన్న 'స' అంటే తనయొక్క, నాయొక్క అని భారతి పిన్నికి, మొన్న పాఠం చెప్పారుకదా! స్వభావమంటే మీ భావం, సాత్వికమని గుర్తించింది మీ భావన. అదే సాత్వికభావం. ఆవివరణకు ముగ్ధులై" మా అమ్మ వ్యాసుడంత అవుతుందా? అని అనుకున్నారు. నల్లఖాసీమ్ వచ్చి ఈ పూటే మన్నవ వెద్దామని అన్నాడు. మధ్యాహ్నం పన్నెండు గంటలకు మన్నవ ప్రయాణమై రైల్వే స్టేషన్‌కు బయలు దేరారు. దారిలో ఒకామె తినిపారవేసిన విస్తరాకు కోసం వెదుకుతూ అమ్మను అడిగింది. ఈ వాకిలి దగ్గరవుండండి. వీళ్ళుతిని పారవేసే వేళ అయింది. దొరకవచ్చు అంటుండగానే గోడమీదగా విస్తరిపడ్డది. ఆమెదానికోసం ఆదుర్దాగా పరిగెత్తింది. అమ్మ ఆమె వద్దకు వెళ్లి మీకు ఈ విస్తరి ఎందుకని అడిగింది. వారికి పిల్లలు బ్రతక్కపోతే పుల్లాకులో పొర్లిస్తే బ్రతుకుతారన్నారు. అందుకని ఎంగిలి ఆకు కోసం

వెతుకుతున్నామని చెప్పింది. మీరు అన్నాలుతినరా? మీది పనికిరాదా? అసలు పుల్లాకు అంటే అప్పుడే తినిపారేసింది కాదు. పులిసిపోయిన ఆకు, పులిసిన వాసన వచ్చేది. ఓహెూ! అదా చిన్న పిల్లవయినా నీవే నయం" అంటూ ఆమె వెళ్ళిపోయింది.

"చెక్క వంగిన అరగంటకు కానీ రైలురాదు. అదీ ఒకరు నడిపితేనే వచ్చేది. వాడు మాత్రం అనుకున్నట్లు నడపగలడా అని అమ్మ ప్రశ్నించింది. చిదంబరరావుగారు పకపకానవ్వి "నీకెవరు చెప్పారు? నడపలేడని? ప్రతి పనిలోనూ తెలుస్తూనే వుంది." "అనుకున్నది జరగదు, తనకున్నది తప్పదు" అని అమ్మ విరిస్తుంటే తాతగారు విస్తుపోయారు. జీడిపప్పు అమ్ముకునే అమ్మి కేక వేసుకుంటూ అమ్మ ముందుకు వచ్చి నిలుచుంది. ఆమెకాలు ముందుకు సాగలేదు. అమ్మ కూడా ఆమెవంక చూస్తున్నది. "నీకు తినాలని వుందా? అని తాతగారు అమ్మను అడిగారు. దానికి అమ్మ నాకు ఎప్పుడూ ఏమీ తినాలని అనిపించదు. ఏమి తినవలసి వచ్చినా వద్దు అనీ అనిపించదు అని అంది. అమ్మ మానసిక స్థితి కంటే వాక్చమత్కృతికి వివరించిన విధానము చిదంబరరావుగారిని ఎక్కువగా ఆకర్షించినట్లున్నది. "శబ్దమంజరివా" అంటూ జేబులో నుంచీ అర్ధణా తీసియిస్తూ ఒకగిద్దెడు పప్పు ఇవ్వమ్మీ" అని అన్నారు. అమ్మ, ఒకకానీ జీడిపప్పు మాకిచ్చి ఒకకానీ జీడిపప్పు నీవు తీసుకో, కానీ జీడిపప్పు నీకు నేను కొనిపెట్టాననుకో అమ్మా" అంది. చిదంబరరావుగారు ఆశ్చర్యంతో అమ్మాయికెందుకు? అంతపప్పు ఉంటేను? ఆ అమ్మాయి అమ్ముకోవటానికి గాని తినటానికి కాదుగా అమ్మేవాళ్ళు అసలు తినలేరు" అని తన సర్వసమానత్వాన్ని, సర్వమాతృత్వాన్ని చాటింది.

★ ★ ★

# 7. ఆపదుద్ధారిణి

ఆపదుద్ధీరిణి అమ్మమ్మగారి సంవత్సరీకాలకు మన్నవ వెళ్ళటానికి రైలుస్టేషన్‌కు వెళ్ళారు. అంతారైలు ఎక్కి లోపలికి వెళ్ళి కూర్చున్నారు. అమ్మ మాత్రం రైలుపెట్టె వాకిట్లో నిలుచున్నది. పడిపోతావు వచ్చేయమని చిదంబరరావుగారు అన్నారు. అమ్మ వచ్చి కిటికీ దగ్గర కూర్చుంది. ఎదురుగా ఒక అబ్బాయి కూర్చుని అమ్మని కన్నార్పకుండా చూస్తూ బయటకు దృష్టిసారించాడు. అదేమిటి తాతా చెట్టు పరుగెత్తు తున్నాయని అడిగాడు. భ్రమఅంటే ఇదేకదా! అని తాత అనుకున్నాడు. నిజంతాతా చూడు నీవు నిజం చెప్పమ్మా అని అమ్మతో అంటూ చెయ్యిబయటకు చాపాడు.

కిటికీ చెక్క గభీమని పడ్డది. 'అమ్మా' అని కేకపెట్టాడు అబ్బాయి. తాతకెవ్వుమన్నాడు. గభరాగా పెట్టెలో వారంతా లేచిచూశారు. చేతికి దెబ్బ తగ్గలేదు. ప్రాణంపోవలసిన దెబ్బకాదు. కొయ్యబారిపోయిన తాతలేచి మనవడి ముక్కు దగ్గర వేలుపెట్టి చూచాడు. శ్వాస ఆడటంలేదు. ఋణం తీరిందంటూ బావురుమన్నాడు తాత.

"ఏ వూరు తాత మీది?" అమ్మ అడిగింది. తాత వాళ్ళవూరు చాలా దూరమమ్మా. వాడి అమ్మ, నాన్నా పోయారని తానే పిల్లవాడిని పెంచుతున్నానన్నాడు. "నీ బాధతీర్చిపోయినాడులే" ఒక ఆయన వూరడించాడు. ఇప్పుడు ఇది బాధకదూ! బాధను తీర్చటానికి బాధ అవసరమయిందా? దెబ్బ తగిలినప్పుడు పిల్లవాడికి బాధ తరువాత తాతకు బాధ. వారిస్తితిని చూచిన జనానికి బాధ. బాధలో ఏబాధ ఎక్కువ? అన్ని బాధలు ఒకటేనా? అని ఆ వూరడించిన ఆయనతో అంది. అసలు బాధ అంటే ఏమిటి తాతగారు? అని ప్రశ్నించింది. ఇందాకనుండీ కనపడేదంతా బాధేగా అన్నారు. "తాను వాకిట్లో నుంచున్నప్పుడు ఆయన పడిన బాధ ఇప్పుడు లేదుగా అని అమ్మ అంది. నిజమేనమ్మా కానీ అట్లా అని మనస్సు వూరుకోదుగా అన్నారు. ఊరుకోకపోవడమే దానిగుణమని తాతగారి ద్వారా తెలియచేసింది.

నిడుబ్రోలులో రైలు ఆగింది. ఎవరిదారిన వాళ్ళు రైలు దిగివెళ్ళిపోయారు. తాత ఒక్కడే చనిపోయిన పిల్లవాడిని భుజంమీద వేసుకొని దిగాడు. ఆ పిల్లవాడిని పాతిపెట్టించి వెడదామా అని తాతగారిని అమ్మ అడిగింది. మనకు పొద్దుపోతుందమ్మా అని చిదంబరరావుగారు ప్లాట్‌ఫారం చివరకు వెళ్ళారు. నల్లఖాసీం బండి కట్టించుకొచ్చాడు. తాతగారు వచ్చేలోగా వస్తానని అమ్మ ఆముసలివాడి దగ్గరకు

వెళ్ళింది. చొరవగా చేయివేసి ప్రేమగా నిమురుతూ ఏం నాయనా ఏడుస్తున్నావు? పిల్లవాడు పోయాడనా? ఇప్పుడు ఖర్చుకులేదనా? నిన్ను చూచేవాళ్ళు లేరనా? ఎందుకు ఏడవటం అని ప్రశ్నమీద ప్రశ్న గబగబా అడిగింది. వీడింత గంజి పోస్తాడనుకున్నాను అని తాత అన్నాడు. ఏడ్చేది నీకొరకే కదా? పెంచింది నీకొరకు, అది నీ తృప్తి, నీకు హాయిగా వుండి పెంచావు. చచ్చిపోతే నీకు ఇబ్బందని ఏడుస్తున్నావు ప్రాణం లేదనుకొని శావాన్ని దగ్గరపెట్టుకు ఏడుస్తున్నావంటే డబ్బులేదని, పారవేసేవాళ్లు లేరని, నీబాధ్యత తప్పిపోతుందని, నీప్రేమకు ఆధారం పోతుందని అది నీకొరకే---చిన్నపిల్ల పలికే పెద్దమాటలు విని అంతమటుకూ చుట్టూ నిల్చుని చోద్యం చూసున్న జనం విస్ఫారిత నయనాలతో అమ్మ వంక చూచారు.

అమ్మ తనచేతిలోని వుంగరాన్ని తాతకు ఇచ్చిదాన్ని మార్చుకొని కావలసిన ఏర్పాట్లు చేసుకోమంది. చూచిన పెద్దవాళ్ళందరూ అలాగే వెళ్ళారు. చిన్న పిల్లవు నీకెందుకమ్మా అన్నాడు. "నాకొరకే, నాతృప్తికే నాయనా! నాకివ్వడం నీ తృప్తి ఏమిటమ్మ" అన్నాడు తాత. ప్రపంచంలో ప్రతివాడు ప్రతి పనీ తన కోసమే చేసుకుంటున్నాడని నాకు తోస్తుందన్నది. వుంగరం అమ్మచేతికి పెట్టటానికి తాత ప్రయత్నించాడు. "బ్రతికితే వాడికి పెట్టు, లేకపోతే ఇంకోదానికి వాడుకో అని" అమ్మ చెప్పింది.

ఇంతలో పిల్లవాని చేయి కదిలింది. తాత ఆశగా పిల్లవాని వంకచూస్తూ "బాలవాక్యం బ్రహ్మవాక్యం అన్నారంటూ చేతులు ముకుళించాడు. బాలవాక్యంకాదు బ్రహ్మవాక్యమంటే "భ్రాంతిలేని వాక్యమే బ్రహ్మవాక్యం" అని అమ్మ వివరించింది. ఆవివరణ విని ముగ్ధుడై "ఆబ్రహ్మవు నీవే" అన్నాడు.

అమ్మా! నీ చేతిమీదగా పిల్లవాడికి వుంగరం పెట్టమంటూ చనిపోయిన బిడ్డకు ప్రాణంపోశావు. బ్రహ్మవో అమ్మవో ఎవరివైతేనేమీ! ఆపదుద్ధారిణివి. అమ్మ ఋణం ఎట్లా తీర్చుకుంటానో అని అన్నాడు. అన్నింటికీ తరుణమే కారణం. ఋణమేమీ లేదు. అందరినీ రక్షించేవాడు ఒకడే నాయనా. ఆపదలను కలిగించేవాడు ఆపదలనుంచి రక్షించేవాడు ఒకడే. నీ మనుమడికి దెబ్బ తగిలించినవాడు. పోయాడని భ్రాంతి కలిగించినవాడు. తిరిగి లేవదీసినవాడు ఒకడే" అని చెప్పింది. అసలు అమ్మ నిర్ణయమే అది అయినపుడు అమ్మకు అభ్యంతరమేముంది.

★ ★ ★

# 8. ఉపనిషద్వాణి

వూళ్లోకెళ్ళేటప్పటికి పొద్దుపోయింది. గుళ్ళో పడుకొని తెల్లవారాక వెళ్దామమ్మా అన్నాడు ఖాసీం, అలతి అలతి మాటలతో అతిసహజంగా అమ్మ ఇచ్చిన అద్వైత, వివరణకు తాత విస్మితుడై "వాడేనా అమ్మా ఇందాకనీవు చెప్పిన బ్రహ్మ-అహంబ్రహ్మాస్మి అని మాగురువుగారు చెప్పారని అంటాడు. తాతకు బ్రహ్మత్వమంటే ఏమిటో విరించటానికి నిశ్చయించుకుంది.

అహం నేను బ్రహ్మను నేను అనగా బ్రహ్మ అయిన నేను నేనుగానే "అహంబ్రహ్మాస్మి" నేను నేనుగా ఉన్న నేను అహంకారంబ్రహ్మే నేను నీవుగా ఉన్న నేను అంటే రెండుగా ఉన్న నేను అనే స్థితి అహంబ్రహ్మాస్మి. "అమ్మ వితిరణవను తన్మయత్వంతో వింటూ" భ్రాంతిలేనిది బ్రహ్మఅన్నావు. "భ్రాంతి దేనితో పోతుందమ్మా" అని అడిగాడు. "చెప్పేది ఏముంది నాయనా- సమయం వచ్చినప్పుడు భ్రాంతి పోతుందని" తెలియచేసింది.

ఇందాక పిల్లవాడు చచ్చిపోయాడనుకున్నావు? ఆ అబ్బాయి పోలేదు. ప్రాణం కదబట్టింది. ఉన్నదిలేనట్లు కనబడటమే భ్రాంతి అమ్మ ఇచ్చే ఒక్కొక్క నిర్వచనం వింటుంటే తాతకు ఆశ్చర్యం, ఆనందమూ కలిగాయి. పిల్లవాడు బతికాడు కదా! వుంగరమివ్వమంటావా అమ్మా! అని తాత అడిగాడు. "తిరిగి తీసుకోవటానికి తాను ఇవ్వలేదంది. ఏదిచేసినా కీడైనా, మేలైనా, దగ్గరకు తీసినా, ముద్దుపెట్టుకున్న, తిన్నా తినకపోయినా, అలిగిపడుకున్నా అన్నీ తనతృప్తికే చేస్తాడని తెలియచేసింది. ఆఖరికి ప్రేమించినా ద్వేషించినా ప్రతీదీ తాను తప్ప కారణంలేదు.

పెద్దలు ధనంమూలం మిదంజగత్ అని అన్నారుకాని "తనమూలం మిదంజగత్" అనగా తానే ధనమని, ధనమంటే డబ్బులే కాదని తన ఉద్దేశ్యాన్ని వ్యక్తీకరించింది. తను వుండి వస్తువులుంటే ధనంతో పనిలేకుండా సరిపోతుంది. లక్షరూపాయలకు విలువలేదు. నాదృష్టిలో వస్తువే ధనం. ధనమే వస్తువు. అవి భిన్నంకాదు. ధనమూల మిదం జగత్! అనేది శృతి ప్రమాణం మాత్రంకాదు. ఎవరో అవసరానికి డబ్బులేనివాడు వాడినమాట" అని అమ్మ వివరించింది. ఆమాటలు వింటూ మంత్రముగ్ధుడై మైమరచి ఆ స్వరంలోని మాధుర్యానికి, పరవశుడైనాడు

"నీమాటలు వింటుంటే ఉపనిషత్ వాణి వింటున్నట్లుందని అన్నాడు. నీమాటలు చాలా బాగున్నాయని" చెప్పాడు. దానికి అమ్మ ఇంక బాగుండనిదేమిటి నా రూపమా! అని ప్రశ్నించింది.

కొద్ది క్షణాలు తాత అమ్మముఖంలోకి తదేకంగా చూచాడు. కన్ను, ముక్కు, నోరు, గడ్డం, చెవులు, నొసలు దేనికదే ఎంతో కుదిరికగాను, అందంగాను ఉన్నాయి. ఆపాదమస్తకం దృష్టిని సారించాడు. కాళ్ళు, చేతులు, నడుము, మెడా అన్నీ తీర్చి దిద్దినట్లున్నాయి. చేతివేళ్ళు ఎంతో పొడవుగా అందంగా వున్నాయి. కనుబొమ్మల్లో ఇంత ఆకర్షణ వుంటుందా? పాదం నుండీ ఫాలం వరకూ యావత్ శరీరం దివ్యతేజోవిలసితమైనట్లుంది. ప్రతి అవయవము లావణ్యానికి స్థావరమై, సౌందర్యానికి ప్రతినిధియై విరాజిల్లుతున్నట్లుంది.

అలంకృతమయిన సువర్ణాభరణాలు, రమణీయమైన నవ్యకాంతులు విరజిమ్ముతున్నాయి. ఆ స్వర్ణాభరణాల సంయోగం వల్ల దేహం ఉద్దీపమై, ఉజ్వలమై, భాసిస్తున్నదో – ఆ దివ్య శరీర మధురస్పర్శ వల్ల కలిగిన ఆనందాతిశయంతో పసిడి కాంతియే పదింతలై ఫరిడవిల్లిందో తాత మేధకు అందలేదు.

హఠాత్తుగా తాత మనోవీధిల్లో మురళీధరుడైన బాలకృష్ణుడు, శిరమున పింఛము, నొసటన కస్తూరి, ఉరమున కౌస్తుభం నేత్రోత్సాహం చేసాయి. పాదమంజీరాల ఘలఘలారావాలు, వేణుగానం కర్ణామృతమైనాయి. తాత హృదయం హర్షప్రపూర్ణమై శరీరం పులకితమయింది. పారవశ్యంతో కరములు జోడించి కృష్ణా, కృష్ణా అంటున్నాడు. అమ్మ దగ్గరికి వెళ్ళి "నారూపం ఎలావుందని"? అడిగింది.

నీ రూపం కన్నుల పండుగగా ఉన్నది. ఈరోజు నాపుణ్యం వలన నా జీవితమే పండింది. లోగడ ఎందుకు బతికానా అని వాపోయే వాడిని నేటికి నా జన్మ తరించింది. నామనోరథం ఫలించింది. నా బ్రతుక్కి ఇంకేమీ వద్దు. ఇది చాలు అంటూ అమ్మను తన కౌగిలిలోకి తీసుకొని అశ్రుధారలతో అమ్మ శిరస్సునభిషేకించాడు.

మనం ఇందాక ఏమిమాట్లాడుకున్నాము? ఈలోగా నామనస్సు శరీరం ఇట్లా అయ్యాయేమిటి? అని తాత అమ్మను అడిగాడు. "నీవేమయినా చెప్పమని అడిగితే నేనే "తనమూలమిదంజగత్" అని చెప్పింది. శృతి అనే పదం తాత గురువుగారు

తరుచూ ఉపయోగించేవారని చెప్తూ రజ్జుసర్ప భ్రాంతి అని చెప్పేవారన్నాడు. అది అర్ధమయిందా అని అమ్మను అడిగాడు. అంతమటుకు జరిగిన సంఘటనకు మాయతెర కప్పింది. ఏమీ ఎరగని విధంగా కాలేదు నాయినా అంది. తాడును చూచి పాము అనుకోవటం అని తాత వివరించాడు. దానికి అమ్మ పామును చూచి తాడు అనుకోవచ్చుగా భ్రమఅనేది రెండువైపులా కలగచ్చుగా అంది. అమ్మ న్యాయాన్ని తిరగవేసింది. తాత తికమక పడ్డాడు.

చిన్నపిల్లవు నీకర్థంకావులే అమ్మ. అంత అనుభవం పొందిన తాత కన్నులకు అమ్మ గంతలు కట్టింది. సూర్యునికి దారి చూపేందుకు దీపంపట్టుకునే పిచ్చివానిలా తాత ప్రారంభించినా "చీకటి భ్రమలాంటిది. దీపం తెస్తే చీకటిపోతుంది. జ్ఞానం దీపంలాంటిదని" వివరించింది. ఏమిటమ్మా! మళ్ళీ చెప్పని వేడుకున్నాడు.

అసలు భ్రమ అనేది తాడు పాము రెండూ తెలిసినవాడికేగా కలిగేది. అచ్చంగా తాడు తెలిసినా లేదు. అచ్చంగా పాము ఒకటే తెలిసినా లేదు. పసిపిల్లవాని ముందుకు పాము వచ్చినా దానితో ఆడుకుంటాడు. వాడే తాడుపట్టీ ఆడుకుంటాడు, పెద్దవారిలో కూడా కొన్ని జంతువుల యొక్క ఉపయోగం వాటి లక్షణం తెలియని వారున్నారు వారికి భయంకానీ భ్రాంతికానీ వుండవు.

భ్రాంతి అంటే మమకారం. భ్రమ ఊహించటం, తాడును చూచి పాము అనుకోవటం భ్రమే! భ్రమ అంటే ఊహించటమా? లేక మాయ అన్న అర్ధం వస్తుందా? తాడును పామునుందు ఆరోపించిపట్లుగా జగత్తు సత్యమనుకుంటున్నారు. "బ్రహ్మ సత్యం కానీ జగత్తు మిధ్య" అనుసూక్తిని ఆధారం చేసుకొని అంటున్నాను. ఆరెంటికి అవినాభావసంబంధం అంటున్నారు. అవి అంటే కనబడేవి. నాభావం-అంటే కనబడేవాటిని ఊహించేది. ఊహను బట్టి సంబంధం ఏదైనా తాను చూచేదాన్ని బట్టీ కనబడుతుంది. వీరి సంభాషణ జరుగుతుండగానే పిల్లవాడు లేచి నేను అమ్మ దగ్గరకు వెళతానని ఏడుపు మొదలు పెట్టాడు. మీ అమ్మ చచ్చిపోయింది అని తాత అనునయించాడు. పిల్లవాడు కళ్ళు నలుపుకుంటూ ఉంగరం ఇచ్చిన అమ్మకావాలని అన్నాడు. ఆ అమ్మయి ఇక్కడేవుంది నాయనా అని తాత చెప్తుండగానే పిల్లవాడు లేచి అమ్మ గొంతు వాటేసుకొని అమ్మా అని పెద్దగా అరచి ప్రాణం వదిలాడు. తాత బావురుమన్నాడు.

రైల్లో నీవు ఎక్కినప్పటినుంచీ అన్నీ ఆపదలే; పోయినవాడు పోక మళ్ళీ బ్రతకటమేమిటి అసలు నీవు ఎవరమ్మా? అని తాత అడిగాడు. "వాడమ్మనే అంది. వాడమ్మ అంటే అందరికీ అమ్మ అని అర్థం. తాత అప్పటివరకూ జరిగిందంతా ఖాసీంతో చెప్పాడు.

ఖాసిం ఆశ్చర్యపోయాడు. అమ్మను వదిలిపెట్టకుండా తాత వస్తున్నాడా? తాతవెంట అమ్మ వస్తున్నదా? ఇది కేవలం రైల్లో పరిచయమేనా? పూర్వమే పరిచయమున్నదా? అందులో ఆ వుంగరం చూడగానే అతనికి సందేహం బలపడింది. లోగడ అమ్మ సొమ్ము చాలాపోయింది. పూర్వం ఇట్లా నీకేమైనా ఇచ్చిందా అని ఖాసిం అడిగాడు. తాత తనకేమీ తెలియదన్నాడు. సరే అయిందేదో అయింది. ఇప్పుడేమి జరగాలి. తెల్లవార వచ్చింది. ఎందుకమ్మా నీకీ పంపకం అని ఖాసిం అడిగాడు. అది నాపెంపకం అని జవాబిచ్చింది. ఇప్పుడీ పిల్లవాడి సంగతి ఏమిటి? ఏంచేయాలి? అర్చకులొస్తే వూరుకోరు. దేవాలయంలో శవాలను పెట్టకూడదు అని అన్నాడు. "శవాలను పెట్టవలసినదిక్కడే. వాడెంత ధన్యుడో దేవుడిలో లయమైపోయాడు లేకపోతే దేవాలయంలో పోడు అని అమ్మ చెప్పింది. ప్రాణంపోవటమే లయంకావటమా? ఇంకానయం నీ ఒళ్ళోపోయాడు కనక నీలోనే లయమయ్యాడని అనలేదు అని తాత అన్నాడు. కాలేదని ఏవరు అన్నారని అమ్మ ప్రశ్నించింది. ప్రాణంనీవే తీసావా అని తాత అడిగాడు. ఎందుకు తీయకూడదు? ఇచ్చినవాడే తీస్తాడు. "నీవే తీసావు" అని తాత అన్నాడు. అయితే "నేనే ఇచ్చాను" అని అమ్మ చెప్పింది. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడచిన తరువాత "ఇన్ని మహావాక్యాలు నేర్చుకొని పరిపూర్ణమైన నీకు అమ్మాయిగా తోచాను. వాడికి అమ్మగాతోచాను. మీకు ఇట్లాతోచటానికి ఏది కారణమో, మొదట రైల్లో పిల్లవానికి తగిలిన దెబ్బకు, ఆ తరువాత రక్షణకు యిప్పుడు అమ్మగా గుర్తించి ప్రాణం విడువటానికి ఆశక్తే కారణం. వేదాంతాన్ని కబుర్లవరకే అలవాటు పడిన తాత అనుభవంలోకి వచ్చేటప్పటకి తట్టుకోలేక విసుగుతో ఏదో ఒకటి చేయమ్మా అన్నాడు.

అమ్మ ఖాసింతో "ఈపిల్లాడినీ, తాతను దాటించి వెళ్దామని చెప్పింది. నీకెందుకమ్మా, ఈ పిల్లవాడితో, తాతతో ఏమిటి సంబంధం అని ఖాసిం అన్నాడు. "నీతో నాకేమి సంబంధమో వాళ్ళతోనూ నాకదే సంబంధం అంటూ తానే పిల్లవానిని

తీసుకొని భుజాన వేసికొన్నది. మనసంబంధాలు, పరిచయాలు పరిమితం కాని, అమ్మకు ఎవరితో సంబంధంలేదు! ఆ సంబంధం సర్వవ్యాప్తమయింది కదా!

ఆలస్యం చేయక రండి. అమ్మ కంఠం వినిపించింది. ఆస్వరంలో అనుల్లం ఘనీయమైన శాసనం ధ్వనించింది. ఇద్దరూ బయలుదేరారు.

తాత ఆలోచనలో పడ్డాడు. బాపట్లలో తాత బావమరిదికి ఒక అమ్మాయి కనపడి రక్షణ కల్పించిందని అన్నప్పుడు తనకూ అలాంటి అనుభవం కావాలనిపించింది. ఖాసిం బంగారం విషయం ప్రస్తావించటంతో ఆ అమ్మాయి - ఈ అమ్మయి ఒక్కరే అనిపించింది.

అమ్మ త్వరత్వరగా వెళ్ళి పిల్లవానిని చిన్నతనంలో అమ్మమ్మ, అమ్మ ఆగిన ప్రదేశంలో దింపింది. మూడుపారలమన్ను తీసి గుంటచేసి పిల్లవానిని పడుకోబెట్టింది. ఆ స్థలంలో ప్రస్తుతం సహస్రలింగాలయంలో అమ్మవారి విగ్రహముంది.

అమ్మా! ఉంగరం తీశావా అని తాత అడిగాడు. ఉంగరం తీయను. కావాలంటే మరేదయినా అడుగు ఇస్తాను అని అన్నది. ఉంగరం వృధాగా పోవటమెందుకు? మట్టిలో కలిసిపోవటమేగా అన్నాడు. అల్లారు ముద్దుగా పెంచిన శరీరం మట్టిలో కలిస్తే లేనిబాధ ఉంగరానికేమొచ్చింది? ముందువెళ్ళి చెప్పినపని చేయమని ఆజ్ఞాపించింది. అమ్మను కూడా రమ్మని తాత ప్రాధేయపడ్డాడు.

తాత, ఖాసిం, అమ్మా వెళ్తుండగా తాతకు ప్రమాదకరమయిన విరోచనము, వాంతి అయి స్పృహతప్పి పడిపోయాడు. తాతా తాతా అని అమ్మ పిలిచింది. తాత మెల్లిగా కళ్ళు తెరచి అమ్మను చూచి లేని ఓపికతెచ్చుకొని ఆపదుద్ధారిణివే అనుకున్నాను. కాని నీ వింత భయంకర సంహారకారిణి వసుకోలేదమ్మా అని అన్నాడు. అలాగా! అంటూ అమ్మ చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వులో ఏమి వినిపించిందో, ఏమి కనిపించిందో "నేను పొరబడ్డానమ్మా నన్ను క్షమించమ్మా నీవు సంహారకారిణివి కాదమ్మా. ఈ సర్వ సృష్టి స్థితిలయకారిణివమ్మా" అంటూ తాత చేతులు జోడించి కన్నులుమూసి అంతిమశ్వాస వదిలాడు. ఖాసిం తాత పలికిన తుదిమాటలు విన్నాడు. తాత చేతులు ముకుళించి కన్ను మూయటం చూచాడు. ఆశ్చర్యపోయాడు. వెంటనే ఖాసింకి గుంటూరులోని మస్తానయ్య స్ఫురించాడు. ధైర్యమియ్యవయ్యా. ఈ ముసలోడ్ని

పిల్లవాడ్ని మట్టిచేయటానికి చిన్నపిల్ల అయినా అమ్మాయి గురించి ఏమీ భయంలేదనే అనుకుంటూ, ఇదేమిటీ అమ్మను మస్తానయ్యే అనుకుంటూ మళ్ళీ యిట్లా అనుకుంటున్నానేమిటి? అనుకున్నాడు. ఇంతలో అమ్మ ఖాసిం ఏమిటి ఆలోచనచేస్తున్నావు? మనం ఇందులో ఇరుక్కున్నాం. ధైర్యం లేకపోయినా మనం పనిపూర్తి చేయాలి. పిల్లవాడికి మట్టి కప్పి వద్దామని పిల్లవానిని సమీపించగానే ఆ పిల్లవాడు ఒక ఉయ్యాలలో ఊగుతున్నట్టు ఒక ముత్తైదువ ఊపుతున్నట్టు కనిపించింది. ఖాసిం గుండె ఝల్లుమన్నది.

ఖాసిం పారతీసుకొని పిల్లవానిమీద మట్టిపోసి వెనక్కి తిరిగిచూచాడు. తనవెన్ను ఆనుకొని నిల్చున్న అమ్మ అప్పుడే రోడ్డుమీదకు ఎలా వెళ్ళింది. అంతదూరం నడచి వెళ్ళటానికి వ్యవధి ఏది? అని యదాగుండెపడి అమ్మను చూస్తూ నిలుచున్నాడు.

ఇంతలో తెల్లవార వచ్చింది. పొలాల్లో ఎవరో మనిషి కనపడుతున్నాడు. అతన్ని పిలిచి డబ్బులిచ్చి మట్టిపోయించమని చెప్పమంది. తనదగ్గర రూపాయిన్నర వున్నదని రెండు రూపాయలకయినా పోస్తారో పోయరో అతనికి తెలియనివ్వటమెందుకని ఖాసిం అన్నాడు. ఫరవాలేదు పిలవమంది. ఖాసిం చప్పట్టుకొట్టి కేకవేసాడు అతడు వస్తుండగానే అమ్మ ఖాసింతో అతడు రైతు. మట్టినీవు పొయ్యి అని చెప్పకు, పోయించమని చెప్పమంది. ఖాసిం పకపకానవ్వి సరేలే అమ్మ మా అమ్మ కరణీకం చేస్తే బాగుండునని అంటాడు. ఎటూ చేస్తానుగా అంది. నీవెందుకు చేస్తావు. అన్నయ్య చేస్తాడని అంటాడు. కరణాన్ని అనిపించుకోనుగాని కరణీకం చేస్తానని ఆనాడే విశదపరిచింది." ఇంతలో ఆ రైతు దగ్గరకు వచ్చాడు. అతను ఖాసింకు తెలిసినవాడే. అతని పేరు దేగల కోటయ్య. ఈ ముసలివాడు ఇక్కడపోయాడు.

ఆ శవాన్ని పాతిపెట్టించమని చెప్పి రూపాయి తీసి కోటయ్యకు ఇవ్వబోయాడు మిగిలిన అర్ధరూపాయికూడా ఇవ్వమని అమ్మ ఆదేశించింది. అతను డబ్బువద్దన్నాడు. అతనికి మట్టి పోయించవలసిన బాధ్యత నాకు ఉన్నది. తీసుకోనాయనా అని అమ్మ చెప్పింది.

కోటయ్య ఆడబ్బులు అందుకుని అమ్మ చెక్కళ్ళు తాకిముద్దుపెట్టుకొని పోయిరండమ్మా అంటూ దొప్పలపూడిలో అమ్మాయికి ఏమైనా కొనిపెట్టమని పావలా

ఇచ్చాడు. "కొనుక్కుతినటమేకాదు నాయనా. ఏదిబుద్ధిపడితే అదిచేస్తా. నీవు చేసినపని నేనూ చేయవచ్చంది. ఆమాటలకు కోటయ్యకు ఏదో అనిర్వచనీయమైన ఆనందం మనసును నింపివేస్తుండగా ముసలివాని మీద మట్టికప్పాడు.

ఆ స్థలంలో ప్రస్తుతం సహస్రలింగాలయ ప్రాంగణంలో గరుత్మంతుని విగ్రహముంది.

దొప్పలపూడి చేరగానే ఖాసింని అడిగిపావలా తీసుకొని దోవలో ఏడు సం॥ల పిల్ల 2 సం॥ల పిల్లను పొట్టను కరుచుకొని ఏడుస్తూ కనిపించిన పిల్లకు ఇచ్చి, తనవంటినున్న గౌను కూడా విప్పి ఆ పిల్లకు తొడగమంది. ఖాసిం ఆశ్చర్యపోయాడు. త్యాగానికైనా హద్దువుండాలను కున్నాడు. కించిత్ కోపంకూడా వచ్చింది.

గౌనుకూడా ఇచ్చేసావు. ఉత్తవొంటితో ఎలా వస్తావని అడిగాడు. తాతగారు మూటలన్నీ తీసుకువెళ్లరు. ఇక్కడే ఎవరింట్లోనో వుంచుతారు కనుక్కోమంది. అక్కడికి దగ్గర్లోవుండే కావూరి వెంకయ్యగారింట్లో కనుక్కుంటే అక్కడే వున్నట్లు తెలిసింది. ఖాసిం మూటలోనుండి గౌను తీసుకుంటూ లాగూకూడా ఇచ్చేసిందేమో అన్న సందేహం వచ్చి ఎందుకైనా మంచిదని లాగూ తీసుకువచ్చేసరికి అమ్మ దిగంబరియై నవ్వుతూ నిలుచున్నది.

"నేను అనుకున్నంతపనీ చేశావు" అని ఖాసిం ఆశ్చర్యపోతుంటే "నేనున్నంత చేశాను. నేనన్నదేనీవనుకున్నది. నీవనేదైనా, నీవనుకోనేదైనా నేనుకుంటేనే" అంటూ తన దైవత్వాన్ని నిరూపణ చేసింది. ఇంటికి వెళ్ళిన తరువాత బంధువులంతా వారింటికి రమ్మని పిలిచారు. అమ్మ వెళ్ళలేదు.

అంతలో గొల్లనాగమ్మ వచ్చింది. అమ్మను చూసీచూడటంతోనే నాగమ్మ గుండెల్లో సముద్రం పొంగింది. అమ్మ చివాలున లేచి చేతులు చాచింది. నాగమ్మ అమ్మ దగ్గరకు వెళ్ళింది. అమ్మ నాగమ్మ వంక చూచింది. నాగమ్మ చూపు నిలచిపోయింది. శరీరం కొయ్యబారింది. మిట్టమధ్యాహ్నం సూర్యుడిలా వున్నావమ్మా. ఆ సూర్యుని చూస్తూ కళ్ళు తెరవలేము. నిన్ను చూస్తూ మూయలేము. నాగమ్మ అతిశయించిన ఆనందంతో అమ్మను ఎత్తుకొని బయటకు వచ్చింది. తెనాలినుండి అమ్మ తాతగారు. అమ్మమ్మగారు వచ్చారు.

పిల్లను ఎక్కడికి తీసుకువెళ్తున్నావు? దించి వెళ్ళమన్నారు జానకమ్మగారు. ఎంతపెంచినా వారిపిల్ల కనుక దించమన్నారు. దించకతప్పదు. తనకుప్రేమే కాని హక్కులేదు కదా! రంగమ్మగారైతే ఇట్లా అనేవారుకాదు అనుకుంటుండగానే కనులు స్రవించాయి. జానకమ్మగారు అమ్మను రమ్మని పిలిచినా రానని తల వూపింది. కాసేపు వుంచుకొని తిరిగి తీసుకురమ్మని జానకమ్మగారు నాగమ్మను శాసించింది. నాగమ్మ అమ్మను ఇంటికి తీసుకు వెళ్తూ దారిపొడుగునా అమ్మను ముద్దుపెట్టుకోవడం, తలదువ్వటం, వీపు నిమరటంతో ఇంటకి చేరటానికే రెండు గంటలు పట్టింది.

అమ్మ నాగమ్మ ఇంటివద్ద చిన్నప్పటి విషయాలు గుర్తున్నదానిలా, ఆ స్థలాలన్నింటినీ తన చరణరజస్సుతో పునీతం చేసింది. మీ అమ్మాయి సుబ్బలక్ష్మి చిన్నప్పుడు నాకు పాలిచ్చింది. ఆమె ఏదని అడిగింది. ఆ విషయం అమ్మ చెపితే అమ్మయొక్క జ్ఞాపకశక్తి అతిమానుషమని నాగమ్మ అనుకుంది.

పొలంనుండీ సుబ్బలక్ష్మి వచ్చి అమ్మను చూచి పట్టలేని ఆనందంతో ఒక్కగంతువేసింది. దారిలో గుమ్మంతగిలి బోర్లా పడ్డది. ఆ పడటంలో సుబ్బలక్ష్మి చేతులు అమ్మ పాదాలమీద పడ్డాయి. అమ్మను పాలుతాగమని బ్రతిమాలింది. అమ్మ పాలుతాగుతుండగా సుబ్బలక్ష్మికి లోకవిస్మృతి కలిగింది. ఏదో తెలియని సుఖంతో పరవశం పొందుతున్నది. అమ్మ పాలుతాగుతూ సుబ్బలక్ష్మి ముఖంవంక చూచింది. అమ్మను ముద్దుపెట్టుకోవాలని తలవంచింది. ఆమె భావాన్ని గ్రహించి అమ్మ తన బుగ్గను ఆమె మూతికి అందించింది. గులాబీవలె అతికోమలంగా, అందంగా వున్న అమ్మ బుగ్గను తన కర్కశమైన పెదవితో ముద్దుపెట్టుకోవటానికి సందేహించి, ఆ అవకాశాన్ని జారవిడుచు కోవటానికి ఇష్టంలేక స్పృశించి, స్పృశించకుండా ఆ బుగ్గపై ముద్దు పెట్టుకుంది.

ప్రపంచంలో యింతకంటే హాయి ఏమున్నది? ఇదే సుఖానికి పరమావధి అని అమ్మను తనపొట్టకు గట్టిగా హత్తుకుంది. ఎంత అదృష్టవంతురాలు సుబ్బలక్ష్మి ఏ పుణ్యానికి ఫలమో అది. ఏ తపస్సుకు వరమో అది. పాలుతాగిన తరువాత నాగమ్మను నీళ్ళు పోయమని అమ్మ అడిగింది. నాగమ్మ ఆశ్చర్యంతో "నీకు నేను నీళ్ళుపోసిన విషయం గుర్తున్నదా? అంది "గంగరావి చెట్టు క్రింద నీళ్ళుపోసుకున్నటు గుర్తు" అని అమ్మ చెప్పింది.

"చిన్నపిల్లకు యింత జ్ఞాపకశక్తి ఏమిటి? ఈ పిల్ల స్పర్శ మాత్రం చేతనే యిందాక నాలో ఆ మైమరపు ఏమిటి? పాలు ఇచ్చేటప్పుడు నేను అనుభవించిన ఆనందం అందరూ అనుభవిస్తే బాగుండుననిపించిందని" సుబ్బలక్ష్మి చెప్పింది.

సంవత్సరీకాలు కాగానే వచ్చిన బంధువులంతా ప్రయాణమైనారు. అమ్మను. జానకమ్మగారు తమ వెంటపంపమని కోరారు. అల్లరివాడని అమ్మ అన్నగారు రాఘవరావు మామయ్యను ఎవ్వరూ దగ్గర వుంచుకోవటానికిష్టపడరు. పిల్లను అందరూ తీసుకు వెడ్తామంటారు. పిల్లవాడి సంగతే బాధగా వుందని సీతాపతిగారు అంటారు.

అమ్మ తల్లి రంగమ్మగారిని తలుచుకొని బాధ పడ్తారు. అది వచ్చినపని నెరవేర్చుకుపోయింది. ముప్ఫయి సంవత్సరాలకే ఎనిమిది మందిని కన్నది. పోయినవారు పోగా వున్న ఇద్దరినీ నా చేతిలో పెట్టిపోయిందని" చిదంబరరావుగారు నిట్టూర్చారు.

సీతాపతిగారు ద్వితీయ వివాహం చేసుకునేట్లయితే అంతదాక తానువుండి వండి పెడ్తానని మరిడమ్మ తాతమ్మ అన్నది. పిల్లవాడిది సామాన్యమయిన అల్లరికాదు. దుడుకువాడిని ఎవరు భరిస్తారు? నాక్కూడా విసుగే. తల్లికి మినహా, తల్లికి తప్పదని సీతాపతిగారు అంటారు.

"తల్లికి తప్పదుకాదు. తల్లికి తప్పేకనపడదు" అమ్మ పలికిన ఆ వాక్యం, పలికిన తీరుకు చిదంబరరావుగారు విస్మితులై మళ్ళీ అనమని అమ్మను అడుగుతారు. మీరు ఎంతమటుకు విన్నారో అది అనండి, ఆ తరువాత నేను చెప్తాను అని అమ్మ అంటుంది. "మా అమ్మ 'లా' చదువుకుంటే బాగుండేది" అని చిదంబరరావుగారు అంటారు. ఇంతకీ నాకు 'లా' తెలీదంటారు. తెలియదని కాదమ్మా. తెలుసు కనకనే అన్నాను. అయితే ఇంకా చదువుకోవటం ఎందుకు? అబ్బబ్బ వదిలిపెట్టవు. ఇదే 'లా' అంటే అంటారు. అందరూ కలసి బాపట్ల ప్రయాణానికి సన్నద్ధులౌతారు.

★ ★ ★

# 9. చింతలతోపు

చింతలతోపు అంటే అమ్మకు చాలా ఇష్టం. చింతకాయలన్నా, చింతాకులన్నా, చింతచిగురన్నా, చింతరసం అన్నా అమ్మకు ఎనలేని ప్రేమ.

బాల్యంలో అమ్మ ఒకనాడు మన్నవలోని చింతలతోపుకు వెళ్ళింది. ఒక ఎత్తైన చింతచెట్టు ఎక్కి చిటారు కొమ్మన కూర్చుంది. చుట్టూ చూచింది. అన్నీ చింతలే. ఎటుచూచినా చింతలే. చింతలమయం. ఇదేమిటి కావాలని చింతలతోపు మధ్యకు వచ్చి చింతచెట్టు ఎక్కికూర్చుని ఎటుచూచినా చింతలే అని ఆశ్చర్యపోతానేమిటి? అని అలోచించసాగింది.

"చింతచెట్టు వున్నది. దానికి చిగురువేస్తుంది. ముదురాకు వుంటుంది. పూలు పూస్తాయి, లేతకాయలు కాస్తాయి, ముదురకాయలుంటాయి, పండు కాయలుంటాయి. అన్ని లక్షణాలు ఉన్నాయి. కానీ అన్ని లక్షణాలనూ ఒకేసారి చూపించలేకపోతున్నాయి. కాలాన్ననుసరించి లక్షణాలు బహిర్గతమవుతుంటాయి. గుణాలు కూడా కాలానికి కట్టుబడి వుంటాయన్నమాట అని అనుకుంటుండగా అమ్మ ఎక్కిన కొమ్మ ఆ పావన పాద స్పర్శతో పునీతమై జీవనలక్ష్యమే సఫలీకృతమైనట్లు, తనకు ఇక జీవితం మీద వాంఛయే లేనట్లు విరిగింది." వెంటనే అమ్మ ప్రక్క కొమ్మను పట్టుకుంది.

ఆ కొమ్మ చిట్టచివరకు వెళ్ళి ఏమీ పట్టుకోకుండా అక్కడ నిలబడి గ్రామం నలుదిక్కులా దృష్టి సారించి "ఈ కొమ్మ ఇప్పుడు విరగదేమి? పైగా వూరంతా చూపిస్తున్నది. ఈ కొమ్మ ఊరిని చూపిస్తోందా? నేను చూడగల్గుతున్నానా చెట్టు ఉన్నదని గుర్తించింది. మరొక కొమ్మను ఆధారం చేసుకుంది నేను. చిటారు కొమ్మను ఎక్కింది నేను. ఊరు నాలుగువైపులా చూచింది నేను. ఇదంతా నేను అనుకున్నది నేను" అంతలో గంగరాజు పున్నయ్య గారు ఆ చెట్టు క్రిందకు వచ్చి ఈ చెట్టు వేసింది నేను అనుకుంటూ వెళ్ళారు. పున్నయ్య గారు అకలంక కృష్ణభక్తులు. ఆయన నిరంతరం కృష్ణనామ సంస్మరణతోనే కాలం గడుపుతుంటారు.

అమ్మ చింతచెట్టు పైనుండే ఆయనను పిలిచింది. ఆయనకు వినిపించలేదు. మళ్లీ పిలిచింది. ఆయన ఆ కంఠంలోని వేణుగానమాధుర్యానికి పరవశించి

ఆగిపోయారు. అమ్మ మళ్ళీ పిలిచింది. ఆయన తనువు పులకరించింది. ఆ స్వరం ఎక్కడ నుండీ! అని ఆలోచిస్తూ చుట్టూ చూసారు.

చింతచెట్టుపైనుండీ మళ్ళీ పిలుపు. తలపైకెత్తి చూసారు. చింతచెట్టుపై కృష్ణుడు శిరమున ఫింఛము, ఉరమున కౌస్తుభం, కరములూ పెదవులనూ సంధిస్తూ మురళీ, మనోహరలావణ్యమూర్తి కనులముందు రూపుదాల్చాడు. ఆ రమణీయ వదనం చుట్టూ అద్భుత తేజోవలయం.

పున్నయ్యగారికి శ్రీకృష్ణ సాక్షాత్కారం అయింది. ఆయన సర్వావయాలు పరవశం పొందాయి. ఆయన ఆలోచనలు ఆగిపోయాయి. ఆ కన్నులలో లౌకికి దృష్టిలేదు అమ్మ చెట్టు దిగి వచ్చింది. "దొరికావులే దొంగ! నిన్ను ఇంక వదిలేదులేదు. నిజంగా" అంటూ అమ్మను భుజం మీద వేసుకుని

**"నను పాలింపవచ్చావా!**
**నీ దయచూపించ వచ్చావా!!"**

అని ఆర్తితో, ఆర్ద్రహృదయంతో పాడుతూ లయబద్ధంగా అడుగులు వేస్తూ వీది వీధి తిరిగారు పున్నయ్యగారు. ఎంతో అభిమానం గల పున్నయ్య గారు నృత్యగానాలతో వీధులవెంట పరిగెత్తటం చూసిన వాళ్ళు ఆశ్చర్య చకితులయ్యారు. పున్నయ్యగారు గ్రామం చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేసి అమ్మను దిగటానికి వీలులేకుండా తన భుజం మీద బంధించి ఇంటికి తీసుకువచ్చారు.

మరిడమ్మ తాతమ్మ (సీతాపతిగారి మేనత్త) బయటకు వచ్చి "ఏమిరా పున్నయ్య అమ్మాయిని ఎత్తుకు వచ్చావు. మీఇంటికి వచ్చిందా? వాళ్ళమ్మ పోతూపోతూ నీ దగ్గర కృష్ణమూర్తి ఉంటాడని చెప్పిందేమో!" అని అంది. దానికి పున్నయ్యగారు ఉంటాడేమిటి? ఇదిగోవాడే వీడు, వీడేవాడు, అప్పుడు ఆ ఆకారంలో వచ్చాడు. ఇప్పుడు ఈ రూపంలో వచ్చాడని ఆనంద పరవశులై ప్రకటించారు.

తన్మయత్వంతో నృత్యంచేస్తుంటే అమ్మ పడిపోతుందేమోనని చిదంబరరావుగారు అమ్మను తీసుకోవటానికి ప్రయత్నించారు. పున్నయ్యగారి భుజం కరుచుకొని అమ్మరాలేదు.

"ఏమిపెట్టి కరిపించాడేమిటి?" అని ఆశ్చర్యంతో అడిగారు. "ఆయనలో ఉన్న 'నేను' నాలో ఉన్న 'నేను' పెట్టి అతికించారని అమ్మ చెప్పింది." ఆత్మను పెట్టి అతికించాడా అని చిదంబరరావుగారు అడిగారు. ఆత్మపెట్టేదికాదు ఆవరించేది. ఆవరించే వున్నది. ఆత్మ అంటే ఏమిటో చెప్పనా అంటూ నేలపై ఒక వలయం గీచి "ఈ సున్నాలో ముఖ్యమైన ప్రదేశమేది? అని అడిగింది. సున్నాలో చెప్పనా? సున్నా చుట్టటానికి అధారం చెప్పనా అని చిదంబరరావుగారు అడిగారు. సున్నాలో తెలిస్తే ఇది చెప్పినట్లే" అని అమ్మ అంది. "సంకల్పం" అని తాతగారు అన్నారు. వేలు, గోరు, భూమి ఈమూడు కాదా-సంకల్పందాకా పోయారు? సంకల్పం ఆకృతి లేనిది. ఈమూడు ఆకృతి కలిగినవి. ఈమూడు చెప్పి సంకల్పం దగ్గరకు వెళ్ళాలి. క్రమంగా వస్తే కానిదేమిటో తేలుతుందని అమ్మ చెప్పింది.

ఇంత తలకాయ ఎక్కడిదో అని చిదంబరరావు తాతగారు స్వగతంలా అనుకున్నారు. మీ అందరికీ ఎక్కడిదో నాకు అక్కడిదే. "ఇచ్చినదేవుడు మర్చిపోతే నీకూతురు బ్రహ్మాండమేరా సీతాపతి" అని అల్లుడితో అమ్మ తాతగారు వెంకటసుబ్బారావుగారు అన్నారు. "నేను బ్రహ్మాండం, మీరు బ్రహ్మాండలోని వాళ్ళు" అని అంది.

మీ గొడవ మీదేనా పున్నయ్య సంగతి ఏమైనా ఆలకించారా అని మరిడమ్మగారు అంది. ఆలకించలా, లాలించా అని అమ్మ అన్నది. లాలించడమేమిటి? బ్రహ్మాండమైనప్పుడు పాలించదూ! అని చిదంబరరావుగారు సమర్థించారు. "బ్రహ్మాండమైనప్పుడు పాలించే తీరుతుందని" అమ్మ ఐదు సం॥ల పిల్లగా వున్నప్పుడే ధృవపరిచింది. అమ్మమాటకు పున్నయ్యగారితో సహా అంతా ఆశ్చర్యపోయారు. అమ్మా! తల్లిలేని తల్లీ "అంటూ అమ్మ చెక్కిళ్ళు పుణికి ముద్దుపెట్టుకున్నారు. పున్నయ్యగారు తల్లిలేనితల్లీ అంటే తొలినేను అనేనా? అదివిని చిదంబరరావుగారు విభ్రాంత చకితులయ్యారు.

కృష్ణునికి, కృష్ణతత్వానికీ తేడా ఏమిటి? అని తాతగారు అడిగారు. కృష్ణతత్వమంటే కృష్ణుడి లక్షణాలు కలిగింది. కృష్ణుడంటే కృష్ణుడే. కృష్ణుని గురించి చెప్పుకోవటానికి పురాణాలే ఆధారమయినాయి. ఆ పురాణాలు చెప్పిన లక్షణాలు

ఎక్కడవుంటే వాటిని కృష్ణతత్వం అంటున్నారు. అదివిని పున్నయ్యగారు తన్మయావస్థ వచ్చిపడిపోయారు. అవసానదశ అని గ్రహించి వారిని ఇంటికి తీసుకువెళ్ళారు.

ఆరోజు రాత్రి వారిని చూడటానికి అమ్మ వెళ్ళింది. అమ్మను చూడగానే కదలని చెయ్యి ఎత్తి నమస్కారంచేసి నంగి మాటలతో "చెట్టుమీద నిలుచున్నది నీవే, నీవే కృష్ణుడివి. అంటూ కళ్ళు పెద్దవి చేసి" నీవే నీవే అని ఉచ్ఛైస్వరంతో ఆయన పలికి తృప్తిగా కన్నులు మూసారు. అమ్మ ముసిముసి నవ్వులు వారి ప్రకటనను మౌనంగా అంగీకరించాయి.

చిదంబరరావుగారు "ప్రొద్దున్న ఆయన నిన్ను భుజాన ఎత్తుకురావటానికి అసలు కారణమేమిటి? అని అడిగారు. అసలు కారణం అసలుకే తెలియాలి అంటూ అసలు అంటే ప్రతిదానిలో వుండే శక్తి అని వివరించింది.

ఇంత గంభీరమైన భావాలు ఎక్కడుండీ వచ్చాయో అని ఆశ్చర్యపోతూ "నేను రాసిన ఆత్మబోధ చదువుతావా? చదువు రాదుగా" అని సానుభూతి ప్రకటించారు. "చదువుకోలేదు కనక చదువురాలేదు" కాని తెలుసుకుండేది తెలివేగా "ఆ తెలివికి ప్రతిదానిని తెలుసుకోవటమే గదా వృత్తి. తెలివికి తెలుసుకోవటమే వృత్తి అయినప్పుడు అది సహజమే. విశేషమేమున్నది? వేరే విశేషమేమున్నదమ్మా?" "నీవే విశేషం" అని శ్లాఘించారు.

బాపట్లలో సీతాపతిగారి దగ్గర అమ్మ అన్నానికి కూర్చుంది. తాతగారు కందిపచ్చడి కలుపుకుంటూ "నీకేది ఇష్టమని" అమ్మను అడిగారు. విస్తట్లో వున్నవాటిలోనా, "అసలు నాకేది ఇష్టమనా" అని అమ్మ అడిగింది. అమ్మ వేసిన ప్రశ్న విని చిదంబరరావుగారు పకపకానవ్వి "చెప్పవయ్యా సీతాపతి చెప్పు సమాధానం" అన్నారు.

"నాన్నే మీరనుకొని మీరు చెప్పండి సమాధానం. మొన్న మీరు ఆ ప్రశ్నమేమే వేసామని సమాధానం చెప్పమంటిరే". "అడుగడుగునా అడుగు తీసి అడుగుపెట్టడం మహాకష్టంగా వుంది. మా అనసూయా మహాదేవిగారితో" అని చిదంబరరావుగారు నవ్వారు. "అన్నింటికీ ఈ అనసూయా మహాదేవిగారే కారణం" అన్నారు వెంకటసుబ్బారావుగారు మనసులోపల ఏమేమో ఊహించుకుంటూ "సమస్త కార్యాలకు

కారణమేనా"? అమ్మ గంభీరంగా అడిగింది" ఆ జరిగిన విషాదఘట్టానికి నీవే కారణం" అని నొక్కినొక్కి చెప్పారు. ఆ మాటలకు చిదంబరరావుగారు బాధపడి అలా అనక శాస్త్రరీత్యా "శాంతిచేయించారుగా! ఇట్లా ఎందుకు జరగాలి? వాళ్ళకట్లా జరిగే యోగ్యత వుంటే వీళ్ళిట్లా పుడతారా? వీళ్ళు ఇట్లా పుట్టినందువల్ల వాళ్ళకు అట్లా జరుగుతుందా? అసలు ఇవి రెండూ కాకపోయినా అట్లా అనుకుంటారా?"

అమ్మ ఒక్కసారి తర్కశాస్త్ర జలధి గర్భంలోకి దూకి ఒక్క మునక వేసి తలపైకెత్తి ఫక్కుమన్నది. తీరంలో నిలబడిన తాతగార్లిద్దరూ నివ్వెరపాటుతో అమ్మవంక చూస్తూవుండిపోయారు. అమ్మ తిరిగి తీరానికి వచ్చి "ఏమిటి? ఏమంటారు?" అంది, "నీవే చెప్పు" చిదంబరరావుగారు అర్థించారు. మరితొడుక్కునేదెవరు? అమ్మ అడిగింది. చిదంబరరావుగారు నవ్వి" గాంభీర్యంలో చమత్కారం, చమత్కారంలో గాంభీర్యం. ఆయన కవి కదా! అందుకని ఈ సంభాషణను కావ్యంలో అయితే రసాభాస అంటారని అలంకార శాస్త్రాన్ని నెమరువేసుకున్నారు.

పరిహాసం మాని చెప్పమ్మా! అని వినయంగా అడిగారు. నాకు చెప్పేస్థితి వుంటే ఈమెగారే కారణమని అనిపించుకుంటానా? అసలు-కారణానికి అర్థం ఏమిటి? కారణానికి అర్థం తెలిస్తే కార్యాలన్నీ తానే అవుతాడా. చెప్పండి-తాతగారు చెప్పండి. తొందరగా చెప్పండి" అమ్మమాట కంఠం ఉద్రిక్తమయ్యాయి.

అమ్మ మాటల్లోని ఆవేశము, అర్థస్ఫూర్తి తాతగారిని ఆకట్టుకున్నాయి. వెంటనే వారి సర్వేంద్రియాలు నిశ్చేతనాలయ్యాయి. అందరూ చేసే చేసే భోజనాలే మాని, చిదంబరరావు గారిని చూస్తూ నోటమాటలేక మౌనంగా ఉండిపోయారు. అమ్మలేచి చేయికడుక్కోని వాకిట్లోని నులకమంచం మీద పడుకున్నది. అమ్మ వెళ్ళటాన్ని ఎవరూ గమనించలేదు.

అరగంట గడిచాక అందరికీ స్పృహాకలిగింది. అప్పటిదాకా నిద్రపోయి లేచినట్లూ, ఏలోకం నుండో అప్పుడే ఈలోకంలోకి దిగినట్లుగా వుంది. అందరూ ఆపిన భోజనాలు చేయడం ప్రారంభించారు.

కొద్ది క్షణాలు గడచేసరికి చిదంబరరావుగారికి అమ్మ జ్ఞాప్తికి వచ్చింది. లోగడ జరిగిన సంభాషణ స్మృతికి వచ్చింది. భోజనం చేయకుండా వెంటనే లేచి వాకిట్లోకి

వచ్చారు. మంచం మీద ఎవరో పెద్ద ముత్తైదువ పడుకున్నట్లు కనిపించింది. ఎవరా అని దగ్గరకు వచ్చేసరికి ఆమె రంగమ్మ? ఆశ్చర్యంతో కన్నులింత చేసుకొని చూచేలోగా అమ్మ సన్నగా నవ్వింది.

ఎంత భ్రమ పడ్డానమ్మా! అని అమ్మను ఎంగిలి చేత్తో నిమురుతూ "ఏం సూరమ్మా తల్లీ అలా కనిపించావు అన్నారు" నన్ను సూరమ్మ అంటారేం? ఆదెమ్మను, ఏమిపేర్లు యీ పేర్లు, నేను సూరమ్మనూగాను, ఆదెమ్మనూగాను" అంది అమ్మ. సోదెమ్మవులే, అదిసరేకాని ఎందుకు అలా కనిపించావని అమ్మను అడిగారు. "ఎట్లా చూచేవారికి అట్లా కనపడతాను" విస్మయసాగరంలో తీరం చేరుకుంటున్న వాడిని మరొక తరంగం లోపలికి నెట్టి వేసినట్లు చిదంబరరావుగారికి తగిలింది ఆవాక్యం. ఎందుకురా తింటూతింటూ వచ్చావు? అమ్మాయి గుర్తుకువచ్చిందా? అని వెంకటసుబ్బారావుగారు తమ్ముడ్ని అడిగారు. గుర్తుకు వచ్చేదేముంది? ఎప్పుడూ ఉంటూనే ఉన్నది. కానీ ఈవేళ ఏదో మాయ కప్పినట్లుందన్నారు చిదంబరరావుగారు. మాయ నీకేకప్పటమేమిటి? అందరికీ కప్పిందిగా అంటూ భోజనాలప్పటి నుంచీ ఏమిటని తర్కించుకున్నారు వెంకటసుబ్బారావుగారు.

★ ★ ★

# 10. సర్వసృష్టికారిణి

మీరంతా బండిలో వెళ్ళండి. నేను అమ్మాయిని ఎత్తుకుని నడచి వస్తానంటూ ఎంగిలిచేత్తో ముఖం తుడుచుకున్నారు. శరీరమంతా మంటలెత్తింది. ఈస్థితి ఎప్పుడూ రాలేదు. మరుపు అంటే ఏమిటో ఎరగను" అనుకుంటూ వెళ్లి స్నానంచేసారు.

దీనినిబట్టి గంగరాజు పున్నయ్యగారి స్థితి ఏమిటో అమ్మాయిని అడగాలి. అమ్మ ఒంటరిగా అరుగుమీద కూర్చుంది. చిదంబరరావుగారు పలకరించారు. అమ్మ పలకలేదు. మా అమ్మ ధృవుడల్లే కనపడుతూ ఉంది అనుకుంటూ "నీ సంగతి ఏమిటో చెప్పమ్మా-వినాలనివుంది" అంటారు వినటమెందుకు, కంటున్నారుగా అంది. ఆనందాశృవులతో ఆయన చెంపలు తడుస్తుండగా "అమ్మా! అనసూయ నీవేమిటో చెప్పమని" ఆర్తితో, ఆవేశంతో అడిగారు. అమ్మ మౌనంగా నిలుచుంది.

పున్నయ్యగారి సంగతి అడుగుతా నిజంచెప్పమని బ్రతిమాలాడారు. "ఇప్పుడు మీస్థితి ఏమిటో పున్నయ్యగారి స్థితీ అదే. ఇప్పుడు మీ సంగతి మీకు తెలుస్తున్నది. ఆయన సంగతీ అంతే చెప్పేదేమీలేదు. కాదమ్మా! అర్థమయ్యేట్లు చెప్పమన్నారు. "చెపితే అర్థంకాదు తాతగారు. ఇంత తాపత్రయం నిన్నపొద్దున్నలేదుగా. పున్నయ్య గారిని చూచినప్పుడు వీరిని గురించిన ఆలోచనలేదుగా? మీకు కలిగిన అనుభవాన్ని పురస్కరించుకొని పున్నయ్యగారి గురించి ఆలోచన వచ్చింది. "ఔను నిజమే. నీవు మాట్లాడుతుంటే ఆనందంగావుండి అడుగుతున్నానమ్మా" అంటారు. "ఔను నిజమే మీకు అర్థంకాక కాదుగా" అంటూ అమ్మ గోడనవున్న మట్టి పెళ్ళలు వలుచుకు తిన్నది. "అదేమిపని అమ్మా? మట్టితినకు కడుపులో బల్లలు పెరుగుతాయి ఆమె మా అమ్మ తాతగారు. ఆమాట చిదంబరరావుగారికి అర్థంకాక "మీ అమ్మ రంగమ్మ అయితే ఆమే ఎందుకు అవుతుందంటావు. ఆ అమ్మపోతూ ఈ అమ్మను చూపించింది. ఆ అమ్మవలె ఈ అమ్మపోయేది కాదు. ఎన్ని బళ్ళు, కార్లు మీదగా పోయినా, తిట్టినా తన్నినా, మలమూత్రాలు విసర్జించినా ఏమిచేసినా, సమస్తజనానికి అన్నంపెట్టేది యీ తల్లే. అన్ని వేళలా అన్ని వస్తువులకూ ఆధారమయింది ఈమే. అందుకే ఈ భూమిని నేను ప్రత్యక్షదైవంగా, మాతృదేవిగా భావిస్తాను.

"ఇంకా వివరంగా చెప్పాలమా!" ఇప్పుడే చెప్పమంటారా? వద్దులే పోతూపోతూ

బండిలో చెప్పుకుందామంటారు. అందరూ బయలుదేరేటప్పటికి మూడున్నర గంటలు అయింది. తాతగారు "నేను బండి తొట్టిలో కూర్చోనా" అని అడిగింది. కూర్చోని కూర్చోనా అని అడుగుతావేమమ్మా అంటారు. కూర్చోలేదు తాతగారు. అటుగా ఎక్కినా, మీకు కూర్చున్నట్లుగా కనపడుతున్నానా? "పొట్టిదానివి కదా! భూమికి జానెడే ఎత్తున ఉంటావు అన్నారు తాతగారు. జానెడే అంటూ అమ్మ నవ్వింది. ఎత్తుగానా? లోపల గానా? బయట బజానా" అన్నది అమ్మ. ఆ ఉర్దూపదాలు అమ్మ ఎక్కడ విన్నదా అని చిదంబరరావుగారు చకితులయ్యారు. ఇంతకూ భూమికి జానెడు ఎత్తున లోపలా, పైనా? లోపల ఎలా వుంటావమ్మా? పైనే, "ఇందాక భూమి మీద జానడెత్తున అనలేదుగా. భూమికి జానడెత్తున అన్నారు. "నామీద భూమి ఉన్నట్లుగా ఉంది మీమాట," "ప్రతి అక్షరంలోనుంచీ అర్థం తీస్తావమ్మా" "వ్యర్థమయిన అర్థాలు కావుకదా" నీమాట ఏదీ వ్యర్థం కాదమ్మా అంతాసార్థకం" ఎవరికి సార్థకమంటారు? సాధకులకా? అయినా నాదృష్టిలో సాధకులే లేరు" బండిలో సామానంతా సర్దారు అందరూ ఎక్కారు.

తాతగారు నేను నడిపేదా బండి? అమాయకంగా అమ్మ అడిగింది. బండి ఏమిటి తల్లీ–అంతా నడుపుతావు?" "నడిపేవాడిని బట్టి అంతా నడుస్తుందా తాతగారు" అని అడిగింది.

దగ్గరగా కూర్చుంటే చాలా విషయాలు మాట్లాడుకోవచ్చు. మీరు కూడా తొట్లోకి రమ్మని తాతగారిని అమ్మ పిలిచింది. తోలేవాడు కూర్చోవద్దా అన్నారు. వాడికీ చోటు వున్నది. ఆమాట విని నేను ఎద్దుల తాళ్ళుపట్టుకొని నడుస్తానని ఖాసిం అన్నాడు. "తాతగారూ ఖాసిం అన్న మాటలు వినపడ్డాయా?" అని అడిగింది. "అంతసేపు నడవలేడమ్మా" అన్నారు తాతగారు. "నడిపించగలవాడు నడవలేక పోవటమేమిటని" సత్యాన్ని చమత్కరించింది.

బండి నడుస్తున్నది. అమ్మతొట్టిలో నుంచి క్రిందకు దూకింది. క్రిందకు పడిపోయినట్లుగా అందరికీ కనిపించింది. అమ్మో బిడ్డ పడిపోయిందని" అందరూ ఆక్రోశించారు. అంతలో బండి వెనక్కువాలి అందరూ వెనకకు దొర్లారు. అమ్మనవ్వుతూ వారివద్దకు వచ్చి "ముందు నేను పడ్డాను. మీరు వెనకపడ్డారు. చిన్న అమ్మాయిని

ముందు పడ్డాను. పెద్ద వారంతా నావెంట పడ్డారు" అన్నది విలాసంగా ఎన్ని అర్థాలుగా అన్నావమ్మా" చిదంబరరావుగారు ఆశ్చర్యపోయారు.

అర్థాలకోసం అనలేదు. జరుగుతున్నది అంటున్నా" అని చెప్పింది. అర్థాలకోసం అనలేదు. సరే, జరుగుతున్నది సరాసరి చెపితే సరిపోదూ? ఇన్నిరకాలుగా ఎందుకూ? అని చిదంబరరావుగారు అన్నారు. చిదంబరం "ఏమిటిరా అమ్మాయి అనేది వెంకటసుబ్బారావుగారు అడిగారు చాలా ఉన్నది అర్థం. ఇప్పుడప్పుడే తేలేటట్టులేదు. ఇంటికి వెళ్ళిన తరువాత తీరిగ్గా అడగాలంటారు. తాతగారు! తెనాలి తాతగారితో అన్నదేమిటి? అమ్మ అడిగింది. "పట్టుకున్నా పీక" నేను పట్టుకోలేదు. మీరే అన్నారు. ఇంటికి వెళ్ళిందాక పీక ఎత్తవద్దని" అని అమ్మ అంది. ఏదీ చెప్పకుండా తప్పుకోవటానికా యీ ఎత్తు అన్నారు? తాతగారు. అందుకే రెండెద్దులూ యీ ఎత్తు ఎత్తాయి. ఇంతకూ "అనుకున్నది జరగదు. తనకున్నది తప్పదు"

ప్రతి వ్యక్తి అనుభవంలోనూ అడుగడుగునా ఎదురై ఓదార్చు సత్యమూ, ప్రతివ్యక్తి మనసులోని ఊహా జగతికి లోకానుభవానికీ మధ్య నిలిచే సమన్వయ సూత్రమూ, పరాజితుడయిన మానవుడు కారణం కోసం ఆకాశంలోకి తలయెత్తి చూచినపుడు అంతరంగం పలికే సమాధానమూ, సర్వమతాల, సకల శాస్త్రలసారము అయిన ఆ మహా వాక్యాన్ని, అమ్మ నోటివెంట అలా నిర్లిప్తంగా, నిసర్గంగా వినగానే, చిదంబరరావుగారు ఆశ్చర్యానందాలతో పులకితాంగులైనారు. స్పష్టంగా స్ఫుటంగా, ధారాళంగా అమ్మ మాట్లాడేతీరు చూచి వెంకటసుబ్బారావు గారు ఆశ్చర్యంతో ఏమిటో మహారాణిగారు తీర్మాణం చేస్తున్నారే అన్నారు. "నేను మహారాణిని కాదు తాతగారు "సర్వ సృష్టికారిణిని" అని అమ్మ తీర్మానించింది. విస్మయానందాలతో వారిమేనులు ఒక్కసారి పులకరించాయి. వారి మేధామండలాల్లో ఒక్క మెరుపు మెరిసింది. పరిసర ప్రకృతి పరమానందంతో పరిమళించింది. పవనుడు భక్తితో ప్రదక్షిణాలు సల్పినట్లు అక్కడే సడులు తిరిగాడు. ఆకాశంనుండి దేవతలు జయజయ ధ్యానాలు సలిపినట్లు మేఘమాలికలు మెత్తగా నినాదించాయి.

మళ్ళీ అనమ్మా! అని తాతగారు అడిగారు. అవసరం కలుగలేదుగా, ఇందాక భూమిని తల్లి అన్నావు. ఆమె అన్నింటికీ ఆధారమన్నావు. ఇప్పుడూ సర్వానికీ నేనే ఆధారమంటున్నావు" అన్నారు.

"సర్వానికీ సర్వమూ ఆధారమే" తరంగం వెంట తరంగం పెద్దపెట్టున వచ్చి మీదపడి ఊపిరి సలప నివ్వనట్లు వాక్యం వెంట వాక్యం అమ్మనోటినుండీ వెలువడి చిదంబరరావుగారిని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. వారి మనో వీథులలో అమ్మ పలికే ప్రతి మాటా ఒకొక్క నక్షత్రమై నిలచిపోతున్నది.

అమ్మ, చిదంబరరావుగారు మన్నవ ప్రయాణమైనారు. రైలు ఎక్కాక ఒక్క క్షణమైనా వృథాచేయకూడదనుకుంటూ పున్నయ్యగారి గురించి క్లుప్తంగా జరిగింది చెప్పమన్నారు. అసలు ఈ ఆలోచన ఎందుకు వచ్చింది మీకు అని అమ్మ అడిగింది. తాతగారికి ఒక విధమైన దివ్యానుభవంతో శరీరం, నిండగా కంఠం పూడుకుపోయింది. అనిర్వచనీయమైన భావానికి భాష లభ్యం కాకపోవచ్చు. దానితో అమ్మ ముఖంలోకి తేరిపార చూచారు. ఆ ముఖంలో వారికి ఏమీ తెలియని అమాయకతో అన్నీ తెలిసిన ప్రశాంతతో కన్నుల శ్రుపూర్ణాలయినాయి. గొంతు సవిరించుకొని ఎప్పుడూ ఆనందపరిచే విషయాన్ని చెప్పటానికి చేతకానిది. అమ్మయందు ఆయనకు ఒక అభిప్రాయం వుందని చెప్పారు.

ఒక్కొక్కప్పుడు అమ్మ ఎంతో పెద్దదానిగా, మరొకప్పుడు ఏమీ తెలియని పసిపిల్లలాగా కనిపిస్తుందని, ఒక్కోసారి సర్వజ్ఞతతో వ్యవహరిస్తుందని ఆవెంటనే ఏమీ తెలియనట్లు మాట్లాడుతుందన్నారు. ఒక బాలిక గురించి ఇన్ని రకాల అనుభవాలా. ఆయన అనుభవాలు కూడా ఊసర వెల్లిలా క్షణక్షణానికి రంగులు మార్చుకోవు. అమ్మ యొక్క అసాధారణ స్థితి గురించి తెలియచేయమన్నారు. అమ్మ చెప్పిన విషయాలు బయటపెట్టనని, విశ్వసించి తన వికారాలు పోగొట్టుకుంటానని అమ్మను బ్రతిమాలుకున్నారు.

"ఆకారమే వికారంతో వచ్చిందని" అమ్మ తెలియచేసింది. ఎంతబాగా అన్నావమ్మా, ఎన్ని జన్మల సుకృతఫలమమ్మా యీ జ్ఞాన సంపద. ఏమహర్షి, ఏజ్ఞానీ యీ మాటను ఇంతతేలికగా అనగలడమ్మా? ఏసాధనా, ఏ విద్యాభ్యాసంలేని అమ్మ అంతగొప్ప విషయాలను వివరించటం యీ నీ సర్వజ్ఞత్వం సామాన్యంకాదు. నీవు ఆదిశక్తివి. లోకజననివి. రంగమ్మ తల్లి కడుపున రత్నగర్భ ఆవిర్భవించింది.

రైలు బాపట్లలో ఆగింది. చిదంబరరావుగారు టికెట్టు తీసి టికెట్టు కలెక్టరుకు ఇస్తూ ఇవిగో అమ్మా టికెట్లు అన్నారు. అదివిని టికెట్టు కలెక్టరు "నీకేమైనా

మతిపోయిందటయ్యా" అని అన్నాడు. ఆ, ఆ పోలా మతి నీకు" అంది అమ్మ. ఎవరినమ్మాయి నీవన్నది అని అన్నాడు. ఎవరికి మతిపోతే వారికి, అమ్మ అంటే అంత నామర్దాగా ఉన్నదా? అని అంది.

రైలు దిగినవారు గుమిగూడారు. చిదంబరరావుగారికి తెలిసిన వడ్లమూడి శ్రీరాములుగారు "ఈ అమ్మాయి ఎవరని అడిగారు. "మా మనుమరాలే" చిదంబరరావు గారు అన్నారు. శ్రీరాములుగారు అమ్మను భుజం మీద పడుకోబెట్టుకొని ఇంటికి తీసుకువచ్చారు. అమ్మమాటలు విని సంతోషం ఆగక తీసుకువచ్చాను స్టేషన్‌లో ఏమి జరిగిందో చెప్పమని అడిగారు.

మీరు ఎత్తుకు వచ్చారు కనుక అంతటితో ఆగింది అన్నది అమ్మ. లేకపోతే వాడినే భుజాన వేసుకుపోవలసి వచ్చేదా అంటూ శ్రీరాములుగారు నవ్వారు. ఇలా జరగదు. వాడూ బిడ్డేగా అమ్మఅంది. అంతలావు అమ్మగారివా అని అన్నారు. తాను ఎంత చిన్న అమ్మ అయినా అంతలావు తాతగార్లకు తగాదా పెట్టాను. అమ్మ అనటమేగా కారణం. అంతేలే అన్నింటికీ అమ్మే కారణం" అమ్మా! నీ మాటలు ఎంతబాగున్నాయని, అమ్మతో పొట్లాట పెట్టుకున్నా ఆనందమే అనుభవించారు.

వంటమనిషి చెంచమ్మగారు అమ్మను ఎత్తుకుని మా అమ్మ వచ్చిందే అంటూ, ఆ స్పర్శతోనే శరీరం పులకించి అమితానంద భరితులయ్యారు. భోజనానికి రమ్మని అమ్మను పిలిస్తే తాతగారితో తింటానన్నది. అందరి భోజనాలు అయినా రాఘవరావు మామయ్య అన్నానికి రాలేదు.

"అందరం అన్నం తిన్నాముకానీ అన్నయ్య అన్నానికి రాలేదని, తల్లికి ఒక బిడ్డరాకపోయినా దిగులే అంది. మరిడమ్మ గారు ఆశ్చర్యంతో అన్నయ్యను పట్టుకొని బిడ్డ అంటావు, వాడు అన్నం తినకపోతే బాధపడే తల్లికాస్తా పోయిందిగా అంది. "వాడు అన్నం తినకపోయినా బాధపడే తల్లిపోయింది కాని ఎవరు అన్నం తినకపోయినా బాధపడే తల్లి వుంది" అని అన్నది అమ్మ.

ఎవరు ఆమె? అడిగే ఆమెకు పెంచిన మమకారం. ఈమాట చెప్పే అమ్మ అమ్మగా అర్థంకాకుండా వుంది అని అమ్మ అంది. వెంటనే మరిడమ్మగారు పెంచిన మమకారంతో అమ్మవైన నిన్ను గురించకుండా ఉన్న అమ్మవునీవనా అర్థం" అన్నది.

"తీసుకో గలిగినవారికి తీసుకో గలిగినంత" అందరికీ అమ్మ అయిన అమ్మ రప్పించుకోవచ్చు సరి అయిన దారిలో పెట్టుకోవచు. చెయ్యటం చేతుల్లో వున్నప్పుడు బాధవుండదు. మాటవుండదు. ప్రతీది ఒకేసారి నిర్ణయమై వుంటుందని తన అభిప్రాయాన్ని తెలియచేసింది అమ్మ.

చిదంబరరావుగారు వచ్చి ఏం మాట్లాడుతున్నావమ్మా అని అడిగారు. "అన్నయ్యారాలేదని చింతతో తాతమ్మతో చెప్తుంటే ఆమె చింతనలో పడ్డది. చింతకు కారణం నాసొంతం అనుకోవటమేనా. సొంతం అనుకోకపోతే సౌఖ్యానికి దారిలేదా సౌఖ్యంగల దారిగా కనబడుతూ దుఃఖాన్ని రుజువు చేస్తుంది, నాది అనేది. ఈ భావాలు, ఆ పదాలు విన్న చిదంబరరావుగారి కవి హృదయం మురిసిపోయి "వీలు కలిగినప్పుడల్లా అమ్మాయితో సంభాషణ చేస్తే చాలా హాయిగా వుంటుంది పిన్నీ అని అంటారు. "నీకేమైనా అనుభవం కలిగిందా" అని మరిడమ్మగారు అడిగింది.

మొత్తంమీద మన ఆవరణలో బ్రహ్మాండం నిండి వుంది. అది కనపడటానికి పరిమితంగా వచ్చింది. అర్ధమయినట్లు వుండే అయోమయమవుతుంది. అర్ధం కాకుండా వుండి వారి వారి సంస్కారాన్ని బట్టి అర్ధమవుతుంది. ఆ రంగమ్మ తల్లిపోతూ పోతూ మన చేతుల్లో పెట్టినందుకు ఆ బిడ్డను రచ్చకెక్కించకుండా జాగ్రత్తగా చూచుకోవాలి

భగవంతుడు ఈ రూపంలో అవతరించటానికి చిదంబరరావుగరి అమ్మమ్మ అమ్మయమ్మగారు (మరిడమ్మగారి తల్లి) మేనమామ చలపతిరావు గారు (సీతాపతిగారి తండ్రి) నిస్వార్ధంగా అందరికీ సేవ చేయటమే పరమావధిగా బ్రతుకుతున్న మరిడమ్మ గారి సాధన చతుష్ఠయ సంపత్తి యొక్క ఫలితమే కారణం" అని చిదంబరరావుగారు తలపోస్తారు.

"ఈ క్షణానవున్న ఉద్దేశాలు శాశ్వతం చేయమ్మా ఎప్పుడూ వీటిని చెదరనీయక, మళ్ళీ నీ మాయను కప్పకమ్మా నీలోనే చేర్చుకో అమ్మా" అని మరిడమ్మగారు ప్రాధేయపడింది. మనం తెలుసుకుంటే తెలివికి తెరవేయకుండా వుంటేచాలు అంటుంటే అటుగా వెళ్తున్న అమ్మ "నాటకంలో వేషాలు వేసుకురావటానికి తెరలు అవసరం" అని అంటుంది. ఎక్కడ నుంచీ వస్తున్నాయమ్మా నాకేనా యీ సమాధానం

అని అంటారు. "అనుకుండేది నా కోసమే కానీ ఈ మాట అందరికీ ఉపయోగపడచ్చు అన్నది అమ్మ.

అయినా ఇప్పుడువున్న సంపూర్ణమయిన భావమూ, విశ్వాసమూ నిలుస్తుందని ఏముందని" అనుకుంటారు. సంపూర్ణం అయినప్పుడు తొలగేదేమిటి? అని అమ్మ అడిగింది. చిదంబరరావుగారు, మరిడమ్మ గారికి అమ్మయందు ఎనలేని విశ్వాసం ఏర్పడింది.

రంగమ్మగారు వెంటకసుబ్బారావుగారికి కలలో కన్పించి అమ్మను తెనాలి తీసుకువెళ్ళమందని చెప్తారు. ఎందుకు పదేపదే చిన్నపిల్లకు వాళ్ల అమ్మనుగుర్తు చేస్తావంటారు. దానికి అమ్మ "అమ్మను ఒకరు జ్ఞప్తిచేయటమేమిటి? మరపురానిది, మరువలేనిది అమ్మ. మరొకరు అడ్డలేనిది. ఎవరూ తీసివేయలేనిది అని అంటుంటే" చిదంబరరావుగారు ఆ కరువు ఎవరూ తీర్చలేరు. నిన్ను తీసుకువెళ్ళి ఆయన కరువు తీర్చుకుంటాడని అంటారు. "ఆయనతో నాకరువు తీరదు. నాతో ఆయన కరువు తీరదని" అమ్మ అంటుంది.

మేము నీ కరువు తీర్చలేముగాని నీవు తీర్చగలవమ్మా అని చిదంబరరావుగారు తన విశ్వాసాన్ని వెలిబుచ్చారు. ఎవరూ తీర్చలేరా. అందరికీ తీరని వ్యధలే. నేను ఆయన కూతురునై కనపడలేను. ఆయన నాకు అమ్మయై కనపడలేదు. ఆయన తాతగారే. నేను మనవరాలినే" నీ ఉద్దేశ్యం పూర్తిగా చెప్పమ్మా అంతా మరుగేనా అని వేడుకున్నారు. మరుపులేదుకానీ మరుగువుంది. "మరుగే నావిధానం" అని చిన్నవయస్సులోనే రూఢీ చేసింది.

సీతాపతిగారు రాగానే అమ్మ ఎదురు వెళ్ళింది. అమ్మను ఎక్కడ వుంచాలన్నది అందరికీ ఒక సమస్య అయింది. సీతాపతిగారి రెండో పెళ్ళితో తనకు సంబంధంలేదని తాను పెట్టిన నగలు పిల్లకు వుంచమని వెంకటసుబ్బయ్యగారు చెప్తారు.

తాతగారిని అమ్మ "విసుగులో వున్నప్పుడు అబ్బా అని, దుఃఖంలో అమ్మ అంటారు. విసుగులో తండ్రిని, బాధలో తల్లినీ ఎందుకు తలుచుకుంటారు?" అమ్మ అడిగింది. ఆ ప్రశ్నకు పకపకానవ్వుతూ అమ్మ బొటనవేలును నోట్లో పెట్టుకున్నారు. ఎంతో తియ్యగావుంది. ఏమిటో తియ్యగా వస్తోందమ్మా నోట్లోకి అన్నారు తాతగారు.

ఆ తీపే ఇంత పని చేస్తున్నది. ఆ తీపి మీనోట్లోవుందా? నాచేతిలో వుందా? శరీరమంతా ఉందా? ఉభయులకు ఉందా? తీపి వున్నస్థితి ఎటువంటిదో గ్రహించే స్థితికూడా అటువంటిదే.

"నీవు ఎట్లాచేస్తే అట్లా అవుతుందమ్మా అన్నారు. "అభ్యాసయోగ యుక్తేన" అంటూ అమ్మ చటుక్కున ఆపింది. చిదంబరరావుగారు ఉలిక్కిపడి ఆశ్చర్యంగా మళ్ళీ చదువు అన్నారు" నా దగ్గర పుస్తకాలున్నాయా? కాగితాలు ఉన్నాయా? మళ్ళీ చదవటానికి ఏదో ఆమూడ్‌లో అన్నాను" అంది. ఇది ఎక్కడ విన్నావమ్మా; అంటూ అమ్మకోసం చూస్తారు. ఏమిటమ్మా అదృశ్యమైనావు అన్నారు. "అదేమీకు సాదృశ్యం అమ్మ కనిపించలేదు కాని స్వరం వినిపించింది. రూపం చూపించి తెరవేయమ్మ అని పూర్వం అడిగాను. ఇదేనా చూపించి తెరవేయడం.

రూపం లేనిది రూపం వచ్చింది. లేని రూపం నిర్గుణం ఉన్నరూపం సగుణం. అదే నిర్వికారం, సాకారం. నిర్వికారానికి ఆకారం వుంది. అవున్నదే నేను - అదే నేను అంటూ తనగురించే అని ఎరుక పరచింది.



# 11. వినోదిని

అందరూ తెనాలికి ప్రయాణమైనారు. అంతా ట్రైన్ ఎక్కబోతుండగా అమ్మ వెనుకగా వెళ్లి తాతయ్య నాకొక కానీ ఇమ్మని అడిగింది. ఎవరో ముష్టి అడుగుతోందనుకొని వెళ్ళమని కసురుకుంటారు. అమ్మ మళ్ళీ జానకమ్మగారి దగ్గరకు వెళ్ళి “అమ్మా! ఒకకాని ఇవ్వమ్మా అంది. చెపితే నీకు కాదమ్మాయి! ఎన్నిసార్లు చెప్పాలని విసుకున్నారు. వాగివాగి అదేపోతుందలే నీవు వూరుకో అని భార్యను సర్దారు.

ఎదురుగా గూడ్సుబండి వస్తుండటంతో రైలు కదల్లేదు. అంతలో చిదంబరరావుగారు అన్నగారు మర్చేపోయిన పర్సు తీసుకువచ్చారు. ఆయన అన్నగారికోసం వెతుకుతుంటే అయ్యా! నాకొక కానీ ఇవ్వండి మీకు కావలసినవారిని చూపిస్తాను అంది. ఆమాట వినిపించుకోకుండా వెళ్తున్నా చిదంబరరావుగారితో అయ్యా కానీ అంటే అబ్బబ్బా ఉండుబండీ పోతుంది. ముందర వున్నది కూడా కనిపించదు అన్నది. తిరిగి తిరిగి విసుగు చెందిన ఆయన ఇందాక కానీ అడిగావుగా, అణా ఇస్తానుకానీ వాళ్ళను చూపించమని అంటూ అణా తీసిచేతిలో ఉంచబోగా ముసుగు దొంగనంటూ అమ్మలేచి నుంచుంది. చిదంబరరావుగారు ఉలిక్కి పడి అన్నయ్యా అని కేక పెట్టారు. వెంటనే ఏం కన్నయ్యా అని అంది అమ్మ. చిదంబరరావు గారు అమ్మను నిర్నమేషంగా చూస్తూ కన్నయ్యా అంటే చూచానయ్యా అనా. కన్నానయ్యా అనా, నిను కన్నాననాయ్యా! అంటూ ఆనందాశృవులు జలజలా రాలాయి. అదంతా నాకు తెలియదు. నేను కన్నానన్నమాట మీరు విన్నారుగా మీకు ఎట్లాతోస్తే అట్లా.

కాణీ అడిగితే లేదంటే లేదన్నారు. పో,పో అన్నారు. నీకు బుద్ధిలేదు అన్నారు. డబ్బు ఇచ్చి ఎన్ని అన్నా ఫరవాలేదు. ఒక్కకాణీ కోసం యిన్ని మాటలన్నారంటే ఆ కానీ ఎంతవిలువైనదో ఆలోచించండి.

అన్నదమ్ములిద్దరూ నిర్ఘాంతపడి కానీ అడిగింది నీవా అమ్మా అన్నారు. జానకమ్మగారు రైలు దిగివచ్చి ఆపిల్ల ఎవరు? ఎవరన్నా మారుపడ్డారా అంటూ దగ్గరకు వచ్చింది.

“మారుపడేగా యిందాక మాట్లాడినవన్నీ” అంది “అమ్మ ఎవరు? ఏమిటి?

పాపిష్టిగోల" అన్నారు. వందలువేలు అడిగానా? కానీయేగా అడిగింది. ఒక్కకానీ ఇవ్వకపోతే మానె. ఈ ఒక్కసారేగా నేనడిగేది. ఇక ఎన్నటికీ మీరు నాకు ఒకకానీ ఇవ్వలేరు. నేను పట్టుకోలేను. సరేకానివ్వండి. ఎందుకాలస్యం. కానీతో కాలం వెళ్లిపోతుంది. తాతగారు కానివ్వండి కాలంవెళ్లిపోతుంది. "పెద్ద సమస్య తెచ్చిపెట్టావమ్మా" మీకేమిటి? కవులు సమస్యలు పరిష్కారం చేస్తారు. పైగా ప్లీడర్‌కూడాను అంది అమ్మ.

ఏం ప్లీడర్‌గారో అయోమయావస్తగా వున్నది. అయోమయావస్త అంటే మాయ అనా? అంది. కృష్ణుడు గోపికలను ఏడిపించినట్లుగా వేధిస్తున్నావు. వాడేనయం ప్రత్యక్షంగా ఏడిపించాడు. వేధించటమంటే ఏమిటి తాతగారు. "కృష్ణుడు వేధించలా! భక్తితో కొలిచాడు ఎవరికి ఎంతభక్తి వుందో అని.

కృష్ణుడికి గోపికల మీద భక్తి ఎక్కువ? గోపికలకు కృష్ణుని పైన భక్తి ఎక్కువ? అమ్మ అడిగింది. నువ్వు చెప్పవలసిందేనమ్మా! అన్నారు తాతగారు.

గోపిక అన్నపేరు ఎందుకు వచ్చిందో ముందు చెప్పండి. గోపిక కృష్ణుల పేర్లలో వున్న అర్థం చెప్పితే తరువాత ఆలోచిద్దాం. అదికూడా నీవే చెప్పమ్మా అని రెండు చేతులు జోడించారు. కృష్ణుడంటే చెప్పండి అన్నది అమ్మ. పూర్తిగా తెలియని స్థితి తల్లీ. నీవే విశదపరచాలని అన్నారు. మీకు తెలియకపోతే నాకేమి తెలుస్తుందని అన్నది.

మాది చదువుకున్న చదువుతల్లీ, నీవే చెప్పు అన్యధాశరణంనాస్తి' అంటేగానీ చెప్పేటట్లు లేవు అంటూ చిదంబరరావుగారు గజగజ వణుకుతూ నుంచున్నారు.

వెంకటసుబ్బారావుగారు "నేను చెప్పనా" అన్నారు. చెప్పండి తాతగారూ మీరెక్కడ? మతుకుమల్లి రఘోత్తమ శాస్త్రులగారి అల్లుడు కదూ? మీకెందుకు తెలియదు అంది అమ్మ. మా మామగారి పేరు ఎలా తెలిసింది. అందులోనూ ఆయన పండితులని ఎలా తెలిసింది. అంటూ ఒరే చిదంబరం ఆ కృష్ణుడే ఈ కృష్ణుడేమోరా అని అన్నారు.

కృష్ణుడంటే ఏమిటో చెప్పలేదుకానీ ఆకృష్ణుడినీ, ఈ కృష్ణుడినీ పోలుస్తున్నారు. రైలు బయలుదేరటానికి టైమున్నందున వెయిటింగ్ రూములో కూర్చుని మాట్లాడుకుంటున్నారు.

అంతలో ఒక వృద్ధబిక్షువు యశోదా కృష్ణుల పాటపాడుకుంటూ వచ్చాడు. గోపిక, కృష్ణులకి అర్థాలు చెప్పవలసి వస్తే ఇప్పుడు యశోద కూడా కలిసింది. ప్రతి దేవుని పేరుకు, దేవునికి అర్థంతేలాలి. అసలు దేవుడనే మాటకు అర్థం తెలిస్తే దేవుడెవరో వెతకచ్చు. దేవుడంటే భగవంతుడు అన్నారు వెంకటసుబ్బయ్యగారు. భగవంతుడంటే అని అమ్మ అడిగింది. తాతగార్లిద్దరూ ఆలోచనలో పడ్డారు. జానకమ్మగారు నిద్రపోయింది.

హఠాత్తుగా అమ్మ చిదంరబరరావుగారితో అసలు ఈ సంభాషణ ఎందుకు వచ్చింది తాతగారు అని అడిగింది. ఆయన ఆలోచించి ట్రైన్ దగ్గర అనగానే వెంకటసుబ్బయ్యగారు బయటకు చూచి గాభరాగా "బండి వెళ్లిపోయిందిరా"! అని కేకవేశారు.

జానకమ్మగారు లేచి బండేకాదు డబ్బూ సామను అన్నీ పోయాయని అరిచారు. అమ్మ నిర్లిప్తంగా కానీ–పోనీ ఏంచేస్తాము" అన్నది. నీ కానీయే యింతదూరం తెచ్చింది. ఇంతకు ఏంచేదాం అన్నారు. "ఏంచేసేదేమున్నది? మీరు చేసినపనే. బండిలో కాలుపెడ్తూ పో, పో నీకేం బుద్ధిలేదు" అని అన్నారు బండిని అందుకే అదిపోయింది.

వారు ముగ్గురూ నిర్వీణ్యులై నిలబడిపోయారు. వారికి చైతన్యం కలిగించటానికి "ఇందాక చిదంబరరావు తాతగారు అన్నారు చూచారూ కృష్ణుడు, గోపికలను వేధించినట్లుగా అని, నా ఉద్దేశం వేధించటం అంటే విధించటమే" విధి అంటే తప్పనిసరి. నిర్ణయమంటే చేసి తీరవలసినది. నిర్ణయమంటే గుర్తు. వీడు ఫలానా అని ఆరూఢత కలిగించేది నిర్ణయం

విధే విధానం. విధి అంటే బ్రహ్మ, పరమాత్మ, చైతన్య స్వరూపం. చైతన్యం. అదే స్పందనం. ఆ స్పందనచేత కలిగే పరిణామం సృష్టి అది అనుక్షణం జరుగుతూనే ఉన్నది. ఆ జరిగేది విధానం. "విధి విధానం అంటే ఇదే" అని అమ్మ వివరిస్తుంటే చిదంబరరావుగారు ఆనందపరవశులై వినసాగారు.

గోపికలకు కూడా చెప్పమ్మా! అని అడిగారు. భక్తి అంటే మనో వాక్కాయకర్మలు అని మీరంటుంటారే వాటికి అతీతమైన స్థితి వారిభక్తి. ఆ భక్తే గోపిక. ఈ స్థితి అందరి గోపికల దగ్గరా వున్నట్లు లేదే అని సందేహం వెలిబుచ్చారు.

గోపికల్లో అనేక విధాల వాళ్ళున్నారు. గోపికల ఆరాధన ఎట్లా వుంటుందంటే ఒకామె ముఖాన్ని ఒకామో పాదాల్ని. ఒకామె హస్తాల్ని, ఒకామె భుజాల్ని, ఒకామె, చెవులను, ఒకామె నేత్రాలను, ఒకామె లలాటాన్ని, ఒకామె లలాటమందలి తిలకాన్ని, ఒకామె కంఠాన్ని, ఒకామె కంఠస్వరాన్ని, ఒకామె శక్తిని, ఒకామె జ్ఞానాన్ని, ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా కృష్ణునిలో ఉన్న ధారణ శక్తియై-ధారణ అంటే ఉచ్ఛ్వాస నిశ్వాసలు గూడా ఆరాధించి రాధ అయింది.

అమ్మ ముఖంలోనూ, కన్నులలో మెరిసే కాంతిని, ఆమాటల్లోని మాధుర్యాన్ని తన్మయత్వంతో అనుభవిస్తూ చిదంబరరావుగారు అడిగారు.

అమ్మా! ఆ కృష్ణుడు, ఆ రాధా అందరూ నీవై చెప్తున్నావా? "నేనెట్లా చెప్పినా మీరు ఎంతో వివేకులు గనుక తీసుకోగలిగారంది. వివేకమంటే ఏమిటమ్మా అని అడిగారు". "తన్నుతాను విమర్శించుకోవటం వివేకం ఇతరులను విమర్శించటం అవివేకం". పనికిమాలిన గుణాలను విడచినవాడే వివేకి. అని తెలియచేసింది. అమ్మ.

ఇంతలో ఇంకో ట్రైన్ వస్తుంది. అందులో వెళ్ళండి. ప్రాప్తముంటే వస్తాయి లేకపోతే లేదు అని అంటుంది అమ్మ.

చేసేదేమి లేక ఇద్దరూ ట్రైన్‌లో తెనాలి వెళ్ళారు. ఇంటికి వేళ్ళేసరికి వారి సామాను ఇంటి ముందు వరండాలోనే కనిపించింది. వీరు ఎక్కిన పెట్టెలో తెలిసిన వారుండటంతో, వారు సామాను ఇంటికి చేర్చారు. అమ్మ ముందుగానే ప్రాప్తముంటే వస్తాయని తెలియచేసింది కదా!

తాతగారిని, జానకమ్మగారిని రైలు ఎక్కించి ఇంటికి వచ్చిన తరువాత గోపిక లంటే అర్థం చెప్పవూ. కృష్ణుడంటే చెప్పమ్మా అని చిదంబరరావుగారు అడిగారు.

★ ★ ★

# 12. శేముషీ వైభవం

అసలు పదం కృష్ణుడు కాదు. గృష్ణుడు అన్నది. ఆ..ఆ..పదాలనే మార్చేస్తున్నావా? గృష్ణుడా? అదెట్లాగమ్మా అని ఆశ్చర్యపోయారు. గృష్ణుడు అంటే గుణములన్నింటికీ ఆధారమయినవాడని అమ్మ సులువుగా చెప్పేసింది. ఆయనకు సరిగా వినిపించక గణితమా? అంటే లెక్కలా? అని అడిగారు. గణితమే. గుణములన్నా గణితమే. ఒకటి రెండు మూడు అనేకాదు ప్రతీదీ గణితమే అంది అమ్మ. అయితే సృష్టికూడా గణితమేనా అని తాతగారు అడిగారు.

చెట్లను తీసుకున్న, మనిషిని తీసుకున్నా అంతా గణితమే. పంచభూతాలతో కూడిన శరీరాన్ని తీసుకున్నా. అసలు ఒక భూతమే పంచబడ్డది కాబట్టి పంచభూతాలయింది. భూతాలు ఐదు అన్నా గణితమే. కదలిక పరిణామం, ఒకదానిలో నుండి మరి ఒకదానిలోనికి పోవటం అంతా గణితమే. అంటే గణనకు అందనిది. అతీతమయినది. అనగా రూపంలేనిది.

ఇట్లా ప్రతీదీ గణితమే. ఈ ఏర్పాట్లకంతకు కర్త ఆకృష్ణుడే. ఆకృష్ణుడు కూడా యీ లెఖ్ఖలో ఒకడే ఇవ్వన్నీ సృష్టించుకొని అందులో తానూ ఒకడై యీ లోకాన్ని నడిపిస్తున్నాడు. నడక అంటే ఒక పాదం ముందు. ఒకపాదం వెనుక. ద్వాంద్వాలే సృష్టికి ఆధారం. సర్వం సర్వానికీ ఆధారమే. అ,ఆ,ఇ,ఈ అం అః ఇది కూడా గణితమే. ఇది ఒక మహా యంత్రం. సంగీతం తీసుకున్నా, మంత్రశాస్త్రం తీసుకున్నా. వాస్తుజ్యోతిష్య శాస్త్రాలు తీసుకున్నా, వైద్య, వేదాంత శాస్త్రాలు తీసుకున్నా, షట్ శాస్త్రములంటే, అదే అక్షరాలతో వ్రాసినా అంకెలు వేసినా, గుర్తించటం సంఖ్యమీదనే ఆధారపడ్డది. ఈ సంఖ్యే కృష్ణుడు. సాంఖ్య విచారణ అని గీతలో చెప్పాడు. కనపడుతున్న దానిని విచారించటమే సాంఖ్య విచారణ. తారకం అంటే మనస్సుతో, మంత్రంతో అంటే కొన్ని అక్షరాలు కూర్చి ఒక వాక్యం చేసి ఒక భావానిచ్చి, భాగించేది తారకం. భావం తానయ్యేది అమనస్కం ఈ మూడింటి స్థితి చెప్పేది, చేసేది, చూచేది. "చెప్పేది-సాంఖ్యం, చేసేది తారకం-చూచేది అమనస్కం"

అంతా, ఇంతా, అన్నీ తానైనా ప్రత్యేకించి ఒకరూపంగా వచ్చినవాడే కృష్ణుడు. ఆ కృష్ణునిలో వుండే సర్వ సాధారణ ఆరాధన ధారణ శక్తే ఈ రాధ. ఆరాధన అంటే

తాను యెప్పుడు తన శక్తిని ఉపయోగించటమే. ఇవే ప్రకృతి పురుషులు. రూపం పురుషుడు, రూపంతో ఉండే శక్తి ప్రకృతి ఈరెండూ ఒకటి విడిచి ఒకటిలేవు. మాటలలో చెప్పవలసి వస్తే ఒకటి ఒకటనో, రెండూ ఒకటనో ఏదో ఒకటి గణితంలో చెప్పవలసిందే. అందుకే అగణితుడు గణితుడయ్యాడు. అంతకూ కర్త కనక గృష్ణుడన్నాను. వీటన్నింటికీ శబ్దమే ఆధారం. ఇట్లా అక్షరాలకు చెప్పకోవటం ఆరంభిస్తే ఎంతయినా విరామం లేకుండా ఆ రాముణ్ణి చూడవచ్చు" అనర్గళంగా, అతి నిర్దుష్టంగా అమ్మ ఇచ్చే వివరణలకు చిదంబరావుగారు ఆనంద పరవశులౌతూ "అంటే" అన్నారు. విరమంలేనిది రామం సృష్టికి విరామంలేదు. కదలికకు లేదు. విరామంలేకుండా జరుగుతున్న ప్రతిపనీ రాముడే. మనలోని ఉచ్వాసనిశ్వాసలు విరామం లేకుండా వున్నాయి. వ్యష్టిలోగాని, సమిష్టిగాగానీ, విరామం లేకుండా ఉండే ప్రతీ ఒక్కటీ రామమే".

నీవు చెప్పే ప్రతి ఒక్కటీ అద్వైత స్థితికి తీసుకువెళ్తున్నదమ్మా! అన్నారు. "నేను తీసుకువెళ్ళేదేమున్నది? అది అయ్యే ఉన్నది. దశరధుని కుమారుడు రాముని గూర్చి చెప్పమ్మా అన్నారు. ఆ రాముడు పరిమితి గల రాముడుగా విరామం లేని దానిలోంచి రాముడు అవతరించాడు. తనలో ఉండే శక్తి సీతై ఆసీతే లోకమాతై, ప్రకృతై, సర్వసాక్షియై, సర్వం ఆ రామమై విరామంలేనివాడుగా ప్రపంచానికి వారి ధర్మాన్ని పంచి పెట్టారు. వారే సీతారాములు.

ఇట్లా అంతకూ చెప్తావా? అని అడిగారు. అంతకూ సృష్టి అనంతమేగా. అంతకూ ఏదో అనంతానికి అదే. ఎంతెంతైనా అనంతమ్మలోనివారే. అంత అన్నా. ఎంత అన్నా పరిమితే. అమ్మ అంటే మళ్ళీ పరిమితి వచ్చింది. అంతా మమ అనుకోండి. ఈ పరిమితులన్నీ ఆపరిమితంలోనివి గనుక ఆ అపరిమితం పరిమితంగా వచ్చే పరిమితాలన్నీ కలుపుకోవాలి.

ఎన్ని రకాలుగా చెప్పినా, అన్నీ, అందరూ ఒకటేనని అంతా అద్వైతమేనని, వస్తువులు మనుషులు, మహాపురుషులు అవతార వ్యక్తులు–అన్ని రకాలు కలిపి గొడ్లనూ, గోదనూ ఒకటేమిటి ప్రపంచంలో ఉన్న ప్రతిదానిని గురించి ఒకేదానికి సమన్వయం చేసి చెప్పావమ్మా! సమన్వయం చేసేదేమిటిలే, ఆ సమన్వయమే నీవు

కదా! లేకపోతే యిట్లా సాధ్యంకాదు నీవు అసాధ్యం కనుక నీకు అంతా సాధ్యమేనమ్మా. ఈ నామాటలు కూడా నీవే"

"నీ యీ మాటలు యీ అపూర్వ సిద్ధాంతాలు నిర్వచనాలు ఏ పండితులన్నా వ్రాస్తే బాగుండును తల్లీ అన్నారు. "పండితుడైన పామరుడు వ్రాయడు. పామరుడయిన పండితుడు రాస్తాడని" కొనగోటిలో ఆయన అశృవులను మీటుతూ, ఎందుకు తాతగారు!" బ్రహ్మాండం పక్కన పెట్టుకొని ఏడుస్తారు అని అమ్మ అడిగింది. చిదంబరరావు గారు అంతలో నవ్వి "నిన్ను బ్రహ్మాండం అని ఎవరన్నారు? నీవు బ్రహ్మాండానివా? అని అడిగారు. ఒకప్పుడు మీరే అన్నారు. అయినా ఈ పేరుతో మీరు ఎప్పుడో అప్పుడు బ్రహ్మాండం అని వ్రాయకతప్పదు. బ్రహ్మాండం అంతా మీ చేతిలో, మీకలంలో, కలంలోని సిరాలో పాళీలో, అక్షరాలలో, మీ భావంలో నిండి పోయింది.

వీళ్ళందరి గురించి చెప్పావుగాని, నీవు ఎందుకు వచ్చావో, నీ అవతారమేమిటో చెప్పమ్మా! నాది అవతారమని ఎవరు చెప్పారు. నేనేదీ పెట్టుకు రాలేదు. నాకేమీ తెలియదు. ప్రత్యేకించి ఒక పని అంటూ లేదు. సృష్టి ఏ ఉద్దేశ్యంతో జరుగుతున్నదో" అంటూ హఠాత్తుగా ఆపేసింది.

సృష్టికి ఆధారమనా చిదంబరరావుగారు అడిగారు. తప్పనిసరిగా సృష్టికి ఆధారమనే అన్నది. అయినదీ, నేను అనుకున్నదీ అదే. జరిగేది అదే. జరగబోయేదీ అదే.

ఒక్కో పనికి ఒక్కొక్కరిని నిర్ణయించి రైలు బండీ చక్రాలు పట్టాలు తప్పకుండా డ్రైవరు నడిపిస్తున్నట్లుగా అదీ ప్రభుత్వం నిర్ణయించినట్లుగా ఈ దిక్చక్రం తిరుగుతున్నది. చిదంబరరావుగారికి ఇంకా అమ్మమాటలు, ఆవాగ్ఝరీ అందులోని అర్థగంభీర్యమూ ఆ ఆలోచననాపటిమా, ఆశేముషీ వైభవమూ అచ్చెరవు కలిగిస్తూ ఆనందాద్వేగంలో మేనుపులకరిస్తూనేవుంది.

చిదంబరరావుగారి పనిమనిషి నల్లి. ఆ అమ్మాయిని స్నానానికి నీళ్ళు ఇమ్మని అమ్మ అడిగింది. ఇంకా కాగలేదమ్మా. కాచి ఇస్తాను అంది. "నీవు కాచి ఇచ్చేటట్లయితే కట్టెలు ఎందుకు" అని అమ్మ అడిగింది. "కట్టెలు, నేను రెండు కావాలమ్మా అంటూ"

అమ్మాయిగారూ నీవు యీ ఆవరణలో తిరుగుతుంటే ఈ ప్రపంచమంతా నీనెత్తిన వున్నట్లు కనపడుతుందమ్మ. చూడటానికి చిన్న పాపాయిలావుంటావు కాని ప్రపంచానికే పెద్దవా అనిపిస్తోందని అమ్మలోకి చూస్తూ అన్నది. "నీకెందుకు అలా తోస్తుందని" అమ్మ అడిగింది.

ప్రతి ఇంటిలో ఉండే చిన్నపిల్లల మాదిరిగా వుండవుగా అమ్మా ఒక్క లక్షణమేమిటి? అన్నీ విశేషంగానే ఉన్నాయి. ఇంతలో మొగలిపూల వాసన గుబాళించింది. మరుక్షణానికే రకరకాల పూలు అదృశ్యంగా పరిమళించాయి. నల్లి కళ్ళు ఆనందంతో మెరిసాయి. చూచావా? నీవు గొప్పదానివని ఋజువైంది. మేము మంచి వారి గురించి చెప్పుకునేటప్పుడు, వారిని గురించి ప్రభువు సువార్తపంపుతాడు. దానికి సంకేతమే ఈ వాసనలు. నీవెంతో మంచిదానివి. గొప్పదానివన్నమాట" అన అన్నది.

"నాకే వాసనరాలేదని అమ్మ అన్నది. నీ సంగతే కదా! అందుకే నీకురాలేదమ్మా! పరలోకంలో వున్న ఆ తండ్రి ఎట్లాంటివాడో, కనపడుతున్న నీవు అంతే. "నేను అంతుకానా"? అంది అమ్మ. అమ్మా నేను ఫలానా అని నిర్ణయించలేకపోవచ్చును. వివరించలేకపోవచ్చును. కానీ ఏదో విశేషం నీలో పొడసూపుతున్నది. అదే దైవత్వం అనుకుంటున్నాను. ఆ తండ్రివి కూడా కాదు. ఆ తండ్రిని కన్న మరియావే అనుకుంటా," అని నల్లి తన విశ్వాసాన్ని ప్రకటించింది.

నల్లికి అమ్మ ఎప్పుడు, ఎక్కడ కనపడినా నమస్కారంచేసేది. తాను ఏపని చేసుకుంటున్నా, పుస్తకాలు చదువుతున్నా అనుక్షణం ఆమెకు ఏవేవో అనుభవాలు కలుగుతుండేవి. అమ్మ సర్వత్రా వ్యాపించి వున్నదన్న విషయంలో నల్లికి బాగా నమ్మకం కుదిరింది. అందువల్ల అమ్మను ఎక్కడనుండి అయినా కొలవవచ్చు. దర్శించుకోవచ్చు, అమ్మ అనుగ్రహాన్ని పొందవచ్చన్న పరిపూర్ణ విశ్వాసంతో నెల్లూరు దగ్గర పల్లెటూళ్ళో స్థిరనివాసమేర్పరచుకన్న ధన్యురాలు.

★ ★ ★

# 13. కరుణ

సీతాపతి తాతగారు, మామయ్య, అమ్మ తెనాలి వచ్చారు. బ్రిడ్జీదాటగానే ఒంటెద్దు బండీ దగ్గరకు అమ్మవచ్చి ఎద్దును నిమురుతూ బండి ఎంతకు కడతావబ్బాయి? అని అడిగింది. అమ్మచేతి స్పర్శ తగలగానే ఎద్దు గజగజ వణికింది. బండివాడు అది చూచి ఎద్దు జోలకి రావద్దని అమ్మకు చెప్పాడు. అమ్మ ఎద్దును నిమురుతూనే వుంది. నీక్కాదు చెప్పేది" అని కొరడా విసిరాడు. ఆకొరడా అమ్మకు ఎద్దుకు తగిలింది. ఎద్దుకాడి వదిలిపెట్టి అమ్మ పాదాలపై ముట్టెబెట్టి క్రిందపడి అమ్మను చూస్తున్నది. బండి మనిషి అమ్మ పాదాల వంకా ఎద్దుముఖం వంకా చూచాడు. కోపంతో పాటు ఆశ్చర్యం కలిగింది. "ఎద్దును ఇట్లా చేశావేమమ్మా! అసలే చావుకు సిద్ధమయింది. జబ్బుచేసినప్పుడు దేవుడికి మొక్కుకున్నాను. నయం అయితే ఏదైనా ఇస్తాననటానికి బదులుగా ఎద్దునే ఇస్తాననుకున్నాను, నయమయింది. ఈరోజే బండీ కట్టాను.

ఈలోగా ఎద్దు అంబా అని అరచి ప్రాణం వదిలింది. ఎద్దు అంతిమశ్వాస వదులుతూ, అమ్మ చిన్న పాదాలుకందుతాయే మోనని తనముట్టెను అమ్మ పాదాల మధ్యకు చేర్చి కన్నుమూసింది. అమ్మఎద్దును, బండివానిని తన కరుణామయి దృక్కులతో చూస్తూ నుంచుంది.

ఇంతలో ఎక్కడినుండో రాయి రివ్వున వచ్చి అమ్మకాలికి తగిలి వెంటనే రక్తం స్రవించింది. ఈ ఎద్దు తన ప్రాణంపోయే సమయంలో కూడా నాకు బాధకలుగ కూడదని ఆలోచించింది. కాని ఎవరో, ఎవరిని ఉద్దేశించో రాయి విసురుతే నాకు తగిలింది. అంతే బాధ పడవలసి వుంటే ఎవ్వరూ తప్పించుకోలేరని ఋజువుకాలేదా? ప్రతి జీవి అనుక్షణం తన జీవితంలో జరుగుతున్న ప్రతి సంఘటనను అవగాహన చేసుకుంటే వేరే శాస్త్రాలతో పనియేముంది? అని తాతగారికి వివరించింది.

కూలివానికి మూటలు ఇచ్చి నడిచి వెళ్దామా, బండీ ఎక్కుదామా? అని సీతాపతిగారు అమ్మను అడిగారు. మీ ఇష్టం మీరు ఎలా తీసుకువెడితే అలా వస్తానంది. "నీ ఇష్టంవచ్చినబండీ కోరుకోమ్మా అన్నారు. చనిపోయిన ఎద్దును చూపిస్తూ ఆ బండీ కావాలని అంది. తాతగారు ఆ బండీకోసం వెడితే "నీకు కనిపించటంలేదా?

ఎద్దు చచ్చిపోయి నేను బాధపడ్తుంటే ఆ బండీ కావాలని అడుగుతావేమని బండి మనిషి కసరుకున్నాడు.

ఏడ్చినట్లే వున్నది? ఏమికోరికలమ్మ ఇటువంటి కోరికలు కోరుతున్నావు?" నాకు ఏనాటికైనా కోరికలంటూ వుంటే అట్లాగే వుంటాయి" అన్నది అమ్మ. తీర్చుకోలేని కోరికలు ఎందుకమ్మా! తాతగారు అడిగారు. "నేను కాదు మీరయినా అంతే ఏబండీ కావాలంటే ఆబండీ ఎక్కిస్తానన్నారు. ఏమి తీర్చగలిగారు? తీర్చకపోగా నా మనస్సులో ఉన్న ఉద్దేశం కనుక్కున్నట్లుగా నేను ఎటో చూస్తుంటే, ఏదో చూచానని జరిగింది ఒకటయితే యింకోరకంగా అర్థంచేసుకొని సంభాషణ ప్రారంభించారు.

అసలు ప్రతి మనిషీ అంతే. తమ మనస్సును బట్టి ఇతరుల ఉద్దేశాన్ని నిర్ణయిస్తారు. ఒకరి మనస్సు మరొకరికి అర్థంకాదు. చివరకు భార్యాభర్తలకుకాని, తల్లీ బిడ్డలకుకాని, అన్నదమ్ములకుకానీ, అక్కచెల్లెళ్ళకుకానీ, కనీసం మార్గ దర్శకులమనీ, గురువులమనుకుని బోధచేసే వారికి కూడా మనస్సు గుర్తించలేని స్థితి వుంటుంది. ఇదే భిన్నత్వం అంటే అసలు మనస్సు తెలుసుకోగలిగితే బోధతో పనిలేదు

అమ్మ గంభీరంగా చెప్పుకుపోతుంటే తాతగారు మారుమాటలేక వింటుంటే. అంతకంటే కూడా అతిశ్రద్ధగా యింకొక మనిషి ఆలకించాడు. అతని పేరు ఖాదర్‌వల్లీ. అమ్మ, తాతగారు నడిచే వెళ్తున్నారు. అమ్మకాలికి తగిలిన గాయం నుండి రక్తం స్రవిస్తూనే వుంది. ఖాదర్‌వల్లీ అదిచూచి అమ్మాయిగారిని ఎత్తుకుంటానని, కాలికి కట్టు కట్టించుదామని" అంటూ అమ్మను ఎత్తుకోబోయాడు.

వద్దలేనాయనా! నడుస్తాలే అని అమ్మ అంటుంటే ఖాదర్‌వల్లీకి అమ్మాయిగా తోచలేదు. అతను వారిని అనుసరించి వస్తుంటే తాతగారికి అనుమానం వచ్చి నీవెందుకు మాతో వస్తున్నావని అడిగారు. అమ్మాయి మాట్లాడుతుంటే వినాలనిపిస్తోంది. చూస్తుంటే ఇంకా ఇంకా చూడాలనిపిస్తోంది. ఆ అమ్మాయి నడుస్తుంటే ఎత్తుకోవాలనిపిస్తున్నది. మావాళ్ళ బండి కట్టుకు వస్తానని వెళ్ళాడు.

"ఈ రోజుల్లో ఎవరినీ నమ్మరాదు. అందులో అతను సాహెబ్. నీ బంగారం కాజేయటానికి ఇవన్నీ ఎత్తులని సీతాపతిగారు అన్నారు. వాడిది చాలా గొప్ప

హృదయం. మంచి చెడలు కులాల మీద ఆధారపడి ఉన్నాయా? గుణహీనుడైనవాడు మీరు చెప్పేపద్ధతిని ఒకడు కులాన్ని బట్టి గుణవంతుడవుతాడా" అని అమ్మ అడిగింది.

అంతలో గుఱ్ఱబండీ తోలుకొని ఖాదర్‌వల్లీ వచ్చి అయ్యా! బండి ఎక్కండి అంటూ అమ్మను బండి ఎక్కించాడు. సీతాపతిగారు ఎక్కారు. సీతాపతిగారికి ఖాదర్ మాటలమీద కొంతవరకూ నమ్మకం ఏర్పడింది.

అమ్మ అమ్మమ్మగారైనా జానకమ్మ గారికి అమ్మను తెనాలిలో బలవంతంగా పెంచడం ఇష్టంలేదు. వెంకటసుబ్బారావుగారు, ఇతరులు అమ్మను, సీతాపతిగారిని ఎంతో ఆదరంగా చూచారు. పదిరోజులు అమ్మను తెనాలిలో వుంచుకొని శాయశక్తులా ప్రయత్నించి విఫలులైనారు. పదకొండవ రోజు సీతాపతిగారికి అమ్మకు తలంటిపోసి కొత్త గుడ్డలు పెట్టి వెంకటసుబ్బారావుగారు "సీతాపతిగారిని ఒక ఇంటివాడవుకమ్మని" ఆశీర్వదించారు.

అన్నపూర్ణమ్మగారు అమ్మను దగ్గరకు తీసుకొని మంచి మంచి పరికిణీలు, చాలా సొమ్ములు చేయిస్తాము ఇక్కడ వుండమ్మా" అని అడిగారు. సొమ్ములు, పరికిణీలు తాతమ్మకావుగా అన్నది అమ్మ. సముద్రమంత గంభీరం అని అన్నపూర్ణమ్మగారు కణతలు నొక్కుకుంది.

సీతాపతితాతగారు, అమ్మ బాపట్ల వెళ్తున్నారని తెలుసుకొని ఖాదర్‌వల్లీ ముందుగానే బండి తీసుకువచ్చి వాకిట్లో నిరీక్షిస్తున్నాడు. సీతాపతిగారు వీధిలోకి వచ్చేటప్పటికి బండి సిద్ధంగా వుండటం చూసి అబ్బుర పడుతుంటే ఖాదర్‌వల్లీ అయ్యారండి" అని పిలిచాడు.

స్టేషన్ దగ్గర బండి దిగి ఖాదర్‌వల్లీకి బాడుగ డబ్బులు ఇవ్వబోతే" వద్దయ్యా! అమ్మకు నీవు తండ్రివి. నేను బిడ్డను. నేను కూలీకిరాలేదు. అమ్మకోసం వచ్చాను అన్నాడు" ఖాదర్‌వల్లీ.

చిన్న పిల్లను పట్టుకొని అమ్మ అంటున్నావేమిటిరా? అని తాతగారు ప్రశ్నించారు. ఎందుకనో తెలీదుకాని అట్లా అనిపిస్తోందయ్యా. నేను బాపట్ల వచ్చినా నా అన్నం నేను తింటు అమ్మను చూస్తుంటాను.

బాపట్ల ఎందుకు? అని సీతాపతిగారు అడిగారు. బాపట్లకోసం కాదయ్యా. అమ్మకోసం. అమ్మ కల్పించుకొని తాతగారికి వినపడకుండా ఖాదర్‌వల్లీతో చూచావుగా నేను వెళ్ళిన తరువాత ఇంకొకనాడు రా అన్ని సంగతులు మాట్లాడుకుందామని చెప్పింది.

అంతలో ట్రైన్ వచ్చింది. "ఓ అబ్బాయి. యీ సామాను, మమ్మల్ని రైలెక్కించివెళ్ళు అని" తాతగారు అన్నారు. అతనితో ఈ మాత్రం కరుణతో మాట్లాడింది యిదేగా. అంటూ కరుణ లేకపోతే మనమే, లేము. మనము చేసే పనులన్నీ కరుణ వల్లనే. నా దృష్టిలో కష్టసుఖాలు రెండూ కరుణ వల్లనే. ప్రతి చిన్నపనీ మనచేతులతో చేస్తున్నామన్నారు. మనం ఎట్లా చేసినా వాడి కరుణవల్లనే. మనకు కనబడకుండా ఆయా తరుణాల్లో ఆయా పనులు చేయించటమే కరుణ. కరుణ సముద్ర అలవంటిది. ఆ తరంగానికి తరుణం వచ్చినప్పుడే నీరే తరంగమవుతుంది. ఎక్కడో ఒక్కచోట పుట్టి కొండలాగ పెరిగి లయమవుతుంది. ఒక్కొక్క అల వస్తున్నట్లుంటుంది. నీటికి గాలి ఒరిపిడే అల అని వివరించింది. తాతగారికి ఏమీ అర్ధంకాలేదు. ఖాదర్‌వల్లీ ఎంతో శ్రద్ధగా అమ్మ ప్రతిమాటను విని" నేను తప్పకుండా బాపట్ల వస్తాను. నీ దగ్గర తెలుసుకోవలసినవి చాలా ఉన్నాయి. నేను ఎక్కడైనా అడుక్కుని తిని అయినా నీ దగ్గర వుంటూ నీపాదాలవద్దే నాప్రాణం విడవాలన్నతన కోరికను వెల్లడించాడు.

ఆమాటలు విన్న అమ్మ కన్నులు కరుణ వర్షించినాయి. ఖాదర్‌వల్లీ పులకితాంగుడుఅయినాడు. ఖాదర్‌చేసిన పుణ్యమేమిటి? ఆ కరుణకు కారణమేమిటి? లేదు ఆ కరుణ అకారణమయినది.

★ ★ ★

# 14. భావనాతీత

సీతాపతి తాతగారు, అమ్మ బాపట్లలో చిదంబరరావుగారింటికి వెళ్ళగానే అమ్మను చూచి "అమ్మా రంగమ్మా వచ్చావా? అని వెంటనే తనపొరపాటు గ్రహించి అమ్మను ఎత్తుకున్నారు. అంతలో సీతాపతిగారికి "అమ్మాయిని ఎక్కడా వదిలిపెట్టవద్దు. ఆప్రయత్నం కూడా చేయద్దు. మనకు బరువుకాదు. అమ్మయే మన బరువు మోస్తుందని" అమ్మమ్మ రంగమ్మ గారి కంఠం వినిపించింది.

ఆ సాయంకాలం లక్ష్మణాచార్యులుగారు వచ్చారు. వారు నృసింహోపాసకులు. గంభీరమైన విగ్రహం. నిత్యం చిదంబరరావుగారింటికి వచ్చిపోతుంటారు. ఆనాడు వస్తూనే అమ్మా! బాలాత్రిపుర సుందరీ "అంటూ కేకలు వేస్తూ మనబాల ఎక్కడ వుందమ్మా అంటారు. మాకు బాలలు ఎవరూ లేరే అని అన్నపూర్ణమ్మగారు చెప్తారు. అంతలో అమ్మ మేడమీద నుండి దిగివస్తూ ఆగకుండానే" ఆబాలగోపాలం బాలలయ్యే వృద్ధులైనారు" అంటూ స్నానాల గదిలోకి వెళ్ళింది. ఇదిగోనమ్మా! ఈబాలే అంటూవివశులై ఒకసారి కనులు మూసుకొని మరలతెరచి" అమ్మాయి చెప్పిన సమాధానం వినలేదా? వినపడలేదా? అని అడిగారు." కనపడనూలేదు" గదిలోనుండే అమ్మ పలికింది. ఇటు వెళ్లిందా ఏమిటి? అని అన్నపూర్ణమ్మగారు అడిగారు. "చూడనేలేదన్నమాట". మనం చూడకపోయినా మనలను చూస్తూ వుంటుంది మనతల్లి అన్నారు లక్ష్మణాచార్యులుగారు. చూస్తున్నానని చూచేవారు ఎంతటివారో? అని అమ్మ అంది. "నీవెంత వారిని చేస్తే అంతవారు" అంతావారే. వారేవీరు. ఆచార్యులవారు గబగబాలేచి స్నానాలగదిలో కాళ్ళు చేతులు కడుక్కుంటున్న అమ్మను అమాంతం ఎత్తుకొని తన కాషాయ బట్టలతో అమ్మముఖం, కరచరణాదులు తుడిచి ఈ తల్లి అర్థమయ్యే తల్లికాదు. చెప్పినా అర్థంకాదు. "అమ్మా! నాకు మాత్రం ఈ స్థితి మారకుండాచేయి తల్లీ. నాకు అరవై సంవత్సరాలు వెళ్ళిపోతున్నాయి. నీ లీలలన్నీ చూస్తానో చూడనో.... నిన్ను మీ అమ్మ పోయినరోజునుంచీ గమనిస్తునే వున్నాను. ఒకరోజు స్వప్నంలో కనిపించావు. నీ యథార్థం వివరించావు. తుదకు నీవు నాతండ్రి, నా ప్రభువు నా ఆరాధ్యదైవం నృసింహస్వామిగా సాక్షత్కరించావు. అప్పుడే వినిపించాయి. అంతావారే వారేవీరు అన్నమాటలు ఆ కలిగిన ఆందోళన, ప్రేమ, భక్తి ఈరోజు ధ్రువపడ్డాయి. రూపంకూడా ఆనాడు చూచినదే".

చిదంబరరావుగారి తల్లి నరసమ్మగారు జ్వరంతో మూలుగుతున్నారు. లక్ష్మణాచార్యులుగారు దగ్గరకు వెళ్ళి ఆమె వెన్నురాస్తూ లేపాలని ప్రయత్నించారు. అది విఫలంకాగా బాలా త్రిపరుసుందరీ నీవు వచ్చి లేపమ్మా! లేస్తుందని" అన్నారు ఆచార్యులవారు. అమ్మలేచి వచ్చి తాతామ్మా! అని పిలిచింది. నరసమ్మగారు వెంటనే లేచి కూర్చుంది.

చూచారా పున్నమ్మగారు "బాలాత్రిపురసుందరి" అంటే ఎవరంటిరే. లక్షణాలు కనిపెడ్తుండండి అన్నారు. "కనిపెడితే కనపడేవి కావు. కనపడితే కనిపెట్టేవి. మీ ప్రయత్నాలేమీ లేవు" అన్నది అమ్మ.

'తాతమ్మకు అన్నం పెడ్తావా అమ్మ!' అని అడిగారు ఆచార్యులవారు "నేను పెట్టడం ఏమిటి? నీవు పెడితే రోజూ ఆమె అన్నం తింటుందమ్మా" నేను పెట్టనప్పుడూ ఆమె పుట్టినప్పటినుంచీ అన్నం తింటూనే వుందిగా" అని అంది. చిదంబరరావు పంతులుగారు "మీ బదులు అమ్మయిని పంపండి కోర్టుకు" అని ఆచార్యులుగారు నవ్వారు.

ఆమె కోర్టుకు వెడితే జడ్జీ, మునసబు , ప్లీడరు, పార్టీ అన్ని ఆమె అయి విచారణ చేయాలి. తీర్పు చెప్పాలి అన్నారు చిదంబరరావుగారు. ఇప్పుడు మాత్రం అన్నీ అయి చేయించటం లేదా అని లక్ష్మణాచార్యులుగారు అన్నారు. వినటానికి విచిత్రంగా వుంటాయి మీ మాటలని అన్నపూర్ణమ్మగారు అన్నారు.

"వినటానికి విచిత్రమే అనుభవించేవారికి విచిత్రంకాదని ఆచార్యులుగారు అన్నారు. అమ్మను అన్నం కలిపిపెట్టమని, కలపటమంటే అన్నమేకాదు అన్నీ అన్నారు. అమ్మ దొడ్లోకి వెళ్ళి ఒకగుడ్డ తడుపుకొని పట్టుకు వచ్చి అన్నంవంక చూస్తూ నిలుచుంది. "నీకెందుకమ్మా! ఈ తడిగుడ్డ అంటూ మరిడమ్మగారు అమ్మ ముఖంలోకి చూచింది. అందులో శాంభవీ ముద్రలోవున్న ఆమె గురువైన మల్లెల్ల రత్తమ్మగారి పోలికలు కనిపించాయి. తన భ్రమేమోనని తరచి చూచింది. సాక్షాత్తూ ఆమె గురువుగారే. అదే సమయంలో లక్ష్మణాచార్యులగారికి నృసింహస్వామిగా దర్శనమిచ్చింది.

వివశురాలైన మరిడమ్మగారు నరసమ్మగారి కూర అన్నంలో పెరుగు కుమ్మరించింది. ఆచార్యులగారు పెరుగు ముద్దపెట్టమని చేయిచాపారు. నరసమ్మగారు ఎంగిలి అని సందేహించింది.

"పెట్టమ్మా! అని సింహగర్జన చేసి కళ్లు పెద్దవి చేసి చేయి ముందుకు చాపారు. వెంటనే నరసమ్మగారు ఆచార్యులవారిచేతిలో ముద్దపెట్టారు. అన్నపుముద్ద చేతిలో పడగానే ఆచార్యులగారు నోరు తెరిచారు. నోరు తెరవగానే జిహ్వ జానెడు పొడవున బయటకు వచ్చి కాలనాగు వలెను, నోరు ఎటుచూచినా జానెడు వెడల్పున మృత్యుగహ్వరం వలె భయావహంగా కనిపించారు. కన్నులు వెడల్పై కణకణలాడే చింత నిప్పులైనాయి. నల్లగుడ్డు మరింత నల్లనై నయంనాంచనాల్లోకి చేరాయి.

ఆదృశ్యం చూడగానే నరసమ్మగారు కర్పూరం తెప్పించి హారతి ఇప్పించింది. మరిడమ్మ గారు రెండు కడవలనీళ్ళు తెచ్చి నెత్తిన కుమ్మరించింది. అర్ధగంట తరువాత ఆచార్యులగారు మామూలు స్థితిలోకి వచ్చి అమ్మను చూచి మన ఇంటికి వెళ్దామని అన్నారు.

అమ్మ, ఆచార్యులగారు వారింటికి చేరారు. ఆచార్యులగారు నిత్యం దేవతార్చన జరుపుకునే చోట అమ్మను కూర్చోబెట్టారు. ఆరోజు ఏకాదశి. రాత్రి ఏడు గంటలు అయింది. వారిద్దర బొమ్మలవలె మూడు గంటలు కూర్చున్నారు.

ఆ తరువాత ఆచార్యులగారే కనులు తెరచి "ఇంతకీ నీవెవరమ్మా? చెప్పుతల్లీ రెండు మూడు నెలలనుండీ యి ఆలోచన కలిగినా అడిగే అవకాశం యీనాటికి కలిగింది. మాట్లాడమ్మా! పోనీ నీవెవరివో చెప్పు పలకవమ్మా పలుకుగల తల్లీ" అని ప్రాధేయపడ్డారు.

"నీవు పలికే పలుకే నేను నాయనా" ఆపలుకులు వినగానే ఆచార్యులవారు హర్షపులకితాంగులై వెంటనే అమ్మను ఆలింగనం చేసికొని "నేను అమ్మ. అమ్మే నేను. నేనే అమ్మ అమ్మే... అని పునశ్చరణచేస్తూ నలభై ఒక్క కొబ్బరికాయలు కొట్టి నారింజకాయంత ముద్దకర్పూరం వెలిగించారు. అమ్మా! నీచేతిమీదగా ఏమైనా ఇవ్వమ్మా" అని పుస్తకం అందించారు. అమ్మ పుస్తకం అందుకొని ఏమి వ్రాయమంటారని" అడిగింది. వెలితిలేనిదిగా వ్రాయమ్మా" అన్నారు. జానెడు కైవారంగల పెద్ద సున్నా చుట్టింది. వెలలేనిది ప్రసాదించావమ్మా" అన్నారు. పక్కన ఏ అక్షరంలేనప్పుడు అది విలువలేనదిగా" అని అమ్మ ప్రశ్నించింది. పక్కన అక్షరం లేనప్పుడు ప్రపంచమంతా యిదేనని, నేనేనని చూపిస్తున్నావమ్మా! ఈ అనుభవాలన్నీ

మన ఇంట్లో వాళ్ళతో చెప్పమంటావా అమ్మా! అని అడిగారు. "చెప్పినా వారి అనుభవం కాదుగా నాయనా" అంది. చెప్పినా నమ్మరమ్మా అని ఆచార్యులగారు అన్నారు.

రాత్రి పన్నెండు గంటలు అయింది. తిరిగి ఇద్దరూ చిదంబరరావు గారింటికి బయలుదేరారు. దారిలో పెద్ద త్రాచు ఇద్దరి మధ్యనా నిఠారుగా నిలుచుని వుంది. ఆచార్యులవారు ఉలిక్కిపడి అమ్మను కేకవేసి "దూరంగా వెళ్ళు-కాటేస్తుంది" అని అన్నారు.

"ఆకాటులో ఘాటులేదు లేండి" అంది అమ్మ. "త్రాచుపాము అమ్మా-విషం" అంటుండగానే సర్పం హఠాత్తుగా ఆచార్యులవారి నిలువునా తోకమీద నిలబడి వారివంకే చూస్తూన్నది. ఆచార్యులవారు భయకంపితులై నిశ్చేష్టులైనారు. అరగంట తరువాత కళ్ళు తెరచి చూడగా అమ్మ సర్ప పరివేష్టిత అయి ఉన్నది. ఆయన వెంటనే అమ్మ పాదాలపై ఒరిగారు.

"పాములంటే నిర్భయుడైన నేను ఎందుకింత భీతి మనస్కుడనైను? అయినా.. ఈ సర్పం నిన్ను చుట్టి వేసిందేమమ్మా? అని ప్రశ్నించారు. "ఇది మాములు సర్పం కాదు నాయనా! నాగేంద్రుడు. ఆ నాగేంద్రుడే నన్ను చుట్టుకొని వున్నాడు. నేను నాగేంద్రుని చుట్టించుకున్నాను. ఆ నాగేంద్రుగే నాగేశ్వరుడై వస్తాడు. వాడే నాకాధారం. వాడి ఆకారమే నేను" అని వివరించింది.

అమ్మ! అమ్మా! ముగ్గురమ్మల మూలపుటమ్మవు నీకు ఆధారమేమిటమ్మా? నీవే ఆధారం-అంటూ అమ్మను తన బాహువుల్లో బిగించుకుని అశ్రుధారలతో అమ్మను మూర్ధాభిషేకం చేసారు. అమ్మా "ముగ్గురమ్మలమూలపుటమ్మ అంటే ఆదియై, అనాదియై, యీనాటికిది అయింది. ముగ్గురమ్మలకు తల్లి మూలపుటమ్మ. మూడు భాగాలై, అన్ని అవస్థలు మూడుగా చేసి, తను త్రిపుటియై, బాలై, బాలాత్రిపురసుందరై, మూడు కాలాలు, మూడుపూటలై, ముగ్గురు మూర్తులకు భార్యలై, మూడు గుణములై, ఆమూడు గుణములే సత్వ, రజస్త గుణములై ప్రపంచమయింది. ప్రపంచమంటే ఒక భూతంలోనుండీ అనేకంగా పంచబడినది. అందుకు నాకు ఆధారం కావలసివచ్చింది" అంటూ విశ్వం యొక్క అవిర్భావాన్ని వర్ణించింది.

అమ్మా! లోకజనని. చిన్నపిల్లగా కనబడటం లేదమ్మా! సాక్షాత్ ఆకాశానికి

భూమికి నీవే అంటుకుపోయినట్లుగా కనబడుతున్నావు. భయం ఆనందం కలుగుతున్నాయి. ఆచార్యులుగారు మాత్రం ఉద్విగ్న మానసంతో అక్కడే తెల్లవారు ఝామున వరకూ జాగరణ చేసారు. అమ్మ ఇంటికి వెళ్ళిపోయింది.

ఆనాటినుండీ లక్ష్మణాచార్యులుగారు రోజూ చిదంబరరావుగారింటికి వచ్చేవారు. అమ్మ ఆచార్యులగారింటికి వెళ్ళేది. అమ్మను గురించి ఆయన తెలుసుకున్నదల్లా చిదంబరరావుగారితో చెప్పేవారు.

ఒక సాయంకాలం అందరూ కూర్చుని వుండగా ఇంతకూ ఈ తల్లి ఎవరి భార్య కావలసి వున్నదో అయిన సంబంధాలు వున్నాయా? అని ఆచార్యులగారు అడిగారు.

"ఆయనే సంబంధం. అయిన సంబంధాలేమున్నాయి. సంబంధమే ఆయన" అన్నది అమ్మ. ఆయన ఎవరు? ఆచార్యులగారు అడిగారు. మీరుకూడా అడుగుతారేమి? మొన్ననే చెప్పానుగా అంటూ అమ్మ గుర్తుచేసింది. ఆమాట విని చిదంబరరావుగారు ఆనందంతో తలపంకించారు.

ఆచార్యులగారు సంతుష్టాంతరంగులై "సీతాపతీ నీది రత్నగర్భమయ్యా" అన్నారు. అందరిదీ రక్తగర్భమే అన్నది అమ్మ. పోనీ ఆ రక్తం అందరి రక్తంలాంటిది కాదమ్మా" అన్నారు. "అందరి రక్తం కలసిన రక్తం" అని అమ్మ అన్నది. అందరికీ నీవు అర్ధంగావు తల్లీ" అందరి సంగతీ వదిలేయండి. మీకు అర్ధమవుతున్నదా? అని అడిగింది.

"నాకయితే అందరికీ అయినట్లు కనపడేదే. నీవు భావనా తీతవమ్మా! ఎంత అర్ధమయినట్లు వుంటావో అంతలోనే అంత అందకుండా పోతావు. సీతాపతీ పిల్లవాడి ఉపనయనం చేసేయి. వాళ్ళ అమ్మ ఆబ్దికం పెట్టుకుంటాడని సలహా ఇచ్చారు ఆచార్యులుగారు.

★ ★ ★

# 15. సర్వజ్ఞ

నరక చతుర్ధశినాడు తెల్లవారు ఝామున ఇంట్లో అందరూ తలంట్లు పోసుకుని స్వీటు తిన్నారు. అమ్మ తలంటి పోసుకోలేదు. స్వీటు తినలేదు. పండుగ పూట తలంటు పోసుకోలేదేమమ్మా అని చిదంబరరావుగారు అమ్మను అడిగారు. పండుగ అంటే యేమిటి? ఈ పండుగ ఉద్దేశం ఏమిటో చెప్పి తలంటి పోయండి అని అన్నది. పండుగ అంటే వేడుక. అందరూ ఉత్సాహంగా తలంట్లు పోసుకుని తల మురికి ఒంటిమురికి వదిలించుకుని నూతన వస్త్రాలు ధరించి, ఉన్నంతలో పిండివంటలు చేసుకుని తృప్తిగా భోజనం చేసి ఆనందంగా కాలం గడుపుతారు. అందరూ సమానంగా గడిపేదే పండుగ. అందరికీ సమానమైన ఆనందం లేకపోతే పండుగ కాదుగా. నాకు ఆనందంలేదని అమ్మ చెప్పింది. ఆమాటకు చిదంబరరావుగారు ఉక్కిరిబిక్కిరి అయి గుటకలు మింగుతూ పండుగ అనే మాటకు అర్ధం చెప్పానన్నారు.

పండుగ యొక్క ఉద్దేశం చెప్పండి అని అమ్మ అడిగింది. దుర్మార్గుడైన నరకాసురుని కృష్ణుడు వధించిన రోజు అని తాతగారు సమాధానమిచ్చారు. కృష్ణుడ్ని పరమాత్మ అంటారు కదా! అతనికి కూడా దుర్మార్గులున్నారా? పురాణాలు దుష్టశిక్షణ, శిష్టరక్షణ అని చెప్తున్నాయి. ఆయనకు దుష్టశిక్షణ, శిష్టరక్షణ రెండూ వున్నాయి.

భగవంతుడిగా పూజింపబడే వారిలో యీ ద్వంద్వాలు లేనివారున్నారా? అని అమ్మ అడిగింది. ఇంతమటుకు అటువంటి అవతారం రాలేదు ఇక వస్తారేమో తెలియదు. ఇంతలో ఒక పిచ్చికుక్కను కొందరు తరుమకువచ్చారు. ఆకుక్క వారిని తప్పించుకుని చిదంబరరావుగారి దొడ్లోకి వచ్చి దాక్కుంది. ఇటేమైన పిచ్చికుక్క వచ్చిందా అని అడిగారు. తాతగారూ వీళ్ళెందుకు ఆ కుక్క వెంట పడ్తున్నారు? అని అడిగింది అమ్మ. అది పిచ్చికుక్క అదికరిస్తే వారికి పిచ్చి ఎక్కుతుంది. అందుకని చంపటానికి వచ్చారు. ఒకటిపోయినా పదిప్రాణాలు రక్షింపబడతాయి కదా అన్నారు. అయితే వీళ్ళుకూడా కృష్ణపరమాత్మ వంటివారా! ఒకడితో పదిమంది బాధపడకుండా వుండటమేగా ఆయన చేసింది. కుక్క నరకాసురుని వంటిది అన్నది అమ్మ. కృష్ణుడు నరకాసురుని చంపితే ప్రజలకు భద్రత కలిగింది. వాడికి జన్మరాహిత్యమయిందని

చిదంబరరావుగారు చెప్పారు. పదిమంది బాధించే దాన్ని పిచ్చి అంటున్నాం. ఒకరిని బాధించేదాన్ని కక్ష అంటున్నాం. కుక్క దగ్గరకు వెళ్ళి వద్దాం తాతగారు అని అడిగింది. మాటలతోనే సరిపెడ్తున్నావు. తలంటుకుందావుగానిరా అని అన్నారు.

కావలసినంత ఆముదం అంటుకునే వచ్చాను అంది అమ్మ. ఏంది? ఎప్పుడు అంటుకున్నావని తలమీద చేయిపెట్టారు. “నా ఆముదం అందరికీ అర్థంకాదు. చూస్తే కనపడేది, చేతికి తగిలేదికాదు. అది నాకే కాదు. అందరికీ వున్నది. ఆముదం అంటే జిడ్డు. ఆ జిడ్డే సంస్కారం. ఈ సంస్కారాలకు ఆస్కారమైన తాను సంస్కారాన్నే పెట్టుకు రావాలని, అందరి సంస్కారాలు తనయందే వుంటాయని” నిర్భయంగా వెల్లడించింది.

చిదంబరరావుగారి భార్య అన్నపూర్ణమ్మగారు అమ్మను తలంటికి తీసుకువెళ్ళటానికి వచ్చారు. తరువాతైనా నాసందేహం నివృత్తి చేయాలి తాతగారు అంది అమ్మ. “ఆ సందేహం ఏమిటిమ్మా” అని అడిగారు. కృష్ణుడు పరమాత్మ అయినప్పుడు దుష్టత్వము. శిష్టత్వము అని రెండు వుంటాయా? వుంటే ఎవరిచేత కల్పింపబడ్డాయి. ఇదంతా చాలా చిక్కు సమస్య తల్లీ నాకు తేలేది కాదు అన్నారు.

సృష్టి ఎవరిచేత ఏర్పడింది? అని అడిగింది. అంతా లీల అంటారమ్మా అన్నారు ఒకడుగా వుండి ఒకడే ఆడుకుంటున్నాడని? వాడెవరు? అని అడుగతూనే కర్త, కర్మ, క్రియ మూడు ఒకటేగా కర్మ, క్రియ, కర్తలోనే అని చెప్పింది.

శాస్రాలు మాత్రం పరమాత్మ చేత ఈ సృష్టి కల్పింపబడ్డదంటారు.

మళ్ళీదానిలోనే కలిసి పోతుందంటున్నారని తాతగారు అన్నారు. భగవంతునికి నామరూపాలు ఉన్నాయా? అతనికి సంకల్పాలున్నయా? లేవా? అని అడిగింది.

శాస్త్రాలు నామరూప రహితుడని సంకల్ప రహితుడని అంటున్నాయి. భారతం చదివేటపుడు అన్ని రూపాలు నావేనని కృష్ణుడంటాడని చదివారుగా అంది. అన్నిరూపాలు ఆయనవే కనుక రూపరహితుడు. అందరి సంకల్పాలు ఆయనవే. అన్ని నామాలు ఆయనవే. ఆయన సంకల్ప రహితుడు కాదు. సంకల్పసహితుడు. ఆయనది సంకల్ప రహితమైనా సంకల్పం. రహితమైన సంకల్పమేమిటి? రెండులేనిది. రెండూ తానయినది. రెండుగా తోచినప్పుడు రాగరహితువుతాడని వివరించింది.

అంతలో అన్నపూర్ణమ్మగారు పెద్దగా కేకవేసింది. దొడ్లోకి వెళ్ళగానే మరిడమ్మగారు నూనె సీసా తీసుకొని కృష్ణుడి పాటలు పాడుతూ అమ్మకు తలంటి నీళ్ళుపోసింది. వినటానికి ముద్దుగానే వున్నాయి కానీ చూస్తే విసుగు వచ్చేదేమో కృష్ణుడి అల్లరికి అని అమ్మ అంది. వాడి అల్లరి చూచినా విసుగు రాదమ్మా! అని మరిడమ్మగారు అంది.

ఎంత మొద్దు పిల్ల వయినా నీవు ముద్దురావటంలేదు. అలాగే ఆ కృష్ణుడు ముద్దు వచ్చేవాడేమో అన్నది అన్నపూర్ణమ్మగారు. తెలిసి అన్నా తెలియక అన్నా మంచిమాటే అన్నది మన్నవ వెంకయ్యగారి కూతురు అన్నది అమ్మ. మంచిమాట ఏమిటిలే ఉన్నమాటే అన్నారు చిదంబరరావుగారు.

కళ్లల్లో నురుగు పడ్తుంది గుడ్డ అడ్డం పెట్టుకోమన్నారు. అమ్మ కళ్ళు తెరవటం, నురుగు కళ్ళలో పడటం జరిగిపోయింది. అయ్యో! అన్నారు తాతగారు. కళ్ళల్లో బాగా నురుగు పడ్డా ఏదో ఆశ్చర్యకర సంఘటన చూస్తున్నట్లు అమ్మ కళ్ళు తెరచి చూస్తోంది.

క్రమేణా అమ్మ దృష్టి ఏదో ప్రమాదాన్ని చూస్తున్నట్లు పరివర్తన చెందింది. ఇంతలో ఒకామె శోకాలు పెడ్తూ చిదంబరరావుగారింటికి వచ్చింది. అమ్మ ప్రమాద సంఘటనను అవలోకిస్తున్నప్పుడు సరిగా ఆమె కోడలు గాయపడింది.

ఆమె అక్కడకురాగానే అమ్మ "మీ కోడలికి ఎట్లా వుందని అడిగింది. అమ్మ ప్రశ్నవిని మరిడమ్మగారు" ఆమె వాకిట్లోకి రాగానే అలా అడుగుతావేమిటి? ఆమె కేమైనా జబ్బుగావుందా అని అడిగింది. ఆమె కోడలిని ఆసుపత్రిలో చేర్చారు. అమ్మాయికి త్వరగా నీళ్ళు పోయండని చెప్పి ఆసుపత్రికి వెళ్తూ మార్గమధ్యంలో సర్వజ్ఞురాలైన అమ్మను ఎవరూ అర్ధంచేసుకోలేదని అనుకుంటూ అంతక్రితం అమ్మ స్థితికి అప్పుడు జరిగిన సంఘటనకు సమన్వయం కుదుర్చుకుంటూ అమ్మకు చూపించితే ప్రయోజనముంటుందని ఊహించి వెనక్కి తిరిగి అమ్మదగ్గరకు వచ్చారు. తాతగారూ ఏమిటి ఆలోచిస్తున్నారు? ఆ అమ్మాయి బాధగురించేనా? ఇట్లాంటివి ఈవేళ ఇంకా ఎన్ని జరిగాయో మీరేవింటారుగా" అంది. అవి ఏమిటో నీవు చెప్పమ్మా అన్నారు. "తమాషాగా అన్నాను నాకేమి తెలుసు" అంటూ తప్పించుకోచూచింది.

అర్ధంకాని తల్లి, నీవి వ్యర్ధంకాని పలుకులు. ఎక్కడేమి జరుగుతున్నాయో అన్నారు. ప్రమాదం జరిగిన ఆమె అత్తగారు వచ్చి "ఏం నాయనా ఇంతవరకూ రాలేదు. మీ మనుమరాలితో, మీ ఆనందంతోనే సరా? మా ప్రాణంమీదకు వచ్చి మీ సహాయం కోరినా రాలేదు అని అడిగింది. "నా మనుమరాలు, నా ఆనందమే నీ కోడలికి ప్రాణం పోకుండా కాపాడింది. ప్రసన్నరేఖా విలసితమైన అమ్మ వదనమండలం చూచి ధైర్యంతో ఆసుపత్రికి బయలుదేరారు.

ఆ సమయంలో కంకటపాలెం నుండీ అంతకన్న ప్రమాదకరమైన దెబ్బలు తగిలినవారు వచ్చారు. "యింకా ఇలాంటివి ఎన్ని జరిగాయో అన్న" అమ్మ మాట చిదంబరరావుగారికి గుర్తుకు వచ్చింది. మీరు ఎప్పుడు పొడుచుకున్నారని తాతగారు వారిని అడిగారు. వారికి సరిగా అమ్మ చెప్పిన సమయంలోనే దెబ్బలు తగిలినట్లు తెలిసి అమ్మ యొక్క సర్వజ్ఞత్వానికి చకితులయ్యారు.

ఆసుపత్రి నుంచి తిరిగి వచ్చేటప్పుడు ఒకామెను మంచంమీద పడుకోబెట్టి మోసుకు వస్తున్నారు. ఏం జరిగిందని ప్రశ్నించారు. ఆ అమ్మాయి కడుపుతో వున్నది. ఆమె నొప్పులతో బాధపడ్తూనే గొడ్లకు మేతవేయబోతే, ఆగొడ్డు కొమ్ము కడుపులో పొడుచుకుని లోపలి బిడ్డచేయి బయటకు వచ్చింది. ఎన్నిగంటలకు ఈ సంఘటన జరిగిందని తాతగారు అడిగారు. పదిగంటల ప్రాంతం అనగానే చిదంబరరావుగారికి ఆశ్చర్యానందాలు పెనవేసుకోగా వెంటనే అంగలు వేసుకుంటూ ఇంటికి వచ్చారు.

అమ్మ ఒంటరిగా కూర్చునివుంది. "ఏం అమ్మా ఒంటరిగా కూర్చున్నావని" అడిగారు, "నేనెప్పుడూ ఒంటరిదాన్ని కాదు. నాలోనే అందరూ వున్నారు. నామనస్సులో అందరూ గుర్తుకు వస్తూనే వుంటారు. అనేకం, అనేకులు అనేక విషయాలు, ప్రపంచమంతా నాలోనేవుంది. దాన్ని నెమరు వేసుకుంటున్నాను. అందువల్లనే నేనే అన్నీ అనీ ఒంటరిదాన్ని కాదని చెప్పింది.

పువ్వొతులు వెలిగిస్తావా అని అడిగారు. వెలిగించటం ఎందుకని అడిగింది. ఒక అసురుడు పోయిన రోజు అందరికీ ఆనంద ప్రదమైనరోజు అన్నారు. అటువంటి ఆనందం నాకులేదు. ఒకబిడ్డ తరిగాడని బాధలేదు. కృష్ణుని చూస్తే సంతోషములేదు. నరకాసురుని చూస్తే బాధలేదు. ఏ సంఘటన నాకు దుఃఖాన్ని కానీ, సుఖాన్ని కానీ

ఇవ్వదు. అంతా, అన్నీ నేనే అనిపిస్తుంది. నేనేనంటే ఈ అనసూయనేకాదు అందరిలో వున్న నేను" అని తెలియచేసింది.

అంతలో లక్ష్మణాచార్యులు గారు వచ్చి అమ్మను ఎత్తుకొని "ఉదయం తొమ్మిది గంటలకు మొక్కజొన్న కండె పట్టుకు వచ్చావుకదమ్మా" అన్నారు తొమ్మిది గంటలకు తలంటుకుంటున్నది. కండెలు మా ఇంట్లో లేనేలేవని తాతగారు అన్నారు. అమ్మను ఆసమయంలో వారింటి దగ్గర చూచానని లక్ష్మణాచార్యులు గారు అన్నారు.

ఎప్పుడు వెళ్ళావమ్మా? అని తాతగారు అడిగారు. మీరు ఆసుపత్రికి వెళ్ళినప్పుడు అన్నది. అప్పుడు పదిగంటలు అయిందికదమ్మా అంటూ అమ్మ యొక్క స్థితప్రజ్ఞతకు అమితానందభరితులయ్యారు. ఈరోజు అమ్మ ముఖం ఎంతో ఉజ్వలంగా భాసిస్తోందని లక్ష్మణాచార్యులుగారు అన్నారు. రోజూలేదా! అని అమ్మ అడిగింది.

రాత్రి నిద్రలో ఏమేమో కలవరించావమ్మా? అది కలవరింతగా లేక ఎవరితోనో సంభాషిస్తున్నట్లుగా వుందని అన్నారు. కలవరింత అయినా ఏదో దృశ్యం కనబడితే వారితో మాట్లాడటమే. చూచేవాడికి కనబడదు. కలవరించే వాడి దృష్టిలో అదినిజమే. వాడి ప్రత్యక్షమే వీడికి వింతగా వుంటుంది. వాడికలవరమే వీడికి వింత అదే కలవరింత అని అమ్మ నిర్వచించింది. ఆనిర్వచనానికి తాతగారు, లక్ష్మణాచార్యులుగారు నిశ్చేష్టులు అయ్యారు.

లక్ష్మణాచార్యులవారు తులసీదళాలతో నృసింహస్వామికి లక్షపత్రిపూజ చేస్తున్నామని అందరినీ తప్పకరమ్మని ఆహ్వానించారు. ఎవరికి నాకా? అని అమ్మ అడిగింది. "ఆ నీకునూ..." అన్నారు. మాటమారిందే అన్నది. నీవు తప్పకుండా రామ్మా అన్నారు. ఇందాక నేను రాకపోయినా వచ్చానన్నారు. ఈసారి నేను వచ్చినా రాలేదని అంటారేమో అని అమ్మ నవ్వింది. కళ్ళకు ఏమాయ కాటుక పెట్టావమ్మా అన్నారు.

కాటుకే మాయ. ఎందుకంటే మాయను నలుపుగా వర్ణించారు శాస్త్రల్లో అటువంటి మాయను ధరించేవి కన్నులే-కళ్ళకు కాటుక అవసరమే అంది. చిదంబరరావుగారు ముసిముసి నవ్వులతో మురిసిపోతుంటే లక్ష్మణాచార్యులుగారు ఆలోచనాభారంతో మందగమనులై గృహోన్ముఖులైనారు. అమ్మ మేడమీదకు వెళ్ళి కూర్చుంది.

ఇంట్లో వారంతా లక్ష్మణారాచ్యులుగారింటికి వెడితే తాతగారు అమ్మతోపాటు తర్వాత వస్తానని మేడపైకి వెళ్ళారు. ఆయన పైకి వెళ్ళగానే ఆయనకు సర్వాలంకార శోభితయై రూపాయంత బొట్టుతో ఒక ముత్తైదువ కనిపించింది. తమ అన్నగారి అత్తగారైన మతుకుమల్లి ముత్తమ్మ గారనుకొని ఎప్పుడు వచ్చారని అడిగారు. అంతలోనే రూపం మారి వీరాసనం వేసుకొని జుట్టు విరబోసుకొని అభయహస్తం, ఒకచేతిలో చెఱుకుగడ పట్టుకుని ఎడమకాలు కుడికాలు మీద వేసుకొని కిరీట ధారిణియై ఫలానా అమ్మవారిని గుర్తించటానికి లేకుండా లిప్తకాలం దృశ్యమానమై శరీరమంతా సకలా భరణాలతో అలంకృతయైన బాలాత్రిపుర సుందరివలె, కనకదుర్గవలె, జ్ఞాన ప్రసూనాంబవలె కనిపించింది. మరు నిమిషంలోనే బొడ్డు కూడ కోయక శరీరమంతా మాయను కప్పుకొని అప్పుడే పుట్టిన పురిటికందు వలె, చింపిరి గుడ్డలతో, చేతిలో కఱ్ఱతో గొడ్లుకాచే కుఱ్ఱవాడిలా, నెరసిన గడ్డంతో కఱ్ఱపట్టుకుని గజగజ ఒణికే వృద్ధుడివలె, లలాటాన విభూతిరేఖలతో చేతిలో పంచాంగం-చెంబుతో శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనంః అంటూ బిక్షాటనకు వచ్చే పేద బ్రాహ్మణుని వలె, కోర్టుమునసబు వలె, పాకీదొడ్లు చిమ్మే వెంకటప్పవలె, దొడ్లో నీళ్లుపోసే వీరాస్వామి వలె, హత్యచేయబడిన స్నేహితుడు పొన్నూరు గోపాలరావుగారి వలె చిత్రవిచిత్రంగా తెరమీద కదలాడే బొమ్మలవలె అమ్మ కనిపించింది. వెంటనే చిదంబరరావుగారు కన్నులు మూసుకొని చేతులు జోడించారు. తమ వాకిట్లో వున్న పొన్నచెట్టు మీద కృష్ణుని బొమ్మవలె, కుగ్లర్ ఆసుపత్రిలోని డాక్టర్లు, అక్కడ చిమ్మే మనిషిలాగా కనిపించింది. ఆ తరువాత పిఠాపురం తాలుకా చెందుర్తి కరణంగారు, బాలో పాసకులైన పెమ్మరాజు సత్యనారాయణగారి వలె కనిపించింది. విచిత్రమేమిటంటే వారిని చిదంబరరావుగారు ఎరుగరు. ఆమర్నాడే ఆయన వీరింటికి వచ్చారు.

లక్ష్మణాచార్యులగారింట్లో జరుగుతున్న క్రతువంతా కనిపించింది. శంకరాచార్యులవారు, ఎక్కడో నానాబాధలు పడ్తూ ఒక ఇంట్లో పని చేసే స్త్రీవలె, ఆ స్త్రీపడే బాధలు అసంఖ్యాకంగా సినిమా తెరమీద బొమ్మల వలెకనిపించాయి.

ఆ దుర్భరమైన బాధలన్నింటినీ ఓర్పుతో అనుభవించే స్త్రీని చూడగానే చిదంబరరావుగారి గుండెలు బరువెక్కి కన్నులు ఆషాడపయోధరాలై "ఎవరీ సహనమూర్తి? ఈ చరిత్ర గతంలోనిదా? వర్తమానంలోనిదా? భవిష్యత్‌లోనిదా? అని ఆలోచిస్తూ" సహనమనే దేవతను ఆరాధిస్తున్న తల్లీ" అన పెద్దగా కేకలు పెట్టారు.

కన్నులు మూసుకొని వుండగా "సహజ సహనం" అనే అక్షరాలు పెద్దవిగా, బంగారపు రంగుతో వ్రాసి వున్నాయి.

ఆ అక్షరాలు చూచి చిదంబరరావుగారు ఉలిక్కి పడ్డారు. ఆ అక్షరాలక్రింద చొక్కాలేకుండా బొడ్డుక్రిందకు జారిన పరికిణీతో, చింపిరిజుట్టు ముక్కు చీమిడితో అమ్మను పోలిన ఒక బాలిక కనిపించింది. ఆ అక్షరాలు, ఆ మూర్తిని అవలోకిస్తూ శరీరం మీద మనస్సు మీద అధికారం కోల్పోయి పరవశస్థితిలో ఉండిపోయారు చిదంబరరావుగారు. అమ్మ మెల్లగా లక్ష్మణాచార్యుల వారింటికి వెళ్ళింది.

ఆరాత్రి పన్నెండు గంటలకు అన్నపూర్ణమ్మ గారు పైకి వెళ్ళారు. చిదంబరరావుగారు గాఢ సుషుప్తిలో వున్నారు. ఆవిడ వెనుతిరిగి క్రిందకు వెళ్ళబోతుండగా చిదంబరరావుగారు కదిలారు. మేలుకున్న చిదంబరరావుగారి నాసికాపుటలకు మధురమైన మొగలి వాసన తగిలింది. ఆవాసన ఆయన గుండెలపై ప్రసారితమౌతున్నది. ఇక్కడ ఏమిటి అనుకుంటూ గుండెలపైకి చేతిని పోనిచ్చారు. చేతికి మెత్తగా తగిలింది. అది సర్పం. జరజరా పాకుతున్నది. ఆయన గుండెలవిసిపోయి ముచ్చెమటలు పోశాయి. ఆదృశ్యం చూచిన అన్నపూర్ణమ్మగారు గజగజ లాడింది. పాము అదృశ్యమయింది.

అన్నపూర్ణమ్మగారు కాళ్ళు, చేతులు కూడతీసుకొని చిదంబరరావుగారి దగ్గరకు వచ్చింది. ఆయనలో చైతన్యం కనిపించకపోయే సరికి, సర్పద్రష్టులయినారేయోనని ఆమె భయవిహ్వలయై శోకాలు పెట్టింది. వెంటనే చిదంబరరావుగారు భయపడవలసిన ప్రమాదమేమీ జరగలేదని సంజ్ఞచేసారు.

అమ్మాయి ఏదని అడిగారు. లక్ష్మణాచార్యుల వారింటివద్ద వుందని చెప్పారు. అమ్మాయి ఎన్ని గంటలకు అక్కడకు వచ్చిందని అడిగారు. పన్నెండుగంటలకు వచ్చింది. తాతా మనుమరాలు ఒకరిని వదిలి ఒకరు నిమిషం కూడా వుండలేరుగా అంది. అవసరమైతే ఆమె వుంచుతుందని తాతగారు చెప్పారు. ఆమె అంటే ఎవరు? బాలాత్రిపుర సుందరా? చందలూరి మహాలక్ష్మమ్మ అని అన్నపూర్ణమ్మగారు అడిగారు. ఎవరైనా ఆమెగా అన్నారు. ఎవరైనా ఆమె అంటే అందరూ ఒకటేననా మీ ఉద్దేశ్యం. ఇంతలో అమ్మ వచ్చి "ఆ అందరూ ఒకటే" అన్నది. ఆ మాట వినగానే చిదంబరరావుగారు ఉలిక్కిపడి లేచి నుంచున్నారు.

తాతగారు! లక్ష్మణాచార్యులుగారు పిలిస్తే వెళ్లి రావచ్చుకదా! మనకేమీ

ప్లీడర్లమనా యింతగర్వం? చిదంబరరావుగారు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ "నీవు వెండి కొండవా, బంగారు కొండవా?" అని అడిగారు. అవేవీకాదు. నేను గోల్కొండను. గోలకొండను అని అమ్మే వివరించింది. ఆత్మబోధ అనే గ్రంథం కొంతవరకూ రాశాను మిగతాది నీవు చెప్పమ్మా నేను వ్రాస్తానన్నారు.

తాతగారు పరిహాసం ఆడుతున్నారా? నాకేమైనా చదువా? చట్టుబండలా? నన్ను చూస్తే మీకు బలే హాస్యంగా వుంది అంటూ ముగ్ధమనోహరంగా నవ్వింది. "నాకు రాత్రి కనిపించినదంతా ఏమిటమ్మా?" అని అడిగారు. మీకు కనపడింది. నాకేమి తెలుస్తుంది. నేను ఆచార్యులవారింటికి వెళ్ళాను.

ఇంటికేదో దోషాలున్నాయని అందువల్లనే బిడ్డలు బ్రతకటంలేదనీ, ఎంతడబ్బు సంపాదించినా నిలువకుండా పోతున్నది, ఇంట్లో దోషం వుండబట్టే అలా జరుగుతున్నదని అంటున్నారు. మీ అత్తయ్యపోరు పడలేక ఇల్లు పడగొట్టేందుకు ఎల్లుండి సుముహూర్తం నిర్ణయించాం. కానీ తెల్లవారు జామునుంచీ వద్దనిపిస్తోందని తాతగారు అన్నారు. రాత్రి కలలో నా ఆలోచనలన్నీ ఆకృతి ధరించాయి. అయినా అది కలగా తోచడంలేదు. చివరకు "సహజసహనం" అనే అక్షరాలు కనిపించాయి. ఇల్లు పగలకొట్టటానికి సహనమో, పగలకొట్టకుండా వుండటానికి సహనమో అర్ధమవటంలేదని అన్నారు. అర్ధంకాకపోతే ఫరవాలేదు కానీ ఇల్లు మాత్రం అనవసరంగా పగలకొట్టించకండి" అని చెప్పింది అమ్మ. చిదంబరరావు గారు కన్నులు మూసుకుని ఒక్కసారి ఆకాశంలోకి చూచి కనులు తెరచి అమ్మ ముఖంలోకి చూస్తూ "మీ అత్తయ్య ఎంతగందరగోళం చేసినా ఇల్లు పగలకొట్టించనమ్మా" అని అన్నారు.

పదిరోజులనాడు ఎక్కడికో వెళ్ళిన అమ్మ అన్నగారు రాఘవరావు మామయ్య వచ్చాడు. "మనం తిరువళ్ళూరు మొక్కుబడి తీర్చేందుకు వెళ్ళాలి. మళ్ళీ ఎక్కడికి వెళ్ళకు" అని అమ్మ చెప్పింది. మామయ్య తనకు అలాంటి నమ్మకాలు లేవన్నాడు. నాన్నా అమ్మ మొక్కుకున్నారు. నీకిష్టంలేకపోతే మానేసేయి. ఇవాళ అమవాస్య ఈరోజు స్వామిపేరుతో అందరికీ బెల్లం పంచేయమని" అమ్మ సలహా ఇచ్చింది.

అందరూ భోజనాలు చేసి సహస్రదీపాలు వెలిగించి ఆనందంగా ఉండగా, చెప్పకుండా వెళ్ళిపోయిన మామయ్య తిరిగి వచ్చివాళ్ళ ఆనందంలో పాలుపంచుకున్నాడు.

★ ★ ★

# 16. నాగులచవితి

నాగులచవితినాడు రైలుపేట అద్దంకి వారితోటలో వున్న పుట్టలోని నాగేంద్రునికి పయస్సులు నివేదన చేస్తారు. అన్నపూర్ణమ్మగారు అక్కడకు వెళ్ళింది. అందరూ తిరిగి వచ్చే వేళకు అమ్మ బయలుదేరి చిదంబరరావు తాతగారిని రమ్మంది. అమ్మ వెళ్ళి అన్నపూర్ణమ్మగారి దగ్గరి గ్లాసు తీసుకుని అందులోని నీళ్ళుపోసింది.

చటుక్కున నాగేంద్రుడు పుట్టపైకి వచ్చి పడగ విప్పాడు. అక్కడ ఉన్నవారందరూ భీతమనస్కులైనారు. పూజ చేయించే పురోహితుడు సైతం భయకంపితుడై దూరంగా పారిపోతూ ఎవరో అమంగళంగా వచ్చి వుంటారు. మైల సోకింది. నాగేంద్రుడికి కోపం వచ్చిందంటూ కేకలు వేశాడు. ఆపరిసర ప్రదేశమంతా మొగలిపూల పరిమళం గుప్పుమంది. చిదంబరరావుగారికి లక్ష్మణాచార్యులగారింట్లో పూజరోజు రాత్రి తన అనుభవం గుర్తుకు వచ్చింది. అన్నపూర్ణమ్మగారు ఆశ్చర్యాందోళనలతో గమనిస్తూ ఉన్నది.

ఎవరో అపవిత్రులు వచ్చారు అని పురోహితుడు గొంతు పెద్దది చేసి మళ్ళీ అరిచాడు. వచ్చింది అపవిత్రులే అయితే అది బయటకు రాదండి దానివాళ్ళు వస్తేనే అది వచ్చింది. "చిదంబరరావుగారు విశ్వాసమూ-గాంభీర్యం తొణికిసలాడే కంఠంతో అన్నారు. అందరూ పాలుపోస్తుంటే ఆ అమ్మాయి నీళ్ళు పోయటం వల్ల కోపం వచ్చిందని కొందరూ, అమ్మాయికి ఏం ప్రమాదం జరుగుతుందో అని కొందరూ తలోరకంగా అనుకున్నారు.

చిదంబరరావుగారు మాత్రం అమ్మ వదనేందుమండలంనుండీ ప్రసరించే ప్రసన్నతా విలసితమైన ప్రశాంత శీతల జోత్స్నలనవలోకిస్తూ ఆనందాశ్రువులు రాల్చారు. వానికనుగుణంగా సన్నని తుప్పర ప్రారంభమైంది. నాగేంద్రుని హృదయమూ ఆనంద ప్రపూర్ణమయిందేమో, ప్రఫుల్ల వదనంతో నిశ్చేష్టుడైనాడు.

అమ్మ నాగేంద్రుని సమీపానికి వెళ్ళి ముఖంలో ముఖం పెట్టి చిదంబరరావుగారిని చూస్తూ "తాతగారు వానకు తడుస్తున్నట్లున్నారు. ఈ పడగ నీడన చేరుదామా" అని అడిగింది. "నీకేమమ్మా అగ్నిగుండంలో ఆడుకోనూ గలవు.

పాము పడగనీడన కాపురమూ చేయగలవు" అన్నారు నవ్వుతూ చిదంబరరావుగారు. "తాతగారు హాస్యం చేస్తున్నారా? జోస్యం చెప్తున్నారా" అంది. జోస్యం అనగానే చిదంబరరావుగారి గుండె కలుక్కుమని కంపితకంఠంతో ఏమమ్మా అట్లా అంటున్నావు. నాకు అంతవాక్శుద్ధి లేదులే" అన్నారు. మీరు పలికే పలుకులన్నీ మీవేనని మీ ఉద్దేశమా? అని అంది.

"ఈ నాగేంద్రుని శిరస్సుపై మీ చెయ్యి పెడతారా? మీ చల్లని స్పర్శకోసం ఎదురు చూస్తున్నాడని, అంది. అమ్మతన చేతిపై చిదంబరరావుగారి చేయి వేసుకుని, చేతితో పగడసవరిస్తూ " ఏమినాయనా నాగేంద్రా నాకోసం బయటకు వచ్చావా అని అడుగుతుండగానే, ఆ పాము ఎగిరి అమ్మ బుజం మీద వ్రాలింది. చిదంబరరావుగారు ఉలిక్కిపడి కన్నులు మూసుకొని అమ్మ రెండో భుజంపై వ్రాలిపోయారు. పది నిమిషాలకు స్వస్థతపొంది కళ్ళుతెరచి "ఇది అద్భుతమైన సంఘటన అమ్మా! నాకు ఆరూపం ఇవ్వరాదు. ఎవ్వరూ దగ్గరకు రారు. ఎవరికీ అవసంరలేదు" అని అడిగారు.

"అవసరంలేకపోతే ఇంతమంది రారుకదా! ఆరూపానికి భయం కలిగించే స్వభావమున్నది. శక్తి గొప్పదని; భక్తితో పాలుపోయటానికి వచ్చినా రూపం చూచి భయపడి పారిపోయారు. వీని లక్షణాలు భయం, క్రోధం, ద్వేషం వీరిలోనూ ఉన్నాయి. స్థాయిల తేడతో, వీరికి క్రోధం లేకపోతే భయానికి తావులేదు. క్రోధానికి, కోపానికి బేధం వున్నది. క్రోధం ఎలా అయినా సాధించాలనేది, కోపం తాత్కాలికంగా బెదురు పెట్టేది. ద్వేషం విషంతో సమానం, రాగం అమృతంతో సమానం.

అమ్మ నాగేంద్రునితో పోరా అన్నది. వెంటనే భుజం మీద నుండి పాదాల మీద వ్రాలి ఒక్కక్షణం ఉండి జరజర పుట్టలోకి వెళ్ళింది. "అమ్మా! ఇది ఈ పుట్టలోనే వుంటుందా? నేనెప్పుడయినా వస్తే కనిపించమని చెప్పు" అని అడిగారు. ఆపుట్టలో కాకపోతే నాపొట్టలో ఉన్నదనుకోండి. నాపొట్టలోనే కాదు అందరిపొట్టలో ఆరేసి పాములున్నాయి. అవి బుస్సు బుస్సుమంటూనే వుంటాయి. ఏమిటవి అరిషడ్వర్గాలా అన్నారు. అందరూ మానవుని నడక నవగ్రహాలమీద ఆధారపడి వుందంటారు. కానీ నాకు రెండే కనిపిస్తున్నాయి ఏమిటవి రాహుకేతువులా అంటారు తాతగారు. కాదు, రాగద్వేషాలు, రాగద్వేషాలకు మించి మరేమీ లేవా? అని అడుగుతారు.

"ఆరెండూ జీవితానికి ఆధారం. ఆ రెంటికీ నేను ఆధారం. రాగమంటే కావాలనుకోవటం కదా! ఒక విధంగా ద్వేషం కూడా రాగమే. ఉదాహరణకు ఒకరిని చంపాలనుకునేది ద్వేషం. ఆ చంపడమనేది కోరికేగా? దానికోసం కత్తిని ప్రేమిస్తాడు, విషాన్ని ప్రేమిస్తాడు. దానికోసం వెతుకుతాడు. దొరకకపోతే బాధపడ్తాడు. వాడికి హింసే ఆరాధన. ఇది చూడలేని వానికి అది హింస. ఒకప్పుడు దేనిని ద్వేషించాడో మరొకప్పుడు అది అవసరం అవుతుంది. ఒకే పదార్థం ఒక సమయంలో అమృతమై మరొక సమయంలో విషమవుతుంది. గుణం కూడా కాలపరిస్థితుల ననుసరించి పరిణామం చెందుతుంది. సర్పం విషజంతువని ప్రసిద్ధి. కానీ అది అమృత జంతువుకూడా. గరళం ఒక తరుణంలో ప్రాణహరమైనా మరొక తరుణంలో ప్రాణదానమూ చేస్తుంది. అమ్మ చేసే సుదీర్ఘమయిన వివరణను చిదంబరరావుగారు ఆసక్తితోనే, ఆనందంతోనూ ఆలకిస్తూ "ఈస్థితిపాము విషానికి ఉన్నదా అని అడిగారు"

ప్రతిపాములోనూ విషముంటుంది. కానీ త్రాచుపాముకే గరళం తీస్తారు. మనిషే అన్నింటినీ చంపగలవాడు. దేనినీ చంపలేనివాడు కూడా. అందరూ అన్నీ కాలం మీదనే ఆధారపడ్డాయి.

"సృష్టికి మానవులకు వ్యతిరేకమయిన జంతువులతో నీకీ సాంగత్యమేమిటమ్మా" అని అడిగారు. ఇంటికి వెళ్ళి చెప్పుకుందామన్నది. నాగులచవితి కదా ఈ రోజు ఉపవాసం వుంటారా? అని అన్నపూర్ణమ్మగారు అడిగింది. ఆమెగారు ఏది? అంది.

మేము ఉన్నప్పుడు వానకురిసింది. మేము ఇటురాగానే వాన వెలిసింది. మేము ఉండటం నాగేంద్రునికి ఇష్టంలేదుకాబోలు అంది. ఇంతలో మళ్ళీ చినుకులు ఆరంభమయినాయి. వీధి తలుపు చప్పుడుఅయింది. ఇందాకటినుండి ఎవరో తలుపు కొడుతున్నారు. నీవైనా తీసిరా అమ్మ అని చిదంబరరావు గారు చెప్పారు.

సగం తడిసిన గుడ్డలతో మాధవపెద్ది కాళిదాసుగారి భార్య పుణ్యవతిగారిని చూచి అన్నపూర్ణమ్మ గారు మీరా రండి లోపలికి ఇంకా ఎవరో అనుకున్నాను తలుపుకొడ్తుంటే అని అన్నది. తలుపుకొట్టింది మేము కాదండీ ఆయన ఎవరో కాషాయ వస్త్రాలు కట్టుకున్నారు. వెంట ఒక అమ్మాయి వున్నది. ఆ అమ్మాయి తలుపు తీసిన అమ్మాయి పోలికలోనే వున్నది" అన్నారు పుణ్యవతి గారు. ఎవరై వుంటారు , అనసూయ

ఇక్కడే వుంది. లక్ష్మణాచార్యులుగారు ఈ సమయంలో ఇక్కడకు రారు మరి ఎవరై వుంటారు అని అన్నపూర్ణమ్మగారు అనుకుంటుండగా వర్షం పెద్దదయింది.

బిచ్చగాళ్ళు కొందరు గబగబా పంచలోకి వచ్చి, అన్నపు జోలెలు కింద పెట్టి నిలబడ్డారు. అంతలో అమ్మ వచ్చి వాళ్ళచేతులలోని సంచులు తీసుకుని గదిలో పెట్టి వంటమనిషి దగ్గరకకు వెళ్ళి ఇన్నాళ్లనుంచీ తినని అన్నం అంతా కలిపి పెట్టండి. వానవెలుస్తుంది అన్నది. వాన వెలిస్తే "నీవు భోజనం చేయటానికేమమ్మా అంటూ అన్నంపెట్టింది. జోలెల్లో తడిసిన అన్నం తీసి కుక్కలకు, పందులకూ వేసి తాను తెచ్చిన అన్నం జోలెల్లో వేసి చేతికి ఇచ్చి "నాయనా వుండండి. పులుసు ఇస్తాను తీసుకువెళ్ధరుగాని" అంటూ లోపలికి పోయి స్నానాల గదిలోన చిల్లు సత్తుగిన్నెకు సున్నిపిండి తడిపి మాటుపెట్టి అన్నానికి తగిన పులుసుపోయించుకొని, నేతిగిన్నెతెచ్చి వారి అన్నంపై వడ్డించి, పులుసు గిన్నె చేతికి ఇచ్చి" మీకు అమ్మాయిలున్నారా? వాళ్ళకు గౌనులున్నాయా? అని అడిగింది.

"లేవు తల్లీ. పిల్లలుమాత్రం ఉన్నారు." "మీకు ధోవతులు లేవా చిరిగినవి కట్టుకున్నారేమి? అంది. కడుపులోకి తిండే లేకపోతే ధోవతులు ఎట్లా వస్తాయి తల్లీ అన్నారు.

అమ్మ గబగబా దొడ్లో బాదమాకులు ఏరుతున్న చిదంబరరావుగారి దగ్గరికి వెళ్లి మీవి చినిగిపోయిన ధోవతులు, తలగుడ్డలు ఉంటేనాకు ఇస్తారూ! అని అడిగింది. "ఏమి చేసుకుంటావమ్మా" అన్నారు. తరువాత చెప్తాకాని బాగా చిరిగిపోయినవి అవసరంలేదు. అన్నది బాగా చినిగిపోయే వరకూ నేను కట్టనుకదా! అన్నారు.

అమ్మ పరుగున వెళ్ళి బీరువా మీదవున్న మూడు తలగుడ్డలు, నాలుగు ధోవతులు, ఒకకోటూ తనవి నాలుగు గౌనులు తీసుకొని వాళ్ళకు ఇచ్చి తొందరగా వెళ్ళండి. ఎవరైనా చూస్తారు అన్నది" అందులో ఒకడు ఎందుకమ్మా మీ వాళ్ళకు తెలియకుండా తెచ్చావా తెలిస్తే కొట్టరూ అన్నాడు. వాళ్ళను నేను కొట్టకుండా వుంటే చాలును వాళ్ళు నన్ను కొట్టడమే! వాన వెలుస్తున్నది. మీరు తొందరగా వెళ్ళండి" అంది. వాళ్ళముఖాలు ఆనందంతో విప్పారాయి.

మా బంగారు తల్లీ! కడుపెడు సంతానం కలిగి ఆ తల్లి కడుపు చల్లగా

పదికాలాల పాటు వర్ధిల్లాలి అంటూ వెళ్ళారు. వాన వెలిసింది. ఇల్లంతా చూచాముగా. ఇకవెద్దామండి. రైలుకట్టఅవతల నాగేంద్రుడు వెలిశాడంటున్నారు. ఒకమారు చూచిరావాలని పుణ్యవతిగారు బయలుదేరింది.

నాగేంద్రుడూ లేడు! నాగజముడూలేదు. మామూలు పామే అన్నది అన్నపూర్ణమ్మ గారు. ఏదో ఒకటిలెండి. కనబడినా మన పాపిష్టి కళ్ళకు అర్థంకావద్దూ? కనబడటానికి సుకృతం కావాలి. కనబడినా అర్థంచేసుకోవటానికి అంతకన్నా అదృష్టం కావాలి అన్నది పుణ్యవతిగారు.

అమ్మ అన్నపూర్ణమ్మగారి దగ్గరకు వచ్చి "వారికి బొట్టుపెట్టి తలా ఒకపండూ ఇవ్వమని చెప్పింది. ఆమె వినిపించుకోనట్లే వూరుకుంది.

ఎవరమ్మా ఈ అమ్మాయి? అప్పుడే మర్యాదలు కూడా తెలిసినాయి అన్నది పుణ్యవతిగారు. ఆమెకు ఒక కంట ఆనందమూ, మరోకంట ఆశ్చర్యం మెరిశాయి. చిదంబరరావుగారి కూతురు భారతీదేవి అందుకొని "ఆమెగారా? మా పెద్దమేనమామ గారి కూతురు. పెద్దనాపసాని, ఆమెకు మర్యాదలేమీ! అన్నీ తెలుస్తాయి" అంది.

ఆమె వ్యంగ్యంగానే అయినా ఎంత సత్యం పలికింది! మాటలతోనే కాలంగడచిపోయిందికానీ ఎవ్వరూ కుంకుమ భరణి పళ్ళూ తేలేదు.

అమ్మ దొడ్లోకి వెళ్లి రెండు నారింజపళ్ళు బాదంకాయలు తెచ్చి బొట్టు పెట్టి వారికి నారింజపళ్ళు ఇచ్చి "మీ పిల్లలకు తీసుకు వెళ్ళండని బాదంకాయలు వారి దోసిళ్ళలో పోసింది. వారు ముందుకు సాగినా వారి మనసులు అమ్మమీదనే లగ్నమైనాయి.

భారతీదేవి అమ్మను పిలిచి ఒక పావలా ఇచ్చి బజారుకు వెళ్ళి ఒకదారపు ఉండా, సూదీ కొనుక్కురమ్మన్నది. "నాకు లెఖ్ఖతెలీదు. వాళ్ళు ఇచ్చినట్లు తీసుకు వస్తాను" అని అమ్మ బయలుదేరింది.

దారిలో కొందరు కుంటివాళ్ళు, గ్రుడ్డివాళ్ళు కనిపించారు. ఆ డబ్బులు వారికిచ్చి ముందుకు సాగింది. బ్రహ్మాండంవారి సత్రం దగ్గరకు వచ్చేసరికి అమ్మ అన్నం పెట్టిన బిక్షకులు, మరికొందరూ కలసి భోజనం చేస్తున్నారు.

"మీరు ఇక్కడ ఉన్నారేమిటి? ఇది మీ ఇల్లా? అమ్మ అడిగింది. "మా ఇల్లుకాదమ్మా – ఇది సత్రం," సత్రం అంటే సర్వులకు స్వతంత్రమైనదనా? అంది.

ఒక కుట్టువాడు నీవు ఎవరి అమ్మాయివి" అని అడిగాడు. ఎవరు దగ్గరకు తీస్తే వారి అమ్మాయిని" అంది అమ్మ.

అంతలో గుడిగంటలు వినిపించాయి. అమ్మ మానస సరోవరంలో భావతరంగాలు ఉద్భవించాయి. దేవాలయంలోని ఒక గ్రామాన దేవాలయ నిర్మాణమూ, సర్వులకు స్వతంత్రమయిన భవన నిర్మాణమూ క్షణంలో అమ్మ మనస్సులో సంకల్పం జరిగింది. ఎక్కడెక్కడో బిక్షాటన చేసుకొని వచ్చి అందరూ కలసి ఒకచోట కూర్చుని సంతోషంగా కబుర్లు చెప్పుకుంటూ అన్నం తినేవారిని చూచి అమ్మ అమితంగా ఆనందపడింది.

అన్ని గ్రామాల్లో అందరూ, అందరి ఆస్తులు కలుపుకొని ఎవరివృత్తివారు చేసుకుంటూ ఒకచోట వుంటూ ఒకే రకంగా తింటూ ఉంటే ఎంత బాగుంటుందని" మనసారా ఆశించింది.

(దానికి నాందిగానే అమ్మ పందొమ్మిది వందల ఏభై ఆరులో జిల్లెళ్ళమూడిలో అన్నపూర్ణాలయం ప్రారంభించి జాతి, కుల, మత, వర్గ బేధం లేకుండా సర్వులకు అమ్మ ప్రసాదం అందించేలా ఏర్పాటు చేసింది.) అట్లాగే నడివీధిలో నిలబడిపోయి ఆలోచనలో, మునిగిపోయిన అమ్మను చూచి విస్మయంతో ఆగిన ఆ కుట్టాడు "ఏమిటమ్మా? ఇక్కడ నిలుచున్నావు? ఎక్కడికి వెళ్తున్నావు? అని అడిగాడు "ఏమీ లేదునాయనా" అంటూ ఉండగానే ఆ పిలుపులోని మాధుర్యంతో అతడు పరవశమౌతుండగా "సూది దారం కొనుక్కురావాలని షాపుకు వెళ్తు ఆ డబ్బులను బిడ్డలకు ఇచ్చేశాను. బిడ్డలకా? అతను ఆశ్చర్యంతో అన్నాడు. ఔను దారిలో కొందరు గుడ్డివాళ్ళు, కుంటివాళ్ళు కనపడితేనూ....వాళ్ళు నీ బిడ్డలా? ఔను. వాళ్ళు నా బిడ్డలేగా అంది. అందరూ నీ బిడ్డలా? ఎట్లా అవుతారు? ఈ అందరినీ నీవు కన్నావా? కంటేనా? అనుకంటేనూ బిడ్డలే. అట్లా కనగలిగితేచాలు (ఆ రకంగా చూడగలిగితే చాలన్న అర్థంలో అమ్మ ఆమాట వాడింది.)

అతనికి అమ్మ భావనా వైశిష్ట్యము, హృదయవైశాల్యము అర్థంగాక, చర్చచేసే సామర్థ్యం లేక ఇప్పుడే వస్తానని వెళ్ళాడు. అమ్మ ఒకషాపుకు వెళ్ళి దారపు ఉండా, సూదీ తీసుకుంది. షాపువాడు డబ్బు ఇమ్మని అడుగుతుండగా ఆకుర్రాడు వచ్చి రూపాయి కాగితం ఇచ్చాడు. ఎందుకు నాయనా నీవు ఇవ్వటం అని మెల్లగా అన్నది.

అమ్మ గబగబా వచ్చి భారతీదేవికి ఇచ్చి మళ్ళీ వీధిలోకి వచ్చి నడక సాగించింది.

ఆ అబ్బాయి ఎదురై మీ ఇల్లెక్కడ అని అడిగాడు. "ఈవూరు కాదు నాయినా అయినా మావూరుతో పనేముంది" అని అంది. "నీతో అవసరమున్నప్పుడు మీ ఊరితో కూడా అవసరముంటుందమ్మ. అక్కడ మీ ఇంట్లో ఎవరెవరు వుంటారని అడిగాడు. అంతటాచూచేవాళ్ళు ఒకరే వుంటారు. "నీవలెనే ఉంటారా? అన్నాడు. ఎట్లా చూచేవాళ్ళకు అట్లా ఉంటాడు. ఆచూపు ఇవ్వవలసింది కూడ వాడే

అమ్మ మాటలు ఒక్కొక్కటీ విన్నకొలదీ అతనిలో ఆనందవీచికలు ఉవ్వెత్తుగా లేచి అతన్ని ముంచెత్తాయి. "నీవు చిన్నపిల్లగా కనిపించినా నీభావాలు చాలా గొప్పగా ఉన్నాయమ్మా నీరూపం, నీ మాటలు, నీ గొంతులోంచీ వచ్చే శబ్దం, వాటిలో వుండే అర్థం అంతా కలిపి పంచదార చిలకలా వున్నావంటూ అమ్మచేతిని, అతని అరచేతిలోకి తీసుకొని వేళ్ళు సవరిస్తూ కన్నీరు కారుస్తూ, అరచేతిని ముద్దుపెట్టుకొని, వేళ్ళునోట్లో పెట్టుకొని చప్పరిస్తూ "ఈ వేళ్ళు ఎంత తీసి అమ్మా! నోట్లో అమృతం కురుస్తున్నది. నన్ను మర్చిపోకుండా వుంటావా అని అడిగాడు. "నేను చిన్నపిల్లను నేను మర్చేపోతాను. పెద్దవాడివి నీవు గుర్తుపెట్టుకోవాలిగాని" అంది అమ్మ. "నీపేరేమిటమ్మా! నాపేరెందుకు అంది. "నిన్ను పిలవటానికి అన్నాడు. పేరు తెలియకపోయినా మాట్లాడుకుంటూనే ఉన్నాముగా? ఇంకా పేరెందుకూ? "ఎక్కడి సమాధానాలమ్మా? అని అన్నాడు. అన్నీ ఎక్కడివో, యివీ అక్కడివే. నీ ప్రశ్నలెక్కడివో, నాసమాధానాలు అక్కడివే అంటూ ఇంటికి వెళ్తానంది.

ఒక్కసారి ఇటురామ్మా, ఎత్తుకుంటానని ప్రాధేయపూర్వకంగా అడిగాడు. "నీ దగ్గరే వున్నాగా అన్నది అమ్మ అంటుండగానే గుఱ్ఱపు బండి చప్పుడయింది. అతను ఆవైపుకు తలతిప్పాడు. అక్కడ అమ్మ. నాలుగుదిక్కులా నాలుగు రూపాల్లో అమ్మ. అతనికి ఏమీ అర్థంకాలేదు. అయోమయమైనాడు. కనులు మూసుకున్నాడు. అతని కన్నులు నిండి అశ్రువులు పొరలి అమ్మ చేతిని అభిషిక్తం చేశాయి. అతని మానసికావస్థతో తనకేమీ ప్రమేయం లేనట్లు నేను వెళ్ళి వస్తాను. ఈ వూళ్ళో వుంటే ఎప్పుడయినా కలుసుకుందామని అంది! నన్ను ఎక్కడికి రమ్మంటావు అని అడిగాడు. నీవు రావద్దు వీలుగా వుంటే నీవున్నచోటికి నేనే వస్తానంది.

అతడు గుండెనిండా ఆనందమూ కంటినిండా నీరు నింపుకొని-శరీరం తేలికయై అడుగులు తడబడుతుండగా యింటికి చేరుకున్నాడు.

★ ★ ★

# 17. దేవతను కన్నావు

అమ్మ, తాతగారు అందరూ కలసి తిరువళ్లూరు వెళ్లి వీరరాఘవస్వామి దేవాలయానికి వెళ్ళి స్వామిని దర్శించి కోనేటిలో స్నానంచేసి బెల్లంవేసి మొక్కుబడి తీర్చారు.

అమ్మ ఈతకోట్టుకుంటూ వెళ్ళి కోనేటి మధ్యలో ఉన్న మండపం మీద కూర్చున్నది. చిన్నపిల్ల కోనేటిలో పడ్డదని అందరూ భయపడి కేకలు వేశారు. అమ్మమాత్రం ఒకచోట మునిగి మండపం దగ్గర తేలి మండపం మీదకు వెళ్లికూర్చుంది. అందరూ విభ్రాంతులై చూస్తూ వుండిపోయారు. అక్కడ మూగిన జనంలో కాషాయగుడ్డలు కట్టుకున్న ఒక మనిషి సీతాపతి తాతగారి దగ్గరకు వచ్చి "మండపంలో కూర్చున్న అమ్మాయి ఎవరండీ? అని అడిగాడు. "మా అమ్మాయే అని తాతగారు చెప్పారు. "ధన్యుడివి నాయనా దేవతను కన్నావు" అంటూ చరచరా నడిచి వెళ్ళిపోయాడు.

ఆశ్చర్యానందాలు వెల్లువలవుతుండగా తాతగారు అన్నపూర్ణమ్మగారితో సాధువు అన్నమాటలు చెప్పారు. సాధువుల సంపాదన కోసం యిలాగేచెప్తుంటారు. కూతురు దేవత అని నమ్మావా? అంది ఆవిడ. "నమ్మితే" నిన్ను అడిగే పనిలేదుగా? జరిగింది చెప్తున్నాను. పక్కనే వున్న భారతీదేవి పకపకా నవ్వుతూ "బహుశ మన్నవ వారింట్లో దేవతపుట్టిందని పొంగిపోతున్నారా? మీ ఇళ్ళల్లో దేవతలు పుడతారా? పుడితే చంద్రమౌళి వారింట్లో పుట్టాలి. ఇంతకూ నీ కూతురేదని అడిగింది. మండపం దగ్గర కూర్చున్నది అన్నారు. ఇప్పుడెక్కడ ఉన్నదో, ఏ సాధువు వెంట వెళ్ళిందో" అని భారతీదేవి అన్నది.

అందరి భోజనాలు ముగిసినా అమ్మ ఇంటికిరాలేదు. మధ్యాహ్నం రెండు గంటలు దాటింది. తాతగారు వెతికి విసిగి, రాఘవరావు మామయ్యను పిలిచి వెతికి రమ్మన్నారు.

కానీ అమ్మ ఆ సత్రం వాకిట్లో ఒక గదిలో వున్న పహిల్వాన్‌తో మాట్లాడుతూ కూర్చున్నది. ఎక్కడనుంచీ వచ్చారు? యీ ఇనపగొలుసులు తెంచుతావా? అని

పహిల్వాన్-అడిగాడు. నేను ఏ గొలుసులూ తెంచలేనూ, ముడివేయలేనూ? ఈ గొలుసులు కాకవేరే గొలుసులున్నాయా? అని అడిగాడు. ఎంతవారమయినా యీ గొలుసులు తెంచగలుగుదుము గానీ గొలుసులకు ఆధారమయిన గొలుసును తెంచలేము.

అది ఎక్కడ వుంటుందమ్మా అని అడిగాడు. "అన్నింట్లో వుండి అన్నీ కాకుండా ఉంటుంది. కొంచెం వివరించి చెప్పమ్మా అన్నాడు" అది యిట్లా వివరిస్తే తెలిసేది కాదు. సమయం వస్తేనే తెలిసేది. సమయం ఎప్పుడు వస్తుందమ్మా అని అడిగాడు తెలిసి వచ్చేదిగాదు. వస్తేనే తెలిసేది.

అమ్మను చూచిన కొద్దీ, అమ్మ మాటలు విన్నకొద్దీ ఆపహిల్వాన్ మనసులో ఏవేవో భావాలు మనోహరాకృతి దాల్చాయి. వెంటనే అమ్మతో నెమలిపింఛం వున్నది. పెట్టుకుంటావా? అని అడిగాడు. ఎక్కడ పెట్టుకోవాలని అమ్మ అడిగింది. "నీ ఆకారం నీ ముందరి జడ పింఛం పెట్టుకోవడానికి అనుకూలంగా వుంది అన్నాడు. ఫించం నాకనుకూలంగా వుందా పింఛానికి నేను అనుకూలంగా ఉన్నానా. లేక రెండూ కలిస్తే యింకా దేనికైనా అనుకూలమా? అని అడిగింది. అదిగో వాడికనుకూలం అంటూ కృష్ణుని ఫొటో చూపించాడు.

"నీవు నా ఇష్టదైవానివా అమ్మా?" అని అడిగాడు. నీ ఇష్టదైవ మెవరో నాకేమి తెలుసు అంది. ఎవరోకాదు. అడుగో వాడే మురళీ కృష్ణుడు, అంటూ అమ్మను చూస్తుండగానే ఫోటోలోని దివ్య సౌందర్యం అమ్మలో తళుక్కుమన్నది. క్రమంగా చూస్తుండగానే ముమ్మూర్తులా  నా స్వామివే అయ్యావు అంటూ అమ్మ చెయ్యి పట్టుకుని తీసుకుని వెళ్ళి నెమలి పింఛం తలలో పెట్టి ఫ్లూట్ చేతికి యిచ్చి ఫొటో తీశాడు. ముద్దు ముద్దుగా అమ్మ మాటలు వింటూనే వివిధ రీతుల్లో ఫోటోలు తీసుకున్నాడు.

అంతలో అమ్మ చీరెకట్టుకుని, కొప్పు పెట్టుకుని, అన్నపు పళ్ళెం చేతబట్టుకుని వడ్డన చేస్తున్నట్లు అతనికి దృశ్యమానమయింది. ఆదృశ్యం చూడగానే అతని శరీరం పులకితమై, చేతిలోని కెమేరా క్రిందకు వదలివేసి అమ్మ పాదాలపై వ్రాలిపోయి "అమ్మ - ఆదిలక్ష్మి - జగజ్జననీ ఎక్కడనుండీ వచ్చావు? నాకీరూపం అంటే చాలా యిష్టం అంటూ వుండగానే అమ్మ మామూలు అమ్మాయిలాగా కనిపించింది.

అతడు విభ్రాంత మనస్కుడై ఖిన్నవదనుడై కూలబడిపోయాడు. అమ్మ మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటు తాతగారు వున్న గదిలోకి వచ్చింది. వెతకటానికి వెళ్ళిన తాతగారు. అమ్మా ఒకరి వెనుక ఒకరు గదిలోకి ప్రవేశించారు. అప్పుడే దీపాలు వెలిగాయి. సీతాపతిగారి హృదయంలో ఒక్కసారిగా వాత్సల్యం పొంగులు వారి అమ్మను  దగ్గరకు తీసుకొని ఎత్తుకుని గుండెలకు హత్తుకుని దించి అన్నం పెట్టండని అన్నారు.

అక్కడనుంచీ ప్రయాణమై బస్సెక్కి రాత్రి పదిన్నరకు శ్రీపురం పుత్తూరు చేరారు. ఉదయం స్నానాదులు ముగించుకొని సుబ్రహ్మణ్యేశ్వరాలయానికి వెళ్ళి అర్చనాదికాలు ముగించుకొని తీర్థప్రసాదాలు తీసుకొని విడిదికి వచ్చారు.

అమ్మ కోవెలలో వుంటానని, అక్కడ పెట్టిన ప్రసాదం తింటానంది. వాళ్ళు బయలుదేరేముందు తనకు కబురు చేయంది తను వస్తానని అమ్మ తాతగారితో చెప్పింది. సాయంకాలం అమ్మవచ్చి తాతగారి ప్రక్కలో కూర్చుంది. తాతగారు అమ్మ వీపు నిమురుతూ  వొళ్ళు కాలిపోతున్నదే అన్నారు. కాలుజాలుగా కూడా వుంది నాన్నా అంది వేడిచేసి ఉంటుందమ్మా కొంచెం మజ్జిగ త్రాగమన్నారు.

అంతలో తాతగారి మాటలు ఒక తెలుగుదేశపు డాక్టరు విని ఏమిటండీ జ్వరం అంటున్నారు. అమ్మాయిని ఇటురమ్మనండి అని చేయి చూచి మందు బిళ్ళలు ఇచ్చి  జ్వరం తీవ్రంగానే ఉన్నది. అన్నం పెట్టకండి. జ్వరం కొన్ని రోజులు ఉండవచ్చును. అన్నరు ఆ రాత్రికి తిరువళ్ళూరు వచ్చి  అక్కడనుంచీ మద్రాసు చేరి తెల్లవారు జామున ట్రెయిన్ ఎక్కి సాయంకాలానికి బాపట్ల చేరారు.

బాపట్లలో చిదంబరరావుగారింటికి వెళ్ళగానే తాతగారు అమ్మను ఎత్తుకొని మీ అన్నయ్య ఉపనయనం ఇంకా వారం రోజలున్నది. తరువాత అయినా వాడిచేత అల్లరి మాన్పిస్తావా? అని అడిగారు. “వాడి అల్లరితో వాడే అల్లరైపోతున్నాడు. మనకేమి నష్టము?” అని అమ్మ ఎదురు ప్రశ్నవేసింది.

చిదంబరరావుగారు సీతాపతిగారితో ఉపనయనంతోపాటు యాత్రా సామారాధాన కూడా చేసుకోమని సలహా ఇచ్చారు. సీతాపతిగారు మన్నవ వెళ్ళి వస్తానన్నారు. అమ్మ కూడా తనకు పనివుందని తానూ వస్తానని ఆయనతో ప్రయాణమైంది.

అమ్మ, తాతగారు రైల్వేస్టేషన్‌కు వచ్చి టికెట్టు కొనుక్కుని ఫ్లాట్‌ఫారం మీదకు రాగానే షేక్ మౌలానా సాహెబ్ కనపడి పైకం తెచ్చానని తాతగారికి అందించాడు. సీతాపతిగారు ఆశ్చర్యంతో "డబ్బు ఎక్కడిదని" అడిగారు. మీరు కబురు చేశారుకదా! తాను ఇంట్లోలేని సమయంలో మీరు ఉపనయనానికి డబ్బు తెమ్మని చెప్పారని వాళ్ళ ఆవిడ చెప్పిందన్నాడు. ఆ మనిషి ఎవరో తెలియకపోయినా కరణంగారు పంపిన మనిషే కదా! అని పైకం తెచ్చానని చెప్పాడు.

తాతగారు విస్మయసాగరంలో మునకలు వేస్తూ తాను ఎవరిచేత కబురు చేయలేదు. ఇంటికి వెళ్ళి చిదంబరరావుగార్ని అడిగారు. ఆయన కబురు చేయలేదన్నారు. ఇంకా నయం తీసుకురమ్మాన్నారంటే అతని చేతికే ఇచ్చేవాడివేగా? అంటూ అమ్మ నవ్వింది. ఆ ఇచ్చేవాడినే. వాళ్ళు ఎవరైనా కరణంగారి మీద అభిమానం కొద్దీ అన్నాడు మౌలా.

మా ఆడవాళ్ళకి రంగమ్మా తల్లి కనబడి త్వరగా డబ్బు పంపుఅన్నదట. అప్పటినుంచి మా ఆవిడ వూపిరాడనీయలేదు. అది కలగా లేక రంగమ్మగారు నిజంగా కనపడినట్లే వుంది అని చెప్పిందన్నాడు.

ఇంతకూ అతను అన్నం తిన్నాడో లేదో కనుక్కున్నారా? అని చిన్న వయస్సులోనే తన మాతృత్వానికి అవధులు లేవని తెలియచేసింది.

ఈపూటే కాదు. అన్నంతిని నాలుగు పూటలయింది. అన్నాడు మౌలా. ఉపనయనం లగ్నం పెట్టించిన నాటినుంచీ అతను అన్నం తినలేదు. శరీరం పోయినా జీవుడు ఇక్కడే వుండవచ్చుననే దృష్టాంతం కోసం కాబోలు బొంగురు పోయిన కంఠంతో అన్నారు చిదంబరరావుగారు.

పైకం అందింది కనుక ఉపనయనానికి కావలసిన వస్తువులన్నీ కొనుక్కువచ్చి పనులు మొదలుపెట్టారు. ఉపనయనానికి వచ్చిన బంధువులు "పనిలోపని పిల్లపెళ్ళికూడా చెయ్యకపోయారా అన్నారు.

అంతలో సీతాపతిగారి చెల్లెలు కనకమ్మ (బామ్మ) గారు, ఆమె భర్త బ్రహ్మాండం సుబ్బారావుగారు వారి జేష్టకుమారుడు నాగేశ్వరరావు (నాన్నగారి) ఉపనయనానికి ఆహ్వానించటానికి వచ్చారు.

అందరూ కలిసి "రేటురు" వెళ్ళారు. అమ్మకూడా వెళ్ళింది. రేటురూలో నాన్నగారి ఉపనయనం కాగానే అందరూ వెళ్ళిపోతుంటే అమ్మను నాలుగురోజులు అట్టే పెట్టుకుంటానని కనకమ్మగారు అన్నారు.

సుబ్బారావుగారు నాలుగురోజులుండమ్మా అంటూ తాను తీసుకు వెళ్ళిదింపుతానన్నారు. ఇంతలో లోకనాధం బాబాయి వచ్చి చెఱువుకు వెళ్ళి కలువ పూలు కోసుకుందామని చెప్పాడు. బంధువులంతా కోడలును అట్టే పెట్టుకున్నవే అని బామ్మను హాస్యమాడేరు.

కోడలయితేనా ఏమిటి? మేనకోడలు కదా! అదీగాక తల్లిలేని పిల్ల నాలుగు రోజులు నాదగ్గర వుంచుకుందామనుకున్నాను అని సమాధానం చెప్పింది కాని అమ్మను కోడలు చేసుకోవాలన్న భావనో కోడలు అవుతుందన్న ఆశో బామ్మకు అలివిమాలిన ఆనందం కలిగించింది.

బావను చేసుకుంటావా అంటూ అమ్మను అడిగారు అమ్మ ఏమీ మాట్లాడలేదు. నాన్నగారి తాతగారు శేషయ్యగారు వచ్చి "ఇదేమంచి సమయం యిప్పుడే పెళ్ళికూడా చేద్దామా?" అని ఆయన ఆశయాన్ని తెలియబరచారు.

అమ్మ కనక ఆ ఇంటికోడలిగా వస్తే మూడవతరం ఆడబడచు వచ్చినట్లే. 'మన్నవ' వారంతా బ్రహ్మాండంలోకి రావలసిందే అని శేషయ్యగారు అన్నారు.

లోకనాధం బాబాయీ అమ్మ చెరువుకు వెళ్ళారు. చెరువులోకి దిగుతావా అని అమ్మను అడిగాడు. తాను దిగలేనని చెప్పింది. మరి పూలు కావాలంటే ఎలా అన్నాడు. మన దగ్గర వున్న లడ్డూ ఇచ్చి కోయించుదామని అమ్మఅంది. లడ్డూ ఇవ్వటం ఎందుకు మనజీతగాడ్ని పిలిచి కోయించుదామని చెప్పాడు.

మనజీతగాళ్ళకు మన ఇంట్లో ఎలాగూ పెడ్తారు కాబట్టి తినని కొత్తవాళ్ళకు ఇచ్చి కోయించుకుందామని అమ్మ చెప్పింది.అంతలో నీళ్ళకోసం చెరువుకు వచ్చిన కుఱ్ఱవాడు వీళ్ళు అడగకుండానే చెఱువులో దిగి చెరో నాలుగు పూలూ కోసిఇచ్చాడు. లడ్డూ ఇచ్చినా తీసుకోలేదు.

అమ్మను అన్నానికి రమ్మంటే తనకు ఆకలిగాలేదని నిద్రవస్తోంది ఎక్కడ

పడుకోనని బామ్మను అడిగింది. ఎక్కడో అక్కడ పడుకో తరువాత తానువచ్చి పడుకోబెట్టుకుంటానని కనకమ్మగారు చెప్పింది.

అమ్మ పశువుల సావిడిలో ఆవుల దగ్గరగా పడుకుంది. తెల్లవారు జామున పశువులకు మేతవేయటానికి వచ్చిన జీతగాడు చూచి లోపల పడుకోబెట్టారు. పొద్దున్నే బామ్మ అమ్మకు పెరుగువేసి అన్నం కలిపి పెట్టింది. కోడలికి తెల్లవారకముందే పెరుగువేసి అన్నం పెడ్తున్నది. అందుకనే అట్టే పెట్టుకున్నట్టున్నది. ఇతరులను ఇట్లా చూస్తుందీ అని బుగ్గలు నొక్కుకున్నారు. వారి మాటలకు బామ్మ మనసు చాలా నొచ్చుకుంది. తల్లిలేని పిల్లవని తీసుకువచ్చి మాటలనిపిస్తున్నానమ్మా తిన్నదీలేదు. పెట్టిందిలేదు. ఒక పరికిణీ చొక్కా కుట్టించి తీసుకు దింపిరండని చెప్పింది.

బామ్మలోపలికి వచ్చి అమ్మతో గుడ్డలు సర్దుకోమని చెప్పింది. నాన్నగారు లోపలికి వస్తుండగా అమ్మ గుడ్డలు మూటకట్టుకుంటున్నది. నాన్నగారు తన చొక్కాలాగూ కూడా మూటలో కట్టమని ఇచ్చారు.

బాపట్లకు సుబ్బారావు తాతగారు, నాన్నగారు అమ్మ కలసి వచ్చారు అమ్మకు బట్టలు కొనటానికి తాతగారు బజారు వెళ్ళారు. గుడ్డలమూట తీసుకొని అమ్మలోపలికి వస్తుంటే "నీవు తీసుకురాకుడదా అని నాన్నగారిని చిదంబరరావుగారు అడిగారు. ఎవరి మూట వారు మోయవద్దా తాతగారూ? అన్నది అమ్మ నవ్వుతూ ఆగుడ్డలన్నీ నీవేనా అన్నారు. బావ చొక్కాలాగూ వున్నాయి" అంది. "నీవి కూడా అందులో వేసి మోయిస్తున్నావా" అని చిదంబరరావుగారు అడిగారు.

అంతలో భారతీదేవిగారు పకపకా నవ్వుతూ "దంపతులు వచ్చారే! అట్లా అంటావేమిటి? ఎవరికోసం మోస్తుంది నాన్నా? ఇదే మొదలు మొయ్యటానికి" అన్నది.

పదహారు రోజుల పండుగకాగానే సీతాపతిగారు మన్నవ వెళ్తామన్నారు. చిదంబరరావుగారు "నీవు కూడా వెళ్తావామ్మా! అని అడిగారు. తనదేమీ లేదని అందరూ కలసి తనని ఎక్కడవుంచితే అక్కడే వుంటాను. ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తానని అంది. ఆ సమాధానం విని చిదంబరరావుగారు ఆనందపడి అమ్మను ముద్దుపెట్టుకొని కోర్టుకు వెళ్ళారు.

అంతలో సుబ్బారావుగారు అమ్మకు కొత్తబట్టలు తీసుకువచ్చారు. అవి కట్టుకొని

వచ్చిన అమ్మను చూచి "మామగారు పెట్టినవా! పెళ్ళికూతురు వలె వున్నదని బంధువులందరూ హాస్యం చేశారు. అమ్మను,నాన్నగారిని చూచిన వారందరూ వారిని దంపతులుగానే వూహించుకొని సరసోక్తులతో సమ్ముగ్ధులయ్యారు.

అమ్మను, మామయ్యను తీసుకుని సీతాపతి తాతగారు మన్నవ వెళ్తూ, మరిడమ్మగారిని రమ్మని అడిగారు. "నీవు మళ్ళీ పెళ్ళిచేసుఉంటానంటే వస్తాకానీ ఎల్లకాలం ఈదటం నావల్లకాదని" చెప్పింది.

కేవలం నాకోసమే అయితే ఎవరూ అక్కరలేదు. పిల్లలున్నారు. పిల్లమరీ దిగులు పడ్తుందని, పిల్లను ఒక ఇంటిదాన్ని చేసేవరకూ జాగ్రత్తగా చూడవలసిన బాధ్యత మనదేకదా! అని సీతాపతిగారు అన్నారు. పెళ్ళి చేసుకోవటానికి సుతరామూ ఒప్పుకోలేదు. అంతలో చిదంబరరావుగారు వచ్చి మనం సంబంధం చూచి పెళ్ళి చేస్తే వాడు కాదనడులే" అన్నాడు.

మన్నవలో పులిపాక మాచమ్మగారు పూటకూళ్ళ ఇల్లునడుపుతోంది. పేరుకు పూటకుళ్ళ యిల్లు అయినా మాచమ్మ గారింటలో ఆదరణకూ ప్రేమకూ కొరతలేదు.

కోమటి హనుమంతుతో రోజూ అమ్మకు ఒక అణా కారప్పూస, ఒక చక్రకేళి ఇవ్వమని సీతాపతిగారు చెప్పారు. హనుమంతు ఎంతో శ్రద్ధాభక్తులతో అది ఒక ఆరాధనగా అమ్మకు నివేదన చేసేవాడు.

నిత్యమూ తాతగారు అమ్మను కాలువలో ఉన్న బల్లకట్టుమీదకు షికారుకు తీసుకువెళ్లేవారు. అమ్మ ఆ బల్లకట్టుమీద కూర్చుని మాలపల్లెలోని పిల్లలందర్నీ పిలిచి తాను తాసుకువెళ్ళిన కారప్పూస పంచిపెట్తుండేది.

కొన్ని రోజుల తరువాత బలకట్టుమీదకు బదులుగా దేవాలయానికి వెళ్ళేది. అమ్మ కారప్పూసను దేవాలయంలో నివేదన చేసి అర్చకుడికి కూడా పెట్టేది.

ఒకరోజు అమ్మ గర్భగుడిలోకి వెళ్ళి తలుపులు బిగించుకొని, ఉలితీసుకువచ్చి రాతిమీద అమ్మవారి చిత్రాన్ని గీసింది. విగ్రహానికి అలంకారాలన్నీ మామూలు రాతికి అమర్చి ఇప్పుడు ఏది అమ్మవారు? తానలోతానే ప్రశ్నించుకుంది. అలంకృతమైన సామాన్యశిలా? అలంకార రహితమైన శిల్పమా? అమ్మవారి కంఠాలంకృతమైన

పూలదండలను వేరుచేసింది. పూలు, దారం, చెమ్కి వేరైనాయి. నివేదన చేసిన కారప్పూసను చూచింది. అందులోని శెనగపిండి, నీళ్ళూ, ఉప్పూ, కారం, నూనె, దానిని తయారుచేయటానికి అవసరమైన పాత్రలు చేసేవాడు, అమ్మేవాడు, కొనేవాడు దృష్టిపథంలోకి వచ్చాయి. అన్నింట్లోనూ అంతర్లీనంగా అమ్మవారు సాక్షాత్కరించింది. అన్ని వస్తువులూ కలిసి అమ్మవారే? ఏ వస్తువుకు ఆవస్తువే అమ్మవారా?

అమ్మగుడి వెలుపలకు వచ్చింది. గుడివంక చూచింది. అమ్మవారు ప్రత్యక్షమయింది. ఆలయమే అమ్మవారా? ఆలయంలో అమ్మవారా? ఆలయశిఖరం వైపు దృష్టి సారించింది. అమ్మవారు కనిపించింది. రాతిలోనూ అమ్మవారే. ప్రతి ఇసుకరేణువులోనూ అమ్మవారే దృశ్యమానమయింది.

ఆకాశం వంక అవలోకించింది. నక్షత్రాలకు బదులుగా అమ్మవారి రూపాలే అనంతంగా కనిపించాయి. అమ్మవారే అనంతకోటి రూపాలుతో విశ్వమంతా తానే అయి భాసిస్తున్నదా? విశ్వరూప సందర్శనమంటే విశ్వంలోని ప్రతి అణువులోనూ, ప్రతి వస్తువును ఒకటిగా చూడటమేనా? అనుకుంటూ అమ్మవారి విగ్రహాన్ని తిరిగి మామూలుగా అలంకరించి ఇంటికి వచ్చింది.

అమ్మ మేనత్త వెంకటసుబ్బమ్మ గారికి ఆరోగ్యం సరిగా లేనందున కానుపుకు గుంటూరు తీసుకువెళ్లారు. అందుకని మరిడమ్మగారు, అమ్మ గుంటూరుకువెళ్ళటానికి బస్సుకోసం కూర్చున్నారు. ఆదారినే ఒక ఫెషాయి వెళ్తూ అమ్మను చూచి నమస్కారం చేసి వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ బరువుగా అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తున్నాడు.

గోసాయి అయింది, స్వాములవారు అయిందీ తెలియకుండా వున్నాడే అనుకున్నారు మరిడమ్మగారు. "వారిద్దరికీ బేధం తెలిస్తేగా అర్థంకావటానికి ముందు గృహస్తులకూ, స్వాములవారికీ తేడా ఏమిటి? అని అమ్మ అడిగింది. గృహస్తుఅంటే ఇల్లూ, వాకలి, పెళ్లామూ, పిల్లలూ కలిగి వుండటమూ, సన్యాసి అంటే ఆ లక్షణాలేమీ లేకపోవటం అని అన్నది మరిడమ్మగారు.

కనబడేటట్టుగానా? అమ్మ ప్రశ్నించింది. ఉంటే కనపడకుండా వుంటాయా? అన్నది ఆమె. "అమ్మ తాను తాతమ్మ దగ్గర వున్నా, ఎదో మాట్లాడుతున్నా మనస్సు

ఎక్కడో పనిచేస్తూ ఏదో తినాలనిపిస్తే అవి దొరకవు కాబట్టి మానుకున్నాను. మనసులో తినాలని వుండి బాహ్యంగా తినకపోయినా తిన్నట్లు అవదా అంటూ తాతమ్మను అడిగింది.

అటువంటివాడు ఆ గుడ్డ కట్టుకోడు గట్టివాడే కట్టుకుంటాడు అంటూ సమర్థించటానికి ప్రయత్నించింది మరిడమ్మగారు. తనకు బయలుదేరేటప్పుడు అన్నం తినాలని అనిపించకపోయినా ఇప్పుడు అనిపిస్తోంది. అట్లాగే ఎవరికైనా, ఏ విషయంలోయినా అంది అమ్మ. నీకెందుకీ ఆలోచనలని అన్నది ఆమె. అదే మానవలక్షణం తనకు తగినవి, చేయగలిగినవి తినగలిగినవి, వినగలిగినవీ మాత్రమే తలంపుకు రావని, ఏవేవో ఆలోచనలు వస్తుంటాయని, తనకు ఏది అవసరమో అంత వరకే ప్రేరణ కలిగితే బాగుండునని అమ్మ వివరించింది. ఈ రోజు అమ్మనోటి వెంట పెద్దపెద్ద మాటలు వస్తున్నాయని అనుకున్నారు మరిడమ్మగారు.

ఇంతకూ ఆవెళ్ళేది సన్యాసా, గృహస్థా? అని అమ్మ అడిగింది. సన్యాసాశ్రమంలో పతనమై పెళ్ళిచేసుకొని భార్యా, సంతానం కలిగిన వాళ్ళను గోసాయిలంటారు.

అంటే వారు గృహస్థ స్వాములవార్లా? అని అమ్మ అడిగింది. నీ ముఖం గృహస్తు స్వాములవారేమిటీ? వేరే ఆలోచన కలవాడు ఆ గుడ్డకట్టుకోడంటివే ఇందాక అని అన్నది. మరిడమ్మగారు నవ్వింది.

మనుషుల నడవడిని బట్టేగా యిన్ని తెగలు మనిషి మనస్తత్వం ఎన్నిరకాలు అనుకుంటూండగానే బస్సు వచ్చింది. అమ్మ తాతమ్మ అందులో ఎక్కికూర్చున్నారు. అందువల్ల గోసాయికి అమ్మతో మాట్లాడే అవకాశం కలగలేదు. అతడు అమ్మవంక కన్నులప్పగించి చూస్తూనే వున్నాడు. నీకింతపెద్ద ఆలోచనలేమిటమ్మ; నీ పెంపకం కదూ! అన్నది అమ్మ. నాదగ్గర ఎంతమంది పెరగలేదూ? వారంతా ఇట్లా అయ్యారా? నీవు ఆ ప్రహ్లాదుడు, ధ్రువుడు వలే అవుతావేమో!

వాళ్ళు చిన్నవయస్సులోనే ఎంతగానో ఎదిగిపోయారు. నాకు అన్నీ ఆలోచనలు, అన్నీ అనుమానాలే. ఆమె ఆలోచనా సాగరంలోకి దూకింది.

★ ★ ★

# 18. అవ్యాజానురాగం

ఆమె సాగరతీరం చేరకముందే బస్సు గుంటూరు చేరింది. మరిడమ్మ తాతమ్మ, అమ్మ బ్రాడీపేటలోని బంధువుల ఇంటికి వెళ్ళారు. ఆ ఇంటి పక్కవాటాలో చింతపల్లి రామచంద్రరావుగారు వుంటున్నారు. ఆయన తమ్ముడు గుండేలరావు ఇరవై సంవత్సరాలుగా పక్షవాతంతో మంచంలో ఉన్నారు. ఆయన నిరంతర రామనామ స్మరణతత్పరుడు.

అమ్మ సరాసరి గుండేలరావుగారి దగ్గరకు వెళ్ళింది. తన దగ్గరున్న నారింజ పండు వొలిచి ఆయన నోటికి అందించింది. మూత్ర విసర్జనతో కలుషితమైన వస్త్రాలు తీసి శుభ్రవస్త్రాలు పక్కలో పరిచింది. అయాచితంగాను, అత్యంత అనురాగంతో అమ్మచేసే ఉపచారం గుండేలరావుగారి గుండెను పులకరింపచేసింది. నిశ్చేష్టుడైన ఆయనకు ఆ క్షణంలో తన ఇష్టదైవం రఘురాముడే ప్రత్యక్షమైనాడని అనుకున్నారు. ఆనందపారవశ్యంలో ఉత్తేజంతో ఆయన "రామచంద్రా, రామచంద్రా అని బిగ్గరగా అనుకున్నారు. ఆ పిలుపు విని వారిఅన్నగారు తననే పిలుస్తున్నారనుకొని వచ్చారు. పక్కనే ఉన్న అమ్మను చూచి "ఈ అమ్మాయి ఎవరిని" ప్రశ్నించారు.

"రాముడే! రఘురాముడే" అని గుండేలరావుగారు గద్గర కంఠంతో పలికారు. నేను మీ పక్క భాగంలో వున్న శేషగిరిరావుగారి బావమరిది కూతుర్ని" అని నిర్లిప్తంగా సమాధానం చెప్పింది అమ్మ.

అప్పటినుంచీ అమ్మ రోజూ గుండేలరావుగారి దగ్గరకు వెళ్లి ఆయనకు పరిచర్యచేయసాగింది. ఆపరిచర్యలో ఆయనకు అనిర్వచనీయమైన సంతోషం, సంతృప్తి కలిగేవి. అమ్మ సన్నిధిలో వుంటే అమ్మలో నుండీ ఏదో శక్తి తనలోకి ప్రవహిస్తున్నట్లు, తననుండీ ఏదో అమ్మలోకి ప్రవహిస్తున్నట్లు ఆయనకు అనుభూతి కల్గేది.

ఆ దివ్యానుభవంతో ఆయనకు పదిహేను రోజులు గడిచాయి. ఒకనాడు అన్నగార్ని పిలిచి తన పక్కలో కూర్చోమన్నారు. అమ్మ పక్కనే కూర్చున్నది. ఒకచేత్తో అన్నగారిని మరొకచేత్తో అమ్మను పట్టుకున్నారు. అన్నయ్యా! మనపక్కలో కూర్చున్నది ఒక అమ్మాయికాదు. ఒక దివ్యశక్తి సన్నిధిలో మనం ఉన్నాం.

ఈ పదిహేను రోజులూ ఎంతో ఉదారంగా ఉపాచారం చేసింది. అమ్మతానై ఆదరించింది. రాముడై రక్షించింది. నా రాముడే నా కోసం ఇట్లా అవతరించాడురా! నారాముడికి నామీద ఎందుకింత అనుగ్రహం కలిగింది. ఆదయోపయోనిధి నాపై ఎందుకిట్లా పొంగిపొరలింది. నేనేమి చేసానని, నేనేమి యాగాలు చేసానా? తపస్సు చేసానా? నారాముని ప్రేమకు, కరుణకు కారణంలేదు. అందుకే ఈ దీనుని కొరకు రూపు దాల్చి వచ్చాడు.

అన్నయ్యా! నామాటనమ్ము నారాముడే నాకోసం ఇట్లా అవతరించాడురా! లేకపోతే నాపై అంత కరుణ ఎవరికి వుంటుంది? అసలు ఆదయార్ద్ర హృదయం నారాముడొక్కడికే వున్నది. ఆ నలినాయతలోచనాలు, ఆ విశాలఫాలభాగం, ఆ కరుణామయ దృక్కులూ, ఆ వచోమాధుర్యం, ఆ గంభీరాకృతి ఒహెూ! నారాముడే అన్నయ్యా! నిస్సందేహంగా నా రాఘురాముడే.

“అన్నయ్యా! నేనేదో చెప్తున్నానని అనుకోవద్దు. ఈ అమ్మ కేవలం శ్రీరామచంద్ర ప్రభువే. ఎవరు ఏమనుకున్నా నీవు మాత్రం ఈ అమ్మనే నమ్ముకో, మనసా పూజించుకో నాకు వ్యవధిలేదు. లేనిచో ఈరహస్యాన్ని ఎంతమందికి వెల్లడి చేసేవాడినో వేయినోళ్ళతో జగత్తంతా ఎలుగెత్తి చాటేవాడిని.”

బంధువులెవ్వరూ అమ్మను గుర్తించినట్లులేదు. అందుకే అంత అలక్ష్యము చేస్తున్నారు. అలుకుగుడ్డలో కూడ దేవుని దర్శించమని ప్రబోధించే మతంలోని మనం కనికరించి దేవుడు కనిపిస్తే అలుకు గుడ్డవలే చూస్తున్నాము.

ప్రస్తుతం ఇదే నా ఆవేదన. లోకరక్షణ కోసం వచ్చిన ఈ అమ్మను లోకమే రాక్షసియై భక్షిస్తుందేమో, ప్రేమతో పాలుపోసేయీ అమ్మ చేతిని లోకమే కాలసర్పమై కాటేస్తుందేమో, మెత్తని ఈహృదయం ఏ పాషాణాల తాకిడికి ఏమవుతుందో!...

రామచంద్రరావుగారు నిర్వీణులై వింటున్నారు. అమ్మ తనను కానట్లు నిర్లిప్తంగా కూర్చుంది. గుండేలరావుగారు మళ్ళీ అందుకున్నారు. అన్నయ్యా! ఎందుకైనా సమయం రావాలి. అమ్మపై మనకు విశ్వాసం కలగటానికైనా, అమ్మకు మనపై కరుణ కలగటానికైనా ఇందులో ఏది ముందో, ఏది వెనకో చెప్పలేము. ఏమయినా నీవు మాత్రం అమ్మ పాదాలు వదలవద్దు. అమ్మపై నమ్మకమే మనకు రక్ష.

గుండేలరావుగారు నంగిమాటలతో అన్నగారికి తన విశ్వాసాన్ని, అనుభవాన్నీ చెప్తున్నారు. ఇంతలో ఆయన కొరకు అన్నం తీసుకువచ్చారు. వెంటనే అమ్మ ఆ అన్నం అందుకుని అన్నం కలిపి గోరుముద్దలు చేసి పసిపిల్లవానికి వలే నోటికి అందించింది. గుండేలరావుగారు "దుర్లభమనుకున్న కరుణ అవ్యాజంగాను, అయాచితంగాను నాపై ప్రసృతమైంది, అదృష్టవంతుడ్ని" అంటూ కన్నులు మూసారు.

ఏనాటి పుణ్యఫలమో అమ్మ చేతి ముద్దలు తినటం, పరమాత్మచేత శుశ్రూష చేయించుకునే అదృష్టం కలగటం, భగవంతుని చేతిలోనే అంతిమ శ్వాస విడిచే మహాద్భాగ్యం ఆయనకు కలిగింది.

గుంటూరులోని ఆశ్రమంలో ఒక స్వామివారు పురాణ పఠనం చెప్పేవారు. అమ్మ క్రమం తప్పకుండా ముప్పదిరోజులు ఆ ఆశ్రమానికి వెళ్ళింది. స్వామివారు అమ్మను పలకరించలేదు. అమ్మ స్వామివారిని పలకరించలేదు.

స్వామివారు అమ్మను రోజూ చూస్తూనే ఉన్నారు. ఒక్కతే వస్తుంది ఎవ్వరితో మాట్లాడదు. ఏమీ వింటునట్లు కనిపించదు. స్వామివారి దగ్గరకు రాదు. నమస్కరించదు. ఆయనకేమీ అర్థంకాలేదు. కాని ఆకన్నుల్లో, ఆచూపుల్లో ఆముఖంలో, ఆవర్ఛస్సులో ఏదో అలౌకికత గోచరిస్తున్నది. ఆయన్ని కూడా కదిలిస్తోంది. ఆలోచనా పరంపర సాగుతున్నది. ఏవరీ అమ్మాయి? ఆయన ఒక పీఠాధిపతి. సర్వసంగపరిత్యాగి. ఆ అమ్మాయి ఎవరైతే ఆయనకేమి? అందులో ఆడపిల్లను గురించి చింతన ధర్మవిరుద్ధమయిన విషయం. సంప్రదాయం అంగీకరించని సంగతి.

కానీ ఈ ధర్మాలకు సంప్రదాయాలకూ కట్టుబడదు మనస్సు మనస్సులో రేగిన కల్లోలానికి కదిలిపోయి ముప్పదిఒకటవ రోజున "అమ్మా! నీవెవరు? అని అడిగారు. అమ్మ తానెవరో తెలియదనే తెలుసుకుందామని వచ్చానంది. స్వామివారు. మీదేకులం అని అమ్మను అడిగారు. "శుక్లశోణితాలదేదో అదే తనకులం" అని చెప్పింది. తన దగ్గరవుండమని స్వాములవారు అడిగారు.

తనవూరు, వాళ్ళనాన్న, తాతమ్మ తనకున్నారని వారిని వదిలిపెట్టి వుండలేనని, వారే గుర్తులేకపోతే మీ దగ్గరకు వచ్చేపనిలేదని తెలియచేసింది. "నీవెవరో తెలుసుకోవాలని వచ్చావుగా, మంత్రం చెప్తాను చెప్పించుకుంటావా అని స్వాములవారు

అడిగారు మంత్రమంటే ఏమిటని అమ్మ అడిగింది. కొన్ని పవరుగల అక్షరాలు కలిపి, కొన్ని వాక్యాలు చేసి వానికి కొంతశక్తి యిచ్చి అది తమబోటివారు రహస్యంగా మీకు చేప్పేది అన్నారు. అక్షరాలలో పవరుగలవి వుంటాయా? అని అడిగింది. సమాధానం చెప్పటానికి స్వామివారికి కొంత వ్యవధి అవసరమైంది. "అక్షరాలకు శక్తి మేము ఇస్తామని" స్వామీవారు చెప్పారు. ఇందాక పవరుగల అక్షరాలు అంటిరే! మీకు ఇచ్చేశక్తి ఉన్నప్పుడు గడ్డిపోచకు కూడా యివ్వవచ్చుకదా అంది.

(సంస్థ వ్యవహారాలలో మేము లేకపోతే సంస్థ నడవదనుకునేవారితో "గడ్డి పోచను నిలబెట్టి పనులు చేయిస్తానని అమ్మ ఘంటాపథంగా చెప్పింది. (అలాంటి ఒక గడ్డిపోచనే నేను. రాయటానికి నన్ను పనిముట్టుగా వాడుకుంటూ తానే నిర్వహిస్తున్నది. పోతనగారన్నట్లు" రాసెడిది భాగవతమట, రాయించెడివాడు రామభద్రుటడట అమ్మే నాచేత రాయిస్తున్నది.)

చెప్పేది వింటాను చెప్పించుకోలేను. చెప్పించుకోవటమంటే ఆయన అన్నదల్లా అనాలని, చెప్పేది వింటానని తన అభిప్రాయాన్ని తెలియచేసింది. దిగ్భ్రాంతి చెందారు స్వాములవారు. ఇంత చిన్నపిల్లకు యింతపెద్ద మాటలేమిటి అని విస్తుపోయారు ఈ వింత ప్రశ్నలు, సమాధానాల ముందు తన పాండిత్యం మూగపోతున్నదేమిటి అని ఆలోచనలో పడ్డారు.

మర్నాడు అమ్మ స్వామివారి వద్దకు వెళ్తూ గులాబీలు సంపెంగలు తీసుకు వెళ్ళింది. దారిలో సైడుకాలువ కడుగుతున్నారు. చేతిలో పూలున్నావాటి సుగంధాన్ని అణచివేసి సైడుకాలువ దుర్వాసన 'గుప్పు' మన్నది. ఏమిటి? అని ఆలోచిస్తూ అమ్మ స్వామివారి దగ్గరకు చేరింది. అందరూ ప్రసాదం తీసుకొని బయటకు వచ్చారు. అందులో ఒకరు "ఏ అమ్మాయ్ పో-పో-ఇక్కడేమీ లేదని" అన్నారు. లేనిదాని కొరకు రాలేదు. ఉన్నదాని కొరకే వచ్చాను. ఒకరు "నీకు ఉన్నది ఏమిటి? అన్నారు" మీకు లేనిది నాకు ఉన్నదీ అని సమాధానం ఇచ్చింది. ఎంత తల పొగరుగా చెప్తున్నదనకుంటుండగా స్వాములవారు లోపలనుండి కేకవేసారు ఎవరూ? అని ఎవరో అమ్మాయండీ అంటూ అమ్మ చెంపమీద చెళ్ళున కొట్టారు.

స్వామివారు లోపలకు రానివ్వమని ఆదేశించారు. అమ్మలోపలికి వెళ్ళగానే

ఏమిటమ్మా మోతమ్రోగింది అని స్వామివారు అడిగారు. రెండు కలసిన శబ్దమని అమ్మ సమాధానం ఇచ్చింది. అంటే మళ్ళీ రెట్టించారు స్వాములవారు.

అమ్మ, తన చెంపమీద తనచేతితో తానే కొట్టుకొని చూపించింది. నీవు కొట్టుకున్నాదా? ఎవరైనా కొట్టిందా అని అడిగారు. "మీరు చూడక విన్నది ఎవరో కొట్టింది. చూస్తూవిన్నది కొట్టుకున్నది" అని చెప్పింది." "నాకు సమాధానం చెప్పినవాడేనా నిన్ను కొట్టిందని అడిగారు. మీకు చెప్పటం విన్నాను కాని, మనిషిని చూడలేదంది" అమ్మ.

స్వామివారికి అమ్మతో ఏదైనా మాట్లాడాలన్నా కుతూహలం పెరిగి అమ్మా! అన్నింటిలోకి ఏది ఎక్కువ వాసన అని అడిగారు. సైదుకాలవ స్వామీ అని అమ్మ చెప్పింది. ఎందుకని అడిగితే తాను వచ్చేటప్పుడు జరిగిన సంగతి చెప్పింది. స్వామివారు నవ్వి పూలల్లోనమ్మా అన్నారు. పూలల్లో అని అడగలేదుగా. ఏది ఎక్కువ అన్నారు. నా అనుభవాన్ని చెప్పాను. అన్ని పూలల్లో ఏది మంచివాసన చెప్పమ్మా అన్నారు. ఏది ఇష్టమయిన వారికి అదిమంచి వాసన అన్నది అమ్మ.

మద్యాహ్నం నుండీ రాలేదేమమ్మా అని స్వామివారు అడిగారు. అప్పుడు వచ్చే తరుణం రాలేదు. ఇప్పుడు వచ్చింది వచ్చానని జవాబిచ్చింది. తరుణమంటే ఏమిటమ్మా స్వాములవారు అడిగారు. "తప్పించుకుందామన్నా తప్పనిది. చేద్దామన్న చేయలేనిది. వీటన్నింటినీ నడిపించేది నాయనా! ఆసంబోధన విని నివ్వెరపోయి నాయనా అంటున్నా వెందుకమ్మా అని అడిగారు. అది నావిధి అంది అమ్మ. విధి అంటే? విధానమే విధి-విధే విధానం అంది. అంటే ఏమిటమ్మా? విధి కర్త, విధానం కర్మ. అమ్మకు ఎలాగైనా మంత్రోపదేశం చేయాలని స్వామివారికి ఆసక్తి కలిగింది.

ఇంతకూ మంత్రం చెప్పించుకుంటావా లేదా అని అడిగారు. ఆయన ఇచ్చిన వివరణ సరిపోలేదని, చాలినట్లయితే చెప్పించుకునే దాన్నని అంది. పోనీ నీవు చెప్పు అని స్వామివారు అడిగారు. మంత్రం చెప్పేదా? వివరించేదా అని అడిగింది. "రెండూ అవసరంగానే ఉన్నాయమ్మా అన్నారు స్వామివారు. అయితే నేనెవరికైనా చేయాలని ప్రశ్నించింది. స్వామివారు ఆనందం పట్టలేక తన ఆశ్రమము, దాని విధులు, అవధులు మరచి అమ్మను దగ్గరకు తీసుకొని ముద్దుపెట్టుకొని" నీవు అమ్మాయివేకానీ, అమ్మగా ఉన్నావమ్మా అన్నారు మాయీ అంటే అమ్మేగా అంది.

"ఇంతకూ నీవు ఏం చదువుకుంటున్నావమ్మా అన్నారు." బళ్లోకి పోవటంలేదు. ఈ బడికే వచ్చాను ఇది ఉపాధ్యాయుడులేని బడిగా వుంది. కాని ఉపాధ్యాయుడులేని దానిని, బడి అనటం నాదే పొరపాటు" అని అంది.

ఏమైనా పెడితే తింటావా అమ్మా?" అని అడిగారు. చివాట్లు పెడితే తినను, కొడితే పడను, నన్నడిగిచేస్తే అంది. ఏపండు ఇష్టమమ్మా" అడిగారు స్వాములవారు తింటే తరగని పండు. ఎప్పుడూ తినేపండు తలపండు, సంతోషంతో స్వామివారి కళ్లు మెరిసినాయి. ఒక పండుతెచ్చి అమ్మకు యిచ్చి వెళ్ళిరా అమ్మా" అన్నారు.

మూడవరోజు సాయంత్రం అమ్మ ఆశ్రమానికి వెళ్ళింది. పురాణశ్రవణం జరుగుతున్నది. అమ్మ ఒకమూల కూర్చుంది. స్వామివారు అమ్మను గమనించారు. పురాణం నడక మందగించింది. అమ్మతో మాట్లాడాలనే కుతూహలంతో పురాణాన్ని ముందుగానే ముగించారు. అమ్మ వెళ్ళి స్వామివారికి పంపర పనసపండు ఇచ్చి నమస్కారం చేసింది. మొత్తం మీద తలపండంత పండు ఇచ్చావమ్మా అన్నారు.

స్వామివారు అమ్మను దగ్గరకు తీసుకొని తల గుండెలకు హత్తుకొని "నీవెవరువు తల్లీ! నీవు తప్పకుండా నా దగ్గర ఉండాలమ్మా!" అన్నారు. "నేనుండలేనుకానీ మీరు వుంచుకోండి నాయినా" అంది. మంత్రమంటే ఏమిటో నీవు చెప్పవూ? "నాచేత మంత్రం చెప్పించుకునే వాడవు. నాకెటా చెప్తానన్నావని" నిలదీసింది, "నామంత్రాలు వేరు నీ మంత్రాలు వేరమ్మా. నిజంగా చెప్పించుకుంటావా? అప్పుడు నీవెవరివయి చెప్పించుకుంటావు? అని అడిగింది. నీవెవరిని చేస్తే వారినవుతానని" స్వాములవారు చెప్పారు. "నిజంగా నేనెవరినని అనుకుంటున్నావు? చెప్పవూ అంటూ స్వాములవారిని అడిగింది.

బాలరాజరాజేశ్వరివమ్మా, బాలరాజరాజేశ్వరి అంటే చిన్న రాజరాజేశ్వరనా? అన్నది అమ్మ. "కాదమ్మ అన్నీ ఆమె అన్నారు. అప్పుడు రెండు మాటలెందుకని అడిగింది. స్వామివారు నవ్వుతూ "ఒకే వస్తువు అన్ని రూపాలు అయింది కనుక అన్నారు. ఏవిధంగా" అమ్మ ప్రశ్నించి తానే "అన్ని భాషలకు, అన్ని అక్షరాలకు మొట్టమొదట కాగితం మీద కలంపెట్టగానే పడేచుక్క ఏ అక్షరం? ఏ భాష? ఎందుకు ఆధారమైంది? అని అడిగింది. అదే అన్ని అక్షరాలకు పునాది. దానినే పాయింట్ అంటారు ఇంగ్లీషులో అన్నారు స్వాములవారు." అదే అన్నింటికీ ఆధారము? అంటూ

స్వామివారి కళ్ళల్లోకి చూస్తూ" అదే ఆధారమయితే కలం కాగితం ఘర్షణకదా! అదేశాస్త్రమని నీ ఉద్దేశ్యమా నాయనా? మంత్రం అంటే మనస్సు. బీజాక్షరమంటే శబ్దం యొక్క స్థాయిలే అక్షరాలు. ఇటువంటి నీ మంత్రశాస్త్రానికి పీఠిక అంటూ వుంటుందా? అని అడిగారు స్వాములవారు. "లేకేమి? ఉన్నది నాయనా అ,ఆ,ఇ,ఈ....అంఅః అదే పీఠిక" అని చెప్పింది.

స్వామివారు తియ్యని పాయసం తెప్పించి అమ్మకు ఇచ్చారు. అమ్మ తాగుతుంటే నాకూ ఇవ్వమ్మా అని అడిగారు. "ఇవ్వటానికి ఇచ్చావా? త్రాగటానికిచ్చావా? అంది అమ్మ," త్రాగటానికే ఇచ్చానుకానీ నాకు మళ్ళీ త్రాగబుద్ది పుడుతోందమ్మా" అన్నారు. మీరు నాకు ఎక్కడ్నించి తెప్పించారో చెప్పండి. మళ్ళీ తెచ్చి ఇస్తాను అన్నది అమ్మ "నేను గ్లాసుడు ఇస్తే నీవు సగం ఇవ్వలేవా? ఇంత చిన్నపిల్లకే ఇది చాలకపోతే, అంతపెద్దపొట్టకు అదిచాలుతుందా? అందుకని తెచ్చిపెడ్తానన్నానని అంది.

స్వామివారు "దానితో సరిపుచ్చుకుంటానుగా" అన్నారు. తృప్తికల మనసా? లేక కొద్దిదాన్ని ఎక్కువ చేస్తారా? అన్నది. "తృప్తి అంటే ఏమిటమ్మా?" అని స్వామివారు అడిగారు. ఇంతకంటే మరొకటి లేదనే స్థితి అన్నది అమ్మ. "అమ్మా! నీవెందుకు వచ్చావో? మీ ఊరేమిటి? నీతల్లిపేరేమిటి? అని అడిగారు. మా అమ్మపేరు ఆధారం, మనాన్నపేరు ఆకాశం అంది. వారికి వేరే పేరు, రూపంలేదా? అన్నారు.

ఈ ఉయ్యాల బల్ల ఉన్నదనుకోండి. బల్లకి గొలుసు ఆధారం. గొలుసుకు దూలమాధారం. దూలానికి భూమి ఆధారం. సర్వమూ ఆధారం మీదనే ఆధారపడి ఉన్నది. కనుక ఆధారం సర్వసాధారణమయింది.

అమ్మ ఇచ్చే సమాధానాల్లోని అర్ధగాంభీర్యానికీ, జ్ఞానసంపదకూ స్వామివారు ఆశ్చర్యచకితులై నిరవధిక ఆనందభరితులై సజలనేత్రులై రెండు గంటలసేపు పడుకుని లేచి "నీయధార్థస్థితి చెప్పమ్మా! నిన్ను మీ వారందరూ ఎట్లా చూస్తూంటారమ్మా? అని అడిగారు. "వారికి కనపడ్డట్టు చూస్తారు" అంది అమ్మ. అందరికీ ఒకేరకంగా కనపడతావా? అన్నారు. అందరి సంగతీ తరువాత చూద్దాము. మీరు చూచిన రోజునుండీ ఒకేరకంగా తోస్తున్నానా? రూపం ఒకటిగానే ఉన్నది. కానీ తోచటంలో మార్పులు ఉన్నాయికదా! అయినా అసలు అందరికీ ఒకటిగానే ఎట్లా కనబడతాను నాయనా? వారి వారి స్థితిని బట్టి చూస్తారు. మనసు కొల బద్దకదా! ఆబద్దకు

అందినంత కొలుస్తారు. గజంలో అంగుళాలు ఉన్నాయి. కానీ అంగుళంలో గజాలు లేవు అంది.

"మీ వారికి నీ స్థితి చెప్పి నిన్ను అట్టిపెట్టుకుంటానమ్మా అన్నారు." నా స్థితి అంటున్నారు. నా స్థితి తెలిసిందాయేమిటి? "స్థితి తెలియకపోయినా సంభాషణ వల్ల నేనొక స్థితిని నిర్ణయించుకున్నాను. అదీ నీవే చెప్పావుగా మనస్సు కొలతబద్ద" అని అన్నారు.

అమ్మ వెళ్ళి వస్తాను అంటూ నమస్కారం చేయబోతే స్వామివారు చేయనీయక చెయ్యి పట్టుకున్నారు. చెయ్యిపట్టుకుంటే నమస్కారం ఆగదు. చేతుల కలయిక కాదు నమస్కారమంటే అన్నది అమ్మ. ఆ మాటకు ఏమి ఆస్కారమన్నారు. సంస్కారమే ఆస్కారం. ఆసంస్కారమే మీకు నమస్కారమ చేయించింది అంటూ ఆశీర్వదించండి అంటూ ఆశీర్వచనం అడిగేదికాదు. సంప్రదాయం ప్రకారం అడిగాను. వెళ్ళి వస్తానని చెప్పింది. బరువు గుండెలతో స్వామివారు అక్కడే కూర్చున్నారు.

స్వామివారు వద్ద సెలవు తీసుకుని అమ్మ కొంతదూరం వెళ్ళేసరికి తనను ఒక మనిషి అనుసరిస్తున్నట్లు అమ్మకు సందేహం కలిగింది. వెంటనే ఆగి అతనిని చూచింది. అతను కూడా ఆగాడు. అమ్మ గబగబా నడచింది. అతడు పెద్దపెద్ద అంగలు వేశాడు. అమ్మ అగిపోయింది. అతడూ ఆగిపోయాడు. అమ్మ ఎంతకూ కదలకపోయేటప్పటికి వెనుదిరిగి అతను వెళ్ళిపోయాడు. అమ్మ ఇంటికి వెళ్ళింది.

★ ★ ★

# 19. బ్రాహ్మణత్వం

సీతాపతిగారు అమ్మను తెనాలిలో తాతగారింటి దగ్గర అలవాటు చేయాలన్న ఉద్దేశ్యంతో అమ్మకు ఇవ్వమని ఒక రూపాయి ఇచ్చి అమ్మకు చెప్పకుండా ఆయన మన్నవ వెళ్ళారు. ఆయన వెళ్ళేటప్పుడు అమ్మ నిద్రపోతున్నది. లేచిన తరువాత నాన్న ఏరి? అని అడిగింది.

ఆయనకు పని వుందని వెళ్ళారు. మీ అమ్మ లేదాయే అన్నీ చూచుకోవాలి కదా! అన్నారు వెంకటసుబ్బయ్యగారు. అమ్మమ్మ బిడ్డపోయి ఏడుస్తున్నది. నీవు ఇక్కడ ఉండకూడదా అమ్మా?" అని అడిగారు.

"మా నాన్నను వదిలిపెట్టి వుండలేను. మా నాన్నను ఇక్కడకు తీసుకువచ్చినా సరే. నన్ను అక్కడకు తీసుకువెళ్ళినా సరే" అన్నది అమ్మ. పెద్ద తల్లి అన్నపూర్ణమ్మగారు "వాళ్ళ నాన్న ఇచ్చిన రూపాయి యివ్వకపోయావా?" అన్నది. "రూపాయి నాన్న కాదుగా? రూపాయిలే అమ్మా నాన్నలయితే అమ్మలేదనుకోవటమెందుకు" అని అమ్మ అడిగింది.

అమ్మకు బెంగవల్ల జ్వరం వచ్చింది. అందులో నాన్నా తాతమ్మ అని ఒకటే కలవరించేది. అందువల్ల సీతాపతిగారికి కబురు చేసారు. మూడవరోజుకు అమ్మకు జ్వరం తగ్గింది. తగ్గిన తరువాత అమ్మ వచ్చివాకిట్లో కూర్చున్నది.

ఒక చెత్తబండీ వీధివెంట వెళ్తున్నది. పాకీవాడు బండీతోలు తున్నాడు. పాకీది వీధులు చిమ్ముతూ, తుక్కుబండిలో పోస్తూ బండీ వెంట నడుస్తున్నది. ఆమె మూడు సం॥ల పిల్లవాడు తల్లివెంట నడుస్తున్నాడు.

అదలింపబడిన ఎద్దు పరిగెత్తింది. బండిని అనుసరించి పాకీ ఆమె పరిగెత్తింది. తల్లికోసం పిల్లవాడూ పరిగెత్తాడు. కాలికి రాయి తగిలి పిల్లవాడు పడ్డాడు. వెనక్కిచూడని పాకీది ముందుకే వెళ్ళింది.

వాకిట్లో కూర్చున్న అమ్మ ఆ పిల్లవానిని చూచింది. ఆసమయంలో అక్కడ అమ్మతోపాటు అమ్మ బంధువులు అనేకులున్నారు. కానీ ఎవరి హృదయాన్ని ఆదృశ్యం స్పృశించలేకపోయింది. అంతలో ఆదారిన రెండు గేదేలు పరుగెత్తుకు వస్తున్నాయి.

అక్కడున్న వారందరూ అయ్యో అయ్యో అనుకోవటంలో పెదవులు కదిలాయిగానీ హృదయం కదిలిందోలేదో తెలియదు. శరీరాలు మాత్రం కదలలేదు. అమ్మ చివాలున లేచి శరవేగంతో పిల్లవానిని సమీపించి ఒక్క ఊపులో పిల్లవానిని లేవదీసి భుజాన వేసుకున్నది.

వెంకటసుబ్బారావుగారు (అమ్మ తాతగారు) ఆశ్చర్యంగా చూస్తూ దీనిలో భూతదయ కనపడుతున్నది. జ్వరంతో వుండి కూడా ఎంతఉద్రేకంతో పరిగెత్తిందో చూడండీ. అది మనసులోని వేగమే కాని కాళ్ళలోని వేగమా? అంటూ లోపల ఉన్న జానకమ్మ గారిని కేకవేశారు.

ఆవిడ వచ్చేలోపల అమ్మ ఆ పిల్లవానిని భుజాన వేసుకొని ఇంటికి చేరింది. దారిన పోయేవాళ్ళు అంతకుముందు పిల్లవాడు పడ్డా చూడనట్లు నటించిన వాళ్ళు పాకీదానిని కేకవేసి పిల్లవాడు పడ్డ విషయం అందించారు.

పిల్లవానిని భుజాన వేసుకొని ఇంటికి చేరిన అమ్మను చూచి వెంటకసుబ్బారావు గారు, జానకమ్మగారు, అన్నపూర్ణమ్మగారు లబలబలాడారు. ఇటువంటిది కనుకనే తల్లిని పొట్టనపెట్టుకుందని "జానకమ్మగారు అంటూ లోపలకు వస్తున్న అమ్మను వారిస్తుంది. దిగు "ఆపాడు పీడ భుజానవేసుకొని వస్తావేమిటి? స్నానం చేసి వద్దువు గాని" అని కసిరింది.

పాకీది పరుగెత్తి వచ్చి నిలుచున్నది. "అదిగో అందరమ్మ సంఘమాత వచ్చింది" అని కారుణ్యం పొంగులు వారే కన్నులతో చూస్తూ అన్నది. అన్నపూర్ణమ్మ గారు అందుకని" నీవు అందరి అమ్మవే? మహామాటలు నేర్పావు. చిన్నపిల్లకు పెద్దశోకమని అంటూ బుగ్గలు నొక్కుకుంది. ఆ, మరిడమ్మగారి పెంపకం కదూ! అని జానకమ్మగారు అవహేళన చేసింది.

పాకీది ముందుకు వచ్చి చేయిజాపి బిడ్డను పిలుస్తూ "దొరసానీ నీవు ఎత్తుకుని వచ్చావా? నా బిడ్డ ఎంత అదృష్టవంతుడమ్మా బ్రాహ్మ లెత్తుకున్నారు?" అని పరవశమయింది.

"మా బ్రాహ్మణత్వం మట్టిలో గలిసింది. ఇంకా ఏంమాట్లాడుతావులే? నీ పిల్లాడిని నీవు తీసుకుపో" అని రుసరుసలాడింది జానకమ్మగారు.

"అవును బ్రాహ్మణత్వం మట్టిలో గలిసింది కనుకనే మీరు ఆపిల్లవాడిని ఎత్తుకోలేదు" గంభీరతాపూర్ణమయిన కంఠస్వరంతో అన్నది. అమ్మమాట మిగిలిన వారి చెవిదూరకపోయినా వెంకటసుబ్బారావుగారు విని ఆశ్చర్యానందాలతో" బ్రాహ్మణత్వం ఆమెకు మాత్రమే ఉన్నట్లు తేల్చింది? అని వివరించారు.

"బ్రహ్మతత్వమే బ్రాహ్మణత్వం అని మరిడమ్మ తాతమ్మ అంటుంటే విన్నాను" అన్నది అమ్మ చిన్నగా. "మహా బ్రాహ్మణత్వం నీకుగా వచ్చిందిలే" అని అన్నపూర్ణమ్మ గారు అన్నది.

పాకీది చెయ్యి చాపి 'రా-అయ్యా' అని పిలిచింది. వాడురాకపోగా అమ్మ కంఠం గట్టిగా వాటేసుకున్నాడు. అందరూ ఆశ్చర్యపోయారు. పాకీది వెంటనే పిల్లవానితో పాటు అమ్మను కౌగిలించుకుని "నేను కాదమ్మా అమ్మను, ఈ బిడ్డకేకాదు నాకు కూడా నీవే అమ్మవు" అంది.

జానకమ్మగారు, అన్నపూర్ణమ్మగారు "ఛీఛీ అంటూ ఆదృశ్యం చూడలేక కళ్ళు మూసుకొని లోపలకు వెళ్ళారు. బలవంతంగా నయినా తీసి ఇవ్వమ్మా పిల్లవాడిని" అని వెంకటసుబ్బారావుగారు సలహా ఇచ్చారు.

"నేను వద్దన్నానా? బలవంతంగా లాగే ఓపిక నాకులేదు. నన్ను విడిచిపెట్టి వెళ్ళే ఓర్పువాడిలోలేదు. గౌను విప్పి పాకీ అమ్మాయికి ఇచ్చి దొడ్డివాకిలిన వస్తే పంచామృతాలు తాగించి స్నానం చేయించి పవిత్రం చేస్తే కానీ ఇంట్లోకి అడుగు పెట్టడానికి వీలులేదన్నారు.

గౌను విప్పి బయటపడవేసి నేను లోపలకు వెళ్ళటమెందుకు? పాకీ దానివెంట వెళతాను. పాకీ పిల్లవాడిని తాకింది నేనుగాని గుడ్డలుకావు. మైలపడ్డది నేనైతే గుడ్డలు విప్పితే మాత్రం మైల ఎక్కడకు పోతుంది. చేయివరకూ తీసి వేద్దామనుకున్నా భుజం మీద పడుకోబెట్టుకున్నాను. వాడు పొట్టకూడా తాకాడు. పైగా వాళ్ళ అమ్మ వచ్చి కౌగిలించుకుని మొత్తంతాకింది. అంతకుముందే వాడిని ఎత్తుకోవాలనే ఉద్దేశంతో మనసే మైలపడింది. రాతరాసినవాడు మైలపడి ఉంటాడు. ఇన్నిరకాల మైలలు కలిసి యీ సంఘమాతను సంఘానికి దూరంచేసాయని" వివరించింది.

వెంకటసుబ్బారావుగారు పట్టలేని ఆనందంతో అమ్మచేతిలోని పిల్లవాడిని పాకీ

దానికిచ్చి, గౌను విప్పి ఆ అమ్మయికే ఇచ్చి అమ్మను భుజాన వేసుకొని రంగమ్మ గారిని తలుచుకున్నారు. అమ్మ గౌనును తన పిల్లవానికి తొడిగి ముద్దుపెట్టుకుంటూ వెడ్తుండగా ఆమె చెయ్యి తాతగారికి తగిలింది.

“అయ్యయ్యో తాతయ్యకూడా మైలపడ్డాడు. పాకీది తాకినవాళ్ళను తాకడమే కాకుండా పాకీదే తాకింది. తాతయ్య పూర్తిగా మైలపడ్డాడంది” అమ్మ

తాతగారు అమ్మను బావిదగ్గరకు తీసుకొని వెళ్ళారు. అన్నపూర్ణమ్మగారు ఆవుపాలు, పంచితం తీసుకువచ్చింది.

అంతలో పక్కఇంటి దుర్గమ్మగారు వచ్చి “ప్రాయశ్చిత్తం అంటే దర్భకాల్చి నాలుకపై పెడతారు. కానీ చిన్న పిల్లకు మనం అవన్నీ ఎక్కడ చేయిస్తాము? అన్నది.” మీరు ఆసుపత్రిలో చేరినప్పుడు మీకు మందులిచ్చింది. నీళ్ళుపోసింది? మీకు బెడ్‌పాన్ పెట్టిందీ వారే. వారు కడగా ఉండి. కడగా ఉన్నవారికి చాకిరీ చేసి అన్నిరకాల వారికి పురుళ్ళుపోసి బొచ్చెలు పట్టినవారే మీ నోట్లో మందులు పోశారు. మీరు ఏంపెట్టి కాల్చుకున్నారు నాలుక? మీరక్తం కూడా మైలపడ్డది. దానికి ప్రాయశ్చిత్తమేమిటి? అని అడిగింది.

“బలే తగినపిల్లవేనే? అంటే “తగినపిల్లను గనుకనే అన్నారు అంది అమ్మ. ఒక్కపిల్ల బ్రతికినా బాణం వంటిది” అని ప్రశంసించింది. మునిపల్లె బుచ్చయ్యగారిని తీసుకువచ్చి తీర్థం ఇప్పించటానికి ప్రయత్నించారు. “వారికియీ సంగతి చెప్పారా? అని అమ్మ ప్రశ్నించింది. చెప్పలేదంటే అమ్మ తాగనంది.

ఇదేమి పీడ? మాయపీడ? ఇంతకూ చచ్చినదానిరాత అట్లాంటిది. కొడుకు ఆ తీరు. కూతురు ఈ తీరు” అని జానకమ్మగారు విసుక్కుంది. “చచ్చినవారికి యింకా రాతలేమిటి? అని అమ్మ అడిగింది. ఇంకా రంగమ్మ కూతురనే అంటున్నారుగా” అన్నారు జానకమ్మగారు.

ఎప్పుడూ మూగమొద్దులా ఉండేది. ఈ వేళ విజృంభించిందేమిటి? అని అన్నపూర్ణమ్మగారు విస్మయం వెలిబుచ్చింది.

జీతగాడిని పిలిచి నీళ్ళు తోడించుకుని స్నానంచేసి, అవుపంచితం త్రాగి మళ్ళీ స్నానం చేసి సాలగ్రామ తీర్థంకూడా తీసుకున్నారు తాతగారు.

అమ్మ అరటిచెట్లలో దిగంబరంగా నిలుచున్నది. తాతగారు వొళ్ళు తుడుచుకుంటూ పిల్లక్కాడా నీళ్ళుపోయండి అన్నారు. “నాకు వద్దులే అన్నది అమ్మ. అది వింటున్న జీతగాడు అంకాలు వారి సంభాషణలో పాల్గొంటూ” అమ్మాయి న్యాయంగా మాట్లాడింది. అందరికీ కోపం వచ్చింది. ఆమెకు కులబేధంలేదు. మొన్న అమ్మాయిగారు ఇడ్లీనాకు నోట్లో స్వయంగా పెట్టి తానుతింది.” అని వివరించాడు. “నీకు పెట్టిందే తిన్నాదా? అని జానకమ్మగారు అడిగింది. అట్లా తినలేదుకానీ అట్లా తినటానికి కూడా అమ్మ సందేహించేట్లుగా లేదు. అందుకని అమ్మకు కులబేధమే లేదనుకుంటున్నానని” వివరించాడు.

“కులబేధం లేదుకనుక నీ నోటిలో పెట్టానంటున్నావు. గుణబేధం వుంటే వీరి ఇంటిలోనే ఉండేదాన్ని కాదు. గుణభేదమే లేనప్పుడు కులభేదం లేకపోవడంలో విశేషమేమున్నది?” అన్నది అమ్మ అమ్మకు చెంబుడు నీళ్ళుపోసి లోపలకు తీసుకువచ్చారు. ప్రాయశ్చిత్తం లేకుండా అమ్మను లోపలకు తీసుకురావటం వారందరికీ జరిగిన ప్రాయశ్చిత్తంగా బాధపడ్డారు.

జ్వరం తగ్గటంతో అమ్మకు అన్నం పెట్టారు. అమ్మ అన్నం తినకుండా ఆలోచనా నిమగ్నమయంది.

అంతలో సీతాపతిగారు వచ్చారు. మీ నాన్న వచ్చాడుగా ఇంక విచారమెందుకు అని వెంకటసుబ్బారావుగారు అడిగారు. నాన్నకోసం కాదు విచారం. పాకీదంటే ఏమిటి? పనికిరాదనా? అని అమ్మ అడిగింది.

అంతదూరం ఆలోచించలేదు ఎప్పుడూ పాకీ అనటం తప్ప అన్నారు. “మనం విసర్జించింది శుభ్రపరిచినందుకేగా దానికింత అంటు? రాతిమీద నీళ్ళుపోసి ఆనీళ్ళు తీసుకువచ్చి సాలగ్రామ తీర్థం అంటే పవిత్రమైదా? ఆవు పంచితానికి ఉన్న పవిత్రత దానికిలేదు? కాకపోతే ఆవు పంచితం ఆరోగ్యకరం కావచ్చును. మనకడుపులో ఉన్న అశుద్ధానికి అంటులేకపోయో. దానిని బాగుచేసిన ఆతల్లికి అంటు వచ్చింది? అది బాగుచేసిన దొడ్లోకి మళ్ళీ వెళుతూనే ఉన్నాముగదా అసలు అంటు అంటే ఏమిటి? అంటు అంటే వదలనటువంటిదని నా ఉద్దేశం అన్నది.

అంటు అంటే దాదాపు ఒకమాటులాంటిదని నాభావం. చిల్లువున్న గిన్నెకు మాటుపెట్టి వాడుకుంటుంటాము. రంధ్రం కనిపించదు కానీ ఆమాటు పెట్టిన

ప్రదేశంలో ప్రత్యేకత కనపడుతూనే ఉంటుంది. గిన్నె ఉపయోగపడుతూనూ ఉంటుంది. అట్లాగే ఒకలోపాన్ని మరొకదాని చేత మరుగుపెట్టి దాన్ని ఉపయోగించుకుంటుంటాము.

మల విసర్జనకు దూరం పోలేము. నడవలేకనేగా యీదొడ్లు ఏర్పాటు చేసుకున్నది. కొందరి జీవనోపాధి క్రమేణా కొందరికి కులవృత్తి అయింది. మనకు పనికివచ్చే పాకీతనానికి, మనం పనికిరాని తనాన్ని అంటగడుతున్నాము.

వెంకటసుబ్బారావుగారు అమ్మ వీపుమీద చెయ్యివేసి వెన్నురాస్తూ ఒక చేత్తో చెక్కిళ్ళు సవరిస్తూ ఉండగా కన్నీళ్ళు స్రవించాయి. నిన్ను ఇక్కడ వుంచుకొని తల్లిలేని కొరతలేకుండా చూచుకొని పెళ్ళిచేసి తృప్తిపడదామని వుంది. మీ బాధ్యతలు లేకపోతే ఆయన పెళ్ళి చేసుకుంటాడుట. మీ అన్నయ్యకు సంబంధాలు వస్తున్నాయి వాడికి చేసి మీ నాన్నా చేసుకుంటాడుట.

ఏది ఎట్లా వున్నా ఇందాక ఇది మాట్లాడినమాటలు దీనికి ఎక్కడి నుండీ వచ్చాయి? ఆశ్చర్యంగా ఉన్నదని అన్నపూర్ణమ్మగారు అంది. ఆశ్చర్యమేముందిలే చిదంబరరావుగారి దగ్గరపెరగటం కొంత, మరిడమ్మగారి సంస్కారం కొంత అన్నది జానకమ్మగారు.

విధానమనేది వ్యక్తి సంబంధించినదేనా? అమ్మ ప్రశ్నించింది. "నీతో మాట్లాడలేము తల్లీ. మనం అడిగినప్పుడల్లా మాట్లాడదు. తనకు ఇష్టమయినప్పుడే మాట్లాడుతుంది. మొన్న చిదంబరం "అమ్మాయి మాట్లాడేదల్లా వింటూ అర్థం చేసుకోమన్నాడు. ఏది ఎట్లా వున్నా మన దగ్గర పెరిగితే ఆ ఉన్న బంగారం పోకుండా చూస్తాము. ఏ సంసారాల్లో పెరిగినా ఆ బంగారం వదిలిస్తారు" అని అన్నపూర్ణమ్మగారు అన్నారు.

"నా బంగారం ఎక్కడున్నాపోయేది కాదులే. ఎవరూ వున్నది వదిలించలేరు. ఇదినాకేకాదు. ఎవరికైనాయింతే" అన్నది అమ్మ. ఇంతలో సీతాపతిగారు వచ్చి రెండు రోజుల్లో పిల్లను తీసుకువెళ్తానన్నారు. అమ్మ, మరిడమ్మగారు. వెంకటసుబ్బారావుగారు సీతాపతిగారు బాపట్ల వెళ్లారు. కొర్నెపాడు నుంచీ రాఘవరావు మామయ్యకు సంబంధం వచ్చింది. పెళ్ళి నిశ్చయమై లగ్నం నిర్ణయమయింది.

రాఘవరావు మామయ్య పెళ్ళి పదిరోజులుందనగా సీతాపతిగారు గ్రామంలో పెండ్లికి ఆహ్వానించడానికి బయలుదేరారు. సీతాపతిగారు కొన్ని ఇళ్ళలో పిలిచారు. కొన్ని ఇళ్ళు వదిలివేశారు. కొన్ని ఇళ్ళలో అందర్ని పిలిచారు. కొన్ని ఇళ్ళలో కొందరిని మాత్రమే పిలిచారు. అమ్మకు ఆ ఆహ్వానవిసర్జనుల ఆంతర్యం అవగాహన కానట్లు అడిగింది.

"నాన్నా కొన్ని ఇళ్ళను, కొంతమంది మనుషులనూ వదిలివేశావేమి? అని అడిగింది. బ్రాహ్మల్లో అందరినీ పిలిచాను. ఇతర కులాల్లో ముఖ్యమయినవారిని మాత్రమే పిలిచాను అన్నారు. అదేమిటి? పిలచేదేదో అందర్ని సమంగా పిలువమంది. మనవాళ్ళందర్నీ పిలిచాగా అమ్మా" అన్నారు. మనవాళ్ళంటే గుర్తు ఏమిటి? మనం అనుకోవటమేగా అంది. అందరికీ శుభలేఖలు పంపించి బాపట్ల బయలుదేరారు.

బాపట్ల చేరిన మర్నాడే మామయ్యను పెళ్లికొడుకును చేశారు. పెళ్ళికి మన్నవ నుండి దాదాపు సగం జనం వచ్చారు. పెమ్మరాజు పిచ్చయ్యగారు వర్షాలయినప్పటికీ కొర్నెపాడులో ఎంతో మర్యాదగా, సలాంఛనంగా అయిదురోజుల వివాహం చేసారు. అత్తగారి లాంఛనాలు అమ్మకే ఇచ్చారు.

పదహారు రోజుల పండుగ కాగానే సీతాపతిగారు, అమ్మా మన్నవ వెళ్ళారు. సీతాపతిగారికి పెళ్లి సంబంధం చూసేందుకు మరిడమ్మగారు బాపట్లలోనే వుండిపోయింది.

మన్నవలో సీతాపతిగారు, అమ్మా మాచమ్మగారింట్లో భోంచేసేవారు. మాచమ్మగారే స్నానం చేయించి, జడవేసేవారు. తాతగారు కృష్ణకాలవకు స్నానానికి వెళ్ళేవారు. ఒక్కో రోజు ఏదో ఆలోచించుకుంటూ తొమ్మిదిగంటలకు కానీ తిరిగి వచ్చేవారుకాదు. తాతగారి కోసం ఎదురు చూస్తూ అమ్మ కూర్చుండేది. ఒకరోజు మధ్యాహ్నం పన్నెండు గంటలయినా రాలేదు. ఆయనకోసం ఎదురు చూచి అమ్మ కృష్ణకాలవకు బయలుదేరింది. దారిలో నీలకంఠం కారపూస, పకోడీల తట్టనెత్తిన బెట్టుకొని వెళ్తూ" ఎవరి అమ్మాయివీ పకోడీలు కావాలా అని అడిగాడు. ఎన్నిమార్లు అడిగినా జవాబు చెప్పకపోయేటప్పటికి నీలకంఠానికి విసుగువేసి ఈ తట్ట నీ నెత్తిన పెడితినా తిక్కకుదురుతుంది అన్నాడు.

ఎన్ని మార్లడిగినా పలకవేమని గడ్డం పట్టుకుని తలపైకి యెత్తాడు. అమ్మను గుర్తించి ఆశ్చర్యపోయాడు. తట్టక్రిందకు దించి అమ్మను భుజంమీద ఎక్కించుకొని తట్టనెత్తినపెట్టుకున్నాడు. అమ్మను తట్టలో కారప్పూస తీసుకు తినమన్నాడు.

కొందరు బాటసారులు వీరికి ఎదురుగా వచ్చారు. అందులో ఒక అతను అమ్మాయిని భుజం ఎక్కించుకున్నాడు. "నీవు నన్ను ఎత్తుకున్నట్లు ఆ అమ్మాయిని ఎత్తుకున్నాడు గాని నెత్తిన కారప్పూస తట్టలేదు. మనంకొంచెం పెడదామా" అని అడిగింది. అతను ఏమీ జవాబివ్వలేదు. అమ్మ క్రిందకు దిగుతానన్నది. నీలకంఠం దించాడు. అమ్మ ముందుకు నడుస్తుంటే వెనక్కిపిలిచి తట్టలోని కారప్పూస తీసి అమ్మ వొళ్లో పోసాడు. ఆకారప్పూస తీసివాళ్ళ అమ్మాయికి పెట్టమని దోసెట్లో పోసి తిరిగి వచ్చింది.

నీలకంఠం అది చూచి ఆశ్చర్యపడి "బలే అమ్మాయివమ్మాయ్" అన్నాడు. "నేను అమ్మనా? అమ్మాయినా? అని అడిగింది. పెట్టటం చూస్తే అమ్మవలే ఉ న్నావు. వయస్సును బట్టి చిన్నపిల్లవూ, అంటే గుణానికి అమ్మవు, రూపానికి అమ్మాయివి అన్నాడు." బాగుంది నీ సమర్ధన" అని అమ్మ నవ్వింది. కారప్పూస అమ్మవొళ్ళో పోస్తూ పకోడీలు పెట్టమంటావా అని అడిగాడు. "ఏది పెట్టినా తింటాను. తినటం ఎట్లా వున్నా తీసుకుంటానని చెప్పింది. మళ్ళీ ఎవరికైనా పెట్టటానికా అన్నాడు. "నీవు నాకు పెట్టుకుంటే నీకు ఎంత తృప్తో. ఎవరికైనా పెట్టుకుంటే నాకు అంత తృప్తి" అంది.

అమ్మ తనకు పెట్టిన కారప్పూస పకోడీలు కాలవదగ్గర ఆడుకునే పిల్లలందరికీ పంచింది. వాళ్లు తింటున్నప్పుడు వాళ్లముఖాల్లో ద్యోతకమైన ఆనందదీప్తిని చూస్తూ కొన్నిక్షణాలు గడిపి తాతగారి కోసం చూచింది. ఆయన కనిపించలేదు. నీలకంఠంతో కలిసి వెళ్లవచ్చునని అక్కడే కూర్చుంది.

సాయంకాలం నాలుగు అయింది. అమ్మ కాలవలో స్నానం చేస్తున్నది. సీతాపతిగారు జూపూడి నుండీ తిరిగివస్తుండగా నీలకంఠం 'కరణంగారు' అని కేకలు వేశాడు. తాతగారు రాగానే కాలవలో స్నానం చేసే అమ్మను చూపించాడు. స్నానం చేస్తున్న అమ్మను చూచిన తాతగారికి భయం కలిగిందీ, కోపం వచ్చింది ఆ కోపంతో నీలకంఠంపై కాలవలోకి ఎందుకు దిగనిచ్చావని అరిచాడు.

అసలెందుకు వచ్చిందిక్కడకు అనుకుంటూ ఎక్కు ఒద్దుకు అంటూ అమ్మను ,కసురుతూ, చెయ్యి అందించారు తాతగారు ఎందుకు ఒంటరిగా ఇక్కడకు వచ్చావన్నారు. మామూలుగా తాతగారు వచ్చేవేళ దాటటం వల్ల తాను వచ్చానని అంది. అన్నం తిన్నావా అని అడిగారు. ఆయన లేకుండా వారింటికి వెళ్ళటం అలవాటు లేదని అంది. అలవాటేమిటి నీవు వెళితే వారు పెట్టమంటారా" అన్నారు. అమ్మ ఇక మాట్లాడక విప్పిన గౌనుతో ఒళ్లుతుడుచుకొని ఆగౌనే తొడుక్కున్నది.

తాతగారు, అమ్మా, నీలకంఠం కలిసి ఊళ్ళోకి వచ్చారు. తాతగారు అమ్మ కలిసి మాచమ్మగారింటికి వెళ్లారు, భోజనం చేశారా? అని మాచమ్మగారు అడిగింది. జరిగిన విషయం తాతగారు వివరించారు.

"పిల్లయినా రాగూడదా? నా పిల్లవలే చూచుకుంటున్నాను గదా? అని, నేను నిన్ను బాగా చూడటంలేదా? అని మాచమ్మ గారు అడిగింది." బాగా చూడని వారు అంటూ ఉంటేగా నీవు నన్ను బాగా చూడటానికి" అన్నది అమ్మ.

మరిడమ్మగారు వచ్చిందాకా నీవు వున్నా లేకపోయినా అమ్మాయిని వచ్చి స్నానం చేసి జడవేయించుకొని అన్నంతిని వెళ్ళమని చెప్పు లేనిదాన్ని కనుక డబ్బుతీసుకుంటున్నాను అని మాచమ్మగారు అంది.

రూపాయిలకు బజారులో దొరకనిది ఆదరణ అదే ఈనాడు రుచిస్తున్నది అని తాతగారు అన్నారు. మాచమ్మగారు పెరుగు తీసుకువచ్చి యిద్దరికి వడ్డించింది తృప్తిగా.

అమ్మ తన విస్తర్లో మాచమ్మగారు కుమ్మరించిన పెరుగువంక చూస్తూ మాచమ్మగారితో ఆదెయ్యతాతయ్యను భోజనానికి పిలవరాదూ? రేపటినుంచీ ఆయనతోనే తింటాను. మానాన్నతో తిననని అంది.

"ఆయన ఎప్పుడు బడితే అప్పుడు రాడమ్మా మధ్యాహ్నం ఒంటిగంట దాకారాడు" అన్నది మాచమ్మగారు రాత్రి ఎన్నిగంటలకు తింటాడని" అడిగింది. పన్నెండు అవుతుంది. అన్నది ఆమె. అంతసేపు నీవూ అన్నం తినకుండా వుంటావా అని అమ్మ అడిగింది. అంతసేపు వుండలేనని తాను తిన్న తరువాతే ఆయన తింటారని చెప్పింది. ఆయన తిన్న తరువాత ఆయన విస్తట్లో తినాలికదా! అమ్మ అన్నది. ఆదెయ్య తాతయ్యకు పెరుగు ఇష్టమేనా అని అడిగింది. ఆయన వేసుకోరు అన్నది

మాచమ్మగారు. తనకు పెరుగు సహించదంటూ అమ్మ కంచం అవతలకు నెట్టి చెయ్యి కడుక్కుంది.

సీతాపతిగారు భోజనం అయిన తరువాత వెళ్దామంటే తాను ఆదెయ్యగారి దగ్గర పడుకుంటానంది అమ్మ. ఆ మాటవిని ఆదెయ్యగారు సంతోషపడి తన పొట్టమీద పడుకోబెట్టుకొని ఇక్కడే పడుకో అమ్మ. ఇంతకన్నా నాకు కావలసినదేమిటి? అని అన్నారు.

కాలంగడిచిపోతోంది కానీ ఆదెయ్యగారికి భోజనానికి పిలుపురాలేదు. మాచమ్మగారు తృప్తిగా అన్నం తిని హాయిగా నిద్రపోతున్నది ఆదెయ్యగారు లేచి మజ్జిగ త్రాగి వచ్చి పడుకున్నారు. అది గమనించిన అమ్మ "తాతగారూ మీరు రెండు పూటలా భోజనం చేయారా? ఎప్పుడూ తినరా? ఇవాళేనా?" అని అడిగింది. "రోజూ అంతేనని ఆయన సమాధానమిచ్చారు. "ఎన్ని సంవత్సరాలనుండీ?" అని అమ్మ అడిగింది. అవన్నీ ఇప్పుడు ఎందుకులే అమ్మ అన్నాడు.

చటుక్కున అమ్మలేచి మాచమ్మగారి దగ్గరకు వెళ్ళి "పన్నెండు గంటలప్పుడు తాతగారు అన్నం తింటారంటివే. ఇప్పుడు పన్నెండు దాటిందిగా. మరి తినలేదేమని అడిగింది. ఎప్పుడయినా ఒకరోజున తినరుగానీ మామూలుగా తింటారమ్మా" అని చెప్పింది మాచమ్మగారు ఆ తినని రోజు ఏదైనా వారం పట్టింపా అన్నది అమ్మ ఏమీలేవు. "ఏవారాలూ దేముడికివ్వకుండా అన్నివారాలు నీకేయిచ్చాడన్నమాట. నీకు మొక్కుకున్నారా తాతగారు." అన్నది అమ్మ. చమత్కారంగా అంటున్నదనుకుని మాచమ్మగారు పకపకా నవ్వింది.

అమ్మ గంభీరంగా "నీకు నవ్వు ఎలా వస్తున్నది? సిగ్గులేని ముఖానికి నవ్వే సింగారమట" అన్నది. ఆకంఠంలోని కఠిన్యమూ, ఆస్వరంలోని గాంభీర్యమూ, ఆ ముఖంలోని అరుణిమా మాచమ్మగారిని క్షణంలో భీతమనస్కను చేశాయి. ఇక్కడ ఇలా పడుకోబోతే తాతగారి కాళ్ళురాయచ్చు కదా! అని మాచమ్మగారితో అమ్మ అంది. ఎక్కడ చూశావలా అని అడిగింది ఆమె. ప్రతి ఇంట్లో జరుగుతునే వుంటుంది. కాని ఇక్కడ మాత్రం అసహజంగా వున్నది"

చిట్టితల్లీ యింకా నిద్రపోకుండా వున్నావా? రంగమ్మ తల్లికి నేనంటే ఎంతో

ప్రేమ అటువంటి వాళ్ళు ఊరికి పదిమంది వుంటే ఎంత బాగుంటుందో! అని అన్నారు. అలాంటి వాళ్ళు ఎక్కువ కాలం వుండరుగా" అమ్మ నిర్లిప్తంగా అన్నది.

"తాతగారూ మీ సహనం వంటి సహనం కావాలందరికీ, సహనమంటే బాధలుంటేగా సహనం తెలిసేది. "సహనమనే దేవతను ఆరాధించాలంటే బాధలనే పూజాద్రవ్యాలు కావాలి" అన్నది అమ్మ. అందుకే భారతంలో కుంతీదేవి, ధర్మరాజాదులు పట్టాభిషిక్తులు అయిన తరువాత శ్రీకృష్ణుని తనకు బాధలు కలుగచేయమంటుంది. బాధలు లేకపోతే భగవంతుడైన నిన్ను మార్చేపోతానేమో అన్నది.

ఆదెయ్య గారికి ఆమాటల్లో అమ్మ కంఠంకాక ఎవరో ఒక మహర్షి అనుభవ పూర్వకమయిన సత్యం పలుకుతున్న విధానం స్ఫురించింది. ఆశ్చర్యానందాలు ఆదెయ్యగారిని కొద్ది క్షణాలు ఉక్కిరిబిక్కిరి చేసినా వెంటనే తేరుకుని "తెల్లవారిందాకా యిక్కడనే పడుకుంటావా? అమ్మా! అన్నారు. కొన్ని రోజులపాటు మీ దగ్గరే పడుకుంటాను అన్నది అమ్మ.

ఒకరోజు రాత్రి ఆదెయ్యగారి పక్కలో అమ్మ పడుకున్నది. పక్కగదిలో మాచమ్మగారు పడుకున్నది. ఉన్నట్లుండి అమ్మ మాచమ్మ గారి ఎదురుగా వచ్చి నిలుచున్నది. ఎంతో ముద్దుగా ఉన్న అమ్మను చూచి మాచమ్మగారు చేతులు చాపింది. అంతలోనే అమ్మ విరాడ్రూపంతో సాక్షాత్కరించింది. మాచమ్మగారు పరవశురాలైంది. క్షణంలో అమ్మ అదృశ్యమయింది. మాచమ్మగారు భయకంపితయై, శరీరం స్వేదసిక్తమయింది. లోగడ అమ్మ ఇచ్చిన సలహా శ్రవణేంద్రియాల్లో ప్రతిధ్వనించ సాగింది.

మాచమ్మగారు కొన్ని నిమిషాలు కొయ్యబారి నిశ్చేష్ఠ అయింది. అంతలో అమ్మ వచ్చి ఆమె చేతిని స్పర్శించింది. ఆస్పర్శ, ఆ మృదుకర స్పర్శ తనకు పాముకాటువలేతోచి భయపడి కెవ్వున కేకేసింది. అమ్మ తన చేతిని మాచమ్మగారి వెన్ను మీదకు పోనిచ్చి నిమరటం ఆరంభించింది. మాచమ్మగారు కొంత ఉపశమించి గుండెలో రేగిన దడ ఏమాత్రం అణగలేదు.

అంతలో మళ్ళీ ఎదురుగా అమ్మ. ఎప్పుడూ చల్లని వెన్నెలను చిందే ఆ

నయనద్వయం తనపై చంద్రనిప్పులను కుమ్మరిస్తున్నది? ఆ బడబాగ్నిలో తాను మాడి మసిఅయిపోతుందా? ఆ ఆలోచనతో శరీరం దగ్ధమై పోతున్నట్లే అనిపించింది. అంతలో మళ్లీ అదే చల్లని చెయ్యి తన శీర్షోపరిభాగంపై వ్రాలింది. మళ్ళీ ఏదో మేనుకు, మనస్సుకూ చల్లదనం!

కాని మాచమ్మగారి హృదయాకాశం లోపలేవో బొమ్మలు అన్నీ తన గత చరిత్రకు సంబంధించినవే. ఒక్కసారిగా మాచమ్మగారి మనస్సులో ఏవో నిర్ణయాలు వెంటవెంటనే జరిగాయి. కన్నులు శ్రావణమేఘాలై పక్కను తడిపేశాయి.

జరిగినదంగా ఏమిటి? యధార్థమా? భ్రమా పరమేశ్వర విలాసమా? అమ్మాయి అనసూయ ఏమిటి ఇవ్వాళ తనతో ఇట్లా ఆడుకుంటున్నది? యీ అమ్మాయి ఏమిటి తనమనస్సు మీదా, శరీరం మీదా యింత అధికారం నెరపుతున్నది. చిన్నపిల్ల అయిన అనసూయ ముందు తాను ఏమిటి అల్పాతి అల్పమైపోతున్నదీ? ఏమైనా అనసూయలో ఏదో అతిమానుషశక్తి ప్రతిభావంతంగా ఉంది అనుకుంటూ ఆదెయ్యగారి పక్కవద్దకు వెళ్ళింది. ఆయన గాఢ సుషుప్తిలో ఉన్నారు. పక్కనే అమ్మకుడా పడుకొని వుంది. కన్నులు ముకుళించిన కమలాల వలె కమనీయంగా ఉన్నాయి. నుదురు చంద్ర వంకవలె మనోజ్ఞంగా ఉన్నది. ముఖం అమాయికంగా నిర్వికారంగా ఉన్నది.

అప్రయత్నంగా మాచమ్మగారు మంచం ప్రక్కనే అమ్మ ముఖంలోని చూస్తూ ఆదెయ్యగారి పాదాలపై చెయ్యివేసింది. ఆస్పర్శకు ఆదెయ్యగారు ఉలిక్కిపడి లేచారు. కనుల ఎదుట తలవంచుకుని అతివినమ్రయై మాచమ్మగారు కనుపించింది. అమ్మకు అపకారం చేయటానికి వచ్చిందన్న సంశయంతో ఆదెయ్యగారు మాచమ్మగారిని ఎందుకు వచ్చావని అడిగారు. ఎన్నడూ ఆదెయ్యగారి కంఠంలో వినిపించని కర్కశత్వానికి మాచమ్మగారు విస్మితురాలయింది.

ఆదెయ్యగారు మాచమ్మగారి కంటివెంట కురిసే అశ్రుధారులకు ఆశ్చర్యపోయారు. "ఏమిటి? ఎందుకూ? అని ఆదెయ్యగారు అడుగుతుండగానే మాచమ్మగారు ఆదెయ్యగారి పాదాలమీద వ్రాలి" నన్ను క్షమించండి నేనెంతో అపచారం చేశాను. ఇన్నాళ్ళు చీకటిలో గడిపేశాను. ఈ క్షణానే నా కళ్ళు తెరుచుకున్నాయి? అని ఆమె విన్నవించుకుంది "ఇందుకు యీ బుజ్జితల్లే కారణం" అని మాచమ్మగారు

అమ్మను చూపిస్తే" మనకు యీమేలు చేయటం కోసమే అమ్మ మన ఇంట్లో మకాం చేసిందన్నమాట" అన్నారు ఆదెయ్యగారు.

మనకు మేలు చేయటానికి అమ్మ ఇక్కడే వుండవలసిన అవసరంలేదు. కొన్ని క్షణాల్లో నాకు కలిగిన అనుభవం మీకు వివరించలేను. వివరించినా మీకు అర్ధంకాదు. మానసికానుభూతి ఎవరిదివారిదే. ఒకరిది ఒకరు పంచుకోలేరు. దీనికి సాక్షం ఉండదుగా ఋజువు వుండదు. ఇప్పుడు నా మనసు వాన కురిసి వెలసిన ఆకాశంవలె నిర్మలంగా వున్నది. ఏది ఏమైనా అమ్మ నా మనస్సుతో తన ఇష్టం వచ్చినట్టు ఆడుకున్నది. నా మనస్సుతో ఆడుకునే శక్తి ఎవరి మనస్సును మాత్రం ఆడించలేదు? ఆమె అందరినీ ఆడించగలదని తోస్తున్నది. అమ్మ లేచి కూర్చుని ప్రసన్నవదనంతో వారిరువురిని వీక్షించింది. అమ్మ మోములోని దరహాస చంద్రికలకు మాచమ్మగారు, ఆదెయ్యగారు పరవశులయ్యారు.

★ ★ ★

# 20. ఇష్టదైవం

సీతాపతిగారికి (అమ్మ నాన్నగారు) పునర్వివాహం తప్పని సరి అయింది. అమ్మను పెండ్లికి రావద్దని బంధువులు అన్నారు. ఆమాటకు అమ్మ "నేను ఇక్కడే వుంటాను. నీవు వెళ్లునాన్నా" అని బతిమాలింది. ఫరవాలేదమ్మా ఏది అయితే, అది అవుతుంది నీవుకూడా రా" అన్నారు తాతగారు ప్రేమే అన్నింటిని జయించగా

వివాహం రాత్రి 8.30 ని॥లకు సరిగా అమ్మతల్లి రంగమ్మగారు చనిపోయిన సమయం అదే. మాసం తేది నక్షత్రం కూడా అదే. వివాహం అతినిరాడంబరంగా జరిగింది.

చిదంబరరావుగారు తల్లి నరసమ్మగారికి మతిస్థిమితంలేదు. ఆరాత్రి ఏమీ తెలియని స్థితిలో ఆమె యిల్లు విడచి వీధిని చేరింది. సరిగా అదే సమయానికి అమ్మ "తాతమ్మ, తాతమ్మ" అని కేకలు వేసింది. నరసమ్మగారికి ఆ పిలుపు వినపడగానే ఒక మహోజ్వల కాంతిరేఖ కనపడ్డది. వెంటనే స్పృహవచ్చింది. "ఇది ఏమిటి? నేను ఇక్కడకు ఎందుకు వచ్చాననుకుంటూ" లోపలకు వస్తూ గడపలో పడిపోయింది. ఆ పడటం సాష్టాంగపడినట్లయి, చేతులు ఎదురుగా నిలుచున్న అమ్మ పాదాలపై వ్రాలాయి. నరసమ్మగారు మరణించింది

అమ్మకు ఏడు సంవత్సరాలు నిండి ఎనిమిదవ సంవత్సరం వచ్చింది. తాతగారింట్లో రెండు పెళ్ళిళ్ళు, ఉపనయనం కావటంతో డబ్బుకు ఇబ్బంది కలిగింది. ధాన్యం ధర తగ్గటంతో ఎంత ధాన్యం అమ్మినా డబ్బేమీ కనపడటంలేదు. అట్టి పరిస్థితులలో సీతాపతిగారి చెల్లెలు కనకమ్మగారి భర్త అయిన బ్రహ్మాండం సుబ్బరావుగారికి జబ్బుచేసి బాపట్ల వచ్చినట్లు తెలిసింది. చెల్లెలుకు సహాయం చేయాలని ఎంతగామనస్సు క్షోభపడుతున్నా ఆర్థిక పరిస్థితి అనుకూలించనందున అమ్మ తండ్రి సీతాపతిగారు విచారగ్రస్తులయ్యారు.

అట్టి క్లిష్ట సమయంలో జూపూడి గ్రామకాపరస్తులు గుండిమెడ జానకిరామయ్యగారు తాతగారికి మూడువేల రూపాయలు ఋణంగా ఇచ్చారు. ఆయన నగలో, పొలాల్లో, ఇళ్ళో తాకట్టు పెట్టుకొని డబ్బు ఇచ్చేవారు. అలాంటిది

సీతాపతిగారికి తాకట్టు లేకనే అప్పు ఇచ్చారు. అది తాతగారి అదృష్టం అనుకుంటూ అంతగా జానకిరామయ్యగారిని వశపరుచుకున్న శక్తి ఏమిటా అని గ్రామస్థులు అన్వేషించసాగారు.

అంతలో అమ్మ వచ్చి "మా నాన్న ఆయనకు అల్లుడు కదూ! అల్లునికి లోంగని మామ ఎక్కడ వున్నాడని" పకపకా నవ్వింది. ఆమాట విన్నవారు "మీనాన్న ఆయనకు అల్లుడు ఎలా అవుతాడని" అన్నారు. అందరూ ఆ విషయం వివరించమని అమ్మను బ్రతిమిలాడారు. దానికి అమ్మ "జనకునికి సీతాపతి అల్లుడే కదా" అని అన్నది. జానకిరామయ్యగారి అసలుపేరు జనకుడు పెళ్ళిలో జానకిరామయ్యగా మార్చారు. ఆవిషయం నీకెలా తెలుసని అడిగారు. "అనసూయ చాలా తెలివైన పిల్ల, మరిడమ్మ గారి పెంపకం కదూ పురాణగాధలన్నీ తెలిసాయి లోకం నడవడీ తెలిసిందని" అనుకున్నారు.

మరిడమ్మగారి (సీతాపతిగారి మేనత్త) ఒడిలో అమ్మ కూర్చోగానే "కాబోయే మీ అత్తగారు నిజామాబాదునుండీ బాపట్ల వచ్చింది. వెళ్లి చూచి వద్దామా? మీ మామయ్యకు చాలా జబ్బుగా వున్నదని అన్నది. దానికి అమ్మ "ఏం జబ్బు తాతమ్మా? బ్రతకరా?" అంది. బాలవాక్కు బ్రహ్మవాక్కు అంటారు. "నీవు చెప్పమ్మా" అని అడిగింది. "రాకూడనిది వచ్చేది బ్రతక్కుండా వుండటానికేగా" అని ముందుగానే జరగబోయే దానిని సూచించింది అమ్మ.

సీతాపతిగారు భోజనానికి కూర్చుంటూ అమ్మను రమ్మన్నారు. అన్నయ్య (రాఘవరావు మామయ్య) ఇంటికి రాలేదేమని అమ్మ అడిగింది. అంత చిన్నవయస్సులోనే అన్నగారు భోజనానికి రాలేదని విచారాన్ని వ్యక్తంచేసింది అమ్మ. చదువులేదు సరికదా వేళకు తిండికి కూడా రాలేదని మరిడమ్మగారు బాధపడింది. ఏంచేస్తాం. వాళ్ళందరూ పోయి వీడెందుకు బతికాడు అని సీతాపతిగారు అన్నారు. దానికి అమ్మ "అలా అనకు నాన్నా వాళ్లు పోవటానికి పుట్టారు. వీడు ఇట్లా చేయటానికి పుట్టాడు" అని అన్నది నిర్లిప్తంగా. "చూడరా సీతాపతీ అమ్మయి ఎంత నిర్లిప్తంగా అన్నదో" అని మరిడమ్మగారు ప్రశంసించింది. "అన్నీ! నీమాటలే" అని తాతగారు అన్నారు. "మీ అందర్నీ పెంచాగా దానని ఒక్కదానినే పెంచానా మరి మీకు రాలేదుగా ఆమాటలు, అమ్మాయి. అన్నట్లు ఎవరు ఎందుకు వచ్చారో అది చేస్తారు" అని

మరిడమ్మగారు అన్నారు. అమ్మలోని దైవత్వాన్ని ముందుగా పసికట్టింది చిదంబరరావు తాతగారు, మరిడమ్మ తాతమ్మే.

సీతాపతిగారి బావగారైన బ్రహ్మాండం సుబ్బారావుగారికి జబ్బు తీవ్రంగా వుండటంతో తాతగారు ఖిన్నులై వారి కుటుంబాన్ని కూడా ఈదవలసి వస్తుందని బాధపడ్డారు. దానికి అమ్మ చిదంబరరావు తాతగారు మనల్ని భరించటంలేదూ? మనం కూడా ఆయనకు బరువేగా అన్నది. తాతమ్మ బండి గింజలు ఇస్తాను వారిని ఎవరూ మోయనక్ఖరలేదని అంది. "అసలు ఇన్ని ఆలోచనలు ఎందుకు? ఎవరి అన్నం వారికి ఉన్నది అన్నది" అమ్మ నిశ్చలంగా.

అమ్మ జిల్లెళ్ళమూడి వచ్చిన ప్రతివారిని భోజనం చేసిరమ్మనేది. ఎవరైనా తిని వచ్చామంటే ప్రసాదంగా కొంచమైనా తీసుకోమనేది. అక్కడ తయారు చేస్తారమ్మా అంటే అక్కడ తయారు చేయాలి నాన్నా! ఇక్కడ రెడీగానే వుందిగా" అనేది. వాళ్ళు దానిలోని పరమార్థాన్ని గ్రహించక తొందగా వెళ్ళిపోయేవారు వారి అన్నము ఇక్కడలేదు అనేది. ఆ విషయాన్ని అతి చిన్న వయస్సులోనే నిర్ధారించింది. అందుకే నదీరా". "ఇచ్చటి మెతుకు కొరకు బ్రతుకు తెరువు దొరుకు" అని మధురంగా గానం చేసాడు."

మన్నవలో ఉన్నప్పుడు అమ్మ ఎక్కువగా పున్నయ్యగారి తోటలో కాలం గడిపేది. ఒకరోజున అమ్మ చింతకొమ్మపై కూర్చుని వుంది. తురుమెళ్ళ వెంకటప్పయ్యగారు చింత చిగురు కోసుకునేందుకు అక్కడకు వచ్చారు. చెట్టుక్రింద నిలుచుని తలపైకి ఎత్తారు.

చిత్రం! సత్యనారాయణస్వామి ప్రత్యక్షమైనాడు. ఆస్వామి ఆయన ఇష్టదైవం. అట్లా ఆయాచితంగా దర్శనం లబించేటప్పటికి ఆనంద పరవశులయ్యారు. ఆ ఆనందజలధిలో తలమునకలవుతూ కరాలు ముకుళించే సరికి ఆమూర్తియే గొడ్లు కాచుకునే పిల్లవాని వలె కనిపించింది. ఆయనకు చికాకు కలిగింది. పానకంలో పుడకలాగా వీడెవడు? అనుకున్నారు. పలకరించారు. ఆపిల్లవాడు పలకలేదు. వాడు పలికితే ఏమి? పలక్కపోతే ఏమీ అనుకుంటూ నాస్వామి నాకు ప్రత్యక్షమైనాడని మురిసిపోయారు.

అంతలో అమ్మ చెట్టుపై నుండీ క్రిందకు దూకింది. గౌనుతో వున్న అమ్మను, వెంకటప్పయ్యగారు, చూచారు. అమ్మ పరుగెత్తింది. ఆయన వెంబడించారు. అమ్మకనుమురుగు అయింది. ఆయనకు మాయతెరలు కమ్మేశాయి. ఏదైనా దయ్యం తనతో ఆడుకుంటున్నదా? అని అనుమానం, ఆలోచన కలిగాయి. భయకంపితులై ఇంటికి పరుగెత్తారు.

అమ్మకూడా వెంటప్పయ్యగారి ఇంటికే వచ్చింది. అక్కడ ఆడవాళ్ళు గవ్వలు ఆడుకుంటుంటే చూస్తూ నిలబడింది. ఆయన ఇంటికి రాగానే నాకు దయ్యం పట్టింది, నాకు దయ్యం పట్టింది. నాకు దయ్యం పట్టిందని కేకలు వేశారు.

అందరూ నిర్ఘాంతపడి చూస్తున్నారు. అంతలో వెంటప్పయ్యగారు అమ్మను చూశారు "ఈ అమ్మాయి వచ్చి ఎంతసేపు అయిందని" అడిగారు. "మీరు వచ్చేముందే వచ్చిందని", ఆయన భార్య చెప్పింది."చెట్టుదూకింది. నువ్వేనా నాకు కనిపించింది నువ్వేనా అమ్మా! మాలపిల్లవాడికి ఎటుపక్కన కూర్చున్నావు" అని అడిగారు. "మాలవాడిని నేను చూడలేదు" అని అమ్మ చెప్పింది. "నన్ను చూచినప్పుడు, ఆ పిల్లవాడు ఎందుకు కనబడలేదు." అని అడిగారు "వాడు మావాడు కావటంచేత మాలవాడుగా కనపడలేదని" అంత చిన్నతనంలోనే తనకు కులమతబేధాలు లేవని అమ్మ స్పష్టం చేసింది.

"నీవేనా చెట్టునుండీ దూకింది. నిజంచెప్పమ్మా అని" అమ్మ చెవిపట్టుకున్నారు. అమ్మ కనిపించలేదు. ఎదురుగా సత్యనారాయణస్వామి నవ్వుతూ నిలుచున్నాడు. విద్యుద్ఘాతం తగిలినట్లు ఆయనకేకవేసి, పారవశ్యంతో, పులకిత దేహంతో క్రిందపడిపోయాడు. "నా ఇష్టదైవం కనిపించాడు. అనసూయ మామూలు పిల్లకాదు. నా ఇష్టదైవం సత్యనారాయణస్వామియే ఈ అనసూయ", అని పలవరించారు.

ఆరోజునుండీ వెంకటప్పయ్యగారు అమ్మ ఎక్కడ కనిపించినా నమస్కారం చేస్తూ వుండేవారు. అప్పటినుంచీ ఆయనకు జీవితంలో బాగా కలిసివచ్చింది. ఆ కృతజ్ఞతతో ప్రతి ఏకాదశినాడు సత్యనారాయణ వ్రతం చేసుకునేవారు. ఒకనాడు వారు వ్రతం చేసుకుంటుండగా అక్కడకు అమ్మ వచ్చింది.

"నేను పుట్టింటి ఏకాదశినాడే" అన్నది అయితే నీకు పుట్టిన రోజు పండుగ

చేయమంటావా" అని అడిగింది వెంకటప్పయ్యగారు భార్య రంగమ్మగారు. ఈరోజు ఆశ్లేషా నక్షత్రం మీరు చేసే పూజనాకే" అని అమ్మ అన్నది.

"మేము చేసేది సత్యనారాయణ వ్రతమమ్మా" అని అమ్మవంక అమాయకంగా చూస్తూ రంగమ్మగారు అంది. "సత్యమైన వ్రతమంతా నాకే" అని ఘంటాపథంగా పలికింది అమ్మ.

**సత్యసంధ సత్య వ్రత అమ్మ**
**సత్యం-శివం-సుందరం అమ్మ**
**సత్యం జ్ఞానం అనంతం అమ్మ**

★ ★ ★

# 21. వాగ్దానం

సీతాపతితాతగారి బావమరిది బ్రహ్మాండం సుబ్బరావుగారికి జబ్బు ఎక్కువైంది. ఆయనకు అన్నిరకాల వైద్యము చేయించినా ఫలితం లేక చందుర్తి కరణం గారైన పెమ్మరాజు సత్యనారాయణమూర్తిగారి చేత తీర్థం ఇప్పిస్తున్నారు. ఆయన హిప్నటిజం కూడా చేస్తున్నందువల్ల పైకి వ్యాధి తగ్గినట్లు కనిపించినా లోపల బాగా ముదిరిపోయింది. సుబ్బారావుగారికి అమ్మంటే అమితమైన ప్రేమ. రోజూ తన దగ్గర కూర్చోబెట్టుకునేవారు. తాను తినే పండు అమ్మ చేతికిస్తూ "తల్లి లేని పిల్లవు నీకెవరు పెడ్తారు? అనేవారు.

చిన్నకొడుకైక లోకనాధంకు డబ్బులిచ్చి "నీవు కొనుక్కున్నదల్లా అమ్మాయికి పెడుతూవుండు. ఆ అమ్మాయి మన ఇంటి అమ్మాయే" అనేవారు. "ఇంటి అమ్మాయి ఏమిటి మన అమ్మాయి అనవేమి నాన్నా" అని అడిగేవాడు లోకనాధం. "ఇప్పుడు మేనమామ కూతురు వదిన, జరిగితే అన్న భార్య వదిన అవుతుంది అంటే తల్లితో సమానమవుతుంది" అని అన్నారు.

"ఏమమ్మా-బావను చేసుకుంటావా?" అని అడిగారు. అమ్మ ఏమీ మాట్లాడలేదు. అప్పటికి అమ్మ మేనత్త కనకమ్మగారు అయిదు మాసాల గర్భిణి. లోకనాధంకు తొమ్మిదవ సంవత్సరం. తరువాత పిల్లవాడు నరసింహారావు. కుంటివాడు అతనంటే సుబ్బారావుగారికి అమిత మమకారం. జబ్బుగా వున్న తండ్రిపక్కలోనే పడుకునేవాడు.

సుబ్బారావుగారు "బావను తప్పకుండా చేసుకుంటావా అమ్మ? నీకు తల్లి లేదు. వాడికి నాన్నలేడు" అన్నారు. "మీరున్నారుగా తండ్రి లేరంటారేమిటి? తల్లి వున్నవారికి ఒక్కతే తల్లి తల్లిలేని వారికి అందరూ తల్లులే" అన్నది అమ్మ. చిదంబరరావు గారు ఆ మాట విని "ఈ తల్లి ఎందరి తల్లులకో తల్లి, ఇంకా ఈమెకు తల్లి ఎందుకు?" అన్నారు.

ఆమాటకు సుబ్బారావుగారెంతో మురిసిపోయి "ఇప్పుడన్నమాట మళ్ళీ అనండి" అన్నారు. "ఏమున్నది? ఈ తల్లి ఎందరి తల్లులకో తల్లి అన్నారు. అది అంటే తెలిసేదికాదు. కంటే తెలుస్తుంది" అన్నారు చిదంబరరావుగారు నిశ్చయంగా.

"ఏమిటో నాకు అర్థం కావటంలేదు. కాని ఆ అమ్మాయి ప్రశాంతత వర్ణించటానికి వీలులేనంతగా వున్నది" అన్నారు సుబ్బారావుగారు. "ఏవమ్మా బావను తప్పక చేసుకుంటావా? అని అడిగారు. చేసుకుండే యోగ్యత ఉంటే తప్పకుండా చేసుకుంటానని అమ్మ చెప్పింది.

మీ అత్తయ్యకు సుఖమంటే ఏమిటో తెలియదమ్మా. చిన్నప్పటి నుంచీ కష్టాలే అన్నారు సుబ్బారావుగారు, "సుఖపడటం తెలియని మనిషికి సుఖపెట్టటం ఏం తెలుస్తుంది? ఒక రకంగా ఆలోచిస్తే సుఖమనేది ఒకరు పెట్టేదికాదు. కొందరు ఎన్ని ఉన్నా సుఖపడలేరు. సుఖమనేది మనస్సుకు సంబంధించినది" అన్నది అమ్మ.

అంతలో భారతి అత్తయ్య, నాన్నగారు వచ్చారు. సుబ్బారావుగారు నాన్నగారిని పిలిచి అమ్మ తెలివి తేటల గురించి వివరించి భారతి అత్తయ్యతో "ఎప్పుడయినా అనసూయతో మాట్లాడావా? ఆశ్చర్యకరమయిన సమాధానాలిస్తుంది" అన్నారు.

"ఏమో ఎప్పుడైనా మాట్లాడితేనేగా, మొద్దులా వుంటుంది" అన్నది భారతి అత్తయ్య. మన్నవ వారిలో అందరికీ ఉన్న తెలివి అన్నిపాళ్ళు వాళ్ళకు మిగల్చకుండా లాక్కున్నది. మంచితనం కూడా అట్లాగే" అన్నారు సుబ్బారావుగారు.

"ఒకరి దగ్గర ఉన్న స్థితిని లాక్కునే శక్తి ఎవరికుంటుంది? నేలాక్కుంటాను. జబ్బు నయం చేస్తాను" అని అనుకుంటున్న సత్యనారాయణగారికే చేతకావటం లేదు. చేతనయితే మీబాధ పోయేదిగా అన్నది అమ్మ. సుబ్బారావుగారు అమ్మ ముఖంలో ఒక వెలుగును చూచి సమ్మోహితులైచూస్తూ "ఇవ్వాళ నీవు ఎక్కడకూ వెళ్ళకమ్మా"? అని సుబ్బారావుగారు అమ్మను అర్థించారు.

అమ్మ దొడ్లోకి వెళ్ళి తులసీదళాలు తెచ్చి నమలండి.కొంచెం తగ్గుతుంది" అన్నది. సుబ్బారావు గారు ఆర్తితో నోరు తెరచి తులసీదళం నములుతూ "నీకీవైద్యం ఎవరు చెప్పారమ్మా" అని అడిగారు. "మీరు బాధగావున్నారన్న ఆవేదనే చెప్పింది." సుబ్బారావుగారు చిదంబరరావుగారిని దగ్గరకు పిలిచి "నేను పోతున్నాను మీ ఇష్టం" అన్నట్లు సంజ్ఞచేస్తూ నాన్నగారినీ, అమ్మనూ చూపించారు.

చిదంబరరావుగారికి సుబ్బారావుగారి కోరిక అర్థమయినా ధైర్యంలేక ఏమీ

చెప్పలేదు. మరిడమ్మగారు మాత్రం "సరేలే నాయనా" అన్నది. కనకమ్మగారు దుఃఖంతో నిలువలేక నేలపై పడిపోయింది. అందరి శోకాలతో యిలు ప్రతిధ్వనించింది.

అమ్మ సుబ్బారావుగారి తలవైపున నిలుచున్నది. చిదంబరరావుగారు ప్రక్కనే కూర్చున్నారు. ముందుగానే గుడ్డకప్పటమెందుకూ అంటూ ఆయన ప్రాణం పోయిందనుకుని కప్పిన గుడ్డను అమ్మతొలగించింది. "ఇందాకనే ప్రాణం పోయిందమ్మా" అన్నారు చిదంబరరావుగారు.

కానీ సుబ్బారావుగారు కళ్లుతెరచి అమ్మ ముఖంలో ముఖంపెట్టి అమ్మను చూచి కళ్ళుమూసారు. వెంటనే ఒక మెరుపు మెరిసినట్లయింది. అమ్మలో లీనమైపోయినట్లు చిదంబరరావుగారు చూచి ఆనందాశ్చర్యాలతో "ఈదృశ్యం చూస్తే నీవు బ్రహ్మాండం వారి కోడలువూ, బ్రహ్మాండానికి తల్లివీ, కాక తప్పదేమో అనిపిస్తున్నది" అని అమ్మను దగ్గరకు తీసుకున్నారు.

కళేబరాన్ని శ్మశానానికి కదిలించే సమయమాసన్నమయినది. అందరూ నమస్కారాలు చేశారు. నరసింహారావును ఎత్తుకొని అమ్మను, నాన్నగారిని చేత్తో పట్టుకొని బాపట్ల వెంకటరావుగారు తీసుకువెళ్ళి నమస్కారం చేయించారు.

శవాన్ని శ్మశానానికి తరలించగానే పెద్ద పెట్టున శోకనాదాలు సాగాయి. అమ్మ అక్కడనే నిలుచున్నది. సత్యనారాయణమూర్తిగారు మేడపైనుండి క్రిందకు చూచారు. అమ్మ సరిగా అప్పుడే అతని వైపు చూచింది. వెంటనే తాను కొలిచే బాలాత్రిపురసుందరి వలే వుండి పకపకా నవ్వుతూ చెయ్యిపైకి యెత్తి వస్తానని ఊపుతూ "ఏమిటి నీ ముఖం నీవు చేసింది? బ్రతికిస్తానని వస్తివే" అన్నట్లువుండి వెంటనే ఆ ముఖంలో లోగడ తాను చేసిన కృతిమమైన పనులన్నీ కనిపించాయి.

అందరితోపాటు అమ్మకూడా శ్మశానానికి బయలుదేరితే అందరూ "వద్దు వద్దు" అని కేకలు వేస్తుండగా సత్యనారాయణమూర్తిగారికి అమ్మ మహిష వాహనారూఢులైన యమధర్మరాజు వలే ప్రత్యక్షమై వెంటనే సామాన్య బాలికలా కనపడింది. ఒక్క క్షణం కనిపించినదంతా తన మనోభ్రమ అనుకున్నా 'కాదు కాదు' అని ఏదో శక్తి బలవత్తరంగా స్ఫురింపజేసింది.

"లోకం నీవు ఇందాక మీ నాన్నగారికి ఏమని దణ్ణం పెట్టుకున్నావని" అడిగింది,

"నాతో మాట్లాడుతూ చదువుచెప్పునాన్నా"అని పెట్టుకున్నానన్నాడు. "నీవు ఏమని పెట్టుకున్నావు నరసింహం? అని అడిగింది "నన్ను ఎత్తుకోమని పెట్టుకున్నానన్నాడు. "మరి నీవు ఏమని పెట్టుకున్నావు" అని వారిద్దరూ ఒకేసారి అడిగారు, "నన్ను దగ్గరకు తీసుకొని చిదంబరరావు తాతగారు ఏమని అన్నారో అది చేస్తానని" అంది "అది ఏమిటని" అడిగారు. "నేను మిమ్మల్ని కనిపెట్టుకొని వుంటానని" అంది. "నీవు చిన్నదానివిగా ఎట్లా చూస్తావు" అని అడిగాడు లోకనాథం.

"అవన్నీ నీకు ఎందుకు? ఎట్లా చేస్తానో! కూలీచేయచ్చు, అడుక్కొని రావచ్చు. మీకు ఏలోపమూ రానీయను, ఇక మీరు ఏడవద్దు" అని చెప్పింది. ఆమాటల్లోని ధీమా, నిశ్చయము సత్యనారాయణమూర్తి గారు విని ఆశ్చర్యచకితులై చిదంబరరావుగారికి చెప్పాలనుకున్నారు.

రూపంలో అమ్మ అతిసామాన్యంగా ఉన్నది. కంఠంలోని స్థైర్యం, గాంభీర్యం, అధికారయుతంగా ఉన్నాయి. ఆవైరుధ్యం వారిని కలతపరచింది.

సుబ్బారావుగారి తల్లిదండ్రుల దుఃఖానికి అవధుల్లేవు. మరిడమ్మ తాతమ్మ కనకమ్మగారిని తన ఒడిలోకి తీసుకొని "నాబండీ గింజలు నీకే ఇస్తాను. రెండేళ్ళు గడిస్తే నీబిడ్డే నీకు అక్కరకు వస్తాడని" ఓదార్చింది.

★ ★ ★

# 22. శిక్ష కాదు శిక్షణ

సుబ్బారావుగారిని దహనం చేసి అంతా ఇంటికి వచ్చారు. అమ్మ మేడపై పడుకుని వుంది. పెమ్మరాజు సత్యనారాయణమూర్తి గారికి నిద్రపట్టక మేడపైకి వచ్చారు. అమ్మ నిద్రపోతోందనుకుని పక్కలో కూర్చున్న సత్యనారాయణమూర్తిగారిని చూచి ఆశ్చర్యంతో "అమ్మాయి దగ్గర ఎందుకు కూర్చున్నారని" చిదంబరరావుగారు అడిగారు. అమ్మాయి కాళ్ళ తీపులతో బాధపడ్తుంటే మెస్మరిజం చేద్దామని" కూర్చున్నాని చెప్పారు.

అమ్మ అన్నీ చూస్తూ ఏమీ చూడనట్లుగా అన్నీ వింటూ ఏమీ విననట్లు పడుకున్నది. మూర్తిగారు అమ్మ కాళ్ళు రాయడం ఆరంభించారు. అమ్మ చివాలున లేచి, "మీరు పెద్దవారు. నాకాళ్ళు పట్టుకుంటారేమిటి అని అడిగింది. అప్పుడు అమ్మ వయస్సు తొమ్మిది సంవత్సరాలు "బాధగా వుంటే రాస్తున్నానమ్మా' అన్నారు. "బాధ ఎవరికి? అని అమ్మ అడిగింది. "నీకేనమ్మా" అన్నారు. "నాకు బాధ అని నేను మీకు చెప్పలేదు. మీరు పట్టుకుంటే బాధలు తగ్గుతాయాయేమిటి? "ఆ తల్లి దయవల్ల తగ్గుతాయమ్మా" అన్నారు. "మరి మామామగారికి తగ్గించలేదేమీ?" అని అమ్మ అడిగింది. "ఆయర్దాయంలేనివారికి తగ్గవు" ఆయుర్దాయంలేనివారు చనిపోతారు. మరి బ్రతికి ఉన్నంత వరకైనా బాధలు తగ్గలేదుగా" అన్నది.

ఏమిటమ్మ, ఏమిటి గొడవ అని చిదంబరరావుగారు అడిగారు. " ఆ ఏమున్నది? ఈయన అడక్కుండానే అందరి బాధలు అర్థంచేసుకుంటారుట. ఈ ఇంటిలో ఎవరెవరు ఏవే బాధలతో వున్నారో చెప్పమనండి కనీసం నివారణ ఎలావున్నప్పటికీ", అని కరకుగా అడిగింది."ఇంత గొడవ ఎందుకు పెద్దవారితో అన్నారు చిదంబరరావుగారు. "పెద్దవారు పెద్దవారుగా ప్రవర్తించకపోవటంతో వస్తుంది గొడవ. వీరు ఉపాసకులు "అని తాతగారితో వ్యంగ్యంగా అని మూర్తిగారినుద్దేశించి" ఉపాసన అంటే యిదేనా? మాట్లాడరేమి? బాలోపాసన అంటే చిన్నపిల్లల ఉపాసనా? అడిగింది అమ్మ సత్యనారాయణమూర్తిగారు నిర్వీణ్ణులై మాటాపలుకూ లేకుండా వుండిపోయారు. అమ్మ ఉచ్ఛైస్వరంతో, "ఉపాసన యిదేనా? పలకరేమి? అందరికీ మీరు చేసే మెస్మరిజం ఇలాగే వుంటుందా? మీరిక ఈ ఉపాసన మానుకున్నా సరే లేదా ఈ విషయం వివరించి చెప్పినాసరే" అని హెచ్చరించింది.

మూర్తిగారిలో చలనంలేదు. మళ్ళీ అమ్మే "మర్యాదగా వుంటే వుండాలి లేకపోతే నీదారిన నీవు వెళ్ళాలి. "ఆయన ఉలుకూపలుకూ లేకుండా అతి వినయంగా నిల్చున్నారు. "ఏమిటి తాతగారు ఇట్లాంటి వారందర్నీ పోగుచేశారు" అన్నది. "అయ్యో ఉపాసనంతా ఊరేగింది. దివాలా తీసిన వ్యాపారివలే బిక్కముఖంతో ఎట్లా నిలుచున్నాడో చూడు ఆయన" అన్నది అమ్మ.

"అంతా మీతాత వెంకయ్యగారి వలె మాట్లాడుతున్నావే. ఆడాబూ దర్పముగానూ. ఏమిటమ్మా యీ గొడవ? ఏమి చేశాడేమిటి నీకు కోపం రావటం అంటే సామాన్య కాదమ్మా! ఏదో విషయం ఉంటుంది." అన్నారు చిదంబరరాబుగారు. "ఆ ఏమయినా చేస్తేనా? అమ్మ మృదు స్వరంలో కోపం స్ఫురించింది. "అబ్బో మా అమ్మ విజృంభించింది" "అవసరమైతే ఏదయినా చేస్తాను. నా విషయమేగాదు యిట్లా ఎంతమందిని వేధిస్తున్నారో" అని అంది. "ఇందుకా అంతకోపం వచ్చింది? నీ అగ్నితత్వాన్ని ఏవరేమి చేస్తారమ్మా? "జలతత్వాన్ని చేస్తారా అని ఎదురు ప్రశ్నవేసింది". "నిన్ను ఏమిచేస్తారన్నాను కానీ యితరులను చేయమని కాదు."

ముందు ఈయన సంగతి తేల్చండి మేడ దించండి" అన్నది అమ్మ నిశ్చయంగా. తెల్లవారనీయమ్మా అన్నారు తాతగారు. ఆయన మీరు, నేను కూర్చుని ఉపాసన అంటే ఏమిటో తేల్చుకుందామా. ఆలస్యం అయితే ఆయన బాగుపడే అవకాశం వుండదన్నది అమ్మ. "ఈ పూటే బాగుచేయదలచావా" అన్నారు చిదంబరరావుగారు. "బాగుపడే సమయం వస్తేనేగా ఆయనకు అటువంటి దుర్బుద్ధి పుట్టింది." అన్నది అమ్మ.

"ఇక మాట్లాడుదామా" అన్నారు తాతగారు. "మాటలతో ఏమీబాగుపడతారా? మాటలతో బాగుపడే మార్గం ఉంటే శాస్త్రాలతోనే బాగుపడేవారు. ఆయనకు అనుభవం కావాలి కానీ మాటలు అవసరంలేదంటూ, ఉపాసన అంటే ఏమిటి? అని మూర్తిగారిని అడిగింది.

అమ్మ ప్రశ్న విన్న ఆయనకు తాను చేసిన దుష్కృత్యాలన్నీ కనులముందుకు వచ్చాయి. ఒక్కోదృశ్యం కనపడినప్పుడల్లా ఉలిక్కిపడుతున్నారు. పదిహేను నిమిషాలు గతించిన పిమ్మట "అమ్మా! భయం కలుగుతున్నది" అన్నారు. భయం, భయం అంటూనే ఇంకో పదిహేను నిమిషాలు గడిచాయి.

తన కనులముందు నిల్చిన దృశ్యపరంపరంలో చివరకు తాను పసివాడై అమ్మ ఒడిలో వాలిపోయినట్లుగా కనిపించింది. వెంటనే వెక్కి వెక్కి ఏడుస్తూ అమ్మ రెండు పాదాలు పట్టుకున్నారు. పాదాల స్పర్శ తగలగానే ఉదయం శవం దగ్గర చూచిన బాలాత్రిపురసుందరి రూపం మళ్ళీ సాక్షాత్కరించింది.

అమ్మా! జగన్మాతా నీవేనా! నిన్ను అర్థం చేసుకోలేకపోయానమ్మా. ప్రత్యక్ష అనుభవంకోసం, ఇన్ని లోపాలు నాచేత చేయించావా" అని కన్నీరు మున్నీరుగా విలపించారు.

"బాలాత్రిపుర సుందరి అంటే బాల అనగా పుట్టుక త్రిపురసుందరి అంటే బాల్య, యౌవ్వన, కౌమార స్థితులు కలిగినది. బాలాత్రిపురసుందరి అంటే సృష్టి స్థితిలయాలు, భూతభవిష్యత్, వర్తమానాలు సర్వమూ ఆమె రూపమే. అమె అంటే కాళ్ళు, చేతులూ, చీరె, రవిక కలిగిన ఆమెకాదు. శక్తి అనగా ప్రతిదానిలో గర్భితమైన శక్తి ఆ శక్తియే ఆమె.

"ఇదివరకే అన్నావు గదమ్మా, వస్తురూపం పురుషుడనీ, దానిలో ఉన్నశక్తిస్త్రీ అనీ, రెండింటినీ విడదీయలేని స్థితే శ్రీవిద్య అని పుస్తకాలు చెప్తూనేవున్నాయి. "విడదీయలేని స్థితికాదు. ఆరెండింటి సంయోగంలో వుండే కాలమే అదే అవాఙ్మనసగోచరం" మూర్తిగారు అమ్మ పాదాలపై పడిపోయి వింటూ ఉన్నారు.

"ఏమీ స్వామీ పాదాలమీద నుంచి తలతీస్తారా?," అమ్మ పాదాలు అమిత మృదువైనవి, బరువు మోయలేవు. కందుతాయో, కములుతాయో. నాకు మా అమ్మ అడుగడుగునా దైవత్వమే ఋజువు చేస్తున్నా అమ్మలో పసితనమే గోచరిస్తుంది. ఆమె ఎప్పుడూ ఏ బాధలేకుండా హాయిగా వుండాలని నా కోరిక నా జీవితంలో నేను అనుకున్న వన్నీ వ్యతిరేకంగానే జరుగుతున్నాయి. కనుక ఇదికూడా వ్యతిరేకం కావచ్చునంటూ" ముందు ముందు జరగబోయేది చిదంబరరావుగారి ద్వారా వ్యక్తపరిచింది. అమ్మ.

మూర్తిగారు అమ్మ పాదాలమీద నుంచి తలయెత్తి కొత్త ప్రపంచాన్ని చూస్తునట్లూ, పునర్జన్మ యెత్తినట్లూ భావిస్తూ లేచి "నమస్తే మాతా" అన్నారు.

అమ్మ చిదంబరరావుగారిని ఉద్దేశించి "శిక్ష అంటే క్రమశిక్షణలో పెట్టటమేనా?"

అని అడిగింది. "నీకు తోచిన దానికి తిరుగేముంటుందమ్మా అదే అందరికీ రక్ష పూర్వం జరిగిన కాలంకంటే జరగబోయే కాలాన్ని తలుచుకున్న కొలదీ దిగులు పెరుగుతున్నదమ్మా" అన్నారు తాతగారు.

అమ్మ మేనత్త కనకమ్మగారిని తలుచుకొని "అత్తయ్య ఏడుపు ఎట్లా మానుతుంది? అని ఆలోచించుకుంటూ "ఇంతకంటే ఎక్కువ ఆనందం కలిగినప్పుడు గానీ, రోజులు గడచిన తరువాత గానీ, చేయగలిగినది ఏమీలేదని నిరాశ కలిగినప్పుడు గాని దుఃఖం దానంతటదే క్రమేణా తగ్గిపోతుంది. లేనిది కలిగినప్పుడు ఉన్నదిపోతుందిగా అది సహజం నవ్వు యొక్క చరమదశ దుఃఖం, దుఃఖం యొక్క చరమ దశ నవ్వూ" అని అనుకున్నది.

సత్యనారాయణమూర్తిగారు అమ్మకు సాష్టాంగ నమస్కారం చేసి గడగడా వణుకుతూ "ఈ అల్పుని త్వరగా నీలో కల్పుకో తల్లీ జీవితమంతా తప్పులే చేశానని ప్రాధేయపడ్డారు.

"అల్పుడవని కాదు మీ బోటివారే ఇట్లాచేస్తే మాబోటి చిన్నవాళ్ళు ఏమవుతారని మీ తప్పును మీకు తెలియపరిచాను. మీరు శిక్ష అనుకోవద్దు. శిక్షణ ఇచ్చి మీపేరు సార్ధకం చేద్దామని యీరాత్రి బయటపడ్డాను. పూర్వం యీ సంగతి నాకు తెలియకపోలేదు. ఏదైనా ఒక ఆధారం లేనిది మాట్లాడను. మీరు బాగుపడటం కూడా నా కోసమే అనుకొని బాగుచేస్తున్నా మానవుల్లో పొరపాట్లు లేని వారు వుండరు. పొరపాట్లతో కూడినదే మానవత్వం. దైవం అనేపేరు పెట్టుకొని వాడిపేరుతో అనేకమందిని ఈ విధంగా మోసం చేస్తే బాధఅనిపించింది. కానీ సామాన్యులు చేస్తే బాధలేదు. సామాన్యులు ఎందరు ఎన్ని విధాలుగా మోసం చేయటంలేదు. వారందర్నీ ఏం అంటున్నాం. ఈ మోసం దైవం పేరుమీదుగా ఎందుకూ అని ప్రశ్న?

అమ్మ దీర్ఘోపన్యాసం విన్న సత్యనారాయణమూర్తిగారు మౌనంగా నిలుచున్నారు. "మీరు భయపడకండి. ఈ విషయం నేను ఎవరికీ చెప్పనులెండి" అంది. నేను ఈపూట బయలుదేరి వెళ్దామనుకుంటున్నానమ్మా? వచ్చినపని అయిపోయిందిగా" అని అన్నారు. "భూమిమీదకు వచ్చినపనా? ఇక్కడకు వచ్చినపనా?" అని అడిగింది.

సుబ్బారావుగారికి జబ్బుగావుందని తీసుకువచ్చారు. ఆయుర్ధాయం లేనివాడిని ఎవరూ బ్రతికించలేరు కదా! వెళ్లి వస్తానమ్మా చచ్చేవాడిని ఏమి చంపుతావు? అని అన్నారు. "నాకు మిమ్మల్ని చంపాలని లేదు. మీకున్నవి పోవాలని మాత్రమున్నది. "వెళ్ళి వస్తానమ్మా" అన్నారు. సరేమంచిది పోయిరండి. పోయినచోట సరిగా వుండండి మీకు యీ స్వభావంవల్ల ప్రమాదంలేదుగానీ ఈపోలికే మీ అమ్మాయికి వస్తే" అన్నది.

"నీ నోటిమీదగా ఆమాట అనకమ్మా" అని చేతులు ముకుళించి అమ్మకు నమస్కరించి సత్యనారాయణమూర్తిగారు భోజనంచేసి ప్రయాణమై రైల్వేస్టేషనుకు వెళ్ళారు. అమ్మకూడా వెంటవెళ్ళి పంపించింది.

రైలు బయలుదేరేముందు మూర్తిగారు వాకిట్లో నిలబడి గద్గద స్వరంతో సజలనయనాలతో ముకిళిత హస్తాలతో "అమ్మా ! దయానిధీ వెళ్ళివస్తానమ్మా" అని సెలవు తీసుకున్నారు.

★ ★ ★

# 23. నాగేంద్రుడు

సత్యనారాయణమూర్తిగారిని పంపించి ఇంటికివస్తుండగా స్టేషన్ గేటు దగ్గర టికెట్ కలెక్టర్ అమ్మను టికెట్టు ఏదని అడిగాడు. అంతలో అమ్మ స్థానంలో పొడుగైన తన స్నేహితుడు కనిపించాడు. టికెట్టు కలెక్టర్ నొచ్చుకుంటూ "అయ్యోనీవా? ఎవరో పిల్ల అనుకున్నా" అన్నాడు.

"నిజమే ఒకపిల్ల ఇక్కడ నిల్చుంది. నేనూ చూచాను. ఆపిల్ల వెనకనే నేను వచ్చానని ఒకాయన సాక్షం ఇచ్చాడు. టికెట్టు కలెక్టరు ఆశ్చర్యంతో రోడ్డువైపు చూచాడు. ఆ అమ్మాయి కనపడింది. వెంటనే పరిగెత్తాడు. అమ్మకూడా కొంచెం దూరం నడిచి అదృశ్యమయింది. టికెట్టు కలెక్టరుకు ఆశ్చర్యం వేసింది. భయమూ కలిగింది.

"ఆ అమ్మాయి నడిస్తే నేను పరుగెత్తాను. కానీ ఆ అమ్మాయిని అందుకోలేకపోయాను. టికెట్టు కోసంకాదు. ఏమిటో తెలుసుకుందామని. చూస్తుండగానే అదృశ్యమయింది. ఒళ్ళు ఝల్లుమన్నది" అని స్నేహితుడుతో అన్నాడు.

దయ్యాలు, భూతాలమీద నమ్మకం లేకపోయినా యీ సంఘటన ఆశ్చర్యాని కలిగిస్తోందని స్నేహితుడు అన్నాడు. "నాకలా తోచటంలేదు. మాతల్లిదండ్రులకు తాతముత్తాతలకూ త్రిపురసుందరీ ఉపాసన శ్రీ చక్రపూజా వుంది. ఆ తల్లి నాకీ రూపంగా దర్శనం యిచ్చిందేమో అనుకుంటున్నానన్నాడు టికెట్టు కలెక్టరు.

సుబ్బారావుగారు చనిపోయిన పదవరోజున చిదంబరరావుగారు, అమ్మా రేటూరు వెళ్ళారు. పదమూడవరోజున వైకుంఠసమారాధన పూర్తికాగానే బయలుదేరారు అప్పుడు బ్రహ్మాండం శేషయ్యగారు "తల్లిలేని పిల్లను ఎటూ పెంచుతున్నారుగా, ఆపిల్లను నాగులుకు ఇచ్చి పెళ్ళిచేయ్యండి" అని సలహా ఇచ్చారు.

"ఒకళ్ళు చేసేది, చేయగలిగింది ఏముంది? విధిలో ఎట్లావుంటే అట్లా అవుతుంది. అన్నారు చిదంబరరావుగారు. మరిడమ్మగారు సీతాపతి తాతగారు. అమ్మా, రాఘవరావు మామయ్య మన్నవకు ప్రయాణమైనారు. మన్నవచేరగానే గ్రామం ముందర సత్రం దగ్గర పెద్ద త్రాచుపాము పడగవిప్పి ఆడుతూ ఎదురుగా నుంచుంది. అమ్మతల వంచుకొని దానిమీదగా నడచింది. ప్రక్కనే వున్న మామయ్య "ఓ మొద్దూ–

పామును చూడకుండా నడుస్తావేం? అని అరిచాడు. అంతలో పదిమంది కర్రలు తీసుకొని పోగయినారు. ఆపాముకూడా ఉత్తరం నుండీ దక్షణంవైపు ముఖం తిప్పి అమ్మవంక చూస్తూ అమ్మ నడచినవైపే నడుస్తున్నది.

"ఈ మొద్దుకు చెప్తూనే వున్నాను. తొక్కవద్దని వట్టి అయోమయం పగపట్టినట్టున్నది" అని విసుక్కున్నాడు మామయ్య. జనం కఱ్ఱలు తెచ్చారుగానీ మాధవాచార్యులుగారి సంఘటనతో ఎవరూ పామును కొట్టటానికి సాహసించలేదు. మాధవాచార్యులుగారి చరిత్ర చాలా విచిత్రమైనది.

మన్నవ శివాలయంలో ధ్వజస్తంభానికి ఉత్తరంగా ఒక పెద్ద పుట్టఉన్నది. అందులో ఒక నాగుపాము వుంది. నిత్యం ఆరోగ్యం కోసమో సంతానం కొరకో అనేకులు ప్రదక్షణాలు చేసేవారు. నాగుల చవితికి పాలు పోసేవారు. చెన్నకేశవస్వామి వారి ఆలయంలోని అర్చకుడు మాధవాచార్యులు. ఆయన ఆయుర్వేద వైద్యుడు. సర్పమంత్రవేత్త. ఎటువంటి సర్పాన్నయినా చేత్తో పట్టుకుని ఆడించగలశక్తి కలవాడు. ఆయనకు యీ ప్రదక్షిణాలు చేసేవాళ్ళనూ, యీ సర్పాన్ని అర్చించేవాళ్ళనూ చూస్తే హాస్యాస్పదంగా ఉండేది.

మన్నవ గోపాలకృష్ణయ్యగారి కూతురు కడుపునొప్పితో బాధపడ్తూ ఆ పుట్టకు ప్రదక్షణాలు చేస్తే ఆనొప్పి నివారణమయింది. ఆగ్రామంలో ఆ పుట్ట అన్నా, ఆ పుట్టలోని నాగేంద్రుడన్నా ఎంతో విశ్వాసం. ఒకరోజున ఆ పుట్టలో రెండు సర్పాలు కనిపించాయి. గర్వించిన మాధవాచార్యులు ఆ రెండు పాములను రెండు చేతులతో పట్టుకొని వీధిలోకి వచ్చి "మీరు దేముడని పూజిస్తున్నది ఈ పాములనే, మనుష్యుల్లో సాధుత్వం ఉన్నవాళ్లు ఉన్నట్లే పశువుల్లో పాముల్లో కూడా వుంటాయి. అంతమాత్రంచేత అవి దేవుళ్లు అవుతాయా" అని హేళనగా అరిచాడు.

మన్నవ నరసింహంగారు "నీవు గుడిలో అర్చకుడివిగదా? అక్కడ దేవుడంటే రాయి గదా, మరి నీవు రాతినే గదా నిత్యము పూజిస్తున్నది.. ఏమీ చైతన్యం కనిపించని రాయే దేవుడుగా అర్చింపబడుతున్నప్పుడు. సాధుత్వం కల పాముని అర్చిస్తే తప్పేమున్నది?" అని ప్రశ్నించారు. ఆ ప్రశ్న వినకుండా, ప్రజలు హృదయభావాన్ని విశ్వాసాన్ని అర్థంచేసుకోకుండా ఒకదాని కోరలు పీకాడు. పీకుతుండగానే ఒకకోర

చేతికి గుచ్చుకొని క్షణాల్లో పడిపోయి అరగంటలో ప్రాణం పోయింది. నాగేంద్రుని హత్యాదోషఫలితమే అనుకున్నారు కానీ పాముకాటు వల్ల మరణించాడని అనుకోలేదు.

నిత్యం ప్రదక్షణాలు చేసే ఆవిడఈ సంఘటన విని నివ్వెరపోయి నిశ్చేష్ట అయి తెప్పరిల్లి ఇంటికి వెళ్ళి పడుకుంది. వారం రోజులవరకూ ఆమెకు వొళ్ళు తెలియలేదు. నిద్రలేదు, ఆహారం లేదు. సర్పం కలలో కనిపించి "ఎందుకు అట్లా ఏడుస్తావు? నన్నెవరూ చంపలేదు. నేను నీపొట్టలోనే ఉన్నాను" అని అంటుండగానే ఆపాము ప్రక్కనే ఒక చిన్న అమ్మాయి కనిపించింది. ఆ పాము ఆ అమ్మాయి పొట్టలో దూరినట్లు దృశ్యమానమయింది.

"ఈరోజు నుండీ పాము కనిపించకపోయినా నీవు పుట్టలో పాలుపోసిపో. చాలా జంతువులు త్రాగుతాయి. నాగేంద్రుడంటే పాము అనేకాదు. నాగేంద్రుడంటే మన వెన్నంటి కాపాడేదే" అని వినిపించింది. గ్లాసు నిండా పాలు తీసుకొని ఆపుట్టవుండే ప్రదేశానికి వెళ్ళింది. అక్కడ పుట్ట కనిపించలేదు. హతాశురాలయింది. కొన్ని క్షణాలకు తాన్నుతానే సముదాయించుకొని ఆప్రదేశంలో కనిపిస్తున్నా కలుగుల్లోనే పాలుపోసింది. ఆపాలు పోసేటప్పుడు తాను 'స్వప్నం'లో కన్న పాపనోటిలో పోస్తున్నట్టు అనుభూతమయింది. ఆమె ఆశ్చర్యపడి ఆ అమ్మాయి ఎవరూ అన్నది తేల్చుకోలేక రోజు పాలుపోస్తూనే వుంది.

నెలరోజుల తరువాత అమ్మను చూచింది. ఆమెకు విస్మయం కలిగింది. డోలాయమాన మానసమయింది ఆమె పాలుపోయటానికి దేవాలయానికి బయలుదేరుతుండగా అమ్మ ఎదురు పడ్డది. ఆమె సంశయాలన్నీ విచ్ఛేదం అయి తాను నిత్యం ఆరాధించే నాగేంద్రుడే అమె అన్న విషయం ధ్రువపడింది.

నాగేంద్రా! ఇక్కడకే వచ్చావా? నాయందు నీకెందుకింత దయ! ఈ అనాధను కాపాడేందుకు వచ్చావా అని పెద్దగా అరుస్తూ అమ్మను భుజాన వేసుకుంది. ఆక్షణంలో ఆమెకు నాగేంద్రుడు పడగవిప్పి తనకు గొడుగు పట్టినట్లూ తాను తలపైకెత్తగా నాగేంద్రుని నోటినుండీ అమృతం జారి తననోటిలో పడ్డట్టూ అనుభూతమై గుటకలు వేస్తూ చప్పరిస్తూ తన్మయం చెందుతూ "నాగేంద్రా నాకోసం వచ్చావా? నన్ను నీలో కలుపుకో అని పారవశ్యంతో కేకలు వేస్తూ నిలుచునే ప్రాణం వదిలింది. అమ్మ మెల్లగా ఆమె భుజంనుండీ జారి ఒకపక్కగా నిలుచుంది. ఆమె కేకలు విని

యిరుగుపొరుగువారు పరుగెత్తుకు వచ్చారు. ఆమెకు శిరోభేదనం అయి ప్రాణంపోయింది.

అందరికీ ఆశ్చర్యంతోపాటు ఆనందం కలిగింది. ఆమెకు అటువంటి ఉత్తమ మరణం లభ్యమయినందుకు ప్రాణం బ్రహ్మకపాలం గుండా పోవాలంటే యోగసాధనలో పరాకాష్టస్థితికి పొందివుండాలి ఆమెకు అతిసునాయసంగా ప్రాప్తించింది. మరిడమ్మ తాతమ్మా మొదలగువారు చూచి విస్మతులైనారు.

అమ్మ మెల్లగా వచ్చి మరిడమ్మగారు భుజాలమీద చేతులువేసి వీపు నానుకొని వెనుకగా కూర్చుంది. “నీవు ఎందుకు వచ్చావమ్మా పెద్దనాపసానిలా? నీవు లేకపోతే యిదంతా జరగదని వచ్చావా? అని మరిడమ్మగారు విసుక్కుంది.

నేను లేకపోతే ఎట్లా జరుగుతుంది! మరి ఇదంతా జరిపిందెవరు? నేనే” అని అమ్మనోరారా చెప్పినా ఎవ్వరూ నమ్మలేదు. అంతా అమ్మ హాస్యమడుతోందని అనుకున్నారు. కానీ అందులోని సత్యాన్ని గ్రహించలేకపోయారు.

చిన్నిపిల్లవు నీకెందుకూ వెళ్ళమని చెయ్యపట్టుకొని బయటకు పంపించారు. అమ్మ చిరునవ్వు నవ్వుతూ బయటకు వెళ్ళింది.

“శవాన్ని ఎక్కువసేపు వుంచటం మంచిదికాదు. ఎక్కడ వున్నాడో కూడా తెలియదు వాడికోసం ఎన్నాళ్ళు అపేటట్లు” అనుకుంటూ అంత్యక్రియలకు ఏర్పాట్లు చేయసాగారు ఇరుగుపొరుగువారు.

అంతలోనే ఆమెతల్లిదండ్రులూ భర్తా వచ్చారు. అవసరానికి అమ్మ వారి మనస్సు కదిపి సమయానికి వచ్చేటట్లుగా ఆదుకున్నది. పసుపు కుంకుమలతో ఊరేగింపుతో ఆమె మహాప్రస్థానం సాగింది.

★ ★ ★

# 24. ప్రియబాంధవి

ప్రతిజీవితంలోనూ కష్టసుఖాలు రెండూ వున్నా కొందరి జీవిత సముద్రంలో వరుసగా దుఃఖతరంగాలే ఉత్పన్నమవుతాయి. కొందరి జీవితవనంలో నిరంతరం మలయసమీరాలే ప్రసృతమవుతాయి. కొందరు కష్టానైనా, సుఖానైనా నిర్లిప్తంగా అనుభవిస్తారు వారే స్థిత ప్రజ్ఞులు. కొందరు నేర్పుతో కష్టాలకడలినే ఆనంద సాగరంగా మార్చుకుంటారు.

మరిడమ్మ గారికి బ్రతుకు బాటలో అడుగడుగునా ఎదురుదెబ్బలే. ఆమె బ్రతుకు కడలిలో నిత్యమూ తుఫానులే. అయినా ఆమె ఓర్పుతో పడవ నడిపిందే కానీ ఏనాడు అధైర్యపడలేదు. సీతాపతిగారికి కలిగిన కష్టం పెండ్లితో గట్టు ఎక్కినా, బ్రహ్మండం సుబ్బారావుగారి మరణంతో కనకమ్మగారు సుడిగుండంలో పడ్డది. అకుటుంబంలో ఎవరికి ఏ కష్టం కలిగినా అది మరిడమ్మగారికి తగిలే దెబ్బే. కనకమ్మగారి సంసారం కూడా తానే మోయవలసి వస్తుందనీ, వడ్ల ధర తగ్గిపోయినందున అది దుర్భరమవుతుందని సీతాపతి తాతగారు విచారించారు.

చెట్టుక్రిందా, పుట్టలపైనా, చెరువుల్లో, కాలవల్లో ఎక్కడబడితే అక్కడ అమ్మ హాయిగా నిశ్చంతగా ఆడుకుంటుండేది. సుబ్బారావుగారు చనిపోయిన మూడవమాసంలో మరిడమ్మగారు రేటూరు వెళ్ళి కనకమ్మ గారిని మన్నవ తీసుకువచ్చారు. చిన్నవాడైనందున లోకనాధం ఆవిడవెంటే వచ్చాడు. సెలవలు కావటంతో నాన్నగారైన నాగేశ్వరరావుగారు కూడా వచ్చారు.

కనకమ్మగారు రెండు మాసాల తరువాత ప్రసవించింది. చైత్రశుద్ధ బహుళ ఏకాదశినాడు సాయంకాలం నాలుగు గంటలకు ఆడపిల్ల పుట్టింది. పురిటిలోనే అమ్మ పసిపిల్లను ఎత్తుకుండేది. ఆపిల్లకు పేరు పెట్టనందున అంతా పాప అనే పిలిచేవారు. పాపకు ఆరునెలలు వచ్చేదాకా పాప పెంపకం బాధ్యత అమ్మే వహించింది. అమ్మే ఉగ్గుపట్టటం, పాలు పట్టటం చేసేది. రోజూ రెండు మూడు ఇళ్ళు తిరిగి ఆవుపాలు తెచ్చేది. అప్పటికి అమ్మ వయస్సు తొమ్మిది సంవత్సరాలు మాత్రమే.

ఒకరోజు సీతాపతి తాతగారు మన్నవ గ్రామకాపురస్తురాలే అయిన పులిపాక

చల్లమ్మగారితో కనకమ్మగారి సంసారం ఈదడం తనవల్లకాదని, తన అశక్తతను వ్యక్తం చేసారు. ఆ విషయం మరిడమ్మగారితో చెప్పింది.

కనకమ్మగారు పరిస్థితులను, తమస్థితినీ తీవ్రంగా ఆలోచించుకుని ఒక నిర్ణయానికి వచ్చి మరిడమ్మగారితో బాపట్ల వెళ్తున్నాని చెప్పి విజయవాడ వెళ్ళారు.

అంతలో నాన్నగారు వచ్చి "నిజామాబాద్ నుండీ సామాను తీసుకు వెళ్ళమని కబురు వచ్చింది. అమ్మ ఏమంటుందో నేను వెళ్ళి వద్దామంటే రైలు చార్జీకి డబ్బులేదు. ఏమీచేయాలో తోచటంలేదు మామయ్యా" అని సీతాపతిగారితో అన్నారు.

"వడ్లధర తగ్గి ఆదాయం తగ్గినా ఖర్చుమాత్రం తగ్గించుకో లేకుండా వున్నాము" అన్నారు సీతాపతిగారు. అంతలో మరిడమ్మగారు వచ్చి "నాన్నగారిని అవతలకు తీసకువెళ్ళి" మీ అమ్మకు కష్టంతోచి బాపట్ల వెళ్తానని" అంది "అక్కడకు రాలేదా" అని అడిగింది. రాలేదని నాన్నాగారు చెప్పారు. అంతలో అమ్మ అందుకుని" ఒకవేళ బెజవాడ వెళ్ళిందేమో. నిన్న నరసింహారావుతో చెప్తుంటో విన్నానని" అమ్మ చెప్పింది.

నాన్నగారి కన్నులు సజల నయనాలు అయ్యాయి. ఆలోచనా భారంతో బరువెక్కాయి. చివరకు గద్గద స్వరంతో" అడుక్కువచ్చి అయినా అమ్మకు పెట్టి నేను తింటాను" అని వాకిట్లోకి వెళ్ళారు.

లోకనాధం చేతిలో ఒక అర్ధరూపాయి పెట్టి ఏమన్నాకొనుక్కోమని" అమ్మ నీతో ఏమీ చెప్పిపోలేదా" అడిగారు. "చెప్పకేం. చదువుకుంటూ అనసూయతో ఆడుకుంటావుండు, నరసింహానికి మందు ఇప్పించి తీసుకు వస్తానని చెప్పిందన్నారు. లోకనాధాన్ని దగ్గరకు తీసుకొని "నీవు దిగులు పడకు నాన్నగారు ,నిజామాబాద్‌లో ఉద్యోగం చేస్తున్నారు. మనమూ అక్కడకు వెళ్దాం" అని అన్నారు నాన్నగారు.

అమ్మ, నాన్నగారు పడుకున్న మంచం దగ్గకు వచ్చి "ఇదిగో బావా ఒకటి అత్తయ్య తీసుకు వెళ్ళింది నిజామాబాద్‌నుంచీ ఉత్తరం వస్తే వెళ్ళి సామాను తీసకురమ్మందని రెండో గాజు నాన్నగారిచేతిలో పెట్టింది. ఎవ్వరికీ చెప్పవద్దంది. దిగులుపడవద్దు, ఏదిక్కూలేని వారికి దేవుడే దిక్కు అని వెళ్ళింది. అది మొదలు అమ్మ ఆ సంసార రధాన్ని నడపటానికే నిశ్చయించుకుంది. అవి అమ్మ మురుగులే.

ఒకటి కనకమ్మగారికి ఒకటి నాన్నగారికీ ఇచ్చింది. కానీ ఆ విషయం అమ్మ నాన్నగారికి చెప్పలేదు.

మర్నాడు నాన్నగారు విజయవాడ వెళ్లి రైల్వే స్టేషనంతా వెదికారు క్రితంరోజు ఎరిగిన వాళ్ళు కనకమ్మగారిని చూచి నచ్చచెప్పి బాపట్ల తీసుకువెళ్ళారు. నాన్నగారు విజయవాడ నుండీ నిజామాబాద్ వెళ్లి సామాను తీసుకువచ్చి పెట్టుకోటానికి జాగాలేనందున అడిగిన వారందరికీ తలా ఒక వస్తువు పంచారు.

కనకమ్మగారు బాపట్ల చేరిన వారంరోజులకే భారతి అత్తయ్యకు ఏదో గాలి పట్టి పడిపోయిందని కబురు వచ్చింది. ఆమె అత్తవారిల్లు బాపట్లలోనే చిదంబరరావుగారికి ఒక్కతే కూతురు. అతిగారాబంగా పెంచారు. భారతీ "అత్తగారింట్లో మీ నాన్న ఏదో హత్యచేసాడు. అదే యిట్లా చుట్టుకున్నదని" అన్నారు. "రంగమ్మతల్లి పట్టి పీడుస్తున్నది" అన్నపూర్ణమ్మ గారు అన్నది. అత్తగారింట్లోని ఒరిపిడి వల్ల మనసు బెదరి ఇలా అయిందని చిదంబరరావుగారు ఉద్దేశపడ్డారు.

భూతవైద్యులను పిలిపించారు. చికిత్స ప్రారంభమయింది. గుంటూరు జిల్లాలోని భూతవైద్యులంతా ప్రయత్నించారు. కానీ ఫలితం లేకపోయింది. ఒకరోజు భారతిగారి మామగారు దేశిరాజు రంగారావుగారు వచ్చి "వంశంలోని వారు ఘెరహత్య చేసిన మహాపాప ఫలితం, తండ్రిచేసిన నేరానికి శిక్ష అని ప్రశ్నలో చెప్పారు" అన్నారు.

పక్కనే వున్న అమ్మ "మొన్న నేను అణాపెట్టి ప్రశ్నకు వెళితే దేశిరాజు రంగారావు గారి రెండవకుమారుడు, మశూచి వల్ల చనిపోయిన పిల్లాకలిసి పీక్కుతింటున్నారని చెప్పారు. కావలిస్తే మనం పోదాం రండి. చెప్పిన వారిని చూపిస్తాను" అన్నది.

చిదంబరరావుగారు బల్లపై చేతితో దబదబా చరుస్తూ పకాపకా నవ్వి బావగారు, బావగారు అని అరిచారు. అమ్మ మాటలకు చిదంబరరావుగారి అట్టహాసానికి రంగారావుగారు చిన్నబుచ్చుకుని "ఎవరీ అమ్మాయి?" అని అడిగారు. మా అన్నయ్యా మనుమరాలు బావమరిది కూతురు మీ ఇంటికి వచ్చేదే అన్నాడు.

ఆ చప్పుడు విని ఏమిటా అని ఇంట్లోంచి అన్నపూర్ణమ్మగారు సీతాపతిగారు, మరిడమ్మగారు, వెంకటసుబ్బయ్య తాతగారు అందరూ బయటకు వచ్చారు.

జరిగిన విషయం వివరించి "మరి అమ్మాయి ఎక్కడ విన్నదో ఆ ఇద్దరి పిల్లల సంగతీ. నాకే ఇంతవరకూ తెలియదు. వారిద్దరూ భారతికి దయ్యమై పట్టారని అనసూయ అంటున్నదన్నారు" చిదంబరరావుగారు.

"అందులో అబద్ధమేమున్నది? లక్ష్మణాచార్యులగారు అన్నారు" అన్నది అన్నపూర్ణమ్మగారు. "అలాగా నాకు తెలియదే. దాని విధి ఎట్లా వున్నదో అట్లా జరుగుతుంది" అని సర్దివేయటానికి చిదంబరరావుగారు ప్రయత్నించారు.

"ఏది ఎట్లావున్నా మా ఇంట్లో, మీ ఇంట్లో కాకుండా ఎక్కడైనా ఇల్లు అద్దెకు తీసుకొని ఉండండి అమ్మాయికి తగ్గిందాకా" అని రంగారావుగారు సలహా ఇచ్చారు.

భోజనం చేసి వెళ్ళమన్నారు. స్కూలు వేళ అయింది వెళ్ళాలన్నారు రంగారావుగారు "అన్నం తినే పని ఎక్కడయినా తప్పదుగా? అన్నది అమ్మ" ఈపిల్ల చాలా అసాధ్యురాల్లా వుందే అన్నారు రంగారావుగారు. "ఔను కొందరు అసాధ్యం అనుకుంటారు. కొందరు అమాయకం అనుకుంటారు" అన్నారు చిదంబరరావుగారు.

"వెళ్ళి వస్తాను బావగారూ రెండు మూడు నెలలు చూచి వాడికి వేరే పెళ్ళి చేస్తాను. వాడూ చిన్నవాడు" అని రంగారావుగారు వెళ్ళారు. ఆయన వెళ్ళగానే అన్నపూర్ణమ్మగారు "ఏమీ సంబంధం? ఇదివద్దూ అని మొదట్లోనే చెప్పాను. దేశిరాజు వారు భాగ్యవంతులని భ్రమపడి పిల్లనోట మట్టికొట్టాము" అని బాధపడ్డారు. అనవసరంగా మాట్లాడక లోపలకుపో," అని కసిరారు చిదంబరరావుగారు.

రైలుపేటలో ఒక ఇంట్లో చేరారు చిదంబరరావుగారు. ఆ పక్కనే కనకమ్మగారు చేరారు. అమ్మ అక్కడా ఇక్కడా వుండేది. నరసింహారావుకు మందులు కనుక్కునేది. పాపకు తలనిండా పుళ్లులేచాయి. అయినా అమ్మ నడుంపుండు పడేలా అత్తయ్యను ఎత్తుకునేది. లోకనాథంతో కబుర్లూ చెపుతూ దిగులుపడకుండా చూచేది. నాన్నగారికి ఎప్పుడు ఏది అవసరమౌతుందో అనుక్షణం విచారిస్తుండేదీ. కనకమ్మ గారికి ఇంటిపనుల్లో సాయంచేసేది.

సీతాపతి తాతగారింట్లో పారిజాతమై దివ్య సౌరభాలు విరజిమ్మిన అమ్మ, చిదంబరరావుగారింట్లో రత్నదీపమై భవ్యకాంతులు వెదజల్లిన అమ్మ, కనకమ్మగారింటికి ప్రియబాంధవి అయింది.

రెండు నెలలు చికిత్స జరిగినా ఫలితం ఏమీలేకుండా నరసింహారావు మరణించాడు. భారతీదేవికి ఎన్ని భూతవైద్యాలు చేయించినా వ్యాధి నయంకాలేదు.

ఇంకొల్లు, పావులూరుల మధ్య ఆంజనేయస్వామి ఉన్నాడు. ఆయన చాలా మహిమలు కలవాడనీ, ఆ విగ్రహం వెలిసిందనీ అక్కడ ప్రదక్షణాలు చేయిస్తే వ్యాధి నయం అవుతుందని తెలిసింది.

ఆ మరునాటి రాత్రే భారతిదేవికి ఆంజనేయస్వామి కలలో కనిపించగా కలమూ కాగితం తీసుకొని దీపంలేక పోయినా అయిదారు పద్యాలు చక్కగా వ్రాసింది. అది చిదంబరరావుగారు చూచి ఆ వర్ణనే ఇంత బాగుంది అక్కడికి వెళ్లి చూస్తే ఇంకెంత బాగుంటుందో అని అనుకుని భారతిదేవిని తీసుకు వెళ్ళటానికి నిర్ణయించుకున్నారు.

చిదంబరరావుగారు, అన్నపూర్ణమ్మగారిని, భారతీదేవిని, అమ్మని, వంటవాడు బిజిబిళ్ళ రాఘవయ్యా గారినీ తీసుకొని ఆంజనేయస్వామి ఆలయానికి వెళ్ళి సత్రంలో వుండి భారతీదేవిచేత ప్రదక్షణాలు చేయించ మొదలుపెట్టారు.

మిరియాలతో రెండు పూటలా 108 ప్రదక్షణాలు చేసి పూటకు బిందెడు పానకం ఐదు కొబ్బరికాయలు, సోలెడు వడపప్పు చేసి రెండు పూటలా సహస్రనామార్చన చేయించుకుంటూ ఇద్దరు బ్రాహ్మణులకు భోజనం పెడ్తూన్నారు. నివేదన చేసిన ప్రసాదమైనా ఇతరులకు పెట్టే అలవాటు సంప్రదాయమూలేవు.

రోజూ అమ్మ యీ వడపప్పు, ఇతరులు ప్రసాదంగా పెట్టినది కూడా కలిపి మధ్యాహ్నం వంట బ్రాహ్మణుడైన రాఘవయ్యగారిని అడిగి చింతపండూ, పచ్చిమిరపకాయలు, ఉప్పూ తీసుకొని పచ్చడి రుబ్బి చెరువు కట్టమీదా, చింతచెట్టు క్రింద కూర్చునే బాటసారులకు, పావులూరు నుంచీ గుడ్డలు వుతకటానికి వచ్చే చాకలాళ్ళకు, అక్కడ పనివాళ్ళకు, అక్కడే వుండి ప్రదక్షణాలు చేసుకునే బీదవాళ్ళకు, ఎందరికో పెడ్తూ వుండేది.

ఒకరోజున భారతీదేవికి కాళ్ళు పిసుకుతూ పచ్చడి రుబ్బటానికి అమ్మకు అవకాశం లేకపోయింది ఆరోజు అనేకులు ఇంటికి వచ్చి "అమ్మయిగారున్నారా? అమ్మాయిగారున్నారా" అని అడిగారు.

ఆనాడు ఆదివారం అవటం చేత బాపట్లనుంచీ చిదంబరరావుగారు వచ్చారు. అమ్మకోసం వచ్చేవారి సంఖ్యను చూచి ఆశ్చర్యచకితులై "మా అమ్మాయి పరపతి పెరిగిపోయిందే. పలుకబడి కూడా ఎక్కువగావుంది. యీవూళ్ళో నాకు కూడా ఇంతగాలేదు" అనుకున్నారు.

అంతలో పావులూరి చాకలి రామన్నవచ్చి తాతగారిని పిలిచి "అయ్యా ఈపూట అమ్మగారు లేపోతే బువ్వలోకి పచ్చడీలేదు. బువ్వాలేదు. ఆతల్లిరోజూ పళ్లెం అన్నం పెట్టేది. పోనీ ఊరికే చూచివెళతాము. అమ్మాయి ఎక్కడున్నదో పిలవండి" అని అర్థించాడు.

దగ్గరగా వేసివున్న తలుపు తెరచి అమ్మను చూపించారు. మంచంమీద కూర్చుని భారతీదేవికి పాదసంవాహనం చేసే అమ్మ కనిపించింది రామన్నకు ఆశ్చర్యమూ, కష్టమూ కలిగి "కొంచెం బయటకురామ్మా" అని పిలిచాడు.

అమ్మ గబగబాలేచి వస్తూ తాతగారు తెచ్చిన అరిటిపండ్లు తీసుకొని రామన్న ఒడిలో వేసింది. క్షణంలో రామన్న కన్నులు నీటికుండలయినాయి. ఆనందంతో వివశుడై అమ్మ రెండు చేతులూ పట్టుకుని దగ్గరకు తీసుకొని చెక్కిళ్ళు పుణుకుతే "ఇవ్వాళ్ళ ఎంతోమంది అల్లాడిపోయారమ్మా" అంటూ "కాళ్ళు పిసుకుతుంటే నీచేతులు నొప్పి పుట్టలేదూ? లేతచేతులు ఎంత కందిపోయాయో చూడు" అని అమ్మ అరచేతులు చూస్తూ బాధపడ్డారు.

"మరి నేను మీకోసం రుబ్బే పచ్చడో? దానికి చేతులు కందిపోవడం లేదూ?" అమ్మ అంది. "నీవా అమ్మా పచ్చడి రుబ్బేది? అంత పచ్చడీ నీవేనా రుబ్బేది? నీవొక్కదానివేనా? అయినా నీవా?" నీవేనా రామన్న గిలగిల లాడిపోయాడు. రామన్న తమ్ముడు గోపాలం వచ్చి "నిజమే అమ్మాయిగారే నూరటం" అని ధృవపరిచాడు.

"అది కాదురా కాస్తోకూస్తో అయితే నూరచ్చు అంత పచ్చడి ఎక్కడ రుబ్బుతుంది" రామన్నకు బాధ కంటే ఆశ్చర్యం ఎక్కువైంది. "నిన్న చూచాను రోటినిండా చాలా పచ్చడి వుంది. పొత్రంతో కూడా అమ్మాయిగారు గిరగిర తిరుగుతున్నారు. అప్పుడు అమ్మాయిగార్ని చూస్తే బలే ముద్దొచ్చింది" అని గోపన్న చెప్పాడు. పనిమనిషి అంకమ్మ వచ్చి "ఇవ్వాళ బువ్వకు చంపారమ్మా" అమ్మతో అన్నాడు. రామన్న అంకమ్మను

ఆశ్చర్యంగా చూస్తూ "నీకూ అట్లాగే ఉన్నదీ? అందరికీ అంట్లుతోముతావు కదా? ఎవరూ ఇంతముద్ద పెట్టారు? నీవుకూడా అన్నానికి బాధపడాలీ?" అని అడిగారు.

పొరుగూళ్ళనుంచి బియ్యం తెచ్చుకుంటారు కదా? పనిచేసినందుకు డబ్బులు అణా ఎక్కువైనా ఇస్తారు కానీ అన్నంమాత్రం మెతుకైనా పెట్టరు. అన్నం మిగిలితే రాత్రిళ్లు వారే తింటారు.

"మాతల్లి ఎంతమంది కడుపుల్లో మంట చల్లారుస్తున్నాదో అన్నపూర్ణమ్మతల్లి" రామన్న గద్గద కంఠంతో అంటాడు, "ఇప్పుడే ఇట్లావుంది. ముందుముందు ఎట్లా ఉంటుందో" గోపన్న ఊహావిహగం భవిష్యదాకాశంలో విహరించింది.

అన్నపూర్ణమ్మాగారు భారతి కాళ్ళు పిసకమంటే ఎక్కడకు వెళ్ళావని అమ్మను మందలించింది. భారతి స్నానంచేసి ప్రదక్షణాకు వెళ్లే వేళ అయింది. అమ్మాయి ఇందాకనుంచీ పిసికిందికదా! అన్నం తిన్నావాలేదా అని ఒక్కరూ అడగరు. పనులు మాత్రం అందరూ శాసిస్తారు. చెట్టుకు కోసుకొచ్చినట్లుగా ఉన్నదని నొచ్చుకున్నారు చిదంబరరావుగారు.

అమ్మ ఏమీ మాట్లాడకుండా భారతిదేవి పాదాల దగ్గర కూర్చుంది అందరికీ కాఫీలు ఇవ్వబడ్డాయి. కానీ అమ్మకు ఇవ్వలేదు. అమ్మను కూడా తీసుకోమన్నారు చిదంబరరావుగారు. తనకు అలవాటు లేదు. కాఫీ సహించదని అంది అమ్మ. "నీకు సహించవా? వాళ్ళు ఇవ్వరా"? అన్నారు తాతగారు. "ఒకరోజు ఇవ్వబోతే వద్దన్నట్లున్నాన్లే. అప్పటినుండీ వాళ్ళు అడగరనుకుంటాను అంది అమ్మ".

చిదంబరరావుగారికి ఆ సమాధానం విని నవ్వు ఆగిందికాదు. గ్లాసులో కాఫీ చిందిపోయేటట్లు నవ్వి రెండూ సందిగ్ధంగానే వున్నాయి అని తాను కాఫీ ఇస్తానని తాగమన్నారు. అమ్మ ఆ కాఫీ అందుకుని తాగింది. అన్నపూర్ణమ్మగారికి కష్టంకలిగి అమ్మకు చంద్రమౌళి వారిపోలికలు వచ్చాయని అంది. భారతీదేవి ఆపోలికవస్తే బాగుపడేది అంటూ తల్లీ కూతుళ్ళు కాసేపు అమ్మ పోలికల గురించి వాదించుకున్నారు.

అమ్మ తనకు ఎవ్వరిపోలికలూ రాలేదని తన అమ్మా నాన్నా పోలికలే వచ్చాయంది. తాతగారు పకపకానవ్వి పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చిందంటారు. ఇది అట్లాలేదు. పిల్లిపోరు పిల్లిపోరు పిట్టతీర్చింది. రెండువైపులా పిల్లుల్ని చేసిందని

చమత్కరించారు. భారతీదేవిని తొందరగా స్నానం చేసి రమ్మని పూజ చేయిస్తానని రామాచార్యులుగారు చెప్పి "అమ్మ గురించి చాలా ప్రత్యేకంగానూ ప్రశస్తంగానూ చెప్పుకుంటున్నారు. ఈ అమ్మాయికి బీదలంటే చాలా ప్రేమట. అందరికీ అన్నం పచ్చళ్ళు దానం చేస్తుందట. అందుకని మావూరి చాకళ్ళు చాలా చాలా చెప్పుకుంటున్నారు. అదీగాక అమ్మాయి ముఖంలో చక్కటి వర్చస్సు ఉన్నది. ఆ వర్చుస్సులో ఎంతో ప్రశాంతత ఉన్నదని" రామాచార్యులు గారు స్తోత్రం ప్రారంభించారు.

ఎవరు ఎలా భావిస్తే అట్లా మూర్తీభవిస్తుంది. ఆ తేజస్సు మొన్నటివారం కొండారెడ్డి అనే కుర్రవాడికి తాను ఉపాసించే ఆంజనేయస్వామి అమ్మాయిలా కనపడుతూ ఉంటాడని, అతని మాటలకు నిదర్శనాలు కూడా చెప్పాడని తాతగారు అన్నారు.

ఏది ఏమైనా అమ్మ దగ్గర తొమ్మిది సం॥ల పిల్ల లక్షణాలేమి లేవు. క్షయ రోగి చేతిలో డబ్బులేక చాలా దూరం నుంచీ నడచి వచ్చాడు. ఆరోజు అతని చరిత్రనంతావిని అతని వద్ద చాలాసేపు కూర్చుంది. తరువాత విచారిస్తే తన మెడలో వున్నరెండు కాసులు తీసి ఇచ్చింది. అవి దొరికాయి అంతే చాలనుకొని ప్రదక్షిణాలు కూడా మానుకొని వెళ్ళిపోయాడు. చిన్నతనం కదా! అమ్మాయికి పాత్రఎరిగి దానం చేయటం తెలియదన్నారు రామాచార్యులుగారు.

ఒక్క క్షణం కూడా వృధాకాకుండా వెంటనే అమ్మ "మీకు రోజూ ఇక్కడ భోజనం పెట్టడం పాత్ర తెలిసిన దానమేనా? అర్చకులు దైవానికి ప్రతినిధులు ఎంతో వున్నతమైన స్థానం, కాబట్టి ప్రజలకు ఆదర్శంగా వ్యవహరించాలి. ఆవిగ్రహాలను చాటుచేసుకొని నిగ్రహం లేకుండా ప్రవర్తిస్తున్నావు. నీ విషయం చెప్పునీకు అక్కలూ, చెల్లెళ్లూ, అమ్మలేరా? ఇతర స్త్రీను ఎట్లా చూడాలీ? దైవాంశ కలవారని భావించే మీరేయిట్లా దిగజారితే ఇకసామన్య మనుషుల సంగతి ఆలోచించేదేమున్నదని" అమ్మ గబగబా అడిగింది.

"ఏమిటమ్మా కోప్పడుతున్నావు" అని తాతగారు అడిగారు "అదికాదు తాతగారూ, ఎవరికి వారు వారి సంగతి మర్చిపోయి లేక వారి సంగతి వదిలిపెట్టి మిగతా వారిని మాత్రమే దృష్టిలో తీసుకొని నిర్ణయాలు చేస్తారు. ఎవరిని వాళ్ళు

విమర్శించుకోవటం వివేకం. ఇతరులను విమర్శంచడం అవివేకం. నేను ఎవరికి ఏమి ఇచ్చినా దానం అనుకోను. వారి వస్తువే వారికిస్తున్నానని అనుకుంటాను. అందులోనా వాదాన్యతా లేదు, ఔదార్యమూలేదు. అటువంటిదేదైనా వున్న దనుకుంటే వారియోగ్యతా యోగ్యతలూ, అర్హతార్హతలూ పాత్రాతా పాత్రతలు విచారించాలి. వారిది వారికి ఇవ్వటంలో వారి మంచి చెడులతో సంబంధమేమున్నది? ఒకవేళ నేనే ఇస్తున్నానని మీరు అనుకుంటే నాకు వారి అవసరమే కనిపిస్తుంది. కానీ వారి అర్హత ప్రసక్తిరాదు" అని అమ్మ దీర్ఘోపన్యాసం ఇచ్చింది.

ఇక ఆ మాటలు వినలేక రామాచార్యులవారు "నేను వెళ్ళి వస్తానండి. డొక్కలో నొప్పి ఎక్కువగా వున్నది. అమ్మాయిగారిని పూజచేసుకోమని" కోరారు. భారతీదేవి ప్రదక్షణాలు ప్రారంభించి ఇరవై ఐదువ రోజు అవటంతో ఆమె ఆరోగ్యంలో కొంత సుగుణం కనిపించింది. మిగిలిన పదిహేను రోజులు అంటే మండలం రోజులు పూర్తిచేసుకొని బాపట్ల వెళ్ళాలని నిశ్చయించుకున్నారు.

★ ★ ★

# 25. అభేదదృష్టి

బారతీదేవి బయటజేరింది. "ఈప్రాంతంలో వుంటే దోషం పక్కవూరికి ఎక్కడకైనా వెళ్ళమని సలహా ఇచ్చారు. ఆనాడు భోరున వర్షం ఆమెలోపలికి రావటానికి వీలులేదు. బయటవర్షం. పావులూరు వెళ్లటానికయినా వాన వెలవాలి. వర్షంలో తడుస్తున్న కూతుర్ని చూచి అన్నపూర్ణమ్మగారు దుఃఖించింది. "ఎందుకత్తయ్యా ఏడుస్తావు? పిన్నిని లోపలికి వచ్చి కూర్చోమను, నిజంగా భారతి పిన్నికే దేముడ్ని మైలపడసే శక్తి వున్నప్పుడు, ఆదేవుడికి ప్రదక్షణాలెందుకని అన్నపూర్ణమ్మగారిని ఓదారుస్తూ అమ్మ ప్రశ్నించింది.

"ఏడిచినట్లే వుంది" అన్నది అన్నపూర్ణమ్మగారు, "ఏవరు ఏడిచినట్లువుంది" భారతి పిన్న రోడ్డుమీద వానలో చిలుచుంటే ఇందాక నువ్వు ఏడిస్తివే అలాగా" అని అమ్మ నవ్వింది. "వంటచేసి తీసుకువస్తాను. మీరు అన్నీ సర్దుకుని పావులూరు వెళ్ళండని అక్కడ రామాచార్యులుగారు మనకు సాయపడతారు" అని వంట మనిషి రాఘవయ్యగారు చెప్పారు.

రామాచార్యులుగారి సహాయం అవసరంలేదని అమ్మ ఖండించింది. మామూలుగానే వండుతున్నా కదా! నీవు తీసుకువెళ్ళేది ఒక్కప్లేటు అన్నమేగదా ఇంతమందికి ఎలా పెడ్తున్నావని రాఘవయ్యగారు ఆశ్చర్యంతో అమ్మను అడిగారు. "ఇక్కడ వుండే వాళ్ల అందరి ఇళ్ళల్లో కాస్తకాస్త అడిగి పెడ్తున్నానంది అమ్మ. అంట్లుతోమే వాళ్ళకే పట్టెడన్నం పెట్టరే నీకు పళ్లాలతో ఎవరు అందిస్తున్నారని" సందేహం తీరక మళ్లీ అడిగారు." నేను అడగ్గానే ఇస్తున్నారు. నన్ను చూస్తే ఇవ్వబుద్ధి అవుతోందేమో" అన్నది అమ్మ. కనుక్కుందాముపద అన్నాడు. బిజిబిళ్ళ రాఘవయ్య వలేలేవు. గుదిబండ రాఘవయ్యవలే ఉన్నావు. "నేను నీకు గుదిబండలా కనబడుతున్నానా" అని అన్నాడు.

అంతా కలిసి పావులూరు వెళ్ళారు. ఊరికి ముందే రామాచార్యులు కనిపించి కవి దేశయ్యగారని వున్నారు. వారిది పెద్దఇల్లు మీవాళ్ళే నియోగులు అని చెప్పారు. "ఎవరైతే మనకేమి? వినియోగపడితే సరి" అన్నది అమ్మ.

దేశయ్యగారింటికి వెళ్ళగానే ఆయన అమ్మను చంకన వేసుకొని "ఏమేవ్ ఈ

అమ్మాయిని చూచావూ, అంతా బాలాత్రిపురసుందరి వలే ఉన్నది." ఆయన భార్య రుక్మిణమ్మగారు వచ్చి ఆయన చంకనుండి అమ్మను తీసుకొని ముద్దుపెట్టుకుంటూ అంతా అమ్మవారి పోలికే అంది.

దేశయ్యగారు అన్నపూర్ణమ్మగారితో, "మనమంతా బంధువులమే. మీరు రావటం మాకు చాలా సంతోషంగా ఉన్నది. అందులోనూ యీ అమ్మాయి రావటం మాకు కన్నులపండుగగా, బ్రతుకులే పండినంత ఆనందంగా ఉన్నది. ఇవ్వాళ సాక్షాత్తు అమ్మవారే మా ఇంటికి వేంచేసినట్లుంది. నేటితో మాకు పిల్లలు లేరన్నకొరత తీరుతుంది. ఈ అమ్మాయిని మాకు పెంపుడ్వియండని" అడిగారు.

మూడు రోజలనుకున్నది దేశయ్య గారింట్లో పదిరోజలున్నారు. రోజూ వారింట్లో పండుగగా జరిగిపోయింది. అందరికీ దేశయ్యగారి దంపతులు నూతన వస్త్రాలు పెట్టారు. ఆరోజు భారతీదేవికి తెరలు అధికంగా వచ్చాయి. అన్నపూర్ణమ్మగారు విచారగ్రస్తయై "ఎందరి దేవుళ్ళకు మ్రొక్కినా ఫలితంలేదని" బాధపడ్డది.

"అత్తయ్యా! నూరు కొబ్బరికాయలు కొడతానని, వెయ్యిమందికి అన్నం పెడతాననీ దణ్ణము పెట్టుకో తగ్గిపోతుందని" అమ్మ చెప్పింది. "నేను పెట్టుకోకపోతే ఏమి? ఆదణ్ణం నీవే పెట్టు, బాలవాక్యం బ్రహ్మవాక్యం కదా! ఒకవేళ తగ్గుతుందేమో తగ్గితే నీవు చెప్పినట్లే చేద్దామంది అన్నపూర్ణమ్మగారు.

ఇంతకూ ఏదేముడికి మొక్కుకోమన్నావో చెప్పమ్మా అని దేశయ్యగారు అడిగారు. "దేవుడన్నానుకానీ ఇంతమంది దేవుళ్లుంటారని నాకు తెలియదు. అదేదో మనకు మించినది మనకు అర్థంకానిది, ఒక శక్తి ఉన్నది కదా! ఆశక్తికి" అని చెప్పింది. అన్నపూర్ణమ్మగారు అంగీకరించింది. ఆనాటినుండీ ఆ ఊరిలో ఉన్నన్నాళ్ళు భారతీదేవికి తెరలురాలేదు.

ఒకరోజున రామాచార్యులుగారు ఆ ఆంజనేయస్వామి మహత్యం గురించి ఎంతో చెప్పారు. అక్కడున్న వారందరూ కూడా ఎన్నో అనుభవాలు వివరించారు. అందరూ అమ్మను కూడా ప్రదక్షణాలు చేయమన్నారు. అమ్మ ప్రదక్షణాలు చేస్తూ ప్రసాదం కోసం రాఘవయ్యగారిని పెసరపప్పు అడిగింది. పావులూరు వెళ్లి వచ్చినప్పటినుంచీ అన్నపూర్ణమ్మగారికి రాఘవయ్యగారిమీద కోపంగా వుంది

పావులూరిలోని చాకలాళ్ళు, పనివాళ్ళు రోజు వారికి అన్నం పచ్చళ్ళు అమ్మ పెడ్తుందని చెప్పారు. అవేవో రాఘవయ్యగారు అమ్మకు దొంగతనంగా ఇస్తారని అన్నపూర్ణమ్మగారికి అనుమానం.

"ప్రసాదంగా నాకేమైనా ఇస్తారా?" అని అడిగింది. బెల్లము, కొంచెం పెసరపప్పు అమ్మకిచ్చారు. అమ్మ పరుగెత్తింది. భారతీదేవి అమ్మ చెయ్యపట్టుకొని "అవి ఏమిటి?" అని అడిగింది. అమ్మ ఒడి చూపించింది. "ఎక్కడకు పట్టుకెళ్తాన్నావు? ఎవరు పెట్టారు? బుద్ధిలేదా?" అని అమ్మ చెంపమీద కొట్టింది. ఆశబ్దం విని రాఘవయ్యగారు వచ్చారు. ఆయన్ని చూచి అమ్మని ఇంకొక దెబ్బ కొట్టింది. "అమ్మాయి ఏమీ చేయలేదు. నేనే పెట్టాను. అమ్మాయిని అనవసరంగా కొట్టకండి" అని విలవిలలాడారు రాఘవయ్యగారు. అంతలో అన్నపూర్ణమ్మగారు వచ్చి కూతుర్ని మందలిస్తూ దానిది అసలే మైదాపిండి వంటి శరీరం, ఎట్లా కందిందో చూడా అన్నారు. అమ్మ మౌనంగా నిల్చుంది. అన్నపూర్ణగారు ప్రేమతోనూ, జాలితోనూ అమ్మను దగ్గరకు తీసుకున్నారు.

ప్రదక్షణాలు చేయటం ఎలాగా అని ఆలోచిస్తుంటే ఎదురుగా వేరుశెనగ చేను కనిపించింది. అమ్మ చేనుకు వెళ్ళి కాయలు కోస్తుంటే రైతు చూచి కేక వేశాడు. అమ్మ ఆ కేకను విన్నది. కానీ కాయలు కోయటం విరమించలేదు. కఱ్ఱవిసిరేశాడు. అమ్మ పక్కనే పడ్డది. ఈవాళ ఎందుకో అందరికీ నన్ను కొట్టాలనిపిస్తోంది అనుకుంటూ చేతిలోని శనగ కొమ్మకుగల కాయలను లాగింది. అనుకోకుండా చెట్టుపూర్తిగా చేతిలోకి వచ్చింది.

రైతు ఎదురుగా నిలుచుని తదేకంగా అమ్మను చూస్తున్నాడు అమ్మ ఒడిలోని కాయలను నేలపై కుమ్మరించింది. అమ్మ ఆచెట్టు వేరున ఉన్న మట్టిగడ్డలను వలుచుకొని ఒడిలో వేసుకు ముందుకు సాగింది. అతని కన్నులు మూత పడలేదు. నోరుతెరిపిన పడలేదు. అమ్మ కొన్ని గజాలు ముందుకు నడిచింది. నిత్యమూ తనచేనును కాచే వనదేవతయా ఈ అమ్మాయి? అన్న ఆలోచన కలిగింది. అతని గుండెలు గబగబా కొట్టుకున్నాయి. తాను అపరాధమో చేశానని బాధపడ్డాడు.

పరుగుపరుగున అమ్మకెదురుగా వచ్చి ముకుళితహస్తుడై "ఆమట్టి బెడ్డలు పారబోయమ్మా నీకు కావసినన్ని శెనగకాయలు కోసి ఇస్తాను. దుర్మార్గుణ్ణి, కృతఘ్నుడ్ని

నీకు అపకారం తలపెట్టాను. కళ్లుతగలలేదు. కాబట్టి సరిపోయింది. లేకపోతే నేనేమైపోయి ఉండేవాడినో," అని గజగజ వణుకుతూ దోసెడు కోసి "పట్టమ్మా కాయలు నీ ఒడిలో పోస్తాను" మట్టిబెడ్డలు పారబోయమన్నాడు. "మట్టిబెడ్డలు పారపోయటం మెందుకు? నాకు శనగకాయలు వద్దు. మట్టిలో వుండే గుణమే గొప్పది. మట్టిగడ్డలు నివేదన చేస్తే వండిన వంటలన్నీ నివేదన చేసినట్లే" అని నిర్మొహమాటంగా, స్పష్టంగా తన ఉద్దేశ్యాన్ని వెల్లడిచేసింది.

"తప్పు తల్లీ మట్టిగడ్డలు నివేదన చేయకూడదు. శనగకాయలు స్వామినివేదనకు తీసుకు వెళ్తున్నావేమిటి? ఇక్కడకు ఇదివరకు ఎప్పుడైనా వచ్చావా? "అతని కంఠంలో శోకం, లాలనా, వేడికోలు ముప్పిరి గొన్నాయి.

తాను ఎప్పుడూ రాలేదని అన్నిటికీ ఇదే మొదలని చెప్పింది. అన్నీ అంటే అడిగాడు రైతు. పూజ చేయాలన్న భావం యీరోజే కలిగిందని, ఈ చేనుకు ఈ రోజే వచ్చానని, ఈ రోజే దేవుడికి నివేదన చేయాలనుకున్నాని, ఇప్పుడు మట్టిగడ్డలు మాత్రమే తనకున్నవని ఎవరూ అభ్యంతరపెట్టేవికావు కనక వాటినే నివేదన చెద్దామనుకున్నానంటూ అమ్మ పరుగెత్తింది.

అమ్మ పరుగెత్తుతుంటే భాగవతంలో చెప్పబడిన బాలగోపాలుడు పరుగెత్తుఉన్నట్లు, సౌందర్య లహరియై ప్రవహించినట్టుగానూ, తన అదృష్టమేదో తన నుండీ దూరమవుతున్నట్లుగాను ద్యోతికమైంది.

అమ్మ అ మట్టిగడ్డలతోనే నూట ఎనిమిది ప్రదక్షణాలు చేసి, వాటినే ఆంజనేయస్వామికి నివేదన చేసి కనిపించిన వారందరికీ ఆ గడ్డలనే ప్రసాదంగా పంచింది.

ఎవరికి వారు ప్రసాదం అనగానే ఆశతో చేతులు చాచారు. చేతిలోపడ్డ మట్టిగడ్డను చూచి నివ్వెరపోయారు. చేతిలోని మట్టిగడ్డనుండీ ప్రసారితమయ్యే పరిమళానికి ఆకర్షితులై ఆమట్టి గడ్డలనే నోటిలో వేసుకొని ఆ రుచికి ముగ్ధులై పోయారు.

ఆ అపూర్వ సంఘటనకు కొండారెడ్డి అనే అతడు విస్మితుడై" "ఈ మట్టి ఎక్కడనుంచీ తెచ్చావమ్మా?" అని అడిగారు. "ఆ మట్టివున్నచోటనుంచే" అని అమ్మ జవాబిచ్చింది."

అంతలో శనగకాయలు రైతు దోసిలినిండా కాయలతో దేవాలయానికి వచ్చాడు. అమ్మ ప్రసాదం ఇవ్వటం కోసం చేయిచాపింది. అతను మారు మాట్లాడకుండా తనచేతిలోని కాయలు క్రిందపోసి ఆ ప్రసాదం అందుకుని కన్నులకు అద్దుకొని స్వీకరించాడు.

అందరూ వింతగా చెప్పుకొని ఆనందిస్తూ ఆప్రసాదాన్ని భారతీదేవికి, ఇతరులకూ పెట్టారు. "అందులో ఏమున్నది? అమట్టికి బెల్లం, సెంటూ పూసిందేమో? అందుకే అంత రుచివాసన అని ఆమె అన్నది. మా ఎదురుగానే మట్టిని తీసుకొని నివేదన చేసి ప్రసాదంగా పంచిందని చెప్పారు కొందరు.

"పెరటిచెట్టు ముందుకు పనికిరాదు" అన్నారు మరికొందరు. నిజాన్ని గుర్తించటం చాలా కష్టం అన్నారు" కొందరూ రాఘవయ్య గారికి ఇదంతా అర్థంకాక "నీవు మట్టిని దేవుడికి నివేదన చేయటం ఏమిటి? ప్రసాదంగా అందరికీ పంచటం ఏమిటి? ఈ విమర్శలెందుకని అడిగారు.

నివేదనకు నియమమేమున్నది? మనకు ఏదివుంటే దేవుడికి అది సమర్పిస్తాము. దేవుడు పండ్లయితేనే పుచ్చుకుంటానని అనలేదుగా? బంగారం అయితేనే స్వీకరిస్తాను మట్టి అయితే పనికిరాదని చెప్పలేదుగా మనకు కలిగిందేదో దానినే సంతోషంగా నివేదన చేస్తాము. నాకు ఉన్నది మట్టీ ఆసమయంలో నాకు అందింది మట్టి కనుకనే దానిని నివేదన చేశాను. దేవుడికి ఏది నివేదన చేస్తామో మనకు అదే ప్రసాదం. అంతవరకే తెలుసునాకు. మరి ఈ వాసనలెక్కడ నుండీ వచ్చాయో దానిరుచి ఏమిటో నాకు తెలియదు. ఇక అనేక విమర్శలంటారా? "వింటే విమర్శకాని, కంటే విమర్శలేదు. కన్నావాళ్లు చెప్తున్నారు. విన్నవాళ్లు చప్పరిస్తున్నారు. కన్నవాడిది అనుభవం. విన్నవాడికి అనుమానం" అని వివరించింది.

అమ్మ వివరిస్తుంటే ఆ క్షణంలో రాఘవయ్యగారికి అమ్మ రూపంలో, అమ్మ కంఠంలో ఏదో అతనికి అర్థంకాని విడమరిచి చెప్పలేని మార్పు గోచరించింది.

★ ★ ★

# 26. ప్రేమనాకు సహజం

కొందరు అమ్మను స్తుతిస్తూ, కొందరు ఆశ్చర్యం ప్రకటిస్తూ ఎవరిదారిన వారు వెళ్ళారు. అమ్మ ఇంట్లోకి రాగానే భారతిదేవి, "ఇంతసేపూ ఎక్కడికి వెళ్ళావు? ఏమిటా వేషాలని" అడిగింది. అమ్మ ఏమి మాట్లాడలేదు. "మాట్లాడవేమి బూటకాలు నేర్చుకుంటున్నావు. ప్రపంచాన్ని మోసంచేసే పనులు నేర్చుకోకు. చిన్నప్పుడే ఇలావుంటే పెద్దయితే ఎట్లావుంటావో" అని మందలిస్తుండగానే" నేను వచ్చింది నాటకం కోసమే" అని నిశ్చయంగా పలికిన మాటలకు అక్కడున్న వారందరూ ఆశ్చర్యపోయారు. అదే సమయంలో నాన్నగారు భారతిదేవిని చూడటానికి వచ్చారు. ప్రదక్షణాలు అయితే వీళ్ళను తీసుకువెళ్తానన్నారు.

అందరూ భోజనానికి కూర్చున్నారు. అమ్మను ఎంతబతిమిలాడినా తినలేదు" లోపల స్వయంపాకం ఎన్ని అన్నా తనను కాదన్నట్లే ఉంటుంది. తనకు ఎంతతోస్తే అంతే, ఎవరిమాట సుతరామూ వినదు. పువ్వులా మెత్తగా కనిపిస్తుంది కానీ రాతికంటే కూడా కఠినంరా" అని భారతీదేవి స్తోత్ర పాఠం వల్లిస్తుంది."

"నాకు ఇదివరకే తెలుసు. ఏభావం అయినా లోపల ఉండవలసినదే. క్రియలో కనపడవలసిందే. కానీ మాటల్లోకి రానివ్వదు. నాకు బాగా అనుభవమే" అన్నారు నాన్నగారు.

భారతిదేవి జరిగిన విషయం వివరిస్తూ "నేను కోపడ్డానని, నేను ఏమన్నా తన బాగు కోసమే కదా తన బాగు తెలుసుకోలేని పిచ్చిపిల్ల అవుతుందని" అన్నది. దానికి నాన్నగారు "అది అంతా మోసమేనంటావా" అన్నారు. "కాకపోతే మంచిదే. అయితే తన్నులు తింటుంది. అవునో కాదో చెప్పేదెవరు అన్నారు" నాన్నగారు. తనంతట తానుగా అయితే ఇప్పుడే చెప్పవచ్చు ఇతరులు తెలసుకోవాలంటే కొంతకాలం పడుతుంది. అన్నది మరి ఎన్నాళ్లకు మోసం బయటపడకపోతే అన్నారు నాన్నగారు. "అది సత్యమే అనుకోవాలి అని భారతిదేవి అంది. మోసాన్ని వివరిస్తుంటే నాన్నగారు కుతూహలంగా వింటూ" ఏం అనసూయా, భారతి అనేదేమిటి? నీవు ఏమంటావు" అని అడిగారు.

అమ్మ ఏమీ మాట్లాడలేదు. ముందు అన్నంతిను తరువాత మాట్లాడుకుందాము అన్నారు. ఆకలి కావటంలేదంది అమ్మ. ఏంతిన్నావమ్మా ఆకలి కాకపోవటానికి? అడిగింది అన్నపూర్ణమ్మగారు. "తినేవన్నీ ఏమిటి? అని చమత్కరించారు రఘువయ్యగారు. "నీకు ఎవరుకొనిపెట్టారు? "అని ఆమె అడిగింది. భూమిమీదకు వచ్చేటప్పుడే తెచ్చుకున్నను. ఆమాట అర్థంకాక ఏమిటి అన్నది. 'బాల్యంలోనే తల్లి లేకపోవటం చింతేకదా!" అని రాఘవయ్యగారు సమన్వయం చేయటానికి ప్రయత్నించారు.

భారతిదేవిని అత్తవారింటికి పంపించారు. పదిరోజులు గడవగానే మళ్ళీ తెరలు మొదలయినాయి. అందువల్ల తిరిగి ఆమెను పుట్టింటికి తీసుకు వచ్చారు. చిదంబరరావు తాతగారు ఆందోళిత మనస్కులైనారు. భారతీ ఆరోగ్య విషయంలో ఏమిచేయటానికి తోచక బాధపడ్తుంటే చందలూరు మహలక్ష్మి అమ్మవారు ప్రసిద్ధి అని అర్చకుడు అమ్మవారి ఆదేశంగా తానే ప్రశ్నలకు సమాధానాలు, సమస్యలకు పరిష్కారమార్గం అందిస్తారని తెలిసింది.

చిదంబరరావుగారు అన్నపూర్ణమ్మగారు, భారతిదేవి, అమ్మ కలిసి చందలూరు వెళ్ళారు. అక్కడ అమ్మణ్ణిని భారతిదేవి గురించి ప్రశ్నిస్తే అమ్మ లక్షణాలు, గృహపరిసితులు వివరించి గృహపీడన వున్నట్లు వాక్కు ప్రసాదింపబడినది. చిదంబరరావుగారు నివారణోపాయం అర్థించారు. కొన్ని నియమాలు, క్రమశిక్షణా, నివేదన విషయం అమ్మణ్ణి ఆదేశానుసారం తెలియచేసారు.

భారతిని, ఆమె తల్లిదండ్రులను కూడా క్రిందే పడుకోమని చెప్తూ రెండు నెలలు గడిచిన తర్వాత మళ్ళీ ఎట్లావున్నది చెప్పమన్నారు. అర్చకునికి అమ్మను చూపించి "అ అమ్మాయి గురించి ఏమైనా చెప్తారా అని అడిగారు. "అమ్మణ్ణికి ఏమీ వాక్కు రావటంలేదు." అన్నారు అర్చకులు చిదంబరరావుగారు పట్టలేని సంతోషంతో" చూచారా అమ్మయే అమ్మణ్ణి అయితే మరి అమ్మణ్ణికి యిక వాక్కు ఏమీ వస్తుంది.

ఆనాటినుండి భారతీదేవి చందలూరి మహలక్ష్మమ్మవారిని నిష్ఠగా పూజించడం మొదలు పెట్టింది. సీతాపతితాతగారు అమ్మను తెనాలిలో తాతగారింటిలోగానీ, నంబూరులో వారి పెద్దతల్లి వద్దగాని దించాలని ఉద్దేశంతో" తెనాలి తీసుకు వెళతాను

బయలుదేరమని" అమ్మతో చెప్పారు. "పాపదిగులు పడ్తుంది రాలేనని, పాపను, లోకనాథాన్ని వదిలిపెట్టి వుండలేనని చెప్పింది.

నాన్నగారు స్కూలు ఫైనల్ పాసైకాలేజీలో చేరే ప్రయత్నంలో వున్నారు. డబ్బు గురించి చర్చించుకుంటే అదివిని అమ్మ తనమెడలోని నానుతాడు ఇస్తాను. ఉపయోగపడితే వాడుకోమని కోరింది. భారతీదేవి, నాన్నగారు దానికి సమ్మతించలేదు? "ఈ గొలుసుకు ఇంతకంటే సార్ధకత ఏముంటుంది. తీసుకోండి" అంటూ గొలుసు ఇవ్వబోయింది.

"అనసూయకు ఎందుకోగాని మీకుటుంబం అంటే చెప్పలేని ప్రేమ. అందరిగురించి దిగులు. తనవయస్సుకు మించి ఆలోచిస్తుంటుంది. ఏది ఏమైనా నీవు అనసూయను చేసుకుంటే నీకు కొంతలో కొంత హాయి దొరుకుందేమో అన్నయ్యా" అంటూ భారతీదేవి నాన్నగారికి సూచనచేసింది.

తనకో సంబంధం వచ్చిందని, ఆయనపోలీసు ఇనస్పెక్టర్ ఆయనకు మగపిల్లలు లేరు. అందువల్ల నాన్నగారిని ఇల్లరికం తీసుకొని, మంచి ఉద్యోగం ఇప్పిస్తానన్నారు. వాళ్ళ కుటుంబానికి అన్ని విధాల సహాయపడ్తామన్నారని, కాని అమ్మ (కనకమ్మగారు) ఒప్పుకోలేదు, అని నాన్నగారు చెప్పారు.

మీ కుటుంబానికి అనసూయ అయితేనే అనుకూలంగా వుంటుంది. అయినా తెనాలివాళ్ళకు భాగ్యవంతులకు, ఇచ్చుకోవాలని ఉన్నట్లుంది. "మీ అత్తయ్య ఉంటే ఎలాగూ ఒప్పుకునేది కాదు. మామయ్య మాఅమ్మ ఎలాచెపితే అలా వింటాడు. మరిడమ్మగారికి ఎలాగూ ఇష్టమే. అనసూయ నిన్నే చేసుకుంటానని చెప్పిందని భారతీదేవి వివరించింది.

నాన్నగారు తమ కుటుంబపు చిక్కులు, యిబ్బందులూ చెపుతూ "ఏది ఎలావున్నా మా అమ్మ మాట తప్పనిసరి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసారు. ఆ మర్నాడే సీతాపతిగారు అమ్మను తెనాలి తీసుకువెళ్ళకుండానే, అమ్మ అమ్మమ్మ జానకమ్మగారు వచ్చింది. ఎదురుగా వచ్చిన అమ్మను చూచి ఎత్తుకుందామని చేతులు చాపింది. అమ్మ ఆమెకు అందక రివ్వున లోపలికి వెళ్ళి లోకనాథం చెయ్యిపట్టుకొని రోజూ

నీతో ఎవరు ఆడతారు? పాపనేమో అత్తయ్య సరిగా చూడదు. వేళకు పాలు పట్టదు అని బాధపడ్డది.

"మామీద నీకెందుకు ఇంతప్రేమ. మేము నీకేమీ చేయటం లేదుగా అని అమాయకంగా అడిగారు. "ప్రేమ నాకు సహజం" ఎవరు కష్టపడుతున్నా నాకు అట్లాగే ఉంటుంది. మీరు నాకేదో చేయాలని నేను ఎప్పుడూ కోరుకోను నీవు దిగులు పడక పాపను జాగ్రత్తగా చూడు నేను వెళ్లక తప్పేట్టులేదని" బుజ్జగించింది అమ్మ.

ఆరోజునే సీతాపతిగారి ద్వితీయ కళత్రం కామేశ్వరమ్మగారు రజస్వల అయినట్లు శుభలేఖ వచ్చింది. ఇరువది ఐదో రోజున శాంతి చేయటానికి నిశ్చయించారు. అమ్మ ఆ కబురు విని ఇక మాపిన్ని మా ఇంటికి వస్తుందని" అమితంగా సంతోషించింది. జానకమ్మగారిని అమ్మను తెనాలిలో దించి సీతాపతిగారు వెనక్కు ప్రయాణమవగానే అమ్మ ముఖం చూచి "అది దిగులు పడ్తుందేమో. ఇంత బలవంతంగా ఇక్కడ ఎందుకు చిదంబరాన్ని వదిలి వుండగలదా అన్నారు తాతగారు. "ఏం వుండలేకపోవటాలు, తల్లిపోతే వుండటంలా? ఇది పోయినా అదిబ్రతికేదేమో అని సీతాపతిగారు దారితప్పి మాట్లాడుతుంటే అది వినలేక వెంకట సుబ్బారావుగారు తప్పుకున్నారు.

అమ్మ తన ఇష్టాఇష్టాలతో నిమిత్తం లేకుండా తెనాలిలో పదిరోజులున్నది. తెనాలినుండీ అమ్మ పినతల్లి భాగ్యమ్మగారు నంబూరు తీసుకువెళ్ళింది. నంబూరులో ఇరుగుపొరుగు వారనేకులు ఏదో విశేషం ఉన్నట్లుగా అమ్మను చూడటానికి వచ్చి ఎంతసేపటికి వెళ్ళకపోయేటప్పటికి భాగ్యమ్మగారు విసుగుతో ప్రొద్దుగూకింది ఇంటికి వెళ్ళమని చెప్పింది. అమ్మయిని విడిచి పెట్టి వెళ్ళలేకుండా వున్నాము అన్నారు. భాగ్యమ్మగారికి అర్థంగాక అంతగా వెళ్ళలేకపోవడమేమిటని అడిగింది.

రంగమ్మ కూతురు, తల్లిలేనిపిల్లకదా అనీ చూచి పోదామని వచ్చాము. కాని అమ్మాయి ముఖంలో ఏదో వివరించి చెప్పలేని శక్తి మమ్మల్ని బంధించిందని చెప్పారు. అంతలో భాగ్యమ్మగారి భర్తయిన గోపరాజుగారు వచ్చారు. ఆయన నంబూరి కరణంగారు. వారికి చిదంబరరావుగారిలా అమ్మను సూరయ్యా అని పిలవటమే అలవాటు. "భాగ్యా! అమ్మయిని బాగా చూడు. ఇంకెక్కడికీ వెళ్ళను ఇక్కడే వుంటాననేలాగా చూడమని" చెప్పారు.

'సూరయ్యా గుడ్డలున్నాయా కట్టుకోవడానికి?" అని అడిగారు. "కట్టుకునే ఉ న్నానుగా, లేకపోతే ఎట్లా కట్టుకుంటాను?" అన్నది అమ్మ చిన్నగా నవ్వుతూ. ఇవికాదమ్మా ఇవి విడిస్తే కట్టుకోను గుడ్డలు కావాలికదా! అన్నారు. భార్యను పిలిచి పిల్లకు ఎన్ని గుడ్డలుండాలోనీకు తెలియదూ? అట్లాగే చూచుకోవాలి అని భార్యకు చెప్పారు. వెంటనే భాగ్యమ్మగారు అమ్మ సంచీ తీసిచూచి "రెండేవున్నాయి" అన్నది. గుంటూరునుండి అరడజను కుట్టించి పంపుతాను. జాగ్రత్తగా చూడు అమ్మాయిని. రోజు గుర్రం మీద సాయంత్రం షికారుకు పంపించమని చెప్పారు.

భాగ్యమ్మగారు అమ్మను అతిశ్రద్ధగా చూస్తున్నది. సాయంత్రం షికారుకు పంపుతున్నది. ఒకరోజు వారి అమ్మాయి సావిత్రిని తనతో పాటు ఎక్కించుకొని కంతేరు వరకూ స్వయంగా గుర్రాన్ని అమ్మ స్వారీ చేసింది.

అకస్మాత్తుగా అమ్మకు జ్వరం వచ్చింది. శరీరమంతా పెద్దపెద్ద దద్దుర్లు ఎక్కాయి. డాక్టర్ను పిలిచి చూపించారు. చింతపండు పులుసురాసి కొద్దిసేపు వుంచి కడిగి వెచ్చని బూడిదరాసి గొంగళి కప్పి పడుకోబెట్టమన్నారు. డాక్టరుగారు చెప్పినట్లుగానే చికిత్స చేసారు. నాలుగురోజులకు దద్దుర్లు తగ్గాయకాని, జ్వరం అలాగేవుంది.

రెండు నెలలైనా జ్వరం తగ్గకపోయెటప్పటికి సన్నిపాత జ్వరమని భయపడి డాక్టరు కణికలు చాది పోశాడు. మందుల వేడికి నోరంతా పొక్కింది. ఎన్ని మందులు వాడినా తగ్గకపోగా నాభి దగ్గరనుంచీ గొంతు వరకూ ఒకటేపుండయి పోయింది.

గోపరాజు గారికి గుంటూరులో రఘవరావు మామయ్య కనిపిస్తే అమ్మకు జ్వరంగావుందని చెప్పారు. అనసూయ దిగులుపడి వుంటుంది తాతమ్మను, నాన్నను వదిలి ఇంతకాలం ఎప్పుడూ వుండలేదు. అప్పుడే మూడు నెలలయింది కదా మందులు వాడకండి అని చెప్పాడు.

వారంరోజులుకు సీతాపతిగారు నంబూరు వచ్చారు. ఆయన్ని చూడగానే చివాలున లేచి కూర్చుని అమ్మ అందర్ని ఆశ్చర్యపరచింది. "ఇంటికివెళ్దాం వస్తావా?" అని సీతాపతిగారు అడిగారు. "దీనికి ఎప్పటినుంచి జ్వరం". అని అడిగారు "పదిరోజులు ఏమీ బాగుందో అప్పటినుంచీ ఒకటే జ్వరం", అని భాగ్యమ్మగారు చెప్పింది.

"మీకు అలవాటు అవుతుందేమో, అయితే మీవైపున మంచి సంబంధం చూచి మీరే చేసుకుంటారు నాకు బాధ్యత తప్పుతుందని అనుకున్నాను," అన్నారు సీతాపతిగారు. తెల్లవారు జామునే బయలుదేరదామనుకున్నా ప్రయాణ సన్నాహం ఏడున్నర గంటలకు కానీ పూర్తికాలేదు. ఎవరో ముఖ్యబంధువులు పెద్దవారు ప్రయాణం అయినట్లుగ్గా ఇరుగుపొరుగు అనేకులు వాకిట్లో గుమిగూడారు. రెండునెలలగా జ్వరంగావున్నా అమ్మ ముఖంలో తరగని తేజస్సును చూచి వారందరూ అమితాశ్చర్యచకితులయ్యారు.

అమ్మనోటిపుండు, గొంతువాపు స్పష్టంగా కనిపిస్తుంటే జబ్బు ఒకటి మందు ఒకటి అయింది తల్లిలేని పిల్లకదా దాన్ని బాగుచేద్దామని తీసుకు వస్తే ఇలా జరిగిందని భాగ్యమ్మగారు బాధపడింది. అమ్మ భాగ్యమ్మగారికి నమస్కారం చేసింది.

అమ్మను ఎత్తుకోవటానికి మోతాదును పిలిపిస్తే అమ్మాయిని ఎత్తుకుని తీసుకువస్తాడన్నారు. దానికి అమ్మ "మోతాదు ఎందుకూ? అతనికి మాత్రం నేను బరువుకాదూ" అన్నది నీరసించిన గొంతుతో అమ్మ మాటలు వినగానే భాగ్యమ్మగారి కళ్లు క్షణంలో అశ్రుపూర్ణాలయ్యాయి. మోతాదుకు శ్రమ ఇవ్వకుండా అమ్మే నడచి రైల్వే స్టేషన్‌కు వచ్చింది. చేరగానే ట్రైన్ వచ్చింది. ట్రెయిన్ ఎక్కి మోతాదును దగ్గరకు పిలిచి తనకు భాగ్యమ్మగారు ఇచ్చిన ఐదు రూపాయిలిచ్చి ఏమైనా కొనుక్కోనాయినా! ఎవరికీ చెప్పకు" అంది.

తనకు వద్దని తానే చేతిలో ఏమైనా పెట్టవలసిందని అన్నాడు. "అరవకుండా తీసుకో పెద్దగా మాట్లాడకు," అంటూ అతనిని హెచ్చరించింది. సీతాపతిగారు బాపట్ల స్టేషన్‌లో దిగి రోడ్డుమీదకు వచ్చేటప్పటికి చిదంబరరావుగారు ఎదురువచ్చారు. అమ్మను చూడగానే దుఃఖం పెల్లుబికింది. అమాంతం అమ్మను ఎత్తుకుని ఇంటికి తీసుకు వచ్చారు. అమ్మను అక్కడ దింపి ఆ సాయంకాలమే సీతాపతి గారు మన్నవ వెళ్ళారు.

అమ్మ నోటిపుండుకు ఆయుర్వేద వైద్యులైన సాంబయ్యగారు మందు ఇస్తున్నారు. "అసలు ఇది ఏమి పుండమ్మా? తాతగారు అడిగారు. "మిమ్మల్ని వదిలిపెట్టి నంబూరులో వుండవలసి వచ్చేనే అనేపుండు" అన్నది అమ్మ. "మమ్మల్ని వదిలిపెడితే నీక్కాడ దిగులుంటుందా? అని అడిగారు. "నాకు అంత వాత్సల్యం లేకపోతే మీదగ్గర ఎట్లావుంటాను?" అంది. నీకు వాత్సల్యం కొంతమంది మీదవుండి, కొంతమంది

మీద ఉండదా ఏమిటి? ఎక్కడున్నా నీకు ఒకటే కదా అన్నారు తాతగారు. అందరికంటే తండ్రియైన సీతాపతిగారి మీద తాతమ్మమీద ఆతరువాత మీరు... మీమీద వాత్సల్యంకంటే సహవాసం బాగుంటుంది అన్నది అమ్మ.

"నేనేమయినా పసివాడినా నీవు సావాసం చేయటానికి, మీనాన్న ఉన్నప్పుడు నాన్నమీద కంటే నామీదనే ఎక్కువ ప్రేమ చూపిస్తావు. వాత్సల్యం అంటే తల్లికో తండ్రికో వర్తిస్తుంది. నీవు పసిపిల్లవూ, అమ్మాయివి కదా? అన్నారు. మాయీ అంటే అమ్మ అనే కదా! అన్నది అమ్మ.

అంత దిగులుగా వున్నప్పుడు వచ్చేయకపోయావా అమ్మా! అలాపాడు మందులన్నీ మింగకపోతే అన్నారు. "మింగవలసిన విధివుంటే ఎట్లా తప్పుతుంది? అప్పుడే ఏమయింది నాపని అంది.

డాక్టరు సాంబయ్యగారు వచ్చి మౌనస్వాములవారిని దర్శించి వచ్చానని చెప్పారు. ఆయన ఎక్కడవున్నారంటే చీరాలలో నూనె పానకాలుగారి తోటలో ఉన్నారు. ఆ సంభాషణ విని "ఆయన మాట్లాడరా తాతగారూ?" అని అడిగింది. "మాట్లాడరమ్మా" అన్నారు తాతగారు, "మరి మనతో సంభాషణ ఎట్లా చేస్తారు?" అని అమ్మ సందేహం వ్యక్తపరచింది. కాగితంమీద వ్రాసి ఇస్తారని అన్నారు "మనమాటలు వారికి వినపడతాయా?" అన్నది అమ్మ. "వినపడతాయి", అన్నారు తాతగారు "మనం అనేది వినపడి, మనకు సమాధానం వ్రాసి ఇచ్చేటప్పుడు యింకా మౌనమేమిటి? అంది అమ్మ.

"మౌనం అంటే మాదృష్టిలో అంతే. మరి నవ్వనే మౌనం ఎట్లాగుండాలి?" అని చిదంబరరావుగారు కుతూహలంగా అడుగుతుంటే సాంబయ్యగారు విసుక్కుని "చిన్నపిల్లవు-నీకేమి తెలుసు? నీవు మాట్లాడకు". అని గద్దించారు.

అమ్మ చిరునవ్వులు చిందిస్తూ "నన్నుకూడా మౌనంగా ఉండమంటారా? కానీ నాకు చదువు రాదుగా మరి వ్రాయటానికి" అన చమత్కరించింది. ఆ చమత్కారానికి చకితులై" ఎవరండి ఈ అమ్మాయి? అని అడిగారు. "మా అమ్మాయే" అని సమాధానం చెబుతుంటే తాతగారి సర్వేంద్రియాలు హర్షపులకితమైనాయి.

"పిలిపించారుట ఎందుకని?" సాంబయ్యగారు అడిగారు. "అమ్మాయి నోరు

చూచారా?" అన్నారు తాతగారు. "కనిపిస్తూనే వుందిగా" అన్నారు సాంబయ్యగారు. "నోరు కనిపిస్తున్నదా? వినిపిస్తున్నదా?"అమ్మ దబాయించింది వెంటనే సాంబయ్యగారు చతికిలబడి" అదికాదమ్మ. పుండు కనిపిస్తున్నది అన్నారు అని అమ్మతో చెప్పితాతగారితో" "పంతులుగారు ఈ అమ్మాయి ఇంత వ్యాఖ్యానంగా మాట్లాడుతోందేమిటి?" అని అడిగారు. "వ్యాఖ్యానం అంటే వివరించటమేగా. నేను వివరిస్తున్నాను. మీరు విమర్శిస్తున్నారు అన్నది అమ్మ. "చాలా గడుసుపిల్ల వలె ఉన్నదే ఈ అమ్మాయి మీకుమల్లె కవిత్వంకూడా చెప్తుందా పంతులుగారు అన్నాడు మధ్యలో అడ్డువచ్చి "నాగొంతులోనూ అంగిట్లోనూ ఉన్న పుండ్లు కూడా చూచారా అని అడిగింది అమ్మ. "నీవు నోరు తెరచి చూపిస్తేనేగా" అన్నారు సాంబయ్యగారు. మరి ఇందాక మీరు చూచానన్నది ఏమిటి? "పెదిమలమీద, పక్కనున్న పుండ్లను చూచి" చూచానన్నాను "ఈపుండ్లను బట్టి లోపల ఉన్న పుండు కూడా అర్థంచేసుకుంటారా" అన్నది అమ్మ.

"పుండుయొక్క స్థానాలు వేరుకావచ్చును కానీ ఈ పుండు స్వభావమూ ఆ పుండు స్వభావము ఒకటే. వ్యాధి అర్థంకాక రససంబందమైన మందులేవో వాడి వుంటారు అన్నాడు" సాంబయ్య.

"సహజంగా ఒక డాక్టరు చేసిన చికిత్సను మరొక డాక్టరు ఏదో రకంగా విమర్శిస్తారని" ముసిముసిగా నవ్వుతూ" యదార్థం చెప్పావమ్మ. నేనేమీ ఆడాక్టరును అసమర్థడని అనలేదు. అర్థంకాక రస సంబంధం వాడారన్నాను. ఎవరైనా అంతే అర్థం కానప్పుడు" అని నోరుతెరవమని అడిగారు.

అమ్మ నోరు తెరచి చూపింది. నోటిలోనూ అంగిట్లోనూ గులాబీ రేకులంత వెడల్పున గులాబీ రంగున పుండ్లు కనిపించాయి. గర్భంలో కూడా పుండు వుండి వుంటుందని, రేపటినుండీ వైద్యం మొదలుపెడ్దామని చెప్పారు.

ఆరాత్రి భోజనం చేసి అందరూ పండుకున్నారు. తెల్లవారి లేచేటప్పటికి అమ్మకు కాళ్ళు చేతులు ఉబ్బి ఉన్నాయి. చిదంబరరావుగారు చూచి "ఇదేమిటమ్మా" అని గుండెలపై చెయ్యివేసి కొట్టుకొని ఆదుర్దాగా కాళ్ళువత్తి చూచారు.

వారి ఆదుర్దా చూచి అమ్మ నెమ్మదిగా "నెత్తురులేని మీదట ఉబ్బినాయ్

కొద్దిసేపటికి అవే తగ్గుతాయి. ఎందుకు మీరిట్లా గాభరా పడ్డారు? ఇప్పుడప్పుడే నేనెక్కడకూ పోతాను తాతగారు? చేయవలసిన పనులు చాలా ఉన్నాయి" అన్నది.

"నిజమేననుకో అమ్మ ఎదురుగా కనపడే బాధను చూచి మనస్సు నిబ్బరించుకోలేకపోతున్నాను. నీస్థితి ఎక్కువ అని, నాకు తెలుసు, నీ మనస్సు మా మనస్సుకంటే విశిష్టమయిందనీ, నాకు తెలుసు. నీ శరీరం మా శరీరంకంటే విభిన్నమైందనీ నాకు తెలుసు. నిన్ను ఎవరూ. ఏమీ చేయలేరని తెలుసు. కానీ నీవు బాధపడ్తూ కనిపించగానే అంతకు ముందున్న భావాలు విశ్వాసాలు కరిగిపోతున్నాయమ్మా. దీనికి కారణం నాకు అంతుబట్టటం లేదు."

"ఇంతమాత్రానికే బాధపడితే, చలిస్తే ఎట్లా ముందుముందు ఉన్నదంతా అదే".
"ఏమో కొన్ని సందర్భాల్లో నీవు సర్వశక్తిమంతురాలివనీ, సర్వజ్ఞురాలవనీ ఎంతనమ్మకమో కొన్ని కొన్ని వేళల్లో నీకేమవుతుందదోననీ, నీవే మౌతావోనని నేను బాధపడ్తుంటానమ్మా. మరి ఆ విశ్వాసానికి, ఈ భయానికి సమన్వయం ఎట్లాగో నాకు అర్థంకావటంలేదు" అని తాతగారు అన్నారు.

"ఏమీలేదు తాతగారు, మీకు నామీద ప్రేమే ఇందుకు కారణం మరినేను మీ మనమరాలినాయె. శరీరం కష్టపడ్తోంది. అది మీకు కనిపిస్తోంది. దానిని చూచిన మీకు బాధ కలగకుండా ఎట్లా వుంటుంది? మీది గుండె కానీ రాయి కాదుగా?

"అదేనమ్మా! సున్నితమయిన ఈ హృదయము యీ మమకారమే అని" అమ్మ అంది. అవరోధంగా తయారయినాయి" అని చిదంబరరావుగారు తన అశక్తతను తెలియచేసారు. "తాతగారూ మమకారం దేనికి అవరోధంకాదు. ఒకచోటవుండే మమకారమే విస్తృతమై, సర్వత్రా వ్యాపిస్తే అదే మాధవత్వం అవుతుంది" అని వివరించింది.

"ఏమిటేమిటీ ఇప్పుడన్నామాట మళ్ళీ వినిపించూ "పరిమితమయిన మమకారం మానవత్వాన్ని, సర్వత్రావుండే మమకారం మాధవత్వాన్ని గుర్తింపచేస్తాయి." అమ్మ పలికిన పలుకులు చిదంబరరావుగారిని ఆశ్చర్యచకితులను చేసింది. ఇంత చిన్న వయస్సులో ఉపనిషద్ వాక్యాలుగా అమ్మ చెప్పే ఒక్కోమాట ఆయన్ని ఆనందడోలికలలో వూగిస్తూ, ఉన్నత శిఖరాగ్రానికి చేరుస్తున్నాయి.

అమ్మ మాటలు వింటూ "ఎక్కడా చిక్కవుకదమ్మా అన్నారు" అదిఏమిటి తాతగారూ ఈనెల్లో బాగా చిక్కావని అందరూ అంటుంటే మీరు ఇట్లా అంటారు. బాగా ప్రేమ ఉన్నచోట ఎంత బాగావున్నా, చిక్కినట్లే కనపడుతుంటారు. మీకేమో నామీద ఎక్కువ ప్రేమ అంటారు. మరి మీరే ఇలా అంటే నేనేమనాలని" అంది. తాతగారు మాటల్లో దొరకదు అన్న అర్థంతో చిక్కవు అని వాడారు. దానికి అమ్మ ఇచ్చిన సమాధానం విని మంత్రముగ్ధులై ఎంత చమత్కారంగా మాట్లాడతావమ్మా" అన్నారు. "మీరు నేర్పిందేగా" అన్నది అమ్మ. చిదంబరరావుగారు వెల్లువలయిన మమకారపు పారవశ్యతంతో అమ్మ తలనిమురుతూ "ఆస్పత్రికి వెళదామా అమ్మా?" అని అడిగారు.

అమ్మకు కాళ్లు పట్టుకుంటున్నాయి కాబట్టి తాను రాలేనని చెప్పింది. కాళ్లు పట్టుకుంటున్నాయి కాదమ్మా కాళ్లు పట్టుకుంటున్నారు భక్తులు అన్నారు. తనకు భక్తులు ఎవరూ లేరని అంతా తన బిడ్డలేనని తెలియపరిచింది అమ్మ. ఈ విషయంలో అమ్మకు ఎంత స్థిరమైన భావనవుందో! ఏ ఒక్కక్షణంలోనూ ఏమరుపాటు కనిపించదని అనుకున్నారు. అది తన స్వభావమని, స్వభావం మారదని, భావం మారుతుండేదని, తల్లికి బిడ్డల విషయంలో మరుపు, ఏమరుపాటూ వుండదని తెలియచేసింది.

మందులు వాడుతూనే వున్నారు. కాలం పరిగెడుతోంది నెలా పదిహేను రోజులు గడిచాయి. అమ్మ తలవెంట్రుకలు అట్టకట్టాయి. అమ్మకు తీవ్రమయిన జ్వరం వచ్చింది. సరిగ్గా ఆరోజు రంగమ్మగారు పోయినరోజు.

చిదంబరరావుగారు అమ్మ పక్కలో కూర్చున్నారు. వారికి గతమంతా స్మృతిపథంలో మెదిలింది. కన్నీరు చెంపల మీదగా ప్రవహించి అమ్మమీద పడ్డాయి. ఎందుకు తాతగారు ఏడుస్తున్నారు. తనకేమీ ఫర్వాలేదని తాను చేయవలసిన పనులెన్నోవున్నాయి అంది.

తీవ్రమయిన అమ్మ జ్వరం, శుష్కిస్తున్న అమ్మ శరీరం చూచి చిదంబరరావుగారు అనంతమైన దిగులుకు లోనైనారు. లోకంలో ఎంతోమంది జ్వరంతో బాధపడ్తున్న వాళ్ళున్నారు. వారందరిగురించి మీకు ఆందోళనలేదు కదా! అన్నది. అమ్మయందు తనకుగల మమకారమే అందుకు కారణమైవుంటుదన్నారు మమకారాన్ని చంపుకోమంటావా అని అమ్మను అడిగితే ఈమమకారాన్ని పెంచుకోమంటాను.

తనను చూచినట్లే అందరినీ చూడండి, తనగురించి దుఃఖించినట్లే అందరి గురించి దుఃఖించమని చెప్పింది. అందరిలో నీవు వున్నానవంటావా, అన్నారు. "నామీద మీకు గల ప్రేమను అందరి మీదా చూపించగలిగితే అందరి దుఃఖం పొందగలిగితే మీకు యీ బాధ తొలుగు తుందేమోననీ నా ఉద్దేశం" అని తెలియచేసింది. అమ్మలోనే అందరూ వున్నారనుకొని అమ్మను మరింతగా ప్రేమించగలనుగాని, అమ్మనే అందరిలో చూచి అందరినీ అమ్మలాగా ప్రేమించటం తనకు సాధ్యంకాదేమోనని తాతగారు సందేహం వెలిబుచ్చారు. ఈ రోజు రంగమ్మగారు అమ్మను ఆయన చేతిలో పెట్టిన రోజు. అమ్మకు నయమయితే ఆయన్నే అమ్మచేతిలో పెట్టినరోజు అవుతుందనుకున్నారు. తాతగారు. పిచ్చి తాతగారూ నయం కాదనుకుంటున్నారా? తాను చేయవలసినవ పనులు చాలా ఉన్నాయి ఆయన కోరిక నెరవేరుతుందని అమ్మ హామీ ఇచ్చింది.

★ ★ ★

# 27. వాళ్ళుతింటే నేను తిన్నట్లే

డాక్టరు వచ్చి అమ్మను పరీక్షచేసి "ఈ జబ్బు చాలాకాలంనుంచీ ఉన్నట్టుంది. జబ్బు సంగతి ఎట్లా వున్నాముందు అమ్మాయిని శుభ్రంగా వుంచండి. ఆజుట్టు దువ్వి జడవేయండి. ఇది తరుణవ్యాదికాదు దీర్ఘవ్యాది" అని క్వినైన్ యింజక్షన్ ఇచ్చారు. కానీ మలేరియా కానందున జబ్బు తగ్గకపోగా రోజురోజుకు పెరిగింది. అమ్మ మామూలుగానే బాధపడసాగింది. సీతాపతిగారు, మరిడమ్మగారు మన్నవ నుండీ వచ్చారు.

చందలూరి మహాలక్ష్మమ్మవారిని ప్రశ్న అడిగితే దడుచుకుందని ఎట్టినీళ్ళు దాటిందని తాయత్తు ఇచ్చారు. కనకమ్మగారు ఆ తాయెత్తు అందుకుని అమ్మకు కట్టి సాంబ్రాణి వేసింది. "ఇన్నీ చేస్తున్నారు కాని తల శుభ్రం చేయమంటే చేయరేమని," చిదంబరరావుగారు అన్నారు.

చిదంబరరావుగారు కోర్టుకు వెళ్ళిన తరువాత అమ్మ జుట్టుకత్తిరించి హారతి కర్పూరం, కొబ్బరినూనె కలిపి రాశారు. సరైన వైద్యం లేకపోయినా ఒక నెలపదిహేను రోజులు అమ్మబాధపడిన తర్వాత అమ్మకు జబ్బు నయమయింది. మరిడమ్మ తాతమ్మ చాలాప్రేమతో, శ్రద్ధతో అమ్మకు పథ్యం చేసిపెట్టేది. మూడు నెలలు గడిచిన పిమ్మట అమ్మ ఆరోగ్యం కొంచెం కుదుటపడి జుట్టుకూడా పెరగసాగింది. సీతాపతిగారు మన్నవ వెళ్తుంటే అమ్మాయికి కొన్నాళ్ళు మందులూ టానిక్కులు వాడితే బాగుంటుందని చిదంబరరావుగారు అన్నారు దాని గాజులు అమ్మి వాడండని చెప్పి వెళ్ళిపోయారు.

అమ్మ ఆ సలహా విన్నా అప్పటికి మౌనంగా వుండి తాతగారూ మానాన్న ఊరికి వెళ్ళేటప్పుడు మీరు ఏమి అడిగారు అని అడిగింది. తాతగారు తటపటాయించినా, అమ్మ తాను విన్నానని చెపితే మరినీకు తెలియంది ఏముందమ్మా? బాధగా అన్నారు.

తనకోసం ఏమి చేయాలన్నా, ఎవరు చేయాలన్నా ప్రస్తుతం తన నగలు అమ్మక తప్పదని, ఆమాట చిదంబరరావుగారు తనమీద పడకుండా, ముందుగానే సీతాపతిగారి దగ్గర సలహా తీసుకున్నారని ఆయన ఉద్దేశం అదే అయినా నేర్పుగా

సీతాపతిగార్ని బయటపడేశారని, చిదంబరరావుగారి ఎత్తుల ముందు తండ్రి ఎంత అంటూ అయినా "మీ వృత్తి తీరే అంతగదా" అని అంది.

చిదంబరరావుగారు పకపకానవ్వి "అమ్మ తాలూకు వాళ్ళు ఎంతపట్టించుకోకపోయినా, ఏం చేసినా వాళ్ళమీద అభిమానం పోదు" అని అన్నారు. దానికి అమ్మ "నాకు ఎవరిమీద దురభిమానం లేదు" అని తెలియచేసింది.

అమ్మ పినతల్లి శేషమ్మగారి భర్త నారాయణరావుగారు అమ్మను చీరాల తీసుకువెళ్ళాలని వచ్చారు. అమ్మ ఇప్పుడిప్పుడే కోలుకుంటోందని, ఇంకా బలానికి మందులిప్పించాలని చిదంబరరావుగారు అన్నారు. ఆ మందులు అక్కడ ఇప్పిస్తామని నారాయణరావుగారు అన్నారు.

"మరిడమ్మ గారితో చెప్పి అమ్మాయి వస్తానంటే తీసుకువెళ్ళి నాలుగురోజుల్లో పంపించండి. అమ్మాయి దిగులు పడ్తుందని" అన్నారు. అమ్మాయి దిగులు పడ్తుందా? అమ్మాయికోసం మీరు దిగులుపడతారా? అని నారాయణరావుగారు అన్నారు. ఏదైనా ఒకటే అన్నారు చిదంబరరావుగారు. మరిడమ్మగారు అమ్మకు పథ్యం చేసిపెట్టుకోవటానికి తనుకూడా రావాల్సి వుంటుందన్నది.

అంతకంటే కావల్సింది ఏముంటుంది ఆ మనుమరాలి దగ్గర నాలుగురోజులున్నావారు అవుతారు. మీరు తప్పకుండా రావల్సిందని నారాయణరావుగారు కోరారు. మరిడమ్మగారు సరే అలాగే వస్తానని చెప్పారు. "తొందరగా గుడ్డలు సర్దుకోండి వెళ్దామని" అన్నారు.

అమ్మ చిదంబరరావుగారి దగ్గరకు వెళ్ళి వాళ్ళు మందులు కొనివ్వటమెందుకు, ఆ చేసేదేదో మీరే చేసి మందులు కొనివ్వండి తీసుకు వెళ్ళి త్రాగుతాను" అన్నది.

చిదంబరరావుగారికి రంగమ్మగారు తొమ్మిది సవర్ల బంగారం ఇచ్చిందని అందులో కొంత సీతాపతిగారి అవసరాలకు వాడారు. "ఇంకా అందులో కొంత పైకం ఉన్నది దానితో కొంటానులే" అన్నారు. 'అదివుంటే సరి లేకపోతే సీతాపతిగారు చెప్పినట్లు చేయమని, తనకు అవేవీ వుండాలని లేదు" అన్నది అమ్మ. అమ్మకోసం కాకపోయినా తాతగారి వాళ్ళకోసమన్నారు. ఎవరికోసం ఎవరు చేసినా జరగవలసిన పద్ధతి ఒకటే అని అమ్మ అన్నది.

చిదంబరరావుగారు మందులు తెచ్చి ఇచ్చారు. నారాయణరావుగారు, మరిదమ్మగారు, అమ్మ ముగ్గురూ కలసి చీరాల వెళ్ళారు. అమ్మను చూడగానే శేషమ్మగారికి దుఃఖం పెల్లుబికింది. ఆనాటికి శేషమ్మగారే వండి పెట్టినా మరునాటినుంచీ మరిదమ్మగారే అందరికీ వండిపెట్టింది. నాలుగురోజుల్లో తిరిగి వెళుదామనుకున్నా పదిరోజులు గడిచాయి.

తిరిగి బాపట్ల వద్దామని అనుకుంటుంగా యింటి పక్కవారు వచ్చి మౌనస్వామి వారిని గురించి మరిదమ్మగారికి తెలియచేసారు. మరిదమ్మగారు, అమ్మ ఆయనను చూచి కాసేపు కూర్చుని వచ్చేశారు.

మర్నాడు అమ్మ అక్కడకు బయలుదేరింది. అక్కడ "నూనె పానకాలుగారి భార్యకు పిల్లలు లేకపోవడంతో ఎప్పుడూ ఏవో ప్రసాదాలు పంచుతుంది. అందుకని పిల్లలంతా గుమిగూడారు. చీరాల వెంకట్రావుగారు బెత్తం తీసుకొని పిల్లలను బెదిరించారు. కొందరు భయపడి వెళ్ళినా కొందరు అక్కడేవున్నారు. వారిలో ముందు వరసలో అమ్మకూడా వుంది మొద్దులా నిలుచున్నావేమని అమ్మ వీపుమీద బెత్తంతో ఒకదెబ్బ కొట్టారు. అమ్మ తననుకాదు కొట్టింది అన్నట్లే నిశ్చలంగా నిల్చుంది. మరి ఆదెబ్బ అమ్మకు తగల్లేదా? అంతలో హఠాత్తుగా వచ్చిన పానకాలుగారు అది చూచి అయ్యో అయ్యో చిన్న పిల్లను ఎంతదెబ్బ కొట్టారంటూ వీపుమీద చూస్తే బెత్తం చారపొంగి వున్నది. కానీ అమ్మ మాత్రం ఏమీ మాట్లాడలేదు. పానకాలుగారే పిల్లల్నీ వెంకట్రావుగార్ని మందలించి వెళ్లారు.

అమ్మ దొడ్డి వాకిలిన మెల్లగా లోపలకు అడుగుపెట్టింది మౌనస్వామి వారు అమ్మను చూచారు. చుట్టూ చూచారు. ఎవరూ కనిపించలేదు. "వాకిట్లో ఎవరూలేరా?" రహస్యంగా అమ్మను అడిగారు. లేరు అంది అమ్మ. దగ్గరకు రమ్మని పిలిచారు. అమ్మ స్వామివారి దగ్గరకు వెళ్ళి మౌనంగా నిల్చుంది కొద్దిక్షణాలు గడిచాయి. "స్వామీ మౌనం అంటే ఏమిటి? అమ్మ ప్రశ్నించింది. "అనవసరమయిన మాటలు మాట్లాడకుండా వుండటానికి యీ మౌనం ఆధారం."

"మీరు మన్నవలో వేసిన యంత్రం రాజరాజేశ్వరా? రాజ్యలక్ష్మా" అమ్మ అడిగింది. "ఆసందేహం ఎందుకు కలిగిందని" స్వామివారు అడిగారు. "మన్నవలో కొంతమంది రాజ్యలక్ష్మి అనీ, మరికొందరు రాజరాజేశ్వరి" అనీ అంటున్నారు అంది.

"రాజరాజేశ్వరీ యంత్రమే" అన్నారు స్వామివారు. "మీరు అసలు మాట్లాడుతారో లేదో అనుకుంటూ వచ్చాము'' అంది అమ్మ. అమ్మను చూడగానే మాట్లాడాలనిపించిందనీ, అంతకుముందెన్నడూ చూడని శాంతి అమ్మముఖంలో దేదీప్యమానంగా కనిపిస్తున్నదమ్మా అన్నారు.

"మీరు అందరికీ బాలమంత్రం ఇస్తూ వుంటారా" అంది అమ్మ. అమ్మరాకను రహస్యంగా ఉంచుతానని, అమ్మను కూడా అలాగే వుంచమన్నారు. అమ్మతో తాను మాట్లాడినట్లు తెలిస్తే అందరూ ఆయన ప్రాణాలు తీస్తారన్నారు. ఆయన మౌనాన్ని ప్రత్యేక సాధనగా పెట్టుకోలేదని కొన్ని అవసరాలు మౌనవ్రతాన్ని ప్రోత్సహించాయని చెప్పారు.

అమ్మ అది పట్టించుకోకుండా ఆయన బాల చెప్పనవారందరికీ తాను 'అజప' చెప్తానంది. అమ్మను ఆనందంగా చూస్తూ, అమ్మ మాటలను ఆశ్చర్యంగా వింటూ ధన్యోస్మి అని జపమాల త్రిప్పుతూ అజపమంటే ఏమిటమ్మా" అని అడిగారు. "నోటితో ఉచ్చరించనిది'' అన్నది అమ్మ. అటువంటిది ఎలా చెబుతావు అడిగారు. చెప్పటమంటూ వచ్చినప్పుడు మాటలతో చెప్పినా చేసేటప్పుడు మాటలు లేకుండా చేసేది. అంతలో అడుగల చప్పుడు విని అమ్మను వెళ్ళమన్నారు.

"ఎందుకు వెళ్ళటం, నన్నేమయినా అంటారనా? మిమ్మల్నేమయినా అంటారనా? అని అడిగింది అమ్మ, ఎవరూ ఎవరినీ ఏమీ అనరు ఆయన నిష్టకు భంగం వస్తుందని అన్నారు. నిష్ఠఅంటే ఏమిటి? అని అమ్మ అడిగింది. అది నీకేమి తెలుస్తుందమ్మా అన్నారు. "నిష్ఠ దరిద్రులు అంటారే అదేనా? అన్నది అమ్మ గంభీరంగా" ఛీ-ఛీ అన్నారు. "మరి మీరు చెప్పనన్నా చెప్పాలి లేదా నేను చెప్పిందన్నా ఒప్పుకోవాలి.

స్వామివారు ఒక్క నిమిషం ఆలోచించి నిష్ఠఅంటే అనుష్ఠానం అన్నారు. అంటే అనుష్ఠానం దరిద్రులా? అంది అమ్మ ఆప్రశ్న విని స్వామివారు అమ్మ ముఖంలో దీప్తిమంతంగా వెలిగే జ్వాలను, మనస్సులోని అమాయకత్వాన్ని సమన్వయం చేసుకోవటానికి ప్రయత్నిస్తుండగా బందా ఆదినారాయణగారు తలుపు కొట్టారు స్వామివారు ఎప్పుడూ తలుపు లోపల గడియ పెట్టుకోరు. కాని ఆనాడు తలుపులు తెరుచుకోవటంలో జరిగిన విలంబనానికి ఆశ్చర్యపోయారు. అమ్మ దొడ్డిదారిన నిష్క్రమించింది. స్వామివారు తలుపులు తెరిచారు.

"ఇంతసేపు ఎక్కడికి వెళ్ళావమ్మా? ప్రొద్దున్న నుంచీ అన్నం తినలేదన్నది" శేషమ్మగారు. "మౌనస్వామిని చూద్దామని వెళ్ళాను. "అక్కడ ఆలస్యమయిందని అమ్మ సమాధానమిచ్చింది." "ఇంత బహీనంగా ఉన్నావు. ఎట్లానడిచావు" అని అడిగింది ఆమె. "ఒక పాదం వేస్తూ ఒకపాదం తీస్తు వెళ్ళాను" అంది అమ్మ. అంత దూరం నడిచావా ఆశ్చర్యంతో అడిగింది శేషమ్మగారు "ఔను నడిచే వెళ్లానని చెప్పింది" అమ్మ.

ఎక్కడికి వెళ్ళావమ్మా? నీకు సరిగా ఆహారం అందదని నేను రావటమేమిటి? నీవు చెప్పకుండా వెళ్లటమేమిటి? మీ బాబాయి పోలీసుల పెట్టి వెతికిస్తానన్నాడు అన్నది మరిడమ్మగారు. "నిన్న మనం వెళ్ళిన చోటికే ఇవ్వాళా వెళ్లానిపించింది వెళ్ళాను. కొంతసేపు కూర్చుందామనిపించింది కూర్చున్నాను'' అంది. ''అన్నంతిని వెళ్ళాల్సిందికదా! అంటే ఇప్పుడు పెట్టరాదు తింటాను" అన్నది అమ్మ.

మర్నాడు ప్రయాణం అని తాతమ్మ చెప్పింది. శేషమ్మగారు అమ్మకు తలంటిపోసి కొత్త పరికిణీ, చొక్కా తొడిగింది పూరీలు చేసి అమ్మను, మరిడమ్మ గారిని పిలిచింది. విస్తళ్ళల్లో ఏరుకు తినేవాళ్ళుకు పెట్టమని అమ్మ అడిగింది. వాళ్ళకు ఏనాడు విస్తళ్ళల్లో ఇలాంటి పదార్థాలు దొరకవుకదా మనం ఎప్పుడైనా తినచ్చునంది.

ఇంట్లో వాళ్ళకే చాలకపోతే వాళ్ళకు ఎక్కడ పెడ్తాం అంది శేషమ్మగారు. మనతోపాటూ వాళ్ళను కూడా లెఖ్ఖ వేసుకుంటే సరి మన ఇంట్లోనే ఇంకో నలుగురు వుంటే చేసుకోమా అంది అమ్మ. మీ బాబాయి సంపాదన ఎంతమందికి సరిపోతుందను కుంటున్నావేమిటి? అంది. అయితే నాకు పెట్టండి అవి నేను వాళ్ళకు పెట్టుకుంటాను అంది అమ్మ. రెండు పూరీలు అమ్మకు ఇచ్చి ముందు నువ్వు తిన్న తరువాత వాళ్ల విషయం చూద్దాము అంది ఆమె. "వాళ్లు తింటే నేను తిన్నట్లే పిన్నీ. ముందు వాళ్ళు తింటే ఆ తరువాత నా విషయం చూడచ్చులే అంది అమ్మ. నాకు కడుపునిండుగా వుంది. పైగా కడుపులో నొప్పిగా కూడా వుందన్నది అమ్మ. శేషమ్మగారు ఇంకేమీ మాట్లాడలేదు ఇంకా నాలుగు పూరీలు అమ్మ చేతిలో పెట్టింది. అమ్మ సంతోషంగా గంతులు వేసుకుంటూ వాటిని యానాదులకు పెట్టి. తన చొక్క పరికిణీ కూడా తీసుకు వెళ్ళి వారికి ఇచ్చింది. వారు పూరీలు తింటూ ఉంటే వారి కళ్లల్లో మెరిసే కృతజ్ఞతాపూర్వకమైన తృప్తిని ఆనందాన్ని చూచి తాను మురిసిపోయింది.

ఆ మరునటి ఉదయమే మరిడమ్మగారు, అమ్మ బాపట్ల వచ్చిన ఒకరోజు మాత్రమే ఉండి మన్నవ వెళ్ళారు.

మరిడమ్మగారితో పాటు చేబ్రోలు వాస్తవ్యురాలు సుబ్బాయమ్మగారు కూడా జ్ఞాని అయిన మల్లెల రత్తమ్మగారి వద్ద మంత్రోపదేశం పొందారు. ఆమె బాల వితంతువు. చాలా తెలివైంది. సంస్కృత పండితురాలు. సుబ్బాయమ్మగారు కూడా సన్యాసినియై అనేకులకు మంత్రోపదేశం చేసింది. చిదంబరరావుగారి భార్య అన్నపూర్ణమ్మగారు కూడా ఆమె శిష్యురాలే. అందువల్ల తరుచూ బాపట్ల వచ్చేది. అక్కడే వుండే అమ్మను చాలా ప్రేమతోనూ, సానుభూతితో చూచేది.

సుబ్బాయమ్మాగారికి ఆవసానదశ సమీపించిందని తెలిసి మరిడ్మగారు చేబ్రోలు బయలుదేరింది. అమ్మ తానూ వస్తానంది. "వద్దులే అమ్మా నీ ఆరోగ్యం సరిగాలేదు" అన్నది. మరిడమ్మగారు. సుబ్బాయమ్మగారికి తానంటే చాలాప్రేమ అని, ఆరాధన అంటే ఏమిటో చూడాలని వస్తానంది అమ్మ.

సీతాపతిగారితో మరిడమ్మగారు తాను చేబ్రోలు వెళ్తున్నానని చెప్పారు. అమ్మాయిని కూడా తీసుకువెళ్ళమన్నారు. తాతయ్యగారి ఉపేక్షాభావానికి తాతమ్మగారికి బాధ కలిగింది.

★ ★ ★

# 28. ఆత్మదర్శనం

మర్నాడు ఉదయం ఎనిమిది గంటలకే భోజనం చేసి, అమ్మ, తాతమ్మ కాలినడకన బయలుదేరారు. దారిలో కాలవలను, కట్టలను, చెరువులను, చెట్లను, పైర్లను, పిట్టలనూ అన్నింటినీ చూస్తుంటే అమ్మకు వాటన్నింటిలో తన ప్రతిరూపమే కనిపించింది. అమ్మ అడుగులు ముందుకు వేస్తున్న కొలదీ "ఇదంతా నేనే. ఈ కనిపంచేదంతా నేనే" అనే భావం స్థిరమై బయటతాను చూచే సర్వమూ తనలోనే దృశ్యమానమయ్యేసరికి అమ్మ ప్రకృతితో తాదాత్మం చెందుతూ, ఆనందంతో తన్మయత్వం చెందుతూ మెల్లగా నడుస్తున్నది.

తాతమ్మ అమ్మను పలుకరించింది. అమ్మలో ప్రతిధ్వనిలేదు. అమ్మ నడకలో, చూపులో ఏదో అలౌకతను తాతమ్మ స్పష్టంగా గమనించింది. అమ్మ కందోయి ఆర్ద్రమై. పెదవులు దరహాస భాసురమై ఉన్నాయి. తాతమ్మకు కూడా అమ్మను చూస్తున్న కొలదీ తనలో తనకే అకారణంగా ఆనంద తరంగిత మవుతున్నట్లు అనుభూతమైంది.

తాతమ్మ కొల్లిమర లాకుల దగ్గర విచారించి చేబ్రోలు వెళ్లే పడవ అంతకుముందే వెళ్ళిపోయిందని తెలిసి అలసటతో, నిరాశతో ఆ కాలవగట్టునే ఉన్న చెట్టు నీడన కూర్చుంది. అమ్మ కూడా వచ్చి కాలవలో ఒక పడవ లంగారు వేసి దానిని చూచి "దానిలో వెళ్దామా తాతమ్మ" అని అడిగింది.

అది కొత్త పడవ ఇంకా ప్రారంభోత్సవం కాలేదు అన్నారు. ఇంతలో పడవ మనిషి అమ్మను కేకేసి మీరు ఏ ఊరు వెళ్తారని అడిగారు. చేబ్రోలు వెళ్ళాలనుకుంటున్నాము అంది అమ్మ. తమ పడవ చేబ్రోలు వెళ్తోందని బోణీ కొట్టటానికిరా అమ్మ అన్నాడు. ఎవరెక్కినా బోణియేనా నేను ఎక్కితేనేనా" అమ్మ అడిగింది. ఎవరెక్కినా బోణీయే ననుకో ఎక్కేవాళ్లు చాలామంది ఉన్నారు. కానీ నీవు ఎక్కితేనే బాగుంటుందమ్మా" అన్నాడు సరంగు.

మొదటి బోణి కొట్టించుకోవటానికి జడపదార్థమైన ఆపడవ చేసుకున్న పుణ్యమేమో. అమ్మ ఈసృష్టి అంతా చైతన్యమే. జడమూ, చైతన్యం అని రెండు లేవు అంటుంది కదా!

ఆ క్రొత్త పడవలో చేబ్రోలు వంతెన దగ్గరకు చేరి అక్కడ దిగి మెల్లగా నడచి రాత్రి ఎనిమిది గంటలకు ఇల్లు చేరుకున్నారు. మరిడమ్మగారు ఇంట్లోకి వెళ్ళి సుబ్బాయమ్మగారి తల్లిని ఓదార్చింది. ఇంతమంది పెద్దవారం వుండగా చిన్నది అదిపోతోందని బాధపడింది.

హైద్రాబాద్ నుండి సుబ్బాయమ్మగారి శిష్యురాలు చిన్నమ్మాయిగారు వచ్చింది. గురువుగారి ప్రాణోత్క్రమణ సమయంలో దగ్గరలేకపోయానన్న విచారంతో సుబ్బాయమ్మగారి ఫోటోముందు కూర్చుని ప్రార్థన చేస్తూ ఏడుస్తున్నది.

హనుమాయమ్మ గారిని ఇంకొక శిష్యురాలు గురువుగారు మరణించిన వెంటనే తానూ గురువుగారిని అనుసరిస్తానని ప్రసంగవశాన పలుమార్లు తెలియచేసింది.

సుబ్బాయమ్మగారు పోతుందన్న వార్త విన్నది. గబగబా పరుగెత్తింది. దారిలో పడటంతోనే కేకవేసి సునాయసంగా ప్రాణం వదిలింది. సుబ్బాయమ్మగారి చుట్టూ అనేకులు వున్నా ఆకేక విని ఎవరూ కదలలేదు. సుబ్బాయమ్మగారు విన్నది కానీ మాట పడిపోయినందున సంజ్ఞద్వారా హనుమాయమ్మగారిని చూచిరమ్మని చెప్పింది.

వారందరూ అటువెళ్ళారు. సుబ్బాయమ్మగారూ ప్రాణం వదిలింది అక్కడ చేరిన వారందరూ ఆవిచిత్ర సంఘటనకు విస్మితులై హనుమాయమ్మగారు అన్నమాట నిలబెట్టుకుంది ధన్యాత్మురాలని ప్రశంసించారు.

చిన్నమ్మాయిగారు పదిహేను గంటలు శోక సమాధిలో వున్న తరువాత బాహ్యలోకంలోకి అరుదెంచి ఎదురుగా దీపారాదన కుందిలో చమురు పోస్తూ కనిపించిన అమ్మను అమాంతం కౌగిలించుకొని "నాతో చెప్పకుండా పోయావా? నన్ను వదిలిపెట్టి పోయావా" అంటూ విలపించింది.

అంతా అమ్మను ఆసక్తితో తిలకించారు. సీతాయమ్మగారు, సుబ్బాయమ్మగారితో పాటు సాధన చేసిన మనిషి క్షుద్రవిద్యలందు ఆసక్తి మెండు. కోపం అధికం చీటికిమాటికి అందరినీ కన్నులెఱ్ఱజేసి కసురుతూ ఉండేది.

తన శక్తిచేత సుబ్బాయమ్మగారిని అమ్మ కూర్చున్నచోటనే స్థాపించానని చెప్పింది అలాంటప్పుడు తన్ని కౌగిలించుకున్న ఆస్పర్శ తనకు తగలకూడదుగా అన్నది అమ్మ.

వెంటనే సుబ్బాయమ్మగారి మరో శిష్యురాలైన వరలక్ష్మమ్మగారు "నిజంగా మీకే కనపరచే శక్తివుంటే మా అందరికీ కనపర్చవచ్చు కదా! ఆ శరీరం కోసమే కదా మాయీ దుఃఖం" అన్నది నిష్ఠురంగా. "అందరూ నోళ్లు మూయండని" సీతాయమ్మగారు అరచింది. అసలు సీతాయమ్మగారు ఏదో ప్రయోగం చేయటం వల్లే సుబ్బాయమ్మగారు హఠాన్మరణానికి గురి అయిందని ఒక అభిప్రాయం కలిగింది. అందరూ ఎవరిదారిన వారు వెళ్ళినా సీతాయమ్మగారు, మరిడమ్మగారూ, చిన్నఅమ్మాయిగారు, అమ్మ మిగిలారు. అమ్మ సీతాయమ్మగారితో తానొక సంగతి అడుగుతాను అన్నది. సీతాయమ్మగారు అంగీకార సూచనగా తలవూపింది.

మీ గురువుగారిని నాలో ఆరోపణ చేసి శక్తి పాతం చేస్తే నేను, నాశరీరం అనేది లేకుండా వుండాలికదా! అప్పుడు నేను ఎక్కడ, ఎట్లా ఉంటాను? అని ప్రశ్నించింది

"చిన్నపిల్లవు నీకేమి తెలస్తుంది? అరవకూ కూర్చో" అని గదిమింది. "మీకు ఎవరో క్షుద్రమంత్రగాళ్ళు కోపం అనే గ్రహాన్ని పంపకం చేసినట్లున్నారు" అంది. సీతాయమ్మగారు భూతవైద్యురాలు. అమ్మ తనను వ్యంగ్యంగా అంటోందని గ్రహించి కళ్ళు పెద్దవి చేసి చూచింది. అమ్మ నిర్భయంగా అదీగాకపోతే ఎవరో క్షుద్రమంత్రగాళ్ళు చచ్చిపోయి మీకు పట్టివుంటారు. పీల్చిపిప్పి చేస్తుంది. దీనిని కుదర్చటం ఏ భూతవైద్యుల వల్లకాదు. ఏ డాక్టర్ల వల్లనూ గాదు. ఆగ్రహాన్ని నయం చేయాలంటే నిగ్రహం గలవారి వల్లనే కావాలి. కోపం గలవారిని శాంతమూర్తులే జయించాలి. అమ్మ మాటల్లో దాగిన వ్యంగ్యవైభవం ముందు సీతాయమ్మగారు అప్రతిభురాలైంది.

ఇవన్నీ తెలిసిన మాటలా? తెలియని మాటలా ఆమెకు ఏమీ అనటానికి తోచక అన్నది. ఎవరివి అంది అమ్మ. తలతిక్క ఎక్కువల్లె వున్నదే అని అమ్మను అంది. తనకున్న అన్నిపాళ్ళూ తనకంటే ఏకొంచమైన ఎక్కువగా వుంటే కానీ తెలుసుకోలేరంది అమ్మ.

వారి సంభాషణ విన్న మరిడమ్మగారు భయపడి అమ్మను వారించింది. ఈరోజు ఈమె సంగతి ఏమిటో తేల్చేయాలని నిశ్చయించుకున్నాను అంది అమ్మ. ఆవిడ అసలే కోపదారి. ఆమెతో ఎందుకు అన్నది మరిడమ్మగారు. ఆమెలో ఉన్న కోపాన్ని పోగొట్టాలనే తప్పించివేరేమీ లేదంది అమ్మ. ఆమాటలు విని సీతాయమ్మగారు కోపంగా

కళు పెద్దవిచేసి చూచింది. అమ్మకూడా కళ్ళు మరింత పెద్దవిచేసి చూచింది. కన్నురెప్ప వాల్చకుండా చూచింది. సీతాయమ్మగారు. అమ్మకూడా అనిమేషంగా చూచింది. సీతాయమ్మగారు విసుగుతో ఏమీ చేయలేక అక్కడి నుంచీ వెళ్ళిపోయింది.

ఆమెతో నీకెందుకమ్మా అన్నది మరిడమ్మగారు "ఏమీలేదు తాతమ్మ నాతో నేనే ఆడుకుంటున్నాను," అన్నది అమ్మ చిరునవ్వుతో.

చిన్నమ్మాయిగారు బాహ్యస్ఫురణలోకి వచ్చి బరువెక్కిన కనురెప్పలమాటున అందరినీ అవలోకిస్తూ మరిడమ్మగారిని చూచి నమస్కరించింది. ఆ క్షణంనుంచీ అందరికీ ఒక విషాద బంధురలోకం నుండీ ఆనందమయంలోకంలోకి వచ్చినట్లుగా ఏదో అనిర్వచనీయమైన హాయిని అనుభవిస్తున్నట్లుగానూ ఉంది. అందుకు కారణం మాత్రం ఎవ్వరికీ అర్ధంకాలేదు. అమ్మకూడా నిజం వెల్లడి చేయలేదు.

సుబ్బాయమ్మగారి సమాధి వద్ద నిత్యమూ సహస్రనామార్చనా, నిరంతరమూ నామసంకీర్తనా జరుగుతున్నాయి. రోజూ వెయ్యిమంది భోజనం చేస్తున్నారు.

పదవరోజు సాయంకాలం అక్కడకి దగ్గరలోవున్న శ్రీలక్ష్మీకాంతానంద యోగివర్యులు అధ్వర్యంలో నడుపబడుతున్న ఆనందాశ్రమం చూచేందుకు వెళ్లటానికి నిశ్చయించుకున్నారు.

సీతాయమ్మగారు కోపగ్రస్తురాలై నిరాహార దీక్ష వహించింది. అమ్మ ఆమెతో "ఏవమ్మా సన్యాసమ్మగారూ ఆహారం తీసుకోకుండా పడుకున్నారని" అడిగింది. సీతాయమ్మగారు చిరాకుగా" తాను సన్యాసిని కానని తెలియచేసింది. కాకపోతే సన్నాసమ్మగారు అనాలా అంది అమ్మ. అనవసరంగా మాట్లాడక అవతలకు పొమ్మని అరిచింది ఆవిడ. ముసి ముసి నవ్వులతో అమ్మ ఎవరు పోవలసివస్తుందో అని, గురువుగారూ అనాలా మీకు ఎంతమంది శిష్యులున్నారంది. కడతేర్చాలంటే ఒక్కరుచాలు. ఆడంబరంగా పోగుచేసుకున్నవాళ్ళకు ఎందరున్నా చాలదని గర్వంగా చెప్పింది సీతయమ్మగారు.

బాపట్లలో కోనా వెంకట్రావుగారి భార్య సుభద్రమ్మగారు ఒక్కరే ఆమె శిష్యురాలు. అకస్మాత్తుగా ఆమెకు జబ్బు చేసినట్లు కబురు వచ్చింది. హడావిడిగా బాపట్ల ప్రయాణమయింది సీతాయమ్మగారు.

గోరుచుట్టుపై రోకలిపోటులా సీతాయమ్మగారికి ఎందకష్టం వచ్చిందని అంతా పరామర్శించారు. సీతాయమ్మగారు రాని కన్నీళ్లు తుడురుకుంటూ "బిడ్డవంటిది" అని విలపించింది. వెంటనే బిడ్డవంటిదా, బిడ్డా? అని అడిగింది అమ్మ. సీతాయమ్మగారు తిరిగి ఎఱ్ఱగా మండిపడుతూ అమ్మను చూచింది. అమ్మకూడా రక్తారుణ నయనాలతో చూస్తూ "ఎవరైనా అనుభవించవలసిందేకదా! రాబోయే సంగతి ఎంతవారికీ తెలియదుగా! తెలియకపోతేనే యిట్లావున్నది తెలిస్తే ఇంకా ఎంత విఱ్ఱవీగుతామో అన్నది.

సీతాయమ్మగారి ప్రయాణం సంగతి తెలిసి ఆసమీపంలో ఉన్నవారంతా బిలబిలా బండి చుట్టూ గుమిగూడారు ఏడవకండి. ఒక్కళ్ళే శిష్యులయితే త్వరగా కడతేర వచ్చునుగా అన్నది పరిహాసంగా, సీతాయమ్మగారు ఏమీ మాట్లాడలేదు. పక్కనేవున్న బొడ్డుపల్లి సుందరమ్మగారు" కడతేరటమంటే ప్రాణంపోవటమేనా అంది. అమ్మ అమాయకంగా ముఖంపెట్టి ఇప్పుడు ఆమాట ఎవరన్నారు.

ఎవరేమి అంటున్నా సీతాయమ్మగారు పెదవి విప్పలేదు. కన్నీటిదారతో ఆమె చెక్కిళ్ళు తడిసాయి. అమ్మతో ఆడుకోవటం ఆమెకు ఆనందప్రదమయింది పాపం మళ్ళీరావాలన్న దృష్టితో పోవటంలేదు ఆమె అన్నది అమ్మ. సీతాయమ్మగారు మాత్రం ఏమాటకూ కదలక అట్లాగే కూర్చుంది.

ఆ సాయంకాలం అమ్మ మరిడమ్మగారు ఇంకో పదిహేనుమంది కలిసి రెడ్డిపాలెంలోని ఆనందాశ్రమానికి వెళ్ళారు. దారిపోడుగునా మరిడమ్మగారు ప్రహ్లాద చరిత్రగానం చేసింది.

ఆ ఆశ్రమం ఎంతో ప్రశాంతంగావుంది. లక్ష్మీకాంతానందయోగిగారు పడక్కుర్చీలో ఆశీనులైనారు. అందరూ ఆయన్ని బాబుగారు అంటారు అందరూ వెళ్ళి దూరంగా కూర్చుని వారిని చూసున్నారు. అమ్మ బాబుగారి దగ్గరగా వెళ్ళి కూర్చుంది. వారు తంబురా తీసుకొని నామసంకీర్తన ప్రారంభించారు. వారు సంగీత సాహిత్యాల ఉభయత్రా పండితులు వారి కంఠంలో మాధ్యుం ఉన్నది. వారు ఆర్తితో చేస్తున్న సంకీర్తన అందరినీ తన్మయులను చేసింది. భాగ్యమ్మగారు బాబుగారి శిష్యురాలు. సాహితీసంపన్నురాలు. అమ్మ ఆవిడరాసిన పాటలు వినడం, చదవటం, పాడటం జరిగింది. అప్పటినుంచీ ఆమె అంటే అమ్మకు ఎంతో సదభిప్రాయం వుంది.

అందువలన కూతూహలంగా అమ్మ ఆమెవద్దకు వెళ్ళింది. కానీ భాగ్యమ్మగారు అమ్మవంక కన్నెత్తి అయినా చూడలేదు.

ఆమెతో మాట్లాడాలన్న కుతూహలం పెచ్చుపెరిగింది. ప్రయాణమయిన మరిడమ్మ తాతమ్మతో, వారందరితో ఆమెను వెళ్ళమని తాను తరువాత వస్తానని చెప్పింది. అప్పటికి అందరూ వెళ్ళిపోయారు. ముగ్గురో నలుగురో భోజనం చేస్తున్నారు. అమ్మను చూచినా భోజనానికి పిలవలేదు. పిలిచినా అమ్మ భోజనం చేయకపోవచ్చుగాని అమ్మకు అది ఆశ్చర్యమనిపించింది.

అమ్మ ఒక్కతే ఆశ్రయమంతా కలియ తిరిగింది. ఆవాతావరణం ఎంతో ఆహ్లాదరకంగా నేత్రపర్వంగానూ కనిపించింది.

మెల్లగా భాగ్యమ్మగారి దగ్గరక వెళ్ళి పలకరించింది. "ఎవరమ్మయివని" అమె అడిగింది. తాను అందరిమాయనని అమ్మ చెప్పింది.

"అబ్బో అబ్బో" అంటూ భాగ్యమ్మగారు అమ్మను దగ్గరకు తీసుకొని తలనిమురుతూ బాబుగారి దగ్గరకు తీసుకువెళ్ళి" ఎంతముద్దుగా వుందో? మాటలు అంతకంటే ముచ్చటగా వున్నాయని" చెప్పింది.

'ఒహెూ అట్లాగా ఎవరీ అమ్మాయి?" అంటూ అమ్మవంక చూచారు. మరి అమ్మలో వారికి ఏమి సాక్షాత్కరమయిందో వారు అలాగే అనిమేషులయి, నిశ్చేష్టులయ్యారు. అమ్మ వస్తానని చెప్పి తులసీదళాలు కోసుకుంటుంటే" అమ్మాయి తులసిచెట్టును తాకకు" అని ఎవరో గట్టిగా కేకవేశారు. "తులసిచెట్టు అంత అంటరానిదా" అని బాబుగారి వంకచూచి నవ్వింది. అమ్మా! అని బాబుగారు అరచేతులు చాచారు. అప్పటికే అమ్మ పరుగెత్తి కనుమరుగైంది.

★ ★ ★

# 29. సంస్కరణ

ఆనందాశ్రమం నుంచీ తిరిగివచ్చిన మర్నాడు అమ్మ, తాతమ్మ పెనుగుదలపాడు బయలుదేరారు. అక్కడ విచారిస్తే పడవ వెళ్లిపోయిందని తెలిసింది. తాతమ్మ నడచిపోవటానికే నిశ్చయించుకొని అమ్మతో చెప్పింది అమ్మ సరే అంది.

కొంతదూరం నడచిన తరువాత అమ్మకు దాహం అయింది. కట్టపొడుగునా చింతచెట్లు వున్నా పల్లంలో వుండటంచేత వాటినీడ సోకటంలేదు. మరిడమ్మతాతమ్మకూ శ్రమగానే వున్నా అమ్మను నడిపిస్తున్నందుకు బాధపడ్తుంది.

"తాతమ్మ! నేను ఏబాట నడచినా చింతలు కనబడుతున్నాయి? చింతలున్న బాటన నేను నడుస్తున్నానా? నేను నడచేబాటలో చింతలు ఉంటున్నాయా? ఏదీ తేలటంలేదు కానీ నావెంట చింతలు మాత్రం తప్పవల్లే ఉన్నది" అన్నది అమ్మ.

"ఆమాటలు అనటంలో నీ ఉద్దేశమేమిటమ్మా?" అని తాతమ్మ అమ్మను అడిగింది ఆశ్చర్యంగా. ఇప్పుడు జరిగేదాన్ని బట్టి, ఇదివరకు జరిగిన దాన్ని బట్టి జరగబోయే దాన్ని బట్టీ అట్లాగేతోస్తున్నది. ఎట్లాగన్నా జరగనీ తనకు దాహం అవుతోంది" అన్నది అమ్మ.

"కాసేపు కూర్చోమ్మా అలసట తీరుతుంది. ఈలోగా రేవు ఎక్కడన్నావున్నదేమో కనుక్కుంటాను. నిన్ను నడిపిస్తున్నాను. మల్లెపూవులాంటి శరీరం. ఎట్లా కందిందో. ముఖం మందారపువ్వు అయింది. పాదాల్లో రక్తపు జీరలు కనిపిస్తున్నాయి అన్నది తాతమ్మ.

తాతమ్మ కవిత్వానికి అమ్మ చిరునవ్వుతో ఆలోకిస్తుంటే మూటలోవున్న ఒకే ఒక నారింజపండును అమ్మకిచ్చింది. అమ్మ దానిని వొలుస్తుండగా జారి క్రిందపడింది. అది దొర్లుకుంటూ ఒక పెద్ద పాముచుట్ట చుట్టుకొని పడుకొనివున్నచోట ఆగింది.

అంతలో ఒక అబ్బాయి తాబేటికాయను బుజాన తగిలించుకొని అటువస్తూ కనిపించాడు. తాతమ్మకు ప్రాణంలేచి వచ్చింది. అతన్ని మంచినీళ్ళ గురించి అడిగితే అది ఖాళీదని జవాబిచ్చాడు. అందుకు తాతమ్మ విచారపడ్తుంటే అమ్మనవ్వుతూ "కాలవనిండా నీళ్ళు ఉన్నా రేవులేదు. నామీద ప్రేమతో నారింజపండు ఇస్తే అదీ

జారిపోయింది. పడవ కోసం వస్తే పడవ అందలేదు. ఎంతప్రేమగలవాళ్ళువున్నా ఎన్ని ఉన్నాబాధపడే యోగ్యత ఉన్నప్పుడు ఎవరూ తప్పించలేరని" తెలియచేసింది.

రాత్రి ఎనిమిదిన్నకు శ్రీరంగపురం చేరున్నారు. బ్రాహ్మణుల ఇల్లు యెక్కడ" అని అడిగింది. "ఎక్కడైతేనేమి పడుకోవటానికి అంది" అమ్మ "నీకు కాస్త మెతుకుపెడ్తారేమోనని" అంది. మెతుకుగానీ, మంచినీళ్ళుగాని ఎవరింట్లో అయితేనేమి? అంది అమ్మ. "అదేమిటమ్మా! ఎవరి వర్ణాశ్రమ ధర్మాలు వారు కాపాడు కోవద్దా" అని అడిగింది తాతమ్మ.

దోవలో వారి విషయం విని, అమ్మను చూచి తమ ఇంటికి రమ్మని ఆహ్వానించాడు. అతడు బ్రాహ్మణేతరుడు. మరికొంత దూరం వెళ్లాక ఒకయువతి ఎంతో ఆదరంగా ఆప్యాయతతో ఆహ్వానించింది. ఆమె బ్రహ్మణయువతి కానందున తాతమ్మ నిర్మోహమాటంగా నిరాకరించింది.

చివరకు ఒక బ్రాహ్మణగృహం చేరారు. తాతమ లోపలికివెళ్ళి మా అమ్మాయికి కొంచెం అన్నం పెడతారా నాయనా. ఈ రాత్రికి ఇక్కడ పడుకొని తెల్లవారి వెళ్లిపోతామని చెప్పింది. ఆయన "దారినపోయే వాళ్ళకోసం మేమేమీ భవంతులు కట్టలేదు" అని అరుస్తుంటే తాతమ్మ ఖిన్నురాలై, అవమానభారంతో వీధిలోకి వచ్చి ఎటువెళ్ళాల్సింది నిర్ణయించుకోలేక నిల్చున్నది.

అంతలో మరొకరు ఆకేకలు విని బయటకు వచ్చి మరిడమ్మగారి నడగి జరిగిన సంగతి తెలుసుకొని వారి ఇంటికి పిలిచారు. ఆయన బ్రాహ్మణుడే అవటంతో తాతమ్మ సమ్మతించింది.

ఆయన పేరు రాఘవయ్యా. భార్యపేను రంగమ్మ వారికి సంతానం లేదు. ఆస్తి అంతగాలేనందున దత్తతకు పిల్లల్నికూడా ఎవ్వరూ ఇవ్వలేదు.

రంగమ్మ అక్క రాజమ్మ ఆమెకు చిన్నతనానే భర్తగతించినందున చెల్లెలుతోనే కలిసి ఉంటున్నది. చెల్లెలు అమాకత్వం వల్ల మరిదిని లోబరుచుకుని ఇంటిపెత్తనం రాజమ్మే చేస్తోంది.

అమ్మను చూడగానే రాజమ్మ ఆలోచనలు పరిపరి విధాల పరుగులెత్తాయి.

అమ్మాయీ బంగారు బొమ్మలావుంది. పెంపుడుకిస్తారెమో అడగాలి. లేదా అమ్మాయి ఒంటినిండా బంగారమే. దానిని తెల్లారే సరికల్లా వూరుదాటిస్తే తరువాత ఆడబ్బు చూపిస్తే ఎవరైనా పెంపుడిస్తారు. ఇవ్వకపోయినా ఆడబ్బుతో దర్జాగా బ్రతకవచ్చునని రాజమ్మ రంగమ్మకు చెప్పింది. ఆమె లబలబాలాడింది.

"క్రిందటి జన్మలో ఎంత పాపం చేసుకున్నామో ఈ జన్మలో పిల్లలు కలుగలేదు. ఈ జన్మలో యింకా ఇటువంటి పాపాలు చేస్తే భగవంతుడు మనల్ని క్షమించడు. ఆ అమ్మాయి దేవతలావుంది. నీ మాటలు వింటే శపిస్తుంది అన్నది రంగమ్మ.

తాతమ్మ అలసటతో నిద్రపోతూ వున్న అమ్మ మెలకువగానే పడుకుని వారి సంభాషణ విన్నది. రాజమ్మ నవ్వి "పాపపుణ్యాలు లెక్కలు వేస్తూ, వచ్చిన అవకాశం జారవిడుచుకుంటే ఆభగవంతుడుకూడా నిన్ను బాగుచేయలేడు. నీకేదయినా ఒక అవకాశం లభిస్తే అది దేవుడే నీకిచ్చాడనుకో" అంది.

రంగమ్మ "నాకీ అవకాశమూ వద్దు, అందలాలు వద్దూ నన్ను నన్నుగా బ్రతకనీయండి. నీమరిది, నీవు ఒప్పుకుంటే యిప్పుడే నాదారిన నేను పోతాను. అడుక్కుతినైనా బ్రతుకుతాను" అని ప్రాధేయపడింది.

రంగమ్మ యిల్లు విడిచి వెడితే రాజమ్మ రామయ్యతో కలసి ఆ ఇంటిలో ఒంటరిగా కాపురం చేస్తే నలుగురూ విమర్శిస్తారు. అందుకే మంచితనానికి మారుపేరైన రంగమ్మ చాటున పాములాంటి రాజమ్మ సుఖంగా బ్రతుకుతున్నది. తాను నోరు తెరిస్తే భర్త, అక్కా ఎక్కడ బయటపడి భంగపడుతారో అని విషం లాంటి సత్యాన్ని కడుపులో దాచుకుని పెదవి దాటన్విలేదు రంగమ్మ. తాను పాలు త్రాగాలి అంతవరకే తెలుసు అవి అవుపాలో, గాడిదపాలో విచక్షణ అవసరంలేని మూర్ఖుడు రామయ్య. తన పొట్ట కింత పదార్థం కావాలి అది అన్నమయినా సరే, అశుద్ధమయినా సరే.

రాజమ్మ ఏమీ సమాధానం చెప్పకపోయే సరికి రంగమ్మ "ఈ అమ్మాయితో వెళ్ళిపొమ్మంటే హాయిగా వెళ్లిపోతాను అంటూ ఏ దేవత అయినా అడ్డుపడి బిడ్డకు యీరాత్రికి ఏగండమూ రాకుండా కాపాడితే బాగుండును" అని వేయిదేవుళ్ళకు, వేయి మొక్కులు మొక్కుకుంది. అంతలో రాజమ్మ నిద్రపోయింది.

రంగమ్మ మెల్లగా వెళ్ళి అమ్మ ముఖంలోకి చూస్తూ "అమ్మ ముఖమండలం తేజోవంతమై మెరుస్తున్నది. అమ్మ ముఖంలోకి చూస్తుంటే ముఖంలో నుండీ కాంతిరేఖలు తన హృదయంలోకి చొచ్చుకు పోతున్నట్లూ, తనలోని చీకటిరాసులు కరిగిపోతున్నట్లూ తత్ఫలితంగా తనలో ఏదో అవ్యక్తానందం పొంగులు వారుతున్నట్లు రంగమ్మకు అనుభూతమైంది.

ఆనందతరంగణితో తేలిపోతున్న రంగమ్మకు రామయ్య గావుకేక వినిపించి త్రుళ్ళిపడింది. పరమానందంతో పరవశం చెందుతున్న రంగమ్మ మనస్సు అక్కడ నుండీ లేవలేకపోయింది. అంతలో పిడుగుపాటులా మళ్ళీ పిలుపు వినిపించింది.

తప్పదనుకున్న రంగమ్మ లేచి వెళ్ళింది. ఆసమయంలో రామయ్య తనను ఎందుకు పిలిచాడో రంగమ్మకు తెలుసు ఏమీ ప్రశ్నించకుండానే పాద సంవాహనకుపక్రమించింది. చేతులు పాదసేవ చేస్తున్నా కన్నులు హృదయంలో పొంగులెత్తే ఆనందానికి చిహ్నంగా అశ్రుపూరితమయ్యాయి. ఆవిషయం రామయ్య కెట్లా అర్థమవుతుంది? "నీమొహానికి ఎప్పుడూ ఏడుపే. ఇప్పుడేమయిందంటూ" కాలికొద్దీ రంగమ్మను తన్నాడు.

అంతలో రాజమ్మలేచి అమ్మ దగ్గరకు వెళ్ళి అమ్మ మెడలో వున్నకంటె కొక్కెం మెల్లగా తీసింది. చటాలున అమ్మలేచి కూర్చుని తన ఒంటిమీదనున్న నగలన్నీ తీసి దోసిట్లో పోసుకు బయలుదేరింది. ఊహించని ఈ సంఘటనకు రాజమ్మ స్తబ్దురాలై అమ్మను వెంబడించింది. అమ్మ రంగమ్మ దోసిట్లో తన నగలన్నీ కుమ్మరించి ఆయన దోసిట్లో పోసి నమస్కారం చేయమంది. రామయ్య నుద్దేశించి తనకు తల్లిలేదని, ఆమెకు పిల్లలు లేరు కాబట్టి తనకు తల్లిమోజు మీకు వదినమోజు, ఆమెకు ధనంమోజు ఈరోజుతో అందరి మోజులు తీరతాయి. రంగమ్మగారిని తన వెంట తీసుకువెళతానని, రాజమ్మగారు మీతోనే వుంటుంది. ఈసొమ్ము మొత్తం ఆమెకే అర్పణచేయమంది అమ్మ.

పది సంవత్సరాలైన సరిగాలేని చిన్నపిల్ల అంత చురుగ్గా పదునుగా మాట్లాడుతుంటే వారు ముగ్గురూ నిర్వీణ్ణులై నిలబడి పోయారు.

కొద్ది క్షణల తరువాత రామయ్య తనదోసిలిలోని సొమ్మును అమ్మపాదాలపై

క్రుమ్మరిస్తుంటే అమ్మ తనకు బంగారం అక్కరలేదని, తనతో వస్తే ఇంతకు రెండు రెట్లు బంగారం ఇస్తానంది. మీరు ఆమెను తన్నారు కదా! దానికియేమిచ్చి ఋణం తీర్చుకుంటారు? ఋణం కాదు పొరపాటు దానికి ఏమీ శిక్ష వేసుకుంటారు? మీరు తన్నితే పడటం ఆమెకు ఎట్లా ధర్మమో, మీరు తన్నకుండా మీకు ధర్మాలు అనేకం వున్నాయి అంది.

భయమే ఎరుగని మొండి రామయ్య భయంతో గజగజలాడుతూ "నీవు ఎవరమ్మా? ఇంతకాలం నేను చేసిన పాపాలన్నీ కలిసి రూపెత్తిన పిశాచానివా? దయ్యానివా? అని అడిగారు. దేవుడయితే నేమి? దయ్యమయితే నేమి? అంది అమ్మ. "నన్ను దండించటానికే వచ్చావా" అని అడిగాడు రామయ్య. అతని తప్పును ఖండించటానికి అన్నది అమ్మ. "దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసేది చేయగలిగేది ఒక్కదైవమే నంటున్నారు. అందువల్ల నీవు దేవతేమో అని పిస్తోంది. ఇందాక దైవమన్నావు". ఇప్పుడు కాకపోవచ్చు అంటున్నావు. ఇంతలో ఏమయిందేమిటి? అన్నది అమ్మ.

"ఏమీ కాలేదు నావంటి పాపాత్మునికి దేవుడు ప్రత్యక్షమవుతాడా? అందుకని కావనుకున్నాను. అయితే మీరు పాపాత్ములుగా అర్థం అయిందికదా? అనిపిస్తున్నదమ్మా చేసేది తప్పని తెలుసు. తెలిసికూడా చేయాలన్పిస్తున్నది అన్నాడు రామయ్య.

"మీరు నాతో పాటూ రండి. పెనుగుదలపాడు వెళ్దాం మీరు నాన్నా ఆమె–అమ్మా. అమ్మనాన్నగార్లతో ఎప్పుడూ ప్రయాణం అలవాటులేదు. ఏకారణం చేత నగలు తీసుకోవాలనుకున్నారో, ఆకొరత లేకుండా నేను మీ ముగ్గురినీ పోషిస్తాను. ఈరోజు నుండీ మీ వదినగారిని తల్లిగా చూచుకోమని రామయ్యకు చెప్పింది. అమ్మ చెబుతుండగానే మనందరినీ భరించవల్సిన అవసరం అమ్మాయికి ఏంకలిగింది" అని అనుమానాన్ని వెల్లడించింది రాజమ్మ. "నోరు ముయ్యి నీవు మాట్లాడవద్దు" అని రాజమ్మను కోప్పడి అమ్మతో" ఏది ఏలా జరిగినా, నాదురుద్దేశాలన్నీ మానుకుంటాను గానీ మావదినగారిని మాత్రం అమ్మగా చూచుకోలేను" అని వినయంగా చెప్పుకున్నాడు రామయ్య. "మానుకుంటే చూచినట్లే" నన్నది అమ్మ.

"మీరు ఇందాక ఆమెను తన్నటంలో మంగళసూత్రం పెరిగింది" తాను గుచ్చి ఇస్తానని తన ఎదుట ఆయన్ని కట్టమని చెప్పింది. అంతలో రంగమ్మ దారం, పసుపూ,

కుంకుమా తెచ్చి యిచ్చింది. అమ్మ దారంపేని పసుపు రాసి సూత్రాలు గుచ్చి రామయ్యకు అందించింది ఇద్దరికీ కుంకుమతో బొట్లు పెట్టింది.

రామయ్య రంగమ్మ మెడలో పాతమంగళసూత్రాన్నే కొత్తగా కట్టాడు. గుడిలో గంటల మంగళారావాలు వినిపించాయి. రంగమ్మ రామయ్యకు నమస్కరించింది. ఇద్దరూ కలిసి అమ్మ పాదాలపై మోకరిల్లారు. అమ్మ ఇరువురి శిరస్సులపై కుంకుమ చల్లుతూ "నాయనా ఆమె నీకు దేవత. ఆమెకు నీవు దేవుడివి. అని వారి శిరస్సులు తన చల్లని చేతులతో నిమురుతూ రాజమ్మ వంక తిరిగి "అమ్మా వారిద్దరినీ నీబిడ్డలుగా చూచుకో" అని సలహా ఇచ్చింది. "బిడ్డలా గడ్డలా" అని వురిమింది రాజమ్మ. "పోనీ నీవే వారి బిడ్డవనుకో" అని అమ్మ సూచనలో మార్పు చేసింది. "మేము పెనుగుదలపాడు వెళ్లివస్తాము తిరిగి మీ ఇంటికి వచ్చి వెళ్తా" అంది అమ్మ. అమ్మ నగలన్నీ రామయ్యే స్వయంగా అలంకరించి పాదాభివందనం చేసాడు.

తెల్లవారగానే తాతమ్మ, అమ్మా పెనుగుదలపాడు వెళ్ళటానికి బయలుదేరారు. రామయ్య దంపతులు వారిని ఊరి బయటకు వచ్చి సమర్యాదగా పంపించారు. అమ్మ ఆదంపతుల వీడ్కోలు నందుకుంటూ" మీ వదినగారికి కోపం వచ్చి వెళ్ళిపోతానంటుందోమో. వెళ్ళనివ్వండి. ఆమె ఎక్కడకు పోదు. నా దగ్గరికే వస్తుంది. ఆమె మనస్సును నేను మళ్ళించుకుంటాను. ఆపూచీనాది ''అని అమ్మ బాధ్యతాయుతంగా పలుకుతుంటే వారి హృదయాలు కృతజ్ఞతా భావంతో పొంగి అమ్మ పాదాలపై పునఃప్రణమిల్లారు.

పెనుగుదలపాడులో తాతమ్మకు అనేకమంది శిష్యులున్నారు. వారంతా అనేక విధాల సత్కరించారు. తాతమ్మ అందరికీ అనేకవేదాంత రహస్యాలు అందించింది. చివరకు వచ్చేటప్పుడు తాతమ్మకు అందరూ హారతి ఇస్తుంటే అమ్మకూడా తాతమ్మ ప్రక్కనే ఉన్నా అందరికీ అమ్మ పక్కనే తాతమ్మ ఉందనిపించింది.

తిరుగు ప్రయాణంలో ఇద్దరూ రామయ్యగారింటికి వచ్చారు. అక్కడ వారిద్దరూ ఎంతో అన్యోనంగా పరస్పర అనురాగంతో కనిపించారు కానీ రాజమ్మ మాత్రం ఆ ఇంటినుండి నిష్క్రమించింది. ఆమెను నేను బాగుచేసుకుంటాను, ఆమెకూడా నాబిడ్డే అని హామీ ఇచ్చింది అమ్మ.

★ ★ ★

# 30. అపూర్వకాంక్ష

తాతమ్మ అమ్మ శ్రీరంగపురంలో రామయ్య ఇంట్లో ఒకరోజు ఉన్నప్పుడు రామయ్య కృతజ్ఞతాపూర్వకంగా అమ్మకు ఉంగరం చేయించాడు. అక్కడునుంచీ గుంటూరు చేరి పదిరోజులు గుంటూరులో ఉండి మన్నవ బయలుదేరారు. దారిలో శ్రీవాసుదాసుగారి దర్శనార్థం బ్రాహ్మణకోడూరు వెళ్తూ కొందరు తాతమ్మను రమ్మని కోరారు. తాను ఇల్లు వదిలి చాలా కాలమయినందున అమ్మను తీసుకు వెళ్ళమని చెప్పింది.

అమ్మను వారితో బ్రాహ్మణ కోడూరు పంపించి తాతమ్మ మన్నవ వెళ్ళింది. వాళ్ళు అమ్మను తీసుకువెళ్ళారు కానీ ఎవరూ అమ్మ అన్నం తిన్నదీ లేనిదీ కూడా కనుక్కోలేదు. ఎవరికివారు అమ్మకు ఒకబిడ్డను దించితే మరొక బిడ్డను ఎత్తుకోవటానికి అందించారు. అమ్మకు వాళ్ళవాళ్ళ పిల్లలను ఎత్తుకుని ఆడించటమే సరిపోయింది. వాళ్ళంతా స్వామివారి సన్నిధిలో మూడు రోజులున్నారు.

నాలుగవ రోజున అందరూ బయలుదేరి ఒక్కొక్కరే స్వామి వారికి నమస్కారంచేస్తూ ఉన్నారు. అమ్మ పినతండ్రిగారైన రామబ్రహ్మంగారు అమ్మను నమస్కారం చేయమన్నారు. అమ్మ నమస్కారం చేసింది. స్వామివారు అమ్మ శిరస్సుపై చేయివేసి గోముగా నిమురుతూ "ఎవరీ అమ్మాయి?" అన్నట్లు రామబ్రహ్మంగారి వంక చూచారు. రామబ్రహ్మంగారు "మా అన్నగారి కుమార్తె తల్లిలేదు. అని పరిచయం చేశారు. "అలాగా పాపం" అని సానుభూతి ప్రకటిస్తూ అమ్మను తన దగ్గరకు తీసుకొని అమ్మ తలను తనగుండెలకు అదుముకొని "ఏమమ్మా-నీకు అమ్మ లేదుగా. అందరికీ నీమీద ప్రేమ ఉండేటట్లు ఆశీర్వదించేదా? అని స్వామివారు అడిగారు "వద్దూ నామీద ఎవరికి ప్రేమ ఉన్నాలేకపోయినా నాకు మాత్రం అందరిమీదనూ, ఎల్లప్పుడూ ప్రేమ ఉండేటట్లు ఆశీర్వదించండి" అన్నది అమ్మ చిన్నగా.

"అదేమిటమ్మా?! నీకోరిక బలే విచిత్రంగా ఉన్నదే నీమీద ప్రేమ అవసరంలేకపోవటమేమిటి? నీకు అందరిపైనా ప్రేమ అనుక్షణమూ ఉండటమేమిటి? అని ఆశ్చర్యంతో అడిగారు.

"ప్రేమ అంటే ఏమిటో తెలియాలంటే నాకు ఉంటేగా తెలిసేది. ఇతరులకు ఉంటే నాకేమి అర్థమవుతుంది? అన్నది అమ్మ ప్రశ్నార్థకంగా స్వామివారు అందుకు ఏమీ ప్రత్యుత్తరం యివ్వలేక మాటమారుస్తూ "పోనీ నీకేమి కావాలో చెప్పు" అని అడిగారు. అమ్మ వెంటనే "ఏమన్నా కావాలనేది అక్కర్లేకుండా కావాలి" అన్నది.

స్వామివారు దిగ్భ్రాంతి చెందారు. వారు ఎన్నో శాస్త్రాలు చదివారు ఎన్నెన్నో వేదాంత గ్రంథాలు పఠించారు. వారికెక్కడా ఆమాట కనిపించలేదు. ఆ చిన్నపిల్ల హృదయంనుండి వెలువడిన ఆ పెద్దకోరికకు విస్మయం చెందుతూనేవారు అమ్మను అడిగారు. "అసలు నీకు ఏపండు యిష్టం?" అని, "ఏపండయినా" అంటే "అన్ని పండ్లూ తింటావా?" "అందరి పళ్లూ తింటాను" అంది. పక్కగా నిలుచున్నా అమ్మను స్వామివారు చేయిపట్టుకొని ఎదురుగా నిలబెట్టుకున్నారు. కన్ను ఆర్పకుండా ఐదు నిమిషాలు చూచి పెద్దపెద్ద కళ్ళుచేసి నాభి దగ్గర నుంచీ ధ్వనిని లాగి షడ్జమ స్థాయి అందుకునేటట్లుగా "రామబ్రహ్మం" అని కేకవేశారు.

ఆ పిలుపు విని మన్నవ రామబ్రహ్మంగారు స్వామివారి యెదురుగా వచ్చి నిల్చున్నారు. "నిన్ను కాదు నాయనా" మన రామబ్రహ్మాన్ని అన్నారు స్వామివారు. "అంటే ఎవరని రామబ్రహ్మంగారికి అర్థంకాక అడిగారు స్వామివారు తమ కంఠసీమ నలంకరించిన పతకంతో ముద్రితమైన రఘురాముని చూపి "ఈస్వామినే నాయినా" అన్నారు. అమ్మాయిని చూడగానే కేక వేశారేమని" అడిగారు రామబ్రహ్మంగారు. "అది నేను చెప్పేదీకాదు. మీరు వినేదీకాదు. ముందుముందు అనుభవంలో మీకే అర్థమవుతుందని, అమ్మను దగ్గరకు పిలిస్తూ చేతులు చాపారు.

అమ్మకూడా రివ్వున వచ్చి వారిచేతుల్లో వాలిపోయింది. వారు అమ్మను పొట్టకు కరచుకొని నొసటన ముద్దుపెట్టుకున్నారు. ఆసమయంలో స్వామివారి బొట్టు చెదరి అమ్మ కళ్ళల్లో పడ్డది. అమ్మ కళ్లుమూసుకొని చేతితో నలుపుకుంది. అది చూచి స్వామివారు "కంటిలో నలకపడ్డదా అమ్మా?" అని అడిగారు. "కంటిలో నలకాలేదు. మనసులో కలకాలేదు వెళ్ళివాస్తాను" అన్నది అమ్మ. వాళ్ళను బండి ఎక్కించి వస్తానని రామబ్రహ్మంగారు వెళ్ళారు. స్వామివారు అమ్మను చూస్తూ నాలుగురోజులుండరాదూ? అని అడిగారు మాబాబాయిగారిని అడిగి వారు వుంటే నేను ఉంటాను అన్నది అమ్మ.

మళ్ళీ వస్తానని చెప్పి వెళ్ళిన రామబ్రహ్మంగారు ఆబండ్లతో బాటే వెళ్ళిపోయారు. అందువల్ల అమ్మకూడా బయలుదేరింది. "మరి నీవు ఎలా వెళ్తావమ్మా?" అని స్వామివారు అడిగారు. "ఎట్లావుంటే అట్లా వెళతా" నంది అమ్మ. "దారిలో బండ్లు కనిపించకపోతే వెనక్కు వచ్చేయమ్మా నడచి వెళ్లకు" అన్నారు జాలిగా స్వామివారు.

"వాళ్ళబండిలోనే వెళ్ళాలని ఏముంది? ఎవరు ఎక్కించుకున్నా ఎక్కువచ్చుగదా?" "సరే" నంటూ స్వామివారు అర్ధనిమీలిత నేత్రులయ్యారు నమస్కారపూర్వకంగా. అమ్మ గబగబా పరుగెత్తింది. ఆపరుగును చూస్తూ స్వామివారు "ఆజానకీ వల్లభుడే యీ బాలికై వచ్చాడా" అనుకుంటూ కనులింతింతచేసుకుని చూస్తుండగానే అమ్మ మలుపుతిరిగింది.

★ ★ ★

# 31. అందరూ మంచివాళ్ళే

అమ్మ వాసుదాసుగారి నుండి సెలవుతీసుకుని బయటకు వచ్చేటప్పటికే మన్నవనుంచి వచ్చిన బండ్లు చాలా దూరం వెళ్ళాయి.

అయినా అమ్మ కలినడకనే బయలుదేరింది. అంతలో ప్రొద్దు గ్రుంకింది. దొప్పలపూడి వాస్తవ్యులయిన బ్రహ్మయ్యగారి బండి పట్టుకుని అమ్మ నడకసాగించింది. "ఏయ్ అమ్మాయి బండిలో చెయ్యి పెట్టకు" అంటూ బండిలో నుండి ఎవరో కసిరారు.

బండిలో వారికి క్రిందటిరోజున జరిగిన అమ్మా-స్వాములవారి సంభాషణ ఘట్టం గుర్తుకువచ్చింది "ఆ అమ్మాయి ఎంత అదృష్టవంతురాలోనని అనుకున్నారు. చిన్నపిల్ల అయినా పెద్దల దృష్టినాకర్షించింది. నలుగురూ నాలుగుమాటలు అమ్మ గురించి అనుకుంటుండగా ఒక చిన్న అబ్బాయి "ఈ అమ్మాయేనమ్మా ఆ అమ్మాయి" అని అమ్మను చూపించాడు.

"కాదు ఆ అమ్మాయి చక్కగా జామపండురంగు మంచిగిరజాలు, తెల్లవాళ్ళపిల్లల్లే ఉంది. "అన్నారు ఇంకొకరు బండితోలే అతను వెనక్కు తిరిగి చూచి "ఆ అమ్మాయిలాగానే ఉన్నది. పిలుద్దాం" అన్నాడు. బండి ఆపారు అమ్మ బండి వద్దకు వచ్చింది. "నిన్న వాసుదాసుగారు పిల్చింది నిన్నేనా? అని అడిగారు ఒకరు. "అవన్నీ తరువాత మాట్లాడుకుందాము. ముందులోపలకు ఎక్కనివండి అన్నారు. మనకే ఇరుగ్గావుందని ఇంకొకరు నసిగారు. "ఇటురా అమ్మాయి నా దగ్గర కూర్చుందువుగానని జీతగాడు ఆదరంగా పిలిచాడు. వద్దు నడిస్తేనే తనకు హాయిగా వుంటుందన్నది అమ్మ. వెంటనే జీతగాడు బండిని ఆపి, తాను దిగి అమ్మను ఎత్తుకుని, బండిలో ఎక్కించుకున్నాడు. ఆమెది ఏవూరని బ్రహ్మయ్యగారు అమ్మను అడిగారు. మన్నవ అని బండిలో కూర్చున్న ఒకామె చెప్పింది. మన్నవలో ఎవరి అమ్మాయివి అని అడిగారు. 'ఎవరి అమ్మాయినంటే ఏమని చెప్పాలి' అని అమ్మ తిరిగి ప్రశ్నించింది. ఒట్టి పిచ్చిపిల్లలా వుంది. అదికూడా తెలియదా అన్నాడు బ్రహ్మయ్యగారి కూమారుడు.

నాన్న నాన్న అనటమే తప్ప తనకు నాన్నగారి పేరు అవసరం కలగలేదని, ఆయన పేరు తెలియదని నాన్న అనటమే అలవాటని చెప్పింది అమ్మ. ఆ సమాధానం

విని బ్రహ్మయ్యగారు "నీవన్నట్లు పిచ్చిఅమ్మాయేరా" అన్నారు కుమారునితో. అమ్మతో పోనీ నీపేరైనా తెలుసునా" అని అడిగారు బ్రహ్మయ్యగారు. "పేరంటే అసలు ఏమిటని" అడిగింది. "నిన్ను ఏమని పిలుస్తారు? అంటే "ఇందాక మీరేమని పిలిచారని" తిరిగి ప్రశ్నించింది.

"ఈ అమ్మాయి చాలా అసాధ్యపు పిల్లలా వుందే" అని బ్రహ్మయ్యగారు ఆశ్చర్యపోయారు. దానికి అమ్మ అప్పుడే మీరు అమ్మాయీ అని, పిల్లా అనీ పిలిచారు. అట్లాగే ఎవరికి వీలయినట్లు ఎవరికి తోచినట్లు వాళ్ళు పిలుస్తారు. తనపేరు ఇది అని ఎవరూ చెప్పలేదంది.

స్కూల్లో అమ్మపేరు ఏమని రాశారని అడిగారు. కష్టపడి మీరైనా బండి ఎక్కించుకున్నారు గానీ తన వాళ్ళు తన్ని బడికి పంపలేదంది.ఇందాక బండిలో కెక్కించుకోవటానికి తలా ఒక మాట అన్నాంకదా! అందుకని అట్లా అంటోంది అర్థమయిందా అని బ్రహ్మయ్యగారి భార్య కూమారుని ప్రశ్నించింది. ఆ అమ్మాయికి అంత తెలివి తేటలు లేవులే అమ్మా. అసలు తన అవయవాలనైనా గుర్తుపడుతుందో లేదో అంటూ జీతగాడితో అమ్మను తొట్టిలో నుంచీ బండీలోకి పంపమన్నాడు.

తన దగ్గరే కూర్చోనివ్వమని బండీవాడు అన్నాడు బలే ముద్దుగా వున్నది ఈ వెన్నెలలో ఆ ఒంటిరంగు చూడండి. ఎట్లా మెరిసిపోతున్నదో అన్నాడు జీతగాడు. ఆ ముద్దు మేమూ అనుభవిస్తాముగా" అన్నారు. జీతగాడు అమ్మనులోపలికి పంపాడు. అమ్మాయి నీ పొట్టయేది అంటే అమ్మ మాట్లాడలేదు. "నీ చేతులేవి అంటే తనదగ్గరే వున్నాయి అంది. ముక్కేది అంటే ఏది వుండే చోట అది ఉన్నది. అన్నీ ఉన్నాయి కానీ యీ అమ్మాయికి బుద్ధేలేదు అన్నాడు బ్రహ్మయ్యగారి కుమారుడు వికటంగా నవ్వుతూ.

"నీకుంటేనేగా తెలిసేది" అంది అమ్మ నిర్వికారంగా అనుమానం ఏమీలేదు. ఈ అమ్మాయితోనే వాసుదాసుగారు మాట్లాడింది ఔనా అమ్మాయి అన్నది బ్రహ్మయ్యగారి భార్య. "నిన్న చూచారు, ఇవ్వాళ చూస్తున్నారు. ఇంకా అడగటమెందుకు" అన్నది అమ్మ.

"నిన్న చూచిన పిల్లలాగా వున్నావు కానీ స్పష్టంగా అన్ని పోలికలూ లేవు.

అలా అని పోలికలు లేకుండానూ లేవు ఇందాక క్రింద నడిచేపటప్పటికీ ఇప్పటికీ తేడా కనిపిస్తున్నది. చూస్తున్నకొద్దీ క్షణక్షణానికీ మారిపోతున్నావు" అంటూ "ఇప్పుడు చూడవే అమ్మా–చూడవే ఆ అమ్మాయి ముఖం చూడవే క్షణ క్షణానికి మారిపోతున్నది. తాను పూజ చేసుకునే పటములోని పోలికలు కనిపిస్తున్నాయని బ్రహ్మయ్యగారి కుమార్తె నిర్ధారణచేసింది.

అంతలో బ్రహ్మయ్యగారు కలుగచేసుకొని "ఏమిటమ్మాయ్ అంటున్నావు. ఎవరి పటం? అంటూ అమ్మ వంక చూచారు. చూస్తూ అనిమేషులై కొన్ని క్షణాలు ఉ ండిపోయి" అమ్మ కనకదుర్గా–నువ్వేనా? అని గద్గద కంఠంతో అంటూ కొడుకును పిలిచి, "ఒరే పెట్టరా, దణ్ణం ఇకనయినా నీకు మంచిరోజులు వస్తాయేమో" అన్నారు.

"ఎందుకు పెట్టటం? మీకు కనిపించెందేదో నాకు కనపడవద్దూ?" తల్లీ ఒక్కసారి వాడివంక చూడు. అని అమ్మను బ్రహ్మయ్యగారు బ్రతిమాలారు. అతని వంక అమ్మ ప్రసన్నంగా చూచింది.

బ్రహ్మయ్యగారి కుమారుడు వెంటనే అమ్మ కాళ్ళపై వాలాడు. అందుకు బ్రహ్మయ్యగారికి అమితానందం కలిగింది. బ్రహ్మయ్యగారి భార్య అమ్మకు నమస్కారం చేసుకున్నది బ్రహ్మయ్యగారి కుమార్తె ఆనంద భాష్పాలతో నిశ్చలంగా ఉండిపోయింది. తొట్లోంచీ జీతగాడు కూడా గూడు క్రిందగా తలవంచి చూస్తూ తన్మయుడయ్యాడు.

అందరూ ఒక కొత్త ఆనందానుభవంతో పరవశం చెందారు. వారందరూ ఆ స్థితిలో ఉండగానే ఎద్దులు సరాసరి వారింటి ముందుకు వచ్చి బండిని ఆపాయి. అంతాదిగి అమ్మనుకూడా వారి ఇంట్లోకి వచ్చి కొంచెం మంచినీళ్లు త్రాగి మళ్ళీ బండిమీదనే మన్నవ వెళ్ళమన్నారు. కానీ అమ్మ నడిచే వెళ్తానన్నది. అయినా వారు ఒప్పుకోక బండి మీదనే తీసుకువెళ్ళమని జీతగాడికి చెప్పారు బ్రహ్మయ్యగారు.

బుల్లిపాపాయివి అంటూ అమ్మను ఎత్తుకొని బండీలో కూర్చోబెట్టాడు జీతగాడు. చూడటానికి పొట్టిగావున్నా తనకు చాలా వయస్సున్నదన్నది అమ్మ. చాలా అంటే ఎంతమ్మా అన్నాడు. ఇంత అని చెప్పలేనంది అమ్మ. ఏదీ చెప్పలేను, చెప్పలేను అంటావేమిటమ్మా అన్నాడు చెప్పేదికాదు కనక. చెబితే తెలుసుకుండేది కాదు నాయనా" అన్నది అమ్మ.

బ్రహ్మయ్యగారు మొక్కజొన్న కండెల బుట్టతెచ్చి అమ్మకు అందించారు. అమ్మను తనతో బాటే తొట్టిలో కూర్చోబెట్టుకొని ఏవేవో అడుగుతుంటే అవన్నీ సరేగానీ మీదేవూరు నాయనా? అని అమ్మ అడిగింది. జడవల్లి. మా బంధువులు కమ్మవారింట్లో వుంటే పని బాగా వస్తుందని వుంచారు. "వారు కమ్మవాళ్ళంటున్నావు నీవు ఎవరివి?" అమ్మ అడిగింది. నీకు తెలియదా అన్నాడు. "నాకు తెలియదు నాయనా అంది అమ్మ. బండిలో అన్ని మహిమలు నీకు కనిపించాయా? వాళ్ళు అనుకుంటుంటే విన్నావా?"

"వాళ్ళు అననుకోవటం తనకు తెలియదని బండి వెంట అమ్మ నడుస్తుంటే చందమామ నడిచినట్లుందన్నాడా జీతగాడు. నీకు తెలియంది ఏమున్నదంటావు ఏంచూచి అంటున్నావు? ఏం తెలుసుకొని అంటున్నావు" అన్నది అమ్మ "ఏమోనమ్మా! నిన్ను చూచినప్పటినుంచీ అట్లా అనాలనిపించింది", అన్నాడు.

అమ్మ అతని గురించి విరాలు సేకరించటానికి మొదలు పెట్టింది. "అన్నం మూడుసార్లు పెడతారా? జీతం ఎంత? అని అడిగింది. పదిహేనురూపాయలన్నాడు. "పదిహేను రూపాయలతో జీవనం సాగుతుందా మీవాళ్ళకు" అంది. అంతా కూలీవాళ్ళే ఎవరి కూలీ వాళ్ళే తెచ్చుకుంటారు కాబట్టి సరిపోతుంది. ఈ పదిహేను రూపాయలతో యీ ఏడు వాళ్ల చెల్లి పెళ్ళి చేస్తానని అన్నాడు.

మనం దిగి కాసేపు కట్టమీద కూర్చుందామని అంది. తాను ఎద్దులకు మేతకూడా తేలేదని ఆలస్యమయితే ఏమైనా అంటారని, మీ ఇల్లు గుర్తుపెట్టుకు రమ్మన్నారని అన్నాడు.

మా ఇల్లు గుర్తు పెట్టుకుంటే అతను అప్పుడప్పుడు కనపడిపోవచ్చంది అమ్మ మేతకు పొలం వచ్చినప్పుడు రావచ్చునుగానీ ఇంటికివస్తే మీవాళ్ళేమయినా అంటారేమోనని సందేహం వెలిబుచ్చాడు. అమ్మ ఇంటికి రావద్దని, సామాన్యంగా తాను గంగరాజు పున్నయ్య గారితోటలో గానీ, మురుగుకాల్వ కట్టమీదగానీ, బల్లకట్టువద్దగాని వుంటానని అక్కడలేకపోతే ఇంటికి రమ్మని చెప్పింది. మీ చెల్లి పెళ్ళి పదిహేను రుపాయలతో ఏమి చేస్తావని తన చేతిని వున్న వుంగరం తీసి ఇచ్చింది. చిన్నిపిల్లవు. మాకామందులు వూరుకోరు అన్నాడు. ఇందాకేమో తనకు

తెలియందిలేదన్నావు, మహిమలు చూపించానన్నావు. ఇప్పుడేమో చిన్నపిల్లవు అంటున్నాడని అమ్మ ఆశ్చర్యాని ప్రకటించింది.

రెండూ అనిపిస్తున్నాయమ్మా అదే తికమక పెడ్తోందన్నాడు జీతగాడు. కొద్ది క్షణాలు గడిచాక ఎందుకో తనకు అమ్మపాదాల దగ్గరే పడివుందామనిపిస్తోందని కాని తాను చెడ్డవాడినని, అన్నీ తప్పుడలవాట్లే అన్నాడు.

మంచి అలవాట్లు ఏమీ లేవా? అమ్మ అడిగింది. అతను ఆలోచనలో పడ్డాడు. కొన్ని క్షణాలకు ఒక్కటుందమ్మ. ఎవరు తినలేదన్నా సహించలేను. నేను మానుకుని అయినా వాళ్ళకు పెడతానన్నాడు. అంతేనా? అమ్మ మళ్ళీ ప్రశ్నించింది. కొంచెంసేపు ఆలోచించి అబద్ధమాడనమ్మా అన్నాడు.

అతనికి వున్నవన్నీ చెడ్డ అలవాట్లుకాదని, ఇవి కూడా అతని దృష్టిలో చెడ్డఅలవాట్లేనా అని అడిగింది నవ్వుతూ అమ్మ.

అతను అమ్మ మాటలకు విరగబడి పకపకా నవ్వాడు. మళ్లీ అమ్మే మనుషులందరూ మంచివాళ్ళే నాన్నా! చెడ్డవాడు ఎవడైనా ఉన్నాడు అంటే మనం అనుకునే యీ చెడ్డతనాన్ని మనకు యిచ్చిన ఆ భగవంతుడు మాత్రమే" అంది.

★ ★ ★

# 32. మంత్రాయి

అతనికి అమ్మ మాటల్లోని అర్థం-అవగాహన కాక అమ్మవంక మౌనంగా చూస్తూ నిల్చుండిపోయాడు. నీకు తీరిక ఎప్పుడు దొరికితే అప్పుడు రమ్మంది. తనకు అమ్మమీద కలిగిన ప్రేమను గుర్తించిందా? లేక అమ్మకే తనపై ప్రేమ కలిగిందా అని ఆలోచిస్తున్నాడు. ఇంకేమీ ఆలోచించక తప్పక రమ్మని ఆజ్ఞాపించింది. ఇంట్లో వున్నా అతన్ని చూడగానే తానే బయటకు వస్తానని అతని రాకకొరకు తనరెండు కళ్ళు వేచి వుంటాయని తెలియచేసింది.

అతను సరే అన్నా అతని మనస్సులో ఆలోచన జ్వలిస్తూనే వుంది. ఏమి ఆలోచిస్తున్నావంటూఅమ్మ అడిగింది. తన మీద అమ్మకు ఇంతప్రేమ ఎందుకా అని ఆలోచిస్తున్నానన్నాడు. తనకు ప్రేమ ఉండటం సహజమేనని, తనప్రేమకు అతను గుర్తించటమే విశేషమంది. అమ్మ తప్పక రమ్మంటూ అతన్ని వదిలిపెట్టి బండి దిగాలంటే పురిట్లో బిడ్డను వదిలిపెట్టినట్టుగా బాధపడ్డది. అమ్మను "మరియావా" అని అడిగాడు. "అయితే నీవు ఏసయ్యావా" అని అతని వంక చూడగానే అతడు అమ్మవంక అమాయకంగా చూచాడు. అమ్మ అతని దగ్గరకు వెళ్లి అతని తలను తన గుండెల్లో పొదవుకుని చెక్కిళ్ళు సవరిస్తూ 'పరిశుద్ధ ఆత్మ' అంటే యిదే అని అర్థమయిందా" అని అడిగింది.

అతను అర్థం కాలేదన్నాడు. తను అతని దగ్గరకు తీసుకున్నాప్పుడు అతని మనస్సు ఎలా ఉందని అడిగింది. "మా అమ్మ దగ్గర వున్నట్లున్నదమ్మా" అన్నాడు. తానే అతని అమ్మనని అనిపించలేదా అని అడిగింది. చెప్పటం చేతకావటంలేదని, ఆ భావాన్ని వ్యక్తపరచలేనన్నాడు. అతనికి మించిన భాషే మాట్లాడుతున్నాడని ఏమయిన చదువుకున్నావా? అని అతడ్ని అడిగింది అమ్మ.

చదువుకోలేదమ్మా అన్నాడు అమ్మ దగ్గర కూర్చుంటేనే మాటలు దొర్లుకు వస్తున్నాయి. భయం కూడా వుందమ్మా చేసే పాడు పనులన్నింటికి శిక్ష వేసి మాన్పించమని వేడుకున్నాడు. అంతలో ఎద్దులు కదిలి గంటలు గణగణమన్నాయి. ఆశబ్దం విని వాకిట్లో పడుకున్న నల్లఖాసిం బయటకు వచ్చి ఇదేమిటి మాబంగారు తల్లి ఇంత అర్ధరాత్రివేళ వచ్చిందని భుజాన వేసుకుని లోపలకు వెళ్ళి దీపం తీసుకువచ్చి

ఎద్దులను చూచి ఇవి కావూరి వారి ఎడ్ల వలే వున్నాయే అన్నాడు. అవునని జీతగాడు చెప్పాడు. బ్రాహ్మణ కోడూరు నుంచీ బండ్లన్నీ వచ్చాయి. అమ్మాయి రాలేదు. మా బాబుగారు కనుక్కురమ్మన్నారు. పోదామనుకుంటూనే కన్నుమూసాను. నిద్రపట్టింది. ఇంతకూ మా అమ్మాయి మీకు ఎక్కడ కనిపించింది? అని అడిగాడు

బ్రాహ్మణ కోడూరు దాటగానే నడిచివస్తూ మమ్మల్ని కలిసింది. మా బండిలో ఎక్కించుకు వచ్చామని చెప్పాడు. మంచి పని చేశారని, నల్లఖాసిం అడిగాడని బ్రహ్మయ్యగారికి చెప్పమన్నాడు.

అమ్మ దొప్పలపూడిలో వారు ఇచ్చిన మొక్కజొన్న కండెలు లోపలకు తీసకువచ్చింది. తాతమ్మ గాఢ నిద్ర పోతున్నది. అమ్మ వెళ్ళి తాతమ్మ పక్కలో కూర్చుంది. ఖాసిం వచ్చి ఏం జరిగిందమ్మ, వాళ్ళ బండి మీద వచ్చావేమిటి అని అడిగాడు. అమ్మ జరిగిందంతా వివరించి ఎవరైతేనేమి తన నడవకుండా తీసుకువచ్చారంది. మనం ఎవరికీ ఏమీ చెయ్యలేము గదా. వాళ్ళు చూడు ఎంత ఆదరణ చూపించారో. వాళ్ళు చూపించిన ఆదరణ మాటల్లో చెప్పటం చేతకావటం లేదు అన్నది అమ్మ.

బుట్టలో వున్న మొక్కజొన్న కండె ఒలిచి ఖాసింతో "ఈ గింజల కూర్పు ఎంత బాగున్నదో! ఒక్కో గింజ నములుతుంటే పాలు నోట్లోకి వస్తాయి. పిప్పి బయట పడ్తున్నది. పాలు నాలక మీద తగిలినపుడు రుచివేరు. చర్మం పాలతో కలిసినపుడు రుచి వేరు. కాల్చుకు తింటున్నప్పుడు రుచివేరు అని అన్నది.

తాతమ్మ కొద్దిగా కదిలింది. అమ్మ మొక్కజొన్న గింజ ఒకటి కొరికి పాలుచప్పరిస్తూ "ఖాసిం ఈ గింజల్లో పాలు ఎవరు పెట్టారు? గింజలు పెట్టినవా? ఈ చర్మం, పాలు కలిస్తేనేగా గింజ అయింది. అంతేనా అని అడిగింది. తన కేమి తెలుస్తుందన్నాడు ఖాసిం. అతను రైతేగాబట్టి తెలస్తుందేమో అన్నానంది. ఉన్నదాన్ని బట్టి పెద్దవాళ్ళు చెప్పిన ప్రకారం చేసేవాణ్ణేకానీ తనకేమీ తెలియదని అన్నాడు.

మరిడమ్మ తాతమ్మకు మెలకువ వచ్చింది. ఏదో తత్వవిచారణ చేస్తున్నదే మా అమ్మ వాసుదాసుగారి దగ్గరి నుంచీ వస్తున్నది గదూ. ఆయన ఏమి చెప్పారమ్మా. అని తాతమ్మ అడిగింది. తనేమీ వినలేదని వాళ్ళు వినటానికి రమ్మని తాతమ్మను

అడిగే తన్ను తీసుకువెళ్ళారు కదా! అన్నది వాళ్ళు తీసుకువెళ్ళటానికి ఏమి కారణాలుంటాయి. వాళ్ళ ఇళ్ళల్లో తన ఈడు పిల్లలున్నారు గదా. వాళ్ళను తీసుకువెళ్ళకుండా తన్నే తీసుకువెళ్ళారంటే వాళ్ళపిల్లలు చూడకూడదా వాసుదాసు గారిని అని అడిగింది. కాదమ్మా తప్పకుండా అమ్మేచూడాలి. అమ్మే చూడదగిన దానివని అమ్మను తీసుకువెళ్ళారు అన్నాడు ఖాసిం.

తెల్లవారుజామున నాలుగు గంటలయింది. తాతమ్మ మేలుకొలుపులు పాడుకుంటూ తన పనిమీద వెళ్ళింది. ఖాసిం పనికి వెళ్ళాడు. అమ్మ తెల్లవారిన తరువాత మురుగు కాలవ కట్టమీదకు వెళ్ళి పదిగంటల దాకా క్రిందటిరోజూ కలిసిన దొప్పలపూడి వారి జీతగాడి కోసం నిరీక్షించి వెనుదిరిగి ఇంటికి వచ్చింది

అప్పుడే అమ్మసవతి తల్లి కామేశ్వరమ్మను ఆమె తండ్రి మంత్రి కిష్టయ్యగారు తీసుకువచ్చారు. అమ్మ గబగబా వెళ్ళి ఆమె ఒళ్లో కూర్చుంది. ఆమె తాను తెచ్చిన పళ్ళు అమ్మ చేతిలో పెట్టింది. అమ్మ ఆ పళ్ళు తీసుకొని మళ్ళీ కాలవ కట్టకు వెళ్ళి ఆ జీతగానికోసం అక్కడ కూర్చుంది. చేతిలో కొడవలీ, తాళ్ళు, భుజాన కర్రలతో గబగబా అడుగులు వేసుకుంటూ వచ్చాడు. అమ్మ అతనికి ఎదురుగా వెళ్ళి నాయనా మంత్రాయి-ఇంత ఆలస్యం చేశావేమి? అని అడిగింది. మంత్రాయి అన్న పిలుపు అమ్మనోట వినగానే అతనికి ఆశ్చర్యం, ఆనందం కలిగి అమ్మ పాదాలపై వాలిపోయాడు. అతని తల నిమురుతూ అతన్ని లేవదీసి “ఆ తోటలోకి పోదాం పద. అన్నం తిన్నావా?” అని అడిగింది అమ్మ తిన్నానమ్మా అన్నాడు.

అమ్మ తన దగ్గరి కమలాఫలం వొలిచి తొనలు తీసి మంత్రాయిని దగ్గరకు పిలిచి అతడి నోటికి అందించింది. మంత్రాయకి ఆశ్చర్యంతోనూ, ఆనందంతోనూ, శరీరం పరవశించి పోయింది. మీరు బ్రహ్మణులూ, నేను తాకరాని వాడినీ, కదా? నన్ను ఇంత దగ్గరకు తీసుకుంటావేమమ్మా” అని అడిగాడు అడుగడుగునా నీ భావాలు మారిపోతాయా నాయనా? ఒకసారి అమ్మా అంటావు. ఒకసారి బ్రాహ్మలు అంటావు అంది.

తనకు స్థిమితం తక్కువని, అందులో అమ్మ విషయంలో మరీ అని, అమ్మను చూచేటప్పుడు ఒకరకంగా వుంటుంది. రాత్రి ఇక్కడ నుంచీ తిరిగి వెళ్తూ అమ్మ గురించి ఆలోచిస్తే అమ్మే దేవుడేమోనని అనిపించిందన్నాడు.

మంత్రాయి అనగానే ఎందుకు పాదాలపై పడ్డావు అంది అమ్మ. ఉన్న సంగతంతా చెప్తానంటూ, మంత్రాయి అయ్య, అమ్మ మేనత్త, మేనమామ బిడ్డలు. ఒకరిది జడవల్లి అని అంటూనే చెప్పమంటావా? ఇది అంతా నాకెందుకు అంటావా అన్నాడు.

తనకెందుకు అనిపిస్తున్నా మంత్రాయిని చూస్తే ఎందుకు చెప్పుకుంటాడో విందామనిపిస్తుంది. తన మనస్సు అతని మనస్సువంటిదేనని స్థిమితమంటూ వుండదని చెప్పింది.

భలే అమ్మవమ్మా! నాతో పోల్చుకుంటున్నావా! అన్నాడు. మనస్సు లక్షణమే అంత అంటూ చెప్పమంది అతను చెప్పటం ప్రారంభించాడు. మేము బాపట్ల దగ్గర ఒక పల్లెటూళ్ళో వుండేవాళ్ళము. దొప్పలపూడిలో మంత్రాయి పెదతల్లి కూమారుడు జీతానికి వున్నాడు. అతనికి జబ్బు చేస్తే ఆసుపత్రికి వెళ్ళాడు. అతనికి బదులు తాను వచ్చాని చెప్పాడు. అమ్మను చూచే అదృష్టం వుండబట్టే ఇట్లా జరిగిందేమోనని రాత్రి నుండీ అనుకుంటున్నానన్నాడు. రెండు మూడు సంవత్సరాల నుంచీ ఎన్నో తప్పులు చేస్తున్నానని తనకు బుద్ధిపుట్టి చేయటం కాదని, కామందులు చేయమన్నట్లు చేస్తున్నానన్నాడు. శరీరం ఒకరికి అమ్ముకున్న కారణం చేత వారు చెప్పినట్లుగా చేయాలి కదా! అన్నాడు.

చెయ్యకపోతే కొడతారా? నిజంగానే అదే నిజమయితే అతనికేమీ అంటదని చెప్పింది అమ్మ ఆమాటకు వస్తే ఎవరి పనులకు ఎవరు మాత్రం బాధ్యులు? అందరూ ఇంకెవరో ఒకరు నడిపితే నడిచేవాళ్ళే గదా! అన్నది అమ్మ. మంత్రాయికి అమ్మ అనేవి అర్థం చేసుకుందామని ప్రయత్నం చేయక తన ధోరణిలోనే "మా ఊరికల్లా ఒకడే ప్రభువు" అన్నాడు మంత్రాయి. ప్రభువు అంటే భగవంతుడేనా అన్నది అమ్మ. కాదమ్మా మావూళ్ళో కల్లా ఒక్కడే ధనవంతుడు. గ్రామమంతా ఆయన చేతుల్లోనే ఉ ంటుంది. ఆయన కంటే పెద్దవాళ్ళు చిన్నవాళ్ళు ఆయన మాటే వింటారు అన్నాడు. ఆయన వూరు పేరు ఏమిటి నాయనా అంది అమ్మ. ఆవూరు జిల్లెళ్ళమూడి. ఆయన పేరు ఖగ్గా పున్నయ్య చాలా చిన్నఊరు అన్నాడు. ఆవూరు తెలియదు కానీ ఆయన మా తాతగారి దగ్గరకు వస్తుంటారు అన్నది అమ్మ. ఇంక ఎంతకాలముంటావు నాయనా! అని అమ్మ అడిగింది.

ఇక్కడే తాను ఉండటానికి ప్రయత్నిస్తానని, తాను ఎక్కడికి వెళ్ళినా, ఏం చేసినా అమ్మను మరిచిపోనని, అమ్మ మాత్రం తన్ని వదిలి పెట్టకూడదని ప్రాధేయపడ్డాడు. మా వూరుకి అగ్రహారీకులు వచ్చి రామాయణం చెప్తుంటారు. అది వింటూవుంటే సీతమ్మవారిలాంటి అమ్మ కనిపిస్తే బాగుండునని అనుకొనేవాణ్ని. మీరు మంత్రాయి అని పలిచినపుడు అమ్మవైపు చూడగానే నిండు ఆకుపచ్చరంగు చీరె, ఎఱ్ఱని రెవికతో ఆ చెట్టుక్రింద మోకాళ్ళ మీద చేతులు పెట్టుకుని, తలవంచుకుని జుట్టు విరబోసుకుని తనకోసమే కూర్చున్న సీతమ్మ లాగా కనపడింది. పాదాలపై పడ్డప్పుడు ఉంగరం జ్ఞాపకం వచ్చింది. మంత్రాయి అన్నపేరు పున్నయ్యగారు పెట్టారు. ఆపేరు అమ్మకు చెప్పలేదు అగ్రహారీకులు చెప్పే కథ అంతా జ్ఞాపకం వచ్చింది. తలమీద చెయ్యిపెట్టినపుడు కూడా సీతమ్మవారిలా వుంది లేచి చూస్తే మామూలుగా చిన్న అమ్మాయిలా కనిపించావు అన్నాడు మంత్రాయి.

అయితే నీవు ఆంజనేయుడివనా నీ ఉద్దేశ్యం? అని ప్రశ్నించింది. 'మంత్రాయి' అని అమ్మ పిలిచింది. ఏమిటమ్మ అన్నాడు. రాత్రి మంత్రాయి తనతో కొన్ని అబద్ధాలు చెప్పాడని కొన్ని దాచాడంది అమ్మ.

అప్పటి దాకా అనురాగం కురిసే అమ్మ కన్నుల్లోను, కంఠంలోను ఏదో కాఠిన్యం గోచరించింది. అంతలావు మనిషీ నిలువునా కారిపోయాడు. రాత్రి అతని వయస్సు పొరపాటు చెప్పాడని, అతని వయస్సు ఇప్పుడు ఇరవై ఏడు సంవత్సరాలని చెప్పింది.

తనకు గుర్తు లేదని, వయస్సుతో మాకు పనేముంటుంది. తరువాత ముగ్గురు పుట్టారనీ, నలుగురు పుట్టారని మాత్రమే అనుకుంటాం అన్నాడు. ఒక అమ్మాయి ఏమయినా పుట్టిందా? అని అమ్మ అతడ్ని అడిగింది. ఈ మధ్యనే ఒక అమ్మాయి పుట్టిపోయిందని చెప్పాడు. అమ్మ ఎవరో, ఏమిటో తనుచేసే ప్రతి పని చూస్తుంటావా అని అడిగాడు.

అతను ఒక్కడేకాదని, అందరూ అటువంటివాళ్ళే అంది. ఈ ప్రపంచంలో ఎంతమంది మనుష్యులో ఎవరు ఏమి చేస్తుంటారో, ఎవరికి ఎంతమంది పిల్లలో అమ్మకు తెలుసా. ఇంత మందిని ఒక్కసారిగా ఎట్లా చూస్తావమ్మా, ఉన్నది రెండే కళ్ళు కదా! ఇంతింత కాళ్ళు ఇంతింత చేతులు రబ్బరు బొమ్మవలే ఉన్నావు అన్నాడు.

అమ్మనవ్వుతూ వింటూ ఉన్నది. "ఎక్కడికీ వెళ్ళకుండా దొప్పలపూడిలోనే ఉండాలని అన్నది. వెళ్ళినేను లోగడ చేసిన పనులు చేయకుండా నావెంట వుండి నన్ను కాపాడమ్మా మావూరి కాపు నాచేత కాని పనులన్నీ చేయించకుండా కనిపెట్టివుండమ్మా!" అని కోరుకున్నాడు

అతన్ని రేపు కూడా రమ్మని, అతనికి అన్నం పెట్లాలని తనకువుందని పగలుగానీ, రాత్రిగాని అతనికి తీరిక దొరికినప్పుడు వచ్చి తినమని తాను ఆతోటలోనే వుంటానని చెప్పింది. సరే అంటూ మంత్రాయి పొలం వెళ్ళాడు. అప్పుడే సూర్యుడు పడమటకు వంగాడు. మంత్రాయి మనస్సులోని మాలిన్యం కడిగివేయబడి సూర్యకిరణ ప్రసారంతో దీప్తివంతమయింది.

అమ్మ మంత్రాయిని అటు పంపించి తాను ఇంటికి వచ్చింది. తాతమ్మ తాను బాపట్ల వెళ్ళి వస్తానని చెప్పింది. లోపలికి వెళ్ళి నానపోసిన పప్పు కడుగుతుంటే సీతాపతిగారు లేచి ఏమిటమ్మా చేస్తున్నావు? అని అడిగారు. ఈవేళ పప్పుకడగాలని బుద్ధి పుట్టింది అన్నది అమ్మ. పప్పు పిసుకుతూ తాతమ్మ ఈ నీరెందుకు పచ్చపడ్డది. పప్పు పిసకగానే పొట్టు వూడుతున్నది. పొట్టుకున్న రంగు నీటికి వచ్చింది. సాంగత్యబలమంటే ఇదేనా? నీరేగా పొట్టను, పప్పును విడదీసింది. ఒక దాన్ని మార్చగల శక్తి ఉన్నప్పటికి ఆ శక్తి మరొక శక్తితో కలవక తప్పదు శక్తి రకరకాలుగా వుంది. ఈ శక్తేనేమో భగవంతుడంటే దీనికే తలోకపేరు పెట్టుకున్నారు. పేరుకు కూడా శక్తివుంది కదా! భావానికి రూపం వుంది. రూపానికి పేరు వున్నది. ఆ రూపానికి శక్తివుంది. ఇందులో ఏదీ తక్కువ కాదు.

అంతలో తాతమ్మ ఏమిటమ్మా ఎవరో అడిగినట్లు చెప్పుకుపోతున్నావు అంది. తాతమ్మకు చెబితే సమాదానం ఇవ్వలేదు. అందుకని పప్పుతో, పొట్టుతో, నీటితో మాట్లాడుకుంటున్నా అన్నది అమ్మ. వాటికి చైతన్యం వుందిగా, చైతన్యం లేకపోతే ఒక దాన్ని ఒకటి మార్చలేవుగా, వంపులు పెట్టినకొద్దీ పప్పులో పొట్టు పోయింది. నీటికి పచ్చదనం వచ్చింది. పొట్టలో నీరు పోసినా నీటికి పచ్చదనం రాదు. ప్రతి దానికి పరిమితి గల శక్తి, చైతన్యం వున్నాయి.

మాట్లాడాలంటే మనుష్యులతోనే అక్కరలేదు. వాటితో కూడా మాట్లాడవచ్చు. మనుష్యుల్లో మాత్రం భాషా, భావాలు ఒకటిగా ఉన్నాయా? మనుష్యుల్లో ఎట్లా

తారతమ్యాలు వున్నాయో అన్ని పదార్థాలలో అట్లానే వున్నాయి. వాటి బాష మనకు అర్థం కాకపోవచ్చు ఒక చెట్టు దగ్గరకు పోతే వచ్చావా అన్నట్లు పలకరిస్తుంది. దీనిని మనం గ్రహించలేము కదా! అని తాతమ్మకు విశదీకరించింది. తాతమ్మ! మాట్లాడవేం? అందరికీ చెప్తావుకదా! అంది. చిదంబరరావు తాతయ్య మాట్లాడుతున్నట్లుంటే వింటున్నా! ఎవరో పెద్దవాళ్ళు ఉపన్యాసమిస్తునట్లుందమ్మ! అని తాతమ్మ చెప్పింది. తాను అడిగిందంతా నిజమేనా? సమాధానం చెప్పమని తాతమ్మతో అంది. అమ్మ అడుగుతున్నట్లుగా లేదని, ఎవరో చెబుతున్నట్లుగా వుండటంతో తాను వింటున్నానని తాతమ్మ అన్నది.

తాతమ్మ పప్పురుబ్బి గారెలు చేసింది. తనకు పెట్టమని నాలుగు గారెలు తీసి పొట్లం కట్టుకుంది అమ్మ. అందరి భోజనాలు అయ్యాక తాను తారువాత వచ్చి తింటానని, పిన్నిని పడుకోమని చెప్పి అమ్మ కాలువ కట్టకు వెళ్ళింది. మంత్రాయి రాలేదు. అమ్మ ఇంటికి వచ్చి అన్నం తీసుకొని తోటలో కూర్చుంది. మంత్రాయి అక్కడకు వచ్చి కొడవలి. కఱ్ఱ పక్కన పెట్టి అమ్మకు నమస్కారం చేస్తాడు.

మంత్రాయి అన్నం తిన్నావా? అని గడ్డం పట్టుకొని అడుగుతుంది అమ్మ. ఎందుకమ్మా ఈ మాలవాడికి ఇంత మంచిపేరు అంటాడు. "నీవు మావాడివి మాలవాడివి కాదని చెప్తుంది. మంత్రాయికి ఆనందంతో కళ్ళ వెంట నీళ్ళు వస్తాయి. అమ్మ అన్నం పొట్లం విప్పి పొట్లకాయ పెరుగుపచ్చడి, వంకాయకూర, గొంగూర పచ్చడి, వెన్నపూస కలిపి ఒక్కొక్క ముద్దే నోట్లో పెడుతుంది. మంత్రాయి ఒక్కోముద్దా తింటూ ఏడుస్తాడు. ఎందుకు నాయనా ఏడుస్తున్నావని అమ్మ అడుగుతుంది.

దొప్పలపూడిలో వుంటాను కదా! రోజు వచ్చి దర్శనం చేసుకోవచ్చనుకున్న, కానీ అదీ తీరిపోయింది. జీతగాడి తమ్ముడ్ని పంపిస్తారుట అన్నాడు. వెంటనే వెళ్ళిపోతావా అని అమ్మ అడిగింది. అతను ఎప్పుడు వస్తే అప్పుడే వెడతాను. రేపే వెళ్ళేటట్లయితే రాలేను. నాలుగు రోజులు వుండేటట్లయితే వస్తానన్నాడు. ఈ వూళ్ళోనే కూలి చేసుకు బతకటానికి ప్రయత్నిస్తానని చెప్తాడు.

బ్రహ్మాయ్యగారు "మా ఇంటి గుర్తులు అడిగారా?" అంది అమ్మ. అడిగారు, చెప్పానంటూ, మీ వూరు నుంచీ పులిపాక భావనారాయణగారు వస్తే ఆయనకు మొన్న జరిగిందంతా చెప్పారు. అన్నాడు.

తాను పుట్టి ఇంతకాలమైనా ఈ రకం భోజనం ఎప్పుడూ చేయలేదన్నాడు. బ్రహ్మయ్య గారింట్లో అయినా తన కోసం జొన్నలు దంపిస్తారని చెప్పాడు. పనిచేయవలసిన వాడికి బలంగా వుంటుందని ఆ జొన్న అన్నం పెడ్తారు నాన్నా? ఈ వరి అన్నంలో ఏముంది? అంది అమ్మ.

అతనికి ఏమి తినాలని వుందో, ఏ కూరలు తినాలని వుందో చెప్పమంది. అవి ఏవి అక్కరలేదమ్మ! ఇందాక నీవు పెట్టిన కూరలు చాలు పొట్లకాయ పెరుగు పచ్చడి ఎప్పుడు తినలేదన్నాడు. వంకాయ కూర కాయలకు కాయలు ఎప్పుడు తినలేదని చెప్పాడు రేపురా? పిన్ని నడగి ఒక వీశెడు కూరచేయించు కొస్తానన్నది అమ్మ. వొద్దులే అమ్మా! ఇంట్లో వాళ్ళేమైనా అనుకుంటారు. ఆలేత చేతులు చూడు అన్నం కలిపితే ఎట్లా కందిపోయాయో, కలపటం కాకుండా, నోట్లోకూడా పెడ్తుంటే వేళ్ళు పళ్ళక్రింద పడిపోతాయేమో అనుకున్నాను. ఎప్పుడైనా వచ్చిపోతుంటానని అమ్మతో మంత్రాయి చెప్పాడు.

ఆ జీతగాడు వస్తే ఏవూరు వెడ్తావని మంత్రాయిని అడిగింది. అమ్మ బాపట్ల దగ్గర జిల్లెళ్ళమూడి పోతానని చెప్పాడు. బాపట్ల వస్తే తన అడ్రసు చెప్తాను. మా తాతయ్య గారింట్లోను, బజారు వాకిట్లోను వుంటానంది. మంత్రాయిని "బాపట్లలో ఎక్కడ వుంటావో చెప్పమని, తాను రావటమే తేలిక అతను రావటం కంటే అని చెప్పింది. చీరాల రోడ్డున మాలపల్లి వుంది పోలేరమ్మగుడిదాటి రావాలి. దేశిరాజు అప్పారావు గారితోట అన్నాడు. అడిగితే చెప్తారుగా అంది. "నీవు అడగటమేమిటమ్మా" అన్నాడు. అడగాలి "నాయనా తప్పదు అంది" వెళ్లి వస్తానంటూ అమ్మ చేయి తీసుకొని ముద్దుపెట్టుకొని నమస్కారం చేసుకొని వెళ్ళాడు అమ్మ ఇంటికి వెళ్ళింది.

★ ★ ★

# 33. ప్రకృతి తాదాత్మ్యం

అమ్మ సాయింత్రం ఐదు గంటలకు తోటలోకి వెళ్తుంది. చింతచెట్టు ఎక్కి చిగురు కోసుకుని కొమ్మ మీద పడుకుంటుంది. ఒక కోకిల అమ్మ ప్రక్కనే కొమ్మమీద కూస్తూ వుంటుంది. కాకులు కూడా చేరుతాయి. అమ్మ నిద్రపోతుంటే అవి చూస్తుంటాయి. అమ్మ నిద్రలేచేటప్పటికి కోయిల ఒక్కటి, కాకులు చాలా అరుస్తూ ఉంటాయి. అమ్మ గురించి చెప్పుకుంటున్నట్లుగా, మధ్య మధ్య అమ్మ వంక చూచి తమలో తాము అరుస్తూ తలలు వూపుతూ చెప్పకుంటూ ఉంటాయి. అమ్మ నిద్రలేచి కోయిల వంక చూస్తుంది. వెంటనే ఇంకా దగ్గరగా వచ్చి చెవిలో కూస్తుంది. కాకులు అమ్మ నిద్ర లేచిందన్నా సంతోషంతో రెక్కలు కొట్టుకుంటూ చుట్టూ చేరుతాయి. అందులో ఒక కాకికి అవిటికాలు. అది వచ్చి అమ్మ వడిలో కూర్చుంటుంది. అమ్మ చెయి పెట్టి కాకిని తడుమూతూ "నీవు 'కా' కోయిల 'కూ' రెండూ కలసి కాకు అని వినపడుతున్నాయంటుంది."

తరువాత "నీకు, నాకు అన్నట్లు వినిపిస్తుంది. మీకు ఏం పెట్టేది?" తాను తప్ప తన దగ్గర ఏమీ లేదని తననే తినమని వాటితో అంది అవి అన్నీ వచ్చి ఒక్కసారిగా అమ్మ ఒళ్ళంతా వాలాయి. మోకాలిమీద, పాదాల మీద రకరకాలుగా వాలి లేచి వెళ్తు ముద్దుపెట్టు కుంటున్నట్లుగా ముక్కు ఆనించి వెళ్ళిపోతాయి.

చిటారు కొమ్మను గూడు ఏగాలి లేకుండానే అమ్మ వొళ్ళో పడుతుంది. అమ్మ వొళ్ళో వున్నకాకి ఎగిరిపోతుంది. ఆ గూటిలోని కాకిపిల్ల అమ్మ పాదాలమీద వ్రాలుతుంది. అమ్మ ఆ పిల్లను తీసి ముద్దుపెట్టుకుని గూడులో పెడ్తుండగా, పిల్లతల్లి వస్తుంది. అమ్మ వొంటిమీద వున్న చొక్కా విప్పి పక్కవేసి కాకి పిల్లను అందులో పెడుతుంది. కాకిని చూస్తుంటే అమ్మకు తానుగా తోస్తుంది, కాని, అది కాకి అనిపించదు. కాకికి కూడా తన తల్లి దగ్గరే వున్నాననిపిస్తుంది.

కాకిపిల్లను గూట్లో పెడుతుంటే అమ్మ దగ్గరే వుంటానని గిలగిలా తన్నుకుంటుంది. ఆ పెద్దకాకి అది చూచి మా ఇద్దరినీ నీబడిలోనే ఉంచుకోమని తనముక్కు తనబిడ్డ మీద వాల్చి బిడ్డను ముక్కుతో ఎత్తి పిల్లతో సహా అమ్మ వొళ్ళో వాలుతుంది. వాటి రెంటిని అమ్మ ముద్దు పెట్టుకుంటుంది. ఇంతలో చింతకొమ్మ

ఒకటి కాకుల మీదుగా అమ్మ తలమీద వాలుతుంది. మీకే కాదు నాకూ అమ్మే అన్నట్లుగా. మీ ముగ్గురూ నాబిడ్డలే. అందరూ తలా ఒకదానికి ఉపయోగపడుతున్నారు అనుకుంటుంది. ఎంతసేపటికి కాకి లేవదు. మిగిలిన కాకులన్నీ ఆచెట్టుమీద ఉన్నాయి. కోయిల కళ్ళు మూసుకొని తల వంచకుండా నిద్రపోతున్నట్లు ఉంటుంది. అమ్మకు అది నిద్రలా తోచదు. భగవంతుని ధ్యానంచేస్తున్నది కాబోలు అనుకొని రెండు కళ్ళ సందున ఒత్తుతుంది. వెంటనే లేచి వచ్చి అమ్మ పాదాలమీద కూర్చుంటుంది. అమ్మ కోసమే అన్నట్లుగా అమ్మను చూచి మళ్ళీ తలవంచి నమస్కారం చేస్తుంది.

పొద్దు గూకింది. తాను వెళ్ళి వస్తానని రేపు వచ్చేటప్పుడు వాటికేమైనా తెచ్చి పెడతానని అమ్మ అంటుంది. కోయిల వెంటనే అమ్మ పాదాలనుంచి ఎగిరి కొమ్మ మీదకి వాలుతుంది. అమ్మ చెట్టు దిగగానే కాకులన్నీ విపరీతంగా 'కా,కా' అని అరుస్తాయి. కోయిల అమ్మతోపాటు దిగి అమ్మ కన్నా కొంచెం ఎత్తుగా ఎగురుతూ కట్టచివరిదాకా వచ్చి అమ్మ భుజం మీద వాలి తలవంచి అమ్మవైపు చూచి ఎగిరి చెట్టుమీదకి వాలి వుంటాపోయిరా అమ్మా! అంటుంది అమ్మ ఇంటికి చేరింది.

అమ్మ అన్నం తిని భజనకు వెళ్తుంది. భజన అయ్యేటప్పటికి రాత్రి ఒంటిగంట అవుతుంది. అమ్మ అక్కడే పడుకొని నిద్రపోతుంది. తెల్లవారి అమ్మ ఇంటికి వచ్చినా నిద్రలేవరు. పనిచేసే మనిషి పని చేసి వెళ్తుంది. అమ్మ ముఖం కడుక్కుని వచ్చి. "బీబీ, మా పిన్ని లేవలేదుగాని, తనకోసం చూచి, చూచి వెళ్ళానని" చెప్పమని అంటుంది.

అంతలో కామేశ్వరమ్మగారు. సీతాపతిగారు లేస్తారు. బీబీ చెప్పగానే ఇంతపొద్దున్నే ఎక్కడికి పోయిందో పిల్చుకు రమ్మంటారు. బీబీ అంతా చూచి ఎక్కడా అమ్మ కనపడక దారిలో ఎదురైన కొలిమర్ల సూరయ్య గారిని, కరణం గారి అమ్మాయిని చూచారా అని అడుగుతుంది. సత్రం వెనుకున్న చెరవులోన స్నానం చేస్తూ బాతులు, కొంగల్ని పెట్టుకుని ఆడుకుంటున్నది అన్నారు.

బీబీ చెఱువు దగ్గరికి వెళ్ళేటప్పటికి తామర ఆకులు, తామర పువ్వులు, బాతులు, కొంగలు అమ్మ చుట్టూ మూగి వుంటాయి. అమ్మ వాటి మధ్యలో వుంటుంది. బీబీ రాగానే అమ్మ తల నీళ్ళలోకి ముంచేస్తుంది. ఆ చప్పుడు విని తాను చూచానని, రా, తలెత్తు, పైకిరా నీళ్ళు తాగేవు అంటుంది అయినా అమ్మ తలెత్తదు. చెఱువులో నీళ్ళు

మింగింది, ఏమిటి కనిపించటంలేదని, ఇంటికి పోయి చెపుదామని బీబీ గట్టుఎక్కి చెఱువు వంక చూస్తుంది. అమ్మ పడుకున్నట్లుగా చుట్టూ బాతులు, కొంగలు, వున్నట్లు కనపడుతుంది.

అమ్మదొంగా కనపడ్డావులే అంటూ బీబీ దగ్గరకు వస్తుంది. చింతచెట్టు బీబీని చూచి కనుక్కోలేదన్నట్లు తల వూపుతుంది. తామరపులు ఇంతేనా అన్నట్లువుంటాయి. తామరాకుమీద నీటిబొట్టు లాంటి ఆటలు అని వున్నాముకాని, మాకేమీ నీరు, బురదా, అంటవు అన్నట్లుగా కదులుతాయి. తామరాకులు, కొంగలు, బాతులు ఇంతేనా నీ తెలివి. లోపలికి రాచూద్దాం అంటూ అమ్మ వంక, బీబీ వంక చూస్తాయి.

బీబీ చెరువులోనికి వచ్చి మీ పిన్ని, నాన్న రమ్మంటున్నారని, తాను వెళ్ళి చెపితే కేకలు వేస్తారంటుంది. బీబీని వెళ్ళమని తాను తరువాత వస్తానంటుంది అమ్మ. నీళ్ళలో చేపలా వున్నావు అంటూ వెళ్ళిపోతుంది. నీళ్ళలో చేప వున్నట్లేమి, నీళ్ళలో పాచి వున్నట్లున్నది అంటుంది అమ్మ. బీబీ వినిపించుకోకుండా వెళ్ళిపోతుంది. అమ్మ ఇంటికి వెళ్దామని బయలుదేరబోయింది. ఇంతలో కాకులు, కోయిలలు కూడ వచ్చి స్నానం చేస్తాయి. దారిని పోయే వాళ్ళు కాకులు స్నానం చేస్తున్నాయి ఏదో అపశకునం అనుకుంటారు.

కోయిలలు, కాకులు, కొంగలు, బాతులు, పూలు, తామరాకులు, నీరు, చింతచెట్లు అన్నింటినీ ఒకేసారి చూస్తుంటే భిన్నత్వంలేని మనస్తత్వం గుర్తు వచ్చింది అమ్మకు. అమ్మవంక ఒక కొంగ తదేక దృష్టితో అరమోడ్పు కన్నులతో చూస్తూ వుంటుంది.

కాకా "నాకు నేనే ఏకాకి" అన్నట్లు తలవంచి ఒక కంటితో చూస్తుంది. అమ్మ బయలుదేరి వస్తానమ్మా, నేను సాయంకాలం వస్తా, మళ్లీ సాయంకాలం ఆడుకుందాం. అనగానే బాతులు అమ్మ చుట్టూ ప్రదక్షణంగా తిరిగి అవన్నీ నమస్కారం చేసినట్లుగా తలలు వూపి వెళ్ళిపోతాయి.

అమ్మకు పది సంవత్సరాలు పూర్తి అయి పదకొండువ సంవత్సరం ప్రారంభమయింది. ప్రతిరోజు మహాలక్ష్మమ్మవారిపురంలో భజన చేయటం మంత్రపుష్పం చెప్పటం, శుక్రవారం బ్రహ్మాండం భూషయ్యగారి ఇంటికి భజనకు

వెళ్ళేది. శనివారం రాత్రిపూట పులిపాక భావనారాయణగారింటిలో వాసుదాసుగారి కీనర్తనలతో, భజనలు చేస్తుండేవారు. అమ్మ అక్కడకు వెళ్ళిచెపుతూ, చేస్తువుండేది.

ఏ కీర్తన అయినా మొదట చరణం చెప్పాక రెండోచరణం అమ్మ చెప్తుంటే అంతా ఆశ్చర్యపోయేవారు. ఆ అమ్మాయి భలే ఆర్తితో చేస్తుందనీ, ఎన్ని గంటలైనా విసుగు, విరామం లేకుండా చేస్తుందననుకునేవారు. బ్రహ్మాండం వర్ధనమ్మగారు (నాన్నగారి పినతండ్రి భార్య) నా కోడలుకు రాని పాట లేదని, ఎంత బాగా చేస్తుందో అని మురిసిపోయేది. ఎవరికోసం చేస్తాను, నాకోసం నేను చేసుకుంటున్నాని పొగుడ్తన్న వాళ్ళతో అనేది.

నగర సంకీర్తనకు కూడా వెళ్ళేది అమ్మ. ఇంట్లో తాతమ్మగారు. సర్వకాల సర్వావస్థల యందూ పాటలు, తత్వాలు, అద్వైతవిచారణ చేసేది. ఊరు ముందర మన్నవ హనుమంతయ్యగారు ఉపనిషత్తులు, భగవద్గీత, వేద పారాయణ, పురాణకాలక్షేపం ఎప్పుడూ జరుగుతుండేది.

ఇంట్లో వుండటం లేదెందుకని తాతమ్మ అమ్మను అడిగింది. ఇంట్లో వుంటే పిన్నికి, నాన్నకీ తోడు, బయటకు వెళితే చెట్లకు, చేమలకు, పిట్టకు అనేక వాటికి తోడుగా వుండవచ్చు అంది అమ్మ తానూ వూరు వెళ్ళేటప్పుడు ఏం చెప్పి పోయాననీ ఆమె అడుగుతుంది. "నాకు వున్నవే చేయగలుగుదును కాని మీరు అన్నవన్నీచేయలేను. అయినా నాకన్న పెద్దవాళ్ళకు నాతోడేమిటి? నాకేవారు తోడుగా వుండాలి. రెండూ ఒకటే అర్థం నాతోటి వారున్నాసరే. వారి తోటి నేనైనా సరే. ఏమిటో అన్నీ పెద్ద పెద్ద అర్థాలతో మాట్లాడుతావు అన్నది తాతమ్మ."

తన్ని పెంచేదెవరని అమ్మ తాతమ్మను అడిగింది. భగవంతుడు పెంచుతున్నాడన్నది. అట్లయితే నీవు భగవంతుడివా? పాటలు పద్యాలు ఎందుకు చెపుతావు. నీవే భగవంతుడని చెప్పవచ్చుకదా! అంది. ఇందాక "నీవే చెప్పావు చెప్పింది చేయలేనని, వున్నది చేస్తానని" అన్నది. తాతమ్మా తలుపులేసి చెపుతుంటావే వాళ్లకు నాకు చెప్పరాదు. పెళ్ళి అయిందాకా పనికిరాదమ్మా! పెళ్లి అయిన తరువాత ఇవన్నీ ఎందుకు? పెళ్ళిలో బ్రాహ్మలే చెపుతారుగా. వాళ్ళు చెప్పినవన్నీ ఆచరించాలిగా అంది అమ్మ అవేమీ అక్కరలేదు. భర్తను దేవునిగా చూచుకుంటే చాలు అన్నది తాతమ్మ. ఆ

ఫోటోను గోడకు వేయాల్సిందే. ఫోటోలో చూచినట్లు కిరీటాలు, బాణాలు తప్పితే ఎప్పుడూ తొడమీద కూర్చోవలసిందేగా అంది అమ్మ.

తాతమ్మ నవ్వుతూ "మలపసన్యాసి నేర్చుకున్నావు మాటలు. ఇటువంటి మాటలు ఎలా తోస్తాయి" అంది. "అవతలివారు అడిగే మాటలను బట్టి నాకు ఇటువంటివి వస్తూంటాయి" అంది అమ్మ ఇంతలో గరికిపాడు నుంచి జాబు వస్తుంది. సీతాపతిగారి చెల్లెలు రెండోకూతురుకి సుస్తీగా ఉందని కామేశ్వరమ్మగారిని పంపించమని, అనసూయను కూడా తీసుకువెళ్తానంటారు సీతాపతిగారు, మరిడమ్మగారు ఇంటిదగ్గర ఉంటానంటుంది.

★ ★ ★

# 34. చాకలి బుచ్చెమ్మ

ఉదయం తొమ్మిది గంటలకు కామేశ్వరమ్మగారు, సీతిపతిగారు అమ్మ బయలుదేరి సాయంత్రం నాలుగు గంటలకు గరికిపాడు చేరుతారు. అక్కడ రానుపోను నాలుగు మైళ్ళు వెళ్ళి కృష్ణ కాలువ నుండి నీళ్ళు తేవాలి. అమ్మతో "పిన్నికి సాయంగా నీవు వెళ్ళమని సీతాపతిగారు చెప్పారు." అమ్మ ఏమీ మాట్లాడకుండా బిందె చంకన పెట్టుకుంటుంది మనిషి నాలుగు బిందెలు చొప్పున రోజూ నీళు తెస్తారు. ఇట్లా పదిరోజులు జరిగిన పిమ్మట ఆ అమ్మాయికి జబ్బు తగ్గుతుంది.

అమ్మ, మేనత్త కూతురు సుందరి బయటకు వెళతారు. ఆవూరి చివర చాకలి బుచ్చమ్మ గారి మఠం వుంది. ఆమె, తమ్ముడు ఎల్లమంద వేదాంతులమని గురువులమని బ్రహ్మంగారి తత్వాలు పాడుతూ అన్నపూర్ణ కావిడిలో మఠాన్ని వృద్ధిలోకి తీసుకు వచ్చారు.

బుచ్చమ్మ కోపదారిగా కనపడినా చాలా నిజాయితీ గల మనిషి. నోటి వెంబడి ఎప్పుడూ నీతి వాక్యాలే వల్లించేది. గుడ్డలు ఉతకటానికి వచ్చినప్పుడు కూడా ఏవేవో వేదాంత విషయాలు చెప్పి, సూర్యనాడి, చంద్రనాడి నడకల గూర్తి చెపుతూ ముందు జరగబోయేది చెప్తుండేది. గుడ్డల కొచ్చినప్పుడల్లా అమ్మను మఠానికి రమ్మని, ఒక్కమారు చూచి వెళ్ళమని కోరేది

ఎలాగు వూరి బయటకు వచ్చాంగదా అని ఆరోజు మఠానికి వెళ్ళింది అమ్మ. అమ్మతో పాటు సుందరి కూడా వెళ్ళింది. మఠానికి వెళ్ళగానే యేం బుచ్చాం ఇనాళ్ళనుండీ వున్నా నన్ను రమ్మని పిలవలేదని అడిగింది. ఏమోనమ్మ ఆ అమ్మాయిని చూడగానే పిలవాలనిపించింది. ఆపిలుపులోనే నీవు "బుచ్చాం" అంటావు. ఆ అమ్మాయి బుచ్చమ్మ అంటుంది. చాకలాళ్ళుగా చూడనే చూడదు. అయినా మీరు మా చాకలాళ్ళ ఇళ్ళకు వస్తారా? అంది.

ఆమె రాగా లేనిది మేమెందుకురాము అంటుంది సుందరి. అమ్మ గుడ్డలు వుతుకుతుంటే ఎంతో పరిమళం వస్తుందని అత్తర్లు సెంట్లు రాసుకున్నా ఎంతసేపు వుంటుంది. అమె గుడ్డలు ఉతుకుతుంటే చెరువు అంతా వాసన వచ్చింది. చెరువులో

ఆమె గుడ్డలనుండి పడ్డ నీరుతోనే సంపెంగపువ్వుల వాసన వచ్చింది. గుడ్డలు ఇచ్చి ఇంటికి వచ్చిన తరువాత, తాను యోగంలో కూర్చుంటే మొగలిపూల వాసనతో తాను వుతికిన పరికిణీ చొక్కా మడతబెట్టి తన ఎదురుగా పెట్టినట్టు ఆ గజ్జెల పట్టాలతో ఘల్లుఘల్లు అనుకుంటూ వచ్చి ఆ బట్టలు వేసుకున్నట్టుగా కనిపించిందని బుచ్చెమ్మ చెప్పింది.

వెంటనే తాను చెయ్యి జాచినట్లు, జడ కుప్పెల జడతో గిరగిరా తిరుగుతుంటే, అమెతో పాటు జడతిరుగుతూ ఆ పరికిణీ గుమ్మట మల్లెలేచి. ఆ చిన్ని చిన్ని పాదాలు భూమిమీద తిరుగుతుంటే చూడటానికి రెండు కళ్ళు చాలలేదు. ముఖము కంటే ఆ రెండు పాదాలు ఎంత బాగుంటాయో, ఆ పాదాల్లో తన నీడ కనబడ్డదని బుచ్చెమ్మ చెప్పింది. అమ్మ వచ్చి తన వొళ్ళొ కుర్చున్నట్లుగా స్పర్శ తగిలి కళ్ళు తెరిచి వెంటనే వారింటికి రాత్రికి రాత్రే వచ్చానని అంది. చీకటిలో అమ్మ, సుందరి కూర్చున్నా అమ్మ ముఖంలో కాంతి కనబడ్డది. ఇక్కడ ఏ రూపంలో చూసానో అక్కడ అదే రూపంతో దర్శన మిచ్చింది.

తల్లిని తాను పిలవటమేమిటి, అని అది వరకే ఆమె వచ్చిందా కదా! రాకపోతే పిలవాలనిపించేది గాదు. తాను వచ్చి పిలిపించుకుంది అది వివరించేది గాదు. తాను వచ్చి పిలిపించుకుంది అని వివరించింది. అమ్మ తన్ను కానట్లు కూర్చుంది. సుందరికి ఆమాటలు అర్ధంకాక అమ్మను తన కంటె ఎక్కువగా చూస్తున్నదన్న బాధకలిగింది.

బుచ్చమ్మ తనకు 'సోహం' భావం కూడా తెలుసమ్మా అంది. సోహం భావం తెలిసేదేమిటి? సోహం అంటే ఏమిటి? అని అమ్మ అడిగింది తన గురువు గారు ఎవరికి చెప్పవద్దన్నారమ్మ. కాని మ్మను చూస్తుంటే చెప్పుకొవాలనిసిస్తుందని గురువుకే గురువువేమో అని అనిపిస్తున్నది. అటువంటి గురువు దొరకటమే కాకుండా ఆ గురువు కటాక్షం వల్ల ఈ తల్లి దర్శనమైంది అని పాదాలమీద పడ్తుంది. అరగంట వరకూ లేవకుండా. లేచిన తరువాత కూడా మాట్లాడకుండా అమ్మ వంక తదేక దృష్టితో గంటసేపు చూస్తూ కూర్చుంటుంది.

సుందరి అమ్మను పేరు పెట్టి రెండు సార్లు పిలిచి తాను వెళ్ళిపోతున్నానంటూ

కోపంగా వెళ్ళిపోయింది. అమ్మ బుచ్చమ్మ మాట్లాడేదాకా వుంది. సుందరి వెళ్ళిన గంటకు వెళ్ళడానికి బయలుదేరుతుంది. అమ్మతో పాటు బుచ్చమ్మ కూడా వస్తూ మంత్రాల గురించి చెప్పేటప్పుడు అమ్మ ముఖం చుట్టూ చక్రం కోణాలతో తిరుగుతున్నట్లు, ఆ చక్రం, లోపల సర్వం ఇమిడి వున్నట్లు కనిపించిందని ఇంక సందేహాలకు తావేమున్నది. ఏది మంత్రాల వల్ల పొందుదామనుకున్నానో అదే తాను పొందానని పరవశం చెందుతుంది.

★ ★ ★

# 35. నేను నేనైన నేను

అమ్మ బాపట్ల చేరుతుంది. ఒకరోజు భారతీదేవి కాళ్ళు వత్తుతుంటే తాతగారు అమ్మను ఎత్తుకుని మేడపైకి తీసుకువెళ్ళారు ఏమ్మా చేతులు నొప్పిగా వున్నాయా అని అడిగారు.

అందరికీ తలా ఒకనొప్పి, భారతి పిన్నికి కీళ్ళనొప్పులు నాకు చేతులు నొప్పులు మీకు మనస్సునొప్పి అందరి నొప్పులకంటే మీ నొప్పి పెద్దది అన్నది. మానవుడు ప్రపంచాన్ని మెప్పిస్తాడా? తనను తానే మెప్పించుకుంటాడా? లేక తనను తాను మెప్పించుకున్నప్పుడే ప్రపంచాన్ని కూడా మెప్పిస్తాననుకుంటాడా? అట్లా కాకపోతే జగత్తు నడక ఇట్లా వుండదు గదా! అన్నది అమ్మ.

అమ్మను పొట్టమీదకు లాక్కొని "జగత్తు" కు తానేమి సమాధానం చెప్పగలననీ, అమ్మే "జగత్తు" అని అంటారు. జగత్తులో వుండే కష్టసుఖాలన్నీ తనకీ వుంటాయన్న మాట అని అమ్మ అనగానే, అమ్మ తలకాయ తన గుండెలకేసి వత్తుకుంటారు. బాధలన్నీ తనకే వచ్చినా తనకేం అని అనుభవించే స్థితి వుంటే బాధలు బాధలనిపించకపోవచ్చు అని అంది. "నీకు అనిపించక పోయినా, మాకు అనిపిస్తునే వుంటాయిగా అమ్మ! భారతికి కాళ్ళు పిసుకుతూ వుంటే తన ప్రాణం పోయినట్లుగా వుంటుందని" తాతగారు అన్నారు.

ఆయన తనతో అట్లా చెప్పకూడదని ఇంకా, ఇంకా పిసుకమ్మా! ముందు ముందు అందరికీ సేవచేయమ్మ అని చెప్పాలని అమ్మ అంది. భారతి పిన్ని తన చేత కాళ్ళు పిసికించుకుంటున్నదంటే తనకు ఓర్పు నేర్పుతున్నది. తనకు నేర్ప గల ఓర్పు కాక సహజమైన ఓర్పు కావాలని అమ్మ అంది. చిదంబరరావుగారికి అమ్మ మాటలు వింటున్న కొద్దీ హృదయం కదిలిస్తున్నావమ్మా అంటారు.

కదిలేదే హృదయం. హృదయాన్ని కదిలించటం కాదు. హృదయమంటే చైతన్యం. ఎక్కడ ఏది జరిగినా గుర్తించేదే హృదయం. జరగటానికి హేతువైనది చైతన్యం. రెంటికి భిన్నంలేదు. అవయవాలు మనకి తెలియకుండానే వాటంతటవి ఆడుతుంటాయి. ఆ స్పర్శలో విశేషమైన సుఖమో కలిగినప్పుడు గుర్తిస్తాం. ఆ గుర్తించేది

హృదయం అని చెప్పింది. తాతగారు అమ్మ గుండెలలో తల పెట్టి రుద్దుతూ నువ్వు బ్రహ్మ పదార్థనివా? బ్రహ్మవా? అని అడిగారు. తాను మూడింటికీ మూలమై మూడు అయినాను అంది. ఆ మూడు ఏమిటమ్మ అని అడిగారు. చిదంబరరావుగారు, "ఏమూడు అయినా సరే" బ్రహ్మనై, "నీవు" అనే వస్తువును ఏర్పరచుకున్నాను, "నీవు, నేను" మధ్యలో వుండే సంది "బ్రహ్మ" పదార్థం అంది. అంటే అన్నారు తాతగారు.

"నేను నేనైన నేను" అనగా 'బ్రహ్మ' నై 'నేనే' 'నీవై' ఆ నీవే నేను బ్రహ్మతత్వం. ఆ రెండింటికి సంధే బ్రహ్మ పదార్థం, అదే నిర్గుణం. ఈ మూడింటికీ బిన్నం లేదు. అమ్మ చెప్తున్న మాటలు వింటూ అమ్మ గుండెల మీదనే కళ్ళు మూసుకుంటారు. అమ్మ తాతగారి చెక్కిళ్ళు నిమురుతూ నిద్రపోయావా నాన్నా! అనగానే లేదమ్మా కండ్లు మూసుకున్నాను అన్నారు. నిద్ర పట్టిందేమో! అనుకున్నాను అంది అమ్మ.

నిద్రపట్టింది గానీ, నాన్నా అనే సరికి నా శరీరమంతా చెవులు పుట్టి నాయమ్మా అన్నారు. తాతగారు తన గుండెల్లో పడుకుంటే ఆయన తాతగారి లా అనిపించక అయిదునెలల పిల్లలు అత్త, తాతా అన్నట్లుగా వున్నారని తెలియచేసింది. ఎంత బరువు పెట్టిందో ఈ గుండెలకు అని తాతగారు అన్నారు. తనది కండ గల నిండు గుండె అని, తనకేమీ బరువులేదని, మీ గుండెలు ఎముకలని, తనగుండె ఎంతమెత్తగా వుందో చూడమని తాతగారితో అన్నది.

అమ్మగుండే ఏమిటి అమ్మ అంతా మెత్తనే అన్నారు. ఈ మెత్తదనాన్ని ప్రపంచం అర్థం చేసుకోలేక వత్తేస్తుందేమో అన్నది అమ్మ. కనపడుతూనే వుందిగా! లేకపోతే నిన్ను కాళ్ళ పిసకమనటం ఏమిటి. అవును, ఇంతకు ముందు భారతి నిన్ను కొట్టిందా? అన్నారు తాతగారు భారతి నన్ను కొట్టలా. భారతి చెయ్యి నా చెంపను కొట్టింది. నా చెంప ఆమె చేతిని కొట్టింది. భారతి నన్ను కొట్టటమేమిటి? అని అంది.

అబ్బా! నీ విధానమేమి విధానమమ్మా! అన్నారు. "ప్రతీదీ మరుగు పరచటమే నాకు ప్రధానం అంది" అమ్మ. "అయితే జీవితంలో ఏదీ బయటకు రానివ్వవన్నమాట" అన్నారు తాతగారు. జీవితంలోనికి రానియ్యకపోయినా జీవితం బయటకు వచ్చింది గదా! జీవితం వచ్చిన తరువాత జీవనం వుంది (జీవనం అంటే నడక) ఈ రెండూ కలసి బ్రతుకుతో పాటు జీవన, జీవితాలతేడా అర్థం అవుతూనే వుంటుందని చెప్పింది అమ్మ.

మర్నాడు కంభం మెట్టు మధుసూధనరావు గారింట్లో సప్తాహం జరుగుతున్నదని అమ్మ తాతగారు వెళ్లారు. తరంగాలు పాడ్తుంటే అమ్మ వెళ్ళి వారితో పాటుపాడుతుంటే దూరంగా వున్న తాతగారు దగ్గరకు వచ్చి అమ్మ దొంగా పాటలు కూడా వచ్చే అంటే పాటలేమిటి? తరంగాలే వస్తే అంది అమ్మ. పక్కనే వున్న ప్లీడరు మల్లాది యజ్ఞనారాయణగారు అమ్మాయి దగ్గర ఎటువంటి ధ్వని వస్తున్నదో వింటున్నారా? ఈ వయస్సులోనే తరంగాలు పాడుతున్నదంటే ఎంత చక్కగా అందరి గొంతుల్లో కలిసి, వేరై వినపడుతోందని అంటారు.

ఆ గొంతు అందరితో కలిసే వుంటుంది. వేరుగాను వుంటుందని తాతగారు అంటారు. పాడటం ఏంలేదు. అది తరంగం కనక అందులోనే పుట్టి. అందులోనే ప్రజ్వరిల్లి అందరిని ముంచి అందులోనే కలుస్తుందని వివరిస్తుంది అమ్మ.

అంతలో గురువుగారు లేచి నృత్యం ఆరంభించారు. చాలా బ్రహ్మానందంగా చేస్తున్నారు నృత్యం అంటారు చిదంబరరావుగారు. బ్రహ్మానందాలు అనేక ముంటాయా? ఒకటేనా? ఏది వచ్చినా బ్రహ్మానందంగ వున్నదంటామని అంది. అయితే ఏమంటావమ్మా అని యజ్ఞనారాయణగారు అడిగారు.

తనకు నచ్చింది ఆనందం. ఆ ఆనందమే బ్రహ్మానందం – బ్రహ్మానందం అనే మాట ప్రతీదానికి వాడుతున్నాం. తృప్తి అంటే ఏంటి? అని అమ్మ అడిగింది. మనం వేరే కూర్చుని చెప్పుకుందాం రా! ఇక్కడ గోలెందుకు మనకు అన్నారు. వాళ్ళు చేసేది, మనం దేన్ని గురించి చెప్పుకోవాలనుకుంటున్నామో రెండూ ఒకటే. వాటినే వారు పాటలుగా పాడుతున్నారు. అన్నీ బ్రహ్మానందంలో నుంచి వచ్చినవే కనుక ఆ ముక్క మనకు తెలియకుండానే పడుతుంది. ఒకడు దొంగతనం చేసి అనుకున్న విధంగా జరిగితే బ్రహ్మానందంగా వుందంటాడు. తనకు ఇష్టం లేని వాటిని బట్టి కూడా బ్రహ్మానందాన్ని అనుభవించానంటాడు. ఇంకొకడు నోటికి కొంచెం రుచిగల కూర తగిలినా బ్రహ్మానందంగా వుంది అంటాడు. సర్వం బ్రహ్మానందమేగా. సర్వకాల ఆనందమైనదే "బ్రహ్మానందం" తాత్కాలికంగా కలిగే ఆనందం దాని ఛాయ మాత్రమే అంటుంది. యజ్ఞ నారాయణగారు కనురెప్పకూడా వేయకుండా చూస్తూ చెవులునిక్కబొడుచుకొని వింటూ వుంటారు.

చిదంబరరావుగారు వచ్చి తన్ని అక్కడే వదిలిపెట్టి ఎప్పుడూ వచ్చారని

ప్రశ్నించారు. మన అమ్మాయి ఒక నెల ఉపాధ్యాయుడిగా చేస్తే గోడలకు, కిటికీలకు కూడ చదువు వస్తుందని అంటారు. అంతదాకా ఎందుకు! కోర్టులో జడ్జీ అయినా, గవర్నమెంట్ నిర్వహించిన 'లా'కు బుద్ధి వస్తుంది. అన్ని చట్లాలు తలక్రిందులవుతాయని తాతగారు అంటారు. మొన్నటి వర్షాలకు చప్టాలే తలక్రిందులైనాయంది అమ్మ. అదేనమ్మ మేము అన్నది పిచ్చి వర్షానికే ఇంతశక్తి ఉంటే సర్వాన్ని వర్షించే దానికి ఎంత శక్తి వుంటుందో! అన్నారు. సర్వాన్ని ఆకర్షింపబడుతుందని యజ్ఞ నారాయణగారు అన్నారు. చిదంబరరావుగారు రెండు చేతులతో అమ్మని వాటేసుకుని యేమ్మా! ఆయన నోటిమీదగా కూడా వచ్చింది. ఆ రోజు ఎప్పుడు వస్తుంది. అందరూ నిన్ను ఆకర్షించే రోజు వస్తుందా? అని అడుగుతారు.

యజ్ఞ నారాయణగారు అమ్మ తలమీద చెయ్యిపెట్టి గడ్డం పుచ్చుకొని దగ్గరకు తీసుకొని ముద్దుపెట్టుకుంటారు. వారు ముద్దుపెట్టుకోగానే రెండో చెంప తాతగారు ముద్దు పెట్టుకుంటారు. ఇదొక భజనా అనీ నవ్వుతుంది. అమ్మ. ఇంటికి వెళ్దామా అని తాతగారు అడిగారు. వెళ్ళండి తాను తరువాత వస్తానంటుంది అమ్మ.

ఆదివారం కావటంతో ప్లీడర్లు చాలా మంది కలుస్తారు వచ్చినవాళ్ళతో మాట్లాడుతుండంతో దీపాలు పెట్టేదాకా చిదంబరరావుగారు కూడా అక్కడే వుంటారు ఈ రాత్రికి నేను ఇక్కడే వుంటానని చెప్తుంది. ఇంతలో పీసపాటి సీతారామయ్యగారు వస్తుంటారు. అమ్మ తాతగారితో చెప్పింది. ఆయన పిచ్చివాడమ్మ! ఆయన్ను పలకరించబోకు అంటారు. తాను పకలరిస్తే ఎక్కువ అవుతుదా? తగ్గిపోతుందా? అని అడిగింది. తాతగారు నవ్వి ఎక్కువ కావచ్చు, తక్కువకావచ్చు. అమ్మ ఏది అనుకుంటే అది అవుతుందని అంటారు సర్వం నీవనుకుంటున్నా! చిన్న అమ్మాయివి మనవరాలివి అనే తోస్తుంటుంది. అ మాయను అట్లా కప్పేస్తుంటావా అన్నారు. ఆ మాయ వేరు కాదుకాని ఆ,ఈ అనేది మాత్రం శబ్ధం ఒకటే గాని ధ్వనులు వేరు అంటుంది.

'ఒకటే' అనేక మయిందని అడుగడుగునా చెప్తూనే వున్నావు. ఆ ఒకటే గుర్తించక అనేకం గుర్తిస్తున్నాం. ఏం బాబు కోర్టుకు వెళ్ళలేదా అని సీతారామయ్యగారిని అడుగుతుంది. ఆయన పిచ్చిధోరణిలో ఏదేదో మాట్లాడుతారు. అమ్మ దగ్గరకు వెళ్ళి పొట్టమీద చేయివేసి భోంచేసారా అని అడుగుతుంది. చేసానమ్మా! అంటారు అమ్మ

చేయి తగలగానే ఒళ్ళు జలదరించినట్లు అవుతుంది. ప్రశాంతంగా ఆయన ఇచ్చిన సమాధానం విన్న చిదంబరరావుగారికి, సీతారామయ్యగారికి నయమవుతుందనాన ఆశ ఉదయించింది. అమ్మ ఆయన పొట్టమీద చేయివేసి ఏవేవో ప్రశ్నలు వేస్తూ వానికి తగిన సమాధానాలు వస్తుంటే మాటలద్వారా వ్యక్తపరచకుండా మనస్సుతో సమాదానం చెప్పకుంటున్నట్లుగా ఆనందం పొందుతారు. చిదంబరరావుగారు, సీతారామయ్యగారు ఏ ఆలోచనా లేకుండా అమ్మ పాదాలమీద పడి నమస్కారం చేసారు. పిచ్చినయమైంది ఏం కనిపించి నమస్కారం చేసావని తాతగారు సీతారామయ్యగారిని అడుగుతారు. వారి ఇలవేల్పు కుమారస్వామిలా తనకు కనపడ్డదని చెప్తారు. అమ్మాయి దగ్గరకు వచ్చేటప్పుడు గుర్తుతో వచ్చావా? అప్పటికీ ఇప్పటికీ తేడా వున్నదా అని తాతగారు అడుగుతారు. వచ్చేటప్పటికి ఎట్లా వచ్చానో తెలియదు కాని ఇప్పుడు నా తల్లో బరువుతీసి వేసినట్లు వుంది అని ఆమెవైపు చూస్తారు. ఇంత చిన్న పిల్ల ఎవరూ అంటూ అమ్మను ఎత్తుకొని ముద్దు పెట్టుకుంటారు. "ఇందాకట్నుంచి నేను మాట్లాడింది ఈ పిల్లకాదు ఎక్కడా పోలిక లేదే అంటారు".

ఏమిటమ్మా ఈ గొడవ నిజమేనా అంటారు. "నేను మీ ఎదుటనే నిల్చున్నాను కదా! ఆ సందేహం మీకు ఎందుకు వచ్చింది? ఇంతముందు ఆయన మనస్సుకు ఇప్పటి మనస్సుకు తేడా వుంది కదా! అంచేతే తాను అట్లా ఆయనకు కనిపించివుంటానన్నది. తనలోనే మార్పువుంటే ఇద్దరూ గుర్తించే వాళ్ళేగా అంది". ఏదో ఒకటి చెప్తావు అద్దు. అర్థం చేసుకోనివ్వకుండా ఎన్నేళ్ళు ఈ తెర అంటారు. తనకు ప్రపంచంతో అవసరమున్నంతవరకూ అని అమ్మ చెప్తుంది.

సీతారామయ్యగారు భజన జరిగిన మర్నాటి నుంచీ ఎటువంటి ఇబ్బందీ లేకుండా మామూలుగా కోర్టుకు వెళ్ళివస్తున్నారు. అదేకదా అమ్మలోని ప్రత్యేకత! తాను దేనికీ కర్తను కాదంటూనే ఎవరికి ఏటైమ్‌లో ఏది అవసరమో దానిని అందించే అమృత మూర్తి అమ్మ.

అమ్మలేచి దొడ్డిగడపలో కూర్చుని రాగం, భావం, తాళం మూడు ఏకమైన స్థితి. నేననేది లేకుండా అమ్మలోకి లీనమైనట్లుంటుంది. అమ్మ కళ్ళు మూసుకుని గోడ కానుకొని అట్లాగే కూర్చుంటుంది. భజన అయిపోయిన తరువాత ఆంజనేయులు గారు దొడ్లోకి వస్తూ అమ్మ కూర్చున్న దృశ్యం చూచి ఎవరో భజనకు వచ్చిన పిల్ల

నిద్రపోతున్నదనుకొని ఎవరా అమ్మాయి. కొంగ జపం చేసేది అని చెంపమీద ఛెళ్ళున కొడతారు. ఇంటికి పోయి పడుకోరాదు! కొంగజపం చేస్తున్నావేం! అంటారు.

కొంగజపం కాదండి, కాకి జపం అంది. ఏకాకి, మాలకాకా? అంటారు కాదండీ బ్రాహ్మణకాకి అంటుంది. బ్రాహ్మణకాకి వుంటుందా అన్నారు ఆయన. మాలకాకి ఉన్నప్పుడు బ్రాహ్మణకాకి ఎందుకు ఉండకూడదు. అన్నది. ఇంతకూ కాకి జపం ఎందుకు అని అడుతుతారు. 'ఏకాకి' కావటానికే కాకి జపం. అసలు కొంగజపం అంటే ఏమిటి? అని అమ్మ అడుగుతుంది. ఏదో వాడుకపదం అంటారు. వాడుకలో వున్నవన్నీ అర్ధంలేనివా? అర్ధంకానివా? అంది.

మధుసూధనరావు గారిని ఆ అమ్మాయి వివరాలు అడిగారు. మన ఇంటి పక్కమేడలో వారి అమ్మాయి అంటారు. చాలా తెలివి కలది. మంచి జ్ఞాని కావచ్చు. తేజస్సు చాలా గొప్పది వున్నదని ఆంజనేయులు గారు అంటారు.

అమ్మ ఇంటికి వచ్చి మేడమీదకు వెళ్తుంది. అమ్మను చూడగానే నవ్వుముఖంతో గురునాన్నగారితో ఇష్టాగోష్ఠి సలిపి వచ్చావా అంటారు చిదంబరరావుగారు. తనకు ఇష్టమైనదీ ఆయనకు అయిష్టమైన గోష్ఠి అంటుంది. ఏమిటమ్మా కొత్త సమాధానం ఏక్షణానికి ఆ క్షణం కొత్తేగ అంటుంటే ఇంతలో పున్నమ్మగారు తాతగారితో మాట్లాడటానికి మేడపైకి వస్తుంది. అమ్మ క్రిందకు వెళ్ళుతుంది.

తనకు బాలా త్రిపురసుందరి విగ్రహం ఒకటి మూడు అడుగుల ఎత్తు గలది చేయించి పెట్టమని అడుగుతుంది. మనకు వేరే మూడు అడుగుల విగ్రహమెందుకు? మూడింటికి మూలమైంది. త్రిమూర్తులకాధారమైంది త్రిలోకములు ఏలేది. త్రిపుటిని రహితం చేసే వంటి బాలా త్రిపుర సుందరీ నిగ్రహం కల విగ్రహం ఇంట్లో తిరుగుతున్నది. ఆ విగ్రహానికి, వేళకు అన్నం నీళ్లు చూస్తేచాలు అంటారు. నిగ్రహం కల విగ్రహం వంటి గొప్పస్థితి కలిగిందెవరు చెప్పండి, విగ్రహానికి ఆకలి దప్పులు వుండవుగా, అన్నింటికీ ఆధారమైతే జయించేదీ ఏమిటి అన్నది. అన్నింటికీ ఆధారమైతాను ప్రత్యే స్వరూపమును ధరించి వున్నది కదా! శరీరానికి కావలసినవన్నీ వుండవలసినదే. అటువంటి వాళ్ళు, వాళ్ళకై వాళ్ళు కావాలని వస్తారు కనుక మనతో పాటు అతి సహజంగా వుంటారు వాళ్ళను గుర్తించటం మహాకష్టం వాళ్ళే కారణ జన్ములు.

ఇంతకూ ఎవరంటారు అని అడిగింది పున్నమ్మగారు. మన ఇంట్లో మూడు అడుగుల పిల్ల ఎవరు చెప్పు. గుండ్రటి చేతులు, ఆ పొట్టి పొట్టి పరికిణీలు, ఆ బంగారు మేనిఛాయ, ఒంటినిండా బంగారం, పెద్దజడ, ఎఱ్ఱగా పల్చని పెదవులు, పొడవైన కోలకళ్ళు, చక్కని చిట్టిముక్కు పిచ్చుకపొట్టలాంటి చేతులు, తామర పూలవంటి హస్తాల్లు, పారిజాతపూవుల కన్నా మించిన మెత్తదనం గల పాదాలు ఎవరికి వున్నాయో మనింట్లో చెప్పమని చిదంబరరావుగారు ఆమెను అడిగారు.

మీరు చెప్పినవన్నీలేకపోయినా కొన్ని లక్షణాలు అనసూయ దగ్గర కనపడుతున్నాయి. కొన్నేకాదు, చెప్పిన లక్షణాలు అన్నీ వుంటాయి గుర్తించు ఇంకా తాను చెప్పటం మర్చేపోయానంటూ ఇంత చిన్నవయస్సులో కుంకుమ బొట్టు కనుబొమ్మల మధ్య ఎవరు పెట్టుకుంటారు? అమ్మాయి నడుస్తుంటే చూశావు? ఎంత సువాసన వస్తుందో? ఎప్పుడైనా దగ్గరకు తీస్తేగా తెల్సేది అన్నారు.

పలకరిస్తా కానీ ఎప్పుడూ దగ్గర కూర్చోబెట్టుకోలా అన్నది. ఈ రోజునుంచీ అన్నీ చూడు నీ అనుభవాన్ని బట్టి నమ్ముదువుగాని, మీరు చెప్పేవన్నీ అనసూయ అనేనా అంది. చిన్నప్పటి నుంచీ పెంచుతున్నావుగనుక ఎంత వరకూ గ్రహించావో తెల్సుకుందామని తాతగారు అంటారు.

మీరు అనుకున్నవన్నీ నమ్మను గానీ, నాకు తెలిసినంతవరకూ తనకు ఇది కావాలని, ఒద్దు అనేది లేదు. ఓర్పు కలిగింది అన్నారు. తన కంటే ఆమె బాగా గుర్తించిందనీ, తాను రూపాన్నే వర్ణించారు కానీ ఆమె మనస్సునే గుర్తించిందని కనుక ఈ రోజునుంచీ ఆమెకు కలిగిన అనుభవాలు తమకు చెప్పమని, మళ్ళీ ఆంధ్రపత్రిక మాదిరిగా అందరికీ చెప్పవద్దు అని చెప్పారు చిదంబరరావుగారు.

అది తేలేదాకా తనకు విగ్రహం చేయించరా అని ఆమె అడిగింది. ఒక నల్లరాతిని తెచ్చి సాయిబును పిలిస్తే వాడే చెక్కుతాడని అంటారు అయితే ఆ రాయి దేవుడు కాదంటారా అని అడిగింది పున్నమ్మగారు. దేవుడు కాదని అనను కానీ చైతన్య స్వరూపమైన దైవం ప్రత్యక్షంగా వుందంటున్నాను అన్నారు.

మీరు ఎంతగా చెప్పినా తాను నమ్మలేనంటుంది. ఈ విషయం ఆమెకు చెప్పటం తన పొరపాటుగా ఒప్పుకుంటారు. చిదంబరరావుగారు. ఎవరిదో ఒకరిది పొరపాటు

అడగటం నాపొరపాటంటారు అన్నది పున్నమ్మగారు. ఎవరి పొరపాటైతే ఏంలే, ఇందాక ఏదో పెడతానంటివే అని మాట మారుస్తారు. .

చిదంబరరావుగారు స్నానం చేసి అమ్మను పిలుస్తారు అమ్మలోపలికి వెళు తుంది. తాతగారు, అమ్మ గారెలు తింటూ ఏమిటమ్మా మధుసూధనరావు గారింట్లో కబుర్లు అంటారు. అమ్మ జరిగిందంతా పూసగుచ్చినట్లు చెప్తుంది. చిదంబరరావు తాతగారు అన్నీ విని “కాకి” దగ్గరకు వచ్చే సరికి పకపకానవ్వుతారు.

★ ★ ★

# 36. మౌలాలి

అమ్మకు పదకొండు సంవత్సరాలు నిండి పన్నెండో సంవత్సరంలోకి ప్రవేశిస్తుంది. భవనారాయణస్వామి దేవాలయం వద్ద చింపిరి గుడ్డలతో ఒక సాయిబు ఎదురు వస్తాడు. చాలా సుస్తీగా వున్నాడు. అమ్మనుచూచి అమ్మ ఎటునడుస్తుంటే అటు తల తిప్పుతూ కన్ను ఆర్పకుండా అమ్మ వంకే చూస్తాడు అమ్మకూడా అతని వంకే చూస్తుంది. తనకోసమే చూస్తున్నాడనుకొని దగ్గరకు వెళ్లి ఏం నాయనా అనగానే చేతులు చాచి అమ్మను పొట్టలోకి తీసుకొని తలను గుండెలకు అదుముకుని ముద్దు పెట్టుకుంటాడు. దగ్గరికి వచ్చేటప్పటికి ఎంత చిన్న పిల్లవైనావా! ఇందాక చాలా భారీ మనిషిలా కనిపించావు. ఇంత త్వరగా మారిపోయావేమమ్మా అంటాడు.

అమ్మ అతనికి ఏం కావాలని అడుగుతుంది. ఆతడు అమ్మే కావాలంటాడు. దగ్గరకు వచ్చానుగా ఎందుకు ఏడుస్తున్నావని అమ్మా అడుగుతుంది ఇది ఏడుపు కాదమ్మా! ఆనందం. తాను పుట్టింది సాయిబుల ఇంట్లో పుట్టినా ఒక కోమటి ఇంట్లో పెరిగానని, ఆ ఇంట్లో అందరూ బ్రహ్మంగారి భక్తులు. ఈశ్వరమ్మ గురించి చదివేటప్పుడు ఒక రూపాన్ని తాను ఉహించుకున్నాడు. ఆ రూపమే అమ్మలో చూచాడు? చూడటమేమిటి? మీరే ఆమె అనుకున్నాను. అయితే మీలో క్షణక్షణం జరిగే మార్పు చాలా చిత్రంగా వుంది అని అంటాడు. అమ్మ బస ఎక్కడా? అని అడిగాడు.

బస అంటే సభా అని అమ్మ అడిగింది. కాదమ్మా నీవు చదువుకోలేదా అంటాడు. ఈశ్వరమ్మను అన్నావుగా ఇంకా చదువెందుకంటుంది అమ్మ. మీ ఇల్లెక్కడ? మీ ఇంటికి తీసుకువెళ్ళమ్మా అంటాడు. సరే ఇక్కడే వుండు ఇప్పుడే వస్తానని ఒక అణా పెట్టి అరిటిపళ్ళు తీసుకుపోతుంది. అమ్మ తిరిగివచ్చి గుడి దగ్గర సాయిబును కల్సుకొని ఇంటికి వెళ్తుంది. సాయిబుని చిట్టికేశ్వరం చెట్టుకింద కూర్చోబెట్టి ఇంట్లోకి వెళ్తుంది. తాతగారు, నాన్నగారు, భారతి గారు భోజనం చేస్తుంటారు. అమ్మ సరాసరి పైకి వెళ్ళి పడుకుంటుంది.

చిదంబరరావుగారు భోంచేసి భారతం చదువుకుంటుంటారు. భారతి, నాన్నగారు గదిలో మాట్లాడుతుంటారు. అమ్మ వంట మనిషినడిగి అన్నం పెట్టించుకొని

సాయిబుకు పెడ్తుంది. నాయనా! నీవు ఇక్కడే వుండని చెప్పి తాతగారి దగ్గరకు వస్తుంది. ఏ భాగవతం నడిపివచ్చావని తాతగారు అంటారు. నడిచేదంతా భాగవతమే అని జవాబిస్తుంది అమ్మ అదీ అమ్మ నడిపేదేనన్న నమ్మకం తాతగారికి.

తాను వెళ్ళి నాన్నను చూచి వచ్చానని చెప్తుంది. దారిలో ఒక ముసలివాడు కట్టుకోవటానికి గుడ్డలు కూడా సరిగా లేక, తిండి లేక శుష్కించి పోయిన శరీరం మహా ఆర్తిగల మనస్సు ఏమైనా ఇద్దామన్నా తన దగ్గర ఏమీ లేదు అని తాతగారితో చెప్తుంది. మన ఇంటికి తీసుకురాకపోయావా? పట్టెడు అన్నం తినేవాడంటారు తాతగారు. మీరు అందుకు సిద్ధపడితే ఇప్పుడే వస్తాడు. అడుక్కునేవాడు కాదు అతని పరిస్థితి బాగా తెలియదు. అమ్మ ఉద్దేశ్యం ఎట్లావుంటే అట్లాగే చేద్దామని తాతగారు అంటారు.

అతనికి మన ఇంటిగుర్తులు చెప్పాను. వచ్చాడేమో అని వాకిట్లోకి వస్తుంది. సాయిబు అమ్మనే ధ్యానం చేస్తూ అమ్మ దగ్గరగా కూర్చున్నా గమనించడు. అతను లేచిందాకా వుండి ఇల్లు చూపించానుగా వీలైనప్పుడు వస్తుండమంది. అన్నం కోసం బాధపడకు. నేను వూరికి వెళ్ళేటప్పుడు తాతగారికి చెప్పి వెళ్తానని అంటుంది.

ఇంకా తాను నాలుగు రోజులుంటానని చెప్తుంది. సాయిబు సరే అని అమ్మకు సాష్టాంగ నమస్కారంచేసి వెళ్తాడు. చిదంబరరావుగారు వూరికి వెడతారు. ఆయన వెళ్ళగానే సీతాపతిగారు అత్తగారింటికి బయలుదేరుతుంది. అమ్మ నిన్న కనపడ్డ సాయిబు కనపడ్తాడేమో అని తోవంతా చూస్తూ వెళ్తుంది. ఎదురుగండా తలవంచుకుని వస్తుంటాడు అమ్మ గబగబా అతని దగ్గరకు వెళ్ళి “నీ పేరేమిటి నాయానా?” అని అమ్మ అడుగుతుంది.

తన పేరు మౌలాలీ అని, తనకు అమ్మ తప్పించి ఏమీ అవసరం లేదంటాడు. తాను వున్నా అన్నీ అవసరమేగా అంటుంది. తన్ని అమ్మ దగ్గరే వుంచుకోమంటాడు. తానే ఒకచోట వుండనని అతని జీవనానికి ఏమైనా వుందా! అని అడుగుతుంది. ఏమీ లేదని చెప్తాడు. ఆసుపత్రి దగ్గర నాన్ రొట్టె, బన్ను బాగా ఖర్చు అవుతాయని జడ కుప్పెలు అతని చేతిలో పెట్టి, మళ్లీ సంపాదించుకున్న తరువాత తనకు ఇవ్వమని చెప్పింది.

అమ్మా! ఇంట్లోవాళ్ళు ఏమి అనరా అని సందేహాన్ని వెలిబుచ్చాడు మౌలాలి. అవి వేసుకుంటే అమ్మ చక్కగా వుందనీ, నాకు బంగారు వస్తువులతో పనేమిటి అమ్మనే అట్టేపెట్టుకుని పట్టెడన్నం పెట్టమంటాడు. తాను ఊళ్ళో వుండనంటే అమ్మ ఎక్కడ వుంటే తాను అక్కడే వుంటానని అన్నాడు. అక్కడి వాళ్ళు నీకు అన్నం పెట్టే వూరుకోవాలిగా అంటుంది. అడుక్కుతినైనా అమ్మ దగ్గరే వుంటానంటాడు. సరే రమ్మంటూ ఇప్పుడు నాలుగు డబ్బులు సంపాదించుకుంటే, రేపు లేవలేని స్థితి వస్తే పనికి వస్తాయని చెప్తుతుంది. అంత చిన్నవయస్సులోనే అమ్మ చేసిన అర్థశాస్త్ర వివరణ ఎవరినైనా చకితులను చేస్తుంది.

తనకు లేవలేని రోజంటూ వస్తే అమ్మ వుందన్న తన నమ్మకాన్ని తెలియచేస్తాడు. తాను ఎప్పుడూ ఒకే వూళ్లో వుంటానని నమ్మకం ఏమిటి అంటుంది అమ్మ. అమ్మ ఎక్కడ వుంటే అక్కడే వుండి అమ్మను బాధించకుండా దూరంగా వుండి నమస్కారం చేసుకుంటానంటాడు. సరే పోదాంరా అని, అతనికి భార్యా పిల్లలూ వున్నారా? అని ప్రశ్నించింది. లేరని, అంతా అమ్మే తల్లీ, తోడు, నీడా అన్నీ అంటాడు.

అమ్మ సీతాపతిగారి దగ్గరకు వెళ్ళి "నాన్నవూరు ఎప్పుడు వెళ్దామని" అడుగుతుంది. తొందరేమిటి తరువాత ఎప్పుడు వెళ్ళేది చెప్తానన్నారు. అమ్మ అక్కడి నుంచీ సాయిబు దగ్గరకు వచ్చి తాను ఎప్పుడు వెళ్ళేటట్లయితే అప్పుడు అతన్ని తీసుకువెళ్తానని చెప్పింది.

చిదంబరరావుగారింట్లో వంటమనిషి దగ్గరకు వెళ్ళి ఆమె వెళ్ళేలోగా ఒక మనిషికి అన్నం ఇవ్వమంటుంది. అది తీసుకువెళ్ళి మౌలాలీకి పెడ్తుంది. ఇంతలో సీతాపతిగారు వచ్చి ఎల్లుండి ప్రయాణమని చెప్తారు. మద్యాహ్నం ఒంటిగంట అయింది. చిదంబరరావుగారు భోజనం చేయకుండానే వస్తారు. తాతగారికి అన్నం పెడ్తానని అమ్మ వస్తుంది. మళ్ళీ ఎప్పుడు పెడ్తావు తల్లీ! నీ బంగారు చేతులతో అంటారు తాతగారు. తనకు పెట్టే యోగ్యత ఎప్పడుంటే అప్పుడు పెడ్తానని అంటూ తన ప్రయాణం ఎల్లుండేనని చెప్తుంది.

ఆ సాయిబు సంగతి ఏమైందని తాతగారు అడుగుతారు. అతనికీ తనకీ జరిగిన సంబాషణంతా తాతగారికి తెలియజేస్తుంది అమ్మ.

మనకు బరువు లేకుండా అతను అడుక్కు తింటే ఇబ్బందేముంటుందని ఇప్పుడైనా ఒక మనిషికి అన్నం పెట్టడం బరువు కాదు. అది ఇంట్లో వాళ్ళ ఇష్టాయిష్టాల మీద అధారపడి వుంటుంది. తాతమ్మ ఏమీ అనదు అన్నం పెడుతుంది. వచ్చేటప్పుడు మంచిగానే వచ్చినా తరువాత వాళ్ళు బాధ్యతను గుర్తించుకోరని అంటారు. ప్రాప్తమున్నవాళ్ళు వుంటారు. లేకపోతే అతని దారిన అతను వెళ్ళిపోతాడని అమ్మ అంటుంది.

అతన్ని చూడాలని చిదంబరరావుగారు అనగానే వాకిట్లోకి వెళ్లి సాయిబును లోపలికి పిలుచుకు వస్తుంది. అతనుచిదంబరరావుగారికి నమస్కారం చేస్తాడు. ఇద్దరూ ఒకర్ని ఒకరు చూచుకొని నవ్వుకుంటారు. మాట్లాడుకోరు. పది రూపాయలు ఇచ్చి ఏదైనా తగిన వ్యాపారం చేసుకోమని చెప్పండని తాతగారితో అన్నది. తాతగారు అతని జీవనం ఏమిటి? అని అడిగారు.

మొదట్నుండీ బ్రాహ్మణులతోనే స్నేహం అనీ, అతనిది నాగులపాడు వాళ్ళ తాతలు ఎవరో ఈ వూరు వచ్చారు. తాతల దగ్గర నుంచి వాళ్ల నమాజుకు వెళ్ళేవాళ్ళు కాదు. అతని నాన్నగారు కృష్ణభక్తుడు. అతనికి చిన్నప్పటి నుంచి బ్రహ్మం గారంటే చాలా ఇష్టం వాళ్ళ బంధువులు అందరూ పోయారని ఒక్కడినేమిగిలాను. తల్లీ తండ్రీ లేరంటూ దరిద్రుడ్ని తల్లి దొరికింది. బ్రహ్మంగారి మనమరాలు ఈశ్వరమ్మ తనకు అమ్మగా కన్పించింది. ఈమెకు, ఆమెకు భేదం లేదనుకున్నా తాను సిద్ధయ్యంత కాకున్నా కనీసం “అమ్మను” గుర్తు పెట్టుకునే స్థితి వుంటే చాలు. ఒదిలిపెడ్తే ఆ గుర్తు కూడా వుండదుగా. అమ్మను దగ్గర ఉంచుకునే స్థితి లేదు కనుక ఎక్కడైనా అడుక్కొచ్చి తింటూ అమ్మను చూస్తూ ఈ పంచలో వుంటానని చెప్తాడు.

దూరమాలోచించుకో, అమ్మాయికి వివాహమైతే అత్తవారింటికి పోతుంది. అప్పుడు ఎక్కడ వుంటాని చిదంబరరావుగారు అడుగుతారు. అమ్మ ఏవూరు వెళ్తే ఆ వూళ్లో అడుక్కుంటానని అతని నిశ్చయాన్ని తెలియచేసాడు.

అమ్మ మన్నవ వెళ్ళి రెండు నెలలు గడుస్తాయి. దొప్పలపూడిలో అడుక్కుతింటున్న మౌలాలీ రోజూ అమ్మను చూచి వెళ్తుంటాడు ఒక రోజున వాకిట్లోకి వాస్తాడు. మధూకరం తీసుకువచ్చిన అమ్మను చూచి అట్లావున్నావేమమ్మా! అని అడుగుతాడు. అడక్కుండా, పెట్టకుండా మూతదీసి అని కేక వాకిట్లోకి వినిపిస్తుంది.

అతను అన్నం పెట్టించుకోవటానికి బాధ పడ్డాడు. తాను అన్నం కోసం రాలేదని అ అన్నం తీసుకు వెళ్లి గిన్నెలో వేసిరా అంటాడు.

అట్లా అనద్దు నాయనా! నీ కని తెచ్చిన అన్నం ఇంట్లో వేస్తే పొట్లాడుతారు అంది. సరే ఈ రోజుకు పెట్టమ్మ అంటాడు. అమ్మ మౌలాలితో మాట్లాడటం చూచి ఎవరా అబ్బాయి? ఎందుకు అంతసేపు మాట్లాడుతావు. అడుక్కునే వాళ్ళతో ఏమాలోచన. చిన్నప్పుడు లేనిది పెద్దప్పుడు వస్తుందా? ఎందుకు మొగవాళ్ళతో అంతసేపు మాట్లాడటం అంటుంది అమ్మ మేనత్త సుబ్బమ్మగారు.

"జీవితంలో ఇదే ప్రారంభం అనుమానించటానికి అనుకుంటుంది." అమ్మ మౌలాలీ తాను రానని ఎప్పుడైనా ప్రాప్తం వుంటే చూచి పోతానంటాడు. మర్నాడే సుబ్బమ్మగారు పిల్లలూ గరికిపాడు వెళ్లారు. రాఘవరావు మావయ్య తెనాలిలో వున్నారు. మరిడమ్మగారు బాపట్లలో వుంది.

అమ్మ ఆరోజు నుండీ పూర్తిగా పదకొండు రోజులు ఒకే చెట్టుకింద కదలకుండా కూర్చుంటుంది. అన్ని రోజులు అమ్మ ఏమయిందో కూడా కనుక్కోరు. పన్నెండవరోజు కళ్ళు తెరచేటప్పటికి దాహంతో నాలుక పిడచకట్టుకు పోతుంటుంది. దగ్గర్లో మంచినీళ్ళు కూడా లేవు. ఆ చెట్టు మాను వంకనే ఒక అరగంట చూస్తూ కూర్చుటుంది. మాను పగిలిపోతుంది. ఆ పగిలిన చప్పుడు వచ్చేధ్వని "ఓంకార ధ్వనిగా, పెద్ద మోతగా పిడుగుపడినట్లుగా వూరంతా వినిపిస్తుంది. వెంటనే మేఘాలు కమ్మి పెద్ద వర్షం కురుస్తుంది. ఆ గ్రామంలో అదే తొలకరి వాన వూరంతా చల్లబడుతుంది.

ఐదురోజుల్లో భూమి అంతా పచ్చబడుతుంది. అమ్మ ఆవానలో అక్కడే వుంటుంది. మాను పగిలిన తరువాత దానిలో నుంచి నురుగు నురుగ్గా కారుతుంటుంది. దోసిళ్ళతో ఆ రసాన్ని అమ్మ తాగుతూవుంటుంది. అమ్మ దాహం తీరేదాకా కారుతుంది. దానినే "తింత్రీణీ సుధ" అంటారు. ఎటుచూచినా నాగజెముదు చింతలు. ఆ చింతల్లోని చింతే తన దాహాన్ని తీర్చిందనుకుంటుంది అమ్మ. ఎప్పుడూ తనకు చింతలే కావాలని, ఆ చింతే నీడ ఇచ్చింది. చింత రసమే దాహం తీర్చింది తాను వూరినుండీ వెళ్ళేటప్పుడు కూడా ఈ చింతలనే తీసుకువెళ్తాననుకుంది. "ఈ చింత నాచెంతనుండి నా మనస్సుకు యేచింతా లేకుండా చేస్తుంది" అని అమ్మ

అనుకున్నది. ఒకే పరికిణి, చొక్కాతో ఎండకు ఎండి, వానకు తడుస్తూ అక్కడే ఇంకో పదకొండు రోజులు గడుస్తాయి.

మౌలాలీ దొప్పల పూడిలో అడుక్కుంటూ రోజు తోటలో అమ్మ దగ్గరకు వచ్చి వెళ్తుంటాడు. అన్ని రోజులు అమ్మ ఇంటికి రాకపోయినా అమ్మ ఏమయిందని, ఇంటి దగ్గర వారు ఆలోచించరు. ఇరవైమూడు రోజులు చెట్టుకిందే అలాగే గడిచి పోతాయి. మౌలాలీ కూడా ఎక్కువ సమయం తోటలోనే వుంటాడు. ఏరోజు కారోజుకు ఈ అమ్మ ఈశ్వరమ్మ కంటే గొప్పది. ఈ తల్లి ఇట్లా ఎందరెందరిని తరిపంచేస్తోందో అని అనుకుంటాడు. అమ్మా! ఏనాటికైనా బయటకు వస్తావా నీకు తెలియకుండానే నీ శక్తులే బయటకు రప్పిస్తాయిలే అనుకుంటాడు. అమ్మను గురించి ఏవేవో వూహలు వస్తున్నాయి కానీ వర్ణించటానికి చదువురాదని బాధపడ్డాడు.

కూర్చుంటే ఏదో మైకంగా వుంటుందని, అందులోనే మాట్లాడకపోయినా అమ్మతో సంభాషిస్తున్నట్లే వుంటుందనుకుంటాడు. రకరకాల రూపాలు కనపడతాయి. యెన్ని రూపాలు కనపడ్డా అమ్మే అనిపిస్తుంది. అంతేకాని ఎవరో ఏమిటోలే అనిపించదు. అమ్మ కంటే చిన్నపిల్లగా కనిపించినా అమ్మే అనిపిస్తుంది. ముసలి దానిలా కనిపించినా అమ్మే అనిపిస్తుంది. పురుషులైనా అమ్మే అనిపిస్తుంది. ఎక్కడ చెడ్డవాసన వచ్చి ముక్కు ముసుకున్నా అందులోంచి మంచి వాసన వస్తుంది. వస్తువు తీసేసినా ఆ వాసన పోదు. ఒక అనుభవమని ఏముంది? అమ్మను వదిలి అడుక్కుందామనిపించటం లేదంటాడు. "అన్నింటికీ నిన్నే నమ్ముకున్నప్పుడు ఆకలి మాత్రం నీవు తీర్చవా?'' ఇవన్నీ చూస్తే తన ప్రయత్నం ఏమీ లేదని తెలిపోయిందనుకుంటాడు.

అమ్మ అతను చెప్పేవన్నీ వింటూ కళ్ళు మూసుకుని తలవంచుకుని అట్లాగే కూర్చుంటుంది. అలా ఐదు రోజులు కూర్చుంటుంది.

మౌలాలీ అమ్మను చూస్తూ అమ్మతో కలిసి పోయిన వాడిలాగా, చైతన్యం లేని వాడిగా కన్ను ఆర్పకుండా కూర్చుంటాడు. అనేక రకాల పురుగులు పాకుతుంటాయి. తీసి వేద్దామనుకుంన్నా చేతులు లేవవు. కాళ్ళు కదలవు. కనురెప్పవాల్చడానికి కూడా శరీరం స్వాధీనం కాదు. కనపడ్డది గుర్తిస్తాడే కాని సంకల్పాలు రావు. ఈ విధంగా ఐదు రోజులు గడచిపోతాయి. ఆ రోజు నిండు పౌర్ణమి రాత్రి పన్నెండు గంటలప్పుడు

ఒక సర్పం అమ్మ చుట్టూరా చుట్టేసుకుని పైన గొడుగులాగా పడగవిప్పి లెక్క వేయటానికి వీలు లేనన్ని శిరస్సులతో, ఆ వెన్నెలకాంతిలో మెరిసిపోతూ, తల వూపుతూ ఆడుకుంటున్నట్లు కనబడుతుంది. తన భ్రమా లేక నిజమా అని అమ్మ దగ్గరకు వెళ్ళి చూస్తాడు. ఇంకా ఎక్కువ కాంతితో మెరుస్తుంటుంది.

అమ్మను, సమీపించిన కొద్దీ గొడుగు ఆకారంగా ఒక్కో శిరస్సు ఒక్కో గొడుగు కడ్డీగా కనబడుతుంది. పాము చర్మం గొడుగు గుడ్డలా వుంటుంది. క్రిందన పాము చర్మం గొడుగు కర్రలా వుంటుంది. పామును అమ్మే పట్టుకున్నట్లు ఇంకా తరచి చూడగా ఆదిశేషువు గొడుగై అమ్మను ఎండా, వానల నుండి కాపాడుతున్నాడనుకుంటాడు. అమ్మ విష్ణుమూర్తిలా శేషతల్పం మీద పడుకున్నట్లుగా గోచరిస్తుంది. అమ్మ వంకే చుస్తుంటే రూపాలన్నీ పోయి అమ్మ కిరీటధారిణియై వర్ణించనలవికాని రూపంతో అనేకమైన తలలతో అమ్మ కనబడుతుంది. ఆ తరువాత అన్నీ పోయి అమ్మ ఒక్కటిగానే కనపడుతుంది. అప్పుడు అమ్మను కాపాడేదేమిటి? అన్నీ అమ్మరూపాలే అనిపిస్తుంది. ఎప్పుడూ ఇలాంటి దృశ్యాలు చూడాలని వుండేదని వాటినే తన జన్మ తరింపచేయటానికో కనిపింప చేసిందను కుంటాడు తన జన్మకు మూలం అమ్మే అని, మనో వాక్కాయ కర్మలా గుర్తించటమే బ్రహ్మను తెలుసుకోవటం అని బ్రహ్మ గారు చెప్పారన్నది, అమ్మ చూపించిదని అనుకుంటాడు.

అమ్మ కళ్ళు తెరచి మామూలుగా కూర్చుని "ఏమిటి? మౌలాలీ నీలోనీవే మాట్లాడుకుంటున్నావు" అని అడిగింది. తానుకూడా భగవంతుడునేనని గుర్తించాను. అదే బ్రహ్మంగారి తత్వాల్లో చెప్పేది. "అహం బ్రహ్మాస్మి" అనేగా అంటాడు.

"నిన్నటికి ఈరోజుకూ తేడా ఏమిటి?" అని మౌలాలీని అమ్మ అడిగింది. నిన్న ఈ స్థితి లేదు కదా! నీకు తెలియకుండానే నాకు తెలుసా అమ్మా? ఏదైనా నీవు ప్రసాదించిందే అంటాడు. తనకేం తెలియదని అమ్మ అంటుంది. పాపం నీకేం తెల్సు చిట్టి తల్లివి. అనేక రూపాలతో ప్రపంచాన్నే చుట్టేశావు అన్నాడు. తెల్లవారు జామున నాలుగు గంటలకు నాగజముడు పళ్ళుకొన్ని మౌలాలీకి పెడ్తుంది. ఈ దృశ్యాలన్నీ చూడకమునుపు ఈ పళ్ళు తింటూ ఈ తోటలోనే వుండి కాలం గడుపుదామనుకున్నాన అంటూ చేతిలోకి తీసుకుని తింటాడు.

ఈ రోజు ఇంటికి వెళ్తానంటుంది అమ్మ. అమ్మ ఇంటికి వెళ్ళే ఒక గంటముందే

తాతమ్మ వస్తుంది. నల్లఖాసిం, సీతాపతిగారు, మరిడమ్మగారు కబుర్లు చెప్పుకుంటుంటారు. అమ్మా! ఇరవైరోజుల క్యాంపు కొట్టావే తాతమ్మగారితో తిరుగుతున్నావా? అంటాడు ఖాసిం. తాతమ్మ తాను తీసుకువెళ్ళలేదంది. సీతాపతిగారు తాతమ్మతో "మీతో వెళ్ళిందనుకున్నా" మంటారు. అయ్యో! ఎక్కడ తిరుగుతున్నావమ్మా అని మరిడమ్మగారు ఆదుర్దా చెందుతుంది.

సీతాపతిగారు "ఎక్కడికి పోతుందిలే! చింతలపూడి నరసింహం గారింట్లోనో, వాళ్ళపినతండ్రి అంబారావు గారింట్లో వుందో అంటారు. నల్ల ఖాసిం అక్కడకు వెళ్ళానని కనిపించలేదంటాడు. సుబ్బమ్మగారు వాళ్ళతో వెళ్ళిందేమోననుకున్నానంటుంది కామేశ్వరమ్మగారు ఇంత పట్టించుకోకపోతే ఎట్లా నాయనా? పసిబిడ్డ కదా మీరంతా ఉన్నారని కదా వదలి పెట్టి వెళ్ళానని మరిడమ్మ గారు అంటుంది. ఇంట్లో వుంటే సరిపోతుంది. ఎక్కడో వుంటే ఎవరు కనిపెట్టి వుంటారని సీతాపతిగారు అన్నారు. అన్నం తినటానికి రమ్మనగానే అమ్మ అన్నం తిని మౌలాలీకి అన్నం తీసుకొని తోటలోకి వెళుతుంది. మౌలాలీ భోజనం చేస్తాడు ఇంకా చాలా జంతువులకు కూడా ఆహారమేస్తుంది. నీ వాలకం చూస్తే కాశీ అన్నపూర్ణమ్మ తల్లి వలే వున్నావమ్మా! ఒకరికి తెచ్చి ఇంతమందికి పెట్టావు అంటాడు మౌలాలీ.

మౌలాలీయే నయం అని రాబోయే సంగతులు తెలుస్తున్నాయి అంటూ తాను ముందు ముందు చేయబోయే కార్యక్రమాన్ని విశదపరిచింది అమ్మ.

అమ్మ దయవుంటే అన్నీ తెలుస్తాయి అంటాడు. " నా దయ ఏమిటి? అంటుంది అమ్మ. నీ దయ లేకపోతే ఎక్కడో తోటలో కుర్చుని భగవంతుడిచేత అన్నం తెప్పించుకు తింటున్నాను. నిన్ను గుర్తింపచేశావు. నిన్ను చూడకముందు నాకు బాగా దృష్టి దోషం కూడా వుంది. నిన్ను చూడటమే నా దోషం పోవటం అంటాడు మౌలాలీ.

అతనికి కళ్ళే కనిపించకపోతే బజార్లమ్మట ఎలా తిరుగుతున్నావని అమ్మ అడిగింది. కనబడి కాదమ్మ సౌజ్ఞతో తిరిగేవాణ్ణి. అమ్మ కరుణ అమ్మకు తెలియకుండా ప్రసరించింది. ఆయమ్మగా అంటే పోలేరమ్మగా వచ్చి కళ్ళు తీసేసావు. జగదీశ్వరి రూపంతో వచ్చి కళ్ళు ఇచ్చావని అమితానందంతో అమ్మలో కల గొప్పదనాన్ని వేనోళ్ళ పొగిడాడు.

అమ్మ నెత్తిన గొడుగులా పామున్నది. ఎందుకమ్మ అన్నాడు. యేమో మౌలాలీ ఈ మధ్య మధ్యాహ్నం నిద్రలేచేటప్పటికి నా నెత్తిన అట్లాగే కనిపించిందని ప్రక్కకు తిరిగితే పక్కన, ఎదరు చూస్తే ఎదరుగుండా నేను ఎటుచూస్తే అట్లా కనిపించింది. చింతచెట్టు కూడా పాములాగానే కనిపించింది. అదేమిటో చూద్దామని రోడ్డు మీదకు వెళ్ళితే తాను నడిచినట్లే నడుస్తున్నది. శివాలయం వాకిలిముందర ఉన్న ధ్వజం వంక చూస్తే ద్వారం పొడుగునా కనిపించింది. తన పాదాల దగ్గర నుండీ గుడి వాకిలి దాకా వున్నది. ఇది ఏమిటని భానారాయణ స్వామి గుడికి వెళ్ళితే అక్కడా వున్నది. అక్కడే కూర్చున్నాను. చివరకు అదంతా తనలోదేననిపించింది తనలో యెక్కడున్నదో అన్న ఆలోచన తనకే వచ్చిందని వివరించింది." అమ్మ పాము చుట్టలు చుట్టుకుని పడగయెత్తి నుంచున్నప్పుడు మనిషి కూర్చున్న ఆకారంలో వుంటుంది. అదే 'బ్రహ్మదండి' వెన్నెముక క్రిందగా వుంటుంది అదే 'సుషుమ్నానాడి' అదే బ్రహ్మం గారి తత్త్వాల్లో వచ్చేదే నీకు తెలియకుండా వుంటుందా అన్నది.

మనిషి జుట్టు పూర్తిగా తీయించి నుంచో బెడితే వెనకపక్కనుంచి ఆ తల చూస్తుంటే నాకేమో పడగాకారం తోస్తుంది. పాము ఆకారం ఎట్లా వుంటుందో మన శరీరంలో వుండే సుషుమ్నానాడి ఆ పాదము అట్లాగే వుంటుంది. దానికి కేంద్ర స్థానం నడుం దగ్గర నుంచీ శిరస్సు వరకూ అంటారు. అంత మాత్రంచేత శరీరమంతా వుండదని కాదు. కొందరు సాధకులు ఉఛ్వాస నిఛ్వాసాల ద్వారా గుర్తిస్తాయి. అదే కుండలినీ ప్రభోదమని పడుక్కు పామును కొడితే తలెత్తి బుసకొట్టినట్లుగా హఠయోగమని చెప్తారు. అదే సహస్రారానికి వెళ్ళిందంటారు. స్థానాల్లో కేంద్రీకరణ ఎందుకు అంటే విగ్రహారాధన వంటిది. అనేక రకాల విగ్రహాలు పెట్టుకుని ఒక విషయం కోసమే కృషి చేస్తుంటారు? ఒకే స్థితిని అనేక సదుపాయాలు, ఒక మేడకే నాలుగు వైపులా మెట్లు వేసినట్లుగా అంది అమ్మ.

బయట సర్పమల్లే కనబడటమెందుకమ్మా అన్నాడు మౌలాలి. లోపల ఏదో బయటా అదేనని రెండు కాదని అన్నావుకదా! అంది. ఇవన్నీ తన కొద్దనీ, అమ్మేదేవుడని, అదికాదు. అమ్మవే అని తను బిడ్డ అనీ అంటాడు. అన్నీ అమ్మే చేస్తుందని, తాను చూస్తున్నదనేదే చాలా హాయిగా వుందంటాడు.

అందరూ ఒక్కసారి గుర్తించేరోజు వస్తుందా అమ్మా! ఇది తాను చూస్తానా

అని అడిగాడు. అమ్మా! ఆ బ్రహ్మదండిని కూడా సృష్టించింది నువ్వే కదా అని అమ్మకు కనబడటమేమిటి? మాకు భోద చేయటం కోసం ఇవన్నీ ఆధారంగా తీసుకుని చెప్తున్నావు. సామాన్యురాలిగా ఒక రూపంతో వున్నావు గాదు. సూది మొన మోపలేకుండా వున్న అమ్మవు. సూదై కూర్చున్నావు. మొద్దు గుడ్డలు కుట్టాలి. సన్నగుడ్డలు కుట్టాలి. సిల్కు గుడ్డలు కుట్టాలి. అన్నీ చేయాల్సిందేగా అమ్మా! అమ్మను సరిగ వాడుకోవటం చేతకాక పోతే విరగదీసి పెడతాం. అన్నీ అమ్మేగా ఇవన్నీ ఎందుకు పెట్టుకున్నావామ్మా! ఇంత యాతన ఎందుకమ్మా? యీ కార్యభారం అని అన్నాడు.

భరించలేనప్పుడేగా బాధ "భరించలేనిదే బాధ" అంది అమ్మ. అమ్మా నీకు కూడా పెళ్ళి అవసరమా? అని అడిగాడు. ఇప్పుడేగా చెప్పావు సూదివై కూర్చున్నానని, సూది అయిన తరువాత అన్నీ కుట్టాలనుకున్నా గదా! అన్నది అమ్మ. పెళ్ళి అమ్మకు ఆదర్శమేకాని, అమ్మను చూచే వాళ్ళకు బాధే. మొన్న మధూకరానికి వచ్చినప్పటి నుంచీ ముందు ముందు యెక్కువ బాధలే సృష్టించుకున్నదేమో అనిపిస్తుంది. ఎంతగా అన్నీ అమ్మే అనుకుంటున్నా మొన్న అమ్మ మేనత్త తిట్టి గడపలో నెట్టి పడేసిన విషయం జ్ఞాపకం వచ్చి నప్పుడల్లా బాధగా వుంటుందని అన్నాడు.

అమ్మ బందువులనందరినీ ఇట్లా సృష్టించుకుందేమో అనిపిస్తుంది. తనకోసం బాధపడే తల్లిని ముందరగానే పంపించింది. తాను మెట్రిక్యులేషన్ చదువుకొనేటప్పుడు ఒకరోజు స్కూలుకు వెళ్ళి వస్తుంటే అమ్మ కనిపించింది. మళ్ళీ ఎంత చూద్దామనుకున్నా కనిపించనే కనిపించలేదు. అప్పటినుంచీ తనకు తెలియకుండానే "అమ్మా" అనే నామం ఆరోజు నుంచీ జపం చేస్తునే వున్నాడు. ఆనాడే కనపడి మంత్రోపదేశం చేసి అదృశ్యమైనావు. ఆ జపం ఈనాడు ఫలించింది అన్నాడు మౌలాలి.

నాలుగు రోజుల్లో నంబూరు వెళ్తున్నాము మౌలాలీని కూడా వస్తావా అని అమ్మ అడుగుతుంది. అమ్మ రమ్మంటే వస్తానని, రాక పోయినా తాను వుండగలను. పూర్వంలా విడిచి వుండలేనన్న బాధలేదని, తాను ఎప్పుడూ అమ్మ సాన్నిధ్యాన్ని పొందుతున్నానంటాడు మౌలాలీ అమ్మ ఇంటికి వెళ్తుంది.

మర్నాడు సాయింత్రం నాలుగున్నర గంటలకు అమ్మ తోటలోకి వెళ్తుంది. చండీ ఉపాసకుడు కొల్లిమర్ల సూరయ్యగారు చింత చిగురు కోసం వస్తాడు. అమ్మను

చూచి, చింత చిగురు కంటే అమ్మ దగ్గర కూర్చుందామనిపించి వచ్చి కూర్చుంటారు. అమ్మను చూస్తూ వచ్చిన పని మర్చిపోతాడు. ఆయనకు శ్రీ విద్య, తంత్ర విద్యల మీద మంచి అభిమానం, ఎవర్నీ సామాన్యంగా ఒప్పుకోడు. ఎందుకో అమ్మను చూస్తే ఆయన ఇష్టదైవమనిపిస్తుంది. ఆయన చూస్తుండగానే అమ్మ శిరస్సులోనుంచి రక్తం వస్తుంది. ఈ రెండూ సూరయ్యగారు చూచి ఆశ్చర్యపడి ఆ రక్తధారకు ఆయన చెయ్యి అడ్డుపెడతాడు. ఆచేతిలతో పడ్డ రక్తం చక్కటి సువాసన కల భస్మం అవుతుంది. ఆ భస్మం కాస్తా నాకేస్తారు.

అమ్మాయి "నీపేరేమిటి?" అన అడుగుతారు సూరయ్యగారు. నాపేరు అనసూయ అంటారని అంటుంది. "నీకీ రక్తప్రవాహం ఎప్పటినుంచీ?" అన అడుగుతారు. "ఫలానా అప్పటినుంచని తెలియదు. ఇప్పుడు మాత్రం వుందనుకున్నానా, ఎవరో మీబోటివారు చెప్తే తప్ప తనకేమీ తెలియదదంది" అమ్మ ఇంతకు ముందు ఈ విషయం ఎవరైనా చెప్పారా అని అడుగుతారు.

కొండలరావు స్వాములవారు తాను భజన చేస్తుంటే పిలిచి కూర్చోబెట్టుకొని తలమీద తడుముతూ ఇంత మెత్తగా వుందేమిటిమ్మ అని బ్రహ్మకపాళం దగ్గర వత్తి చూస్తారు. చేతికి నెత్తురయింది. ఇదివరకు ఎప్పుడైనా ఇలా జరిగిందా అని అడిగారు. ఆయనకు చెప్పన మాదిరిగానే తనకు తెలియదని చెప్పానంది. అమ్మ తలమీద వాసన చూస్తుంటే ఈ ప్రదేశం ఎంత సువాసన అని అనుకున్నారు. మళ్ళీ ఈయన అలాగే అన్నారని అమ్మ చెప్పింది.

ఇది సామాన్యమైన స్థితికాదు. తపస్సిద్ధి పొందిన వారికి గాని ఇతరులకు రాదు. దానికోసం ఆయన ఆరేళ్ళు ప్రయత్నించి పొట్టకూటికి ఉద్యోగానికి పోయి అన్నీ మర్చిపోయానని చెప్పారు. ఏడు ఏళ్ళ పిల్లవాడప్పటినుంచీ ఎంతో భక్తిగా చేసేవాడినని, ఇరవైమూడు యేళ్ళవరకూ సాగిందని, ఇప్పటికైనా ధ్యాస పోలేదని క్రియజరగటంలేదని భాదపడ్డారు.

"ధ్యాస క్రియేగా అంటుంది" అమ్మ. అట్లా అయితే ఉద్యోగం మానుకుని అమ్మ దగ్గరకు వస్తాననానరు. తన్ని నమ్ముకురావద్దనీ, చివరకు అసహ్యం వేస్తుంది. ఫలానా అమ్మయి కోసం వచ్చానంటే అందరూ నవ్వుతారు. తనమీద ఎవ్వరికీ

సదుద్దేశ్యం లేదు. ఆయన అమ్మ స్థితి ఇది అని చెప్పినా నమ్మరు. పైగా ఆయన్ని ఎగతాళి చేస్తారని, తన రోజులు ప్రస్తుతం బాగా లేవని అమ్మ చెప్తుంది.

"ఈ వూరు కాపురం వచ్చాక చాలా సంతానం కలిగి నష్టమైంది. ఇద్దరున్నారు. ఇద్దరూ మూగ పిల్లలే. ఒక మొగపిల్లవాడు ఒక ఆడపిల్ల. ఒక ఎకరం పొలమున్నది. ఐదువేల రొక్కం వుంది. ఎవరో పేదపిల్లాడికిచ్చి చేయాలి. మిమ్మల్ని వదిలిపెట్టి పోలేకుండా వున్నాను. ఈ ప్రపంచాన్నంతా పాలించే దేవత మీరనిపిస్తుంది" అని అన్నారు.

"నన్ను ఎందుకు మీరు అంటున్నారు" అని అమ్మ అడిగింది. ఆ విధంగా అనాలి అనిపిస్తోందమ్మ అన్నారు సూరయ్యగారు. అమ్మ ఎవరికి ఏ స్థితి వుందో దానికి తగ్గట్టుగా దర్శనమిస్తుంది. దానికి మూలం మూలానికి మూలం. అమూల్యమయిన ఆదరణ. ఆదరణ గల అవతారం. అమృతతత్వమయిన అవతారమనికూడా చెప్పచ్చు అది తన అభిప్రాయమని మౌలాలీ చెప్తాడు.

మూడు రోజుల్లో నంబూరు వెళ్తాను అంటుంది. నంబూరు ఎక్కడ అని మౌలాలీ అడుగుతాడు. గుంటూరు దగ్గర నంబూరు. నంబూరు వచ్చి కరణం గారి ఇల్లెక్కడ అని అడుగుతే చెప్తారు. ఈ మూడు రోజులు తాను అటుపక్కకి రానని చెప్తుంది.

సూరయ్యగారు చింతాకు కోసుకుంటూ అమ్మ దగ్గరకు పరిగెత్తుకు వస్తాడు. తాను తప్పకుండా ఈ వూరు వస్తానని అమ్మతో చెప్తారు. తన్ని నమ్ముకొని మాత్రం రావద్దు. వూళ్ళో వుండే బదులు ఇక్కడే వుంటానని చెప్తారు. అమ్మ. "సరే వుండండి" అంది. వెళ్ళి వస్తానని నమస్కారం చేస్తారు. నా కెందుకు నాయనా నమస్కారం? నీకు నీవు చేసుకో. అచ్చంగా నీకు నీవు చేసుకున్నా భగవంతుడికి చేసినట్లే. ప్రతి వస్తువుకు అన్నంకు, అశుద్ధానికి కూడా అంటుంది.

నంబూరులో పినతల్లి భాగ్యమ్మగారింటికి వెళుతుంది. ఆమె కూతురు సావిత్రి అమ్మ కలిసి వారిపెత్తండ్రి గోపాలరావు బాబుగారింటికి వెళతారు. ఆయనకు భార్య పిల్లలూ లేరు. ఈ పిల్లల్నే తన పిల్లలుగా చూసుకుంటుంటారు. ఆయన అన్నం వండుకుంటే కూరలు భాగ్యమ్మగారు పంపిస్తుంది. ఆయన దేవీ పూజా దురంధరుడు. నిత్య కుంకుమార్చన, అఖండం వెలుగుతూనే వుంటుంది. అక్కడ వున్న ఇరవై రోజుల్లో

అమ్మ పదిరోజులు ఆయన దగ్గరే తింటుంది. ఒకరోజు అన్నం విస్తట్లో పెట్టగానే "నాయనా ఈ రోజు అన్నం నేను కలిపేది" అని గోపాలరావు గారికి వినపడుతుంది. వులిక్కిపడి ఎవరూ? ఆ మాట అన్నది అంటూ పెద్ద పెద్ద కళ్ళు చేసి ఎవరు ఆ మాట అన్నది మీకు వినపడ్డదా అని అడుగుతారు.

నోరు తెరవలేదు కాని అనసూయ గొంతులో నుంచి వచ్చినట్టున్నది ధ్వని, అని సావిత్రి అంటుంది. "శబ్దమే ఒకటి, ధ్వనులు అనేకం" అని వినిపిస్తుంది. గోపాలరావుగారు బిత్తరపోయి బిత్తర చూపులు చూచుకుంటూ నాలుగు మూలలా వెతుకుతారు. ఆ తల్లే ఈ రూపంలో వచ్చిందే అనుకొని అమ్మతో కలుపమ్మా కలుపు అని అన్నారు.

ఆ అమ్మాయిని చూచినప్పటినుంచీ దైవకళ ఉట్టిపడుతోందని, ఆ జడ, ఆ పరికిణీ బాలా త్రిపుర సుందరి వలె వుందని అన్నారు. తనకు నిన్నే అలా అనిపించిందని, దిష్టి తగులుతుందేమేనని వురుకున్నా కలుపమ్మా అని చెయ్యి పట్టుకొని ఒళ్లోకి లాక్కుని ముద్దుపెట్టుకుంటారు. అమ్మ మెడ తన భుజం మీదకు వంచి రెండు గంటలసేపు అలా వుంటారు. పిల్లలు ఇంటికి వెళ్ళిచెప్తారు. గోపాలరావు గారు ఒక చెయ్యి అమ్మ తలమీద, ఒక చెయ్యి అమ్మ వీపుమీద వేసుకుని ఉదయం పదకొండు నుంచీ సాయింకాలం నాలుగు గంటలవరకూ అలాగే వుండి పోతారు. అందరికీ ఏ స్థితి అయింది తెలియక అయోమయంగా వుంటారు.

గోపరాజు గారు డాక్టర్ని పిలుస్తారు. డాక్టరుగారు చూచి శ్వాసలేదు. నాడి అందటంలేదంటారు. తేజస్సు చూస్తే ప్రాణం పోయినట్లు లేదంటారు.

ఆ గందరగోళం చూచి మౌలాలీ ఆ తల్లి మాయ ఎవరు కనుక్కోగలరు? ఏ బిడ్డకు ఎట్లా దర్శనమివ్వాలో అట్లా ఇచ్చి తరింపచేస్తుంది. ఒక్కొక్కరికి ప్రత్యేక్షంగా కనబడేటట్లు ఇస్తుంది. ఒక్కొక్కరిని మాములుగా వుంచే వాళ్ళ యొక్క స్థితి వాళ్ళకు తెలియకుండానే తరింపచేస్తుంది. అనుకుంటాడు. మౌలాలి పక్కనే వున్న నంబూరి హనుమంతారావుగారు ఆ మాటలు విని బాబాయి ఇటురా అని అవతలకు తీసుకువెళ్ళి అదిగో నిల్చున్నాడే వేలు పెట్టి చూపిస్తూ అబ్బాయి ఇట్లా అంటున్నాడని మౌలాలీ అన్న వన్నీ చెపుతాడు.

గోపరాజు గారు మౌలాలీని ఇవతలకు పిల్చి అడుగుతాడు ఏం జరిగింది? అని ఆముసలాయన సంగతి విచారిస్తే గొప్ప దేవీ పూజా సంపన్నుడని అన్నారు. అందుకని ఆతల్లి ఎవరికి ఎట్లా దర్శనమివ్వాలో అట్లా ఇచ్చి తరింపచేస్తుందన్నాను. ఆయన కొల్చేది తల్లినే కదా! ఆ తల్లే ఈ తల్లి అన్నాను. ఆ తల్లి ఈ తల్లి రూపంలో ఎందుకు దర్శనమివ్వకూడదు? ఈ తల్లి ఆ తల్లే ఎందుకు కాకూడదు? అంతే నాయనా నాభావం అన్నాడు.

గోపాలరావు గారు తల ఎత్తుతారు. అమ్మ ఇవతలకు వస్తుంది. గోపరాజుగారు ఏం జరిగిందని అడుగుతారు. గోపాలరావుగారు జరిగిందంతా చెపుతారు. ముద్దుపెట్టుకుంటే అతుక్కుపోయింది. ఆ తరువాత ఏం జరిగిందీ తెలియదు. అమ్మాయిని మాత్రం బాలాత్రిపురసుందరిగా భావన చేసాను అంటారు. మనోభ్రమ అనుకుంటూ గోపరాజుగారు వెళతారు. గోపాలరావు గారు మత్తుగా అలాగే పడుకుంటారు. అమ్మ ఇంటికి వస్తుంది. అక్కడ ఏమిజరిగిందని అమ్మ పెద తల్లి అన్నమ్మగారు అడుగుతుంది. అమ్మ జరిగిందంతా చెపుతుంది. పోయిన సొమ్ములన్నీ పెడితే బాలాత్రిపురసుందరల్లే వుండేదానవి. రంగమ్మ తల్లికి ప్రాప్తంలేదు చూచుకునేందుకు సంతానం కోసం ఏడ్చి ఏడ్చి కళ్ళు పోయినాయి. పిల్ల బతకొచ్చేటప్పటికి దానికి కాలం లేకుండా పోయిందని బాధపడ్తుంది.

★ ★ ★

# 37. వివాహప్రస్థావన

అమ్మకు పన్నెండువ సంవత్సరము జరుగుతుండగానే నాన్న గారి విద్యాభ్యాసం పూర్తి అయి ఉద్యోగాన్వేషణలో వుంటారు. ఈ ప్రాంతంలో ఉద్యోగం దొరకనందున తన తండ్రి బ్రహ్మాండం సుబ్బారావుగారు ఉద్యోగం చేసిన నిజమాబాద్ వెళ్ళి వారి స్నేహితుల ద్వారా ఉద్యోగ ప్రయత్నానికి బయలుదేరుతూ మన్నవ వచ్చి సీతాపతిగారితో అమ్మకు తనకు వివాహము జరిపే విషయమై ప్రస్తావన చేస్తారు.

సీతాపతిగారు తన వద్ద ప్రస్తుతం డబ్బులేదని దొరకగానే ఏర్పాటు చేస్తామని చెప్తారు. నాన్నగారు నిజమాబాదు వెళ్తారు. అంతలో తాతగారికి పైకం అంది లగ్నాలు పెట్టుకొని శుభలేఖలు వేయించి బాపట్లలో కనకమ్మగారి వద్దకు వచ్చి విషయం చెప్తారు. నాన్నగారి చిరునామా తన దగ్గర లేనందున కబురు పంపటం కష్టమని పెళ్ళి వాయిదా వేయమని కోరుతుంది. పెళ్ళి ఏర్పాట్లు జరుగుతున్నందు వలన వాయిదా వేయటం కుదరదని సీతాపతిగారు చెప్తారు. దీని మీద మాటామాటా పెరిగి ఘర్షణ పడటంతో పెళ్ళి ఆగిపోతుంది. ఆ రెండు కుటుంబాల మధ్య ఘర్షణ అపోహలకు ఎందరో కారణమవుతారు.

ఇట్లా రాయబారాలతో ఇంకో ఆరునెలలు గడుస్తాయి. అమ్మ తాతగారైన సుబ్బయ్యగారికి గొంతులో కురుపులేస్తుంది. అమ్మే దగ్గరుండి పరిచర్యలన్నీ చేస్తుంటుంది. ఆసుపత్రికి వెళ్ళి మందులు కూడా అమ్మే తీసుకువస్తుంటుంది. రాత్రీ పగలు అనక పదిహేను రోజులు అమ్మ నిద్రకూడా లేకుండా సేవ చేస్తుంది.

తాతగారు ఆ జబ్బులోనే రాత్రి ఒంటిగంటకు చిదంబరరావుగారికి వుత్తరం రాస్తారు. "నాయనా చిదంబరా! ఈ బిడ్డకు తాతను నేనుకాదునీవే. వాళ్ళ అమ్మ పోతూ పోతూ నీకు అప్పచెప్పింది. అమ్మాయి పెళ్లి విషయంలో ఉన్న అపోహలను తొలగించి ఆ పెళ్ళి జరిపించు. లేదా ఆర్థిక సహాయం నేను చెస్తాను లేదా నీ ఇష్టమొచ్చిన సంబంధం నిర్ణయించు. తల్లిలేని బిడ్డ నోరులేనిది. పోనీ నేనేమైనా చూద్దామన్నా ఇట్లా మంచమెక్కాను. ఆ సీతాపతితో కూడా చెప్పి త్వరగా ఏర్పాటు చేయి. ఇక్కడ వున్నదంటే పొద్దస్తమానం పనేచేస్తున్నది పాపం. మొన్న అర్ధరాత్రివేళ అందరూ నిద్రపోయారనుకొని అరుగుమీద కూర్చుని ఎవరితోనో మాట్లాడుతున్నది.

అది చూచినప్పటినుండీ తొందరగా ఒక అయ్య చేతిలో పెడితే బాగుంటుందనిపిస్తోంది. అమ్మాయిని నేనేమీ అడగలేదు. మరెవ్వరికీ చెప్పలేదు. నీకే తెలియపరుస్తున్నా త్వరగా బయలు దేరిరా" అని రాశారు.

ఉత్తరం చేరగానే చిదంబరరావుగారు వచ్చారు. ముందుగా అమ్మ దగ్గరకే వచ్చి మౌలాలీతో మాట్లాడావా అని అడుగుతారు. మీరు కూడా నన్ను ఏ అయ్య చేతిలోనో పెట్టి భారం దించుకుందామనుకుంటున్నారా? అంది. మౌలాలీ తోనేనా అని ఆయన అడుగుతారు. మీకు కూడా అనుమానమేనా? ఒకవేళ మౌలాలీ కాకపోయినా అటువంటి బిడ్డలే అవుతారు అంటుంది. "అది కాదమ్మా! నిన్ను అట్లా అనుకుంటానుటమ్మా? నేను, రామరామ అంతకంటే నరకం ఏమున్నదమ్మా నిన్ను అనటమే నరకము. అంటే నీ మనస్సు కష్టపెట్టటమే అనీ" ఆవేదనతో అంటారు.

సుబ్బయ్యగారితో ఎందుకు అట్లా రాసావు. అటువంటి అనుమానం ఎందుకు వచ్చింది? అమ్మాయి అంటే సామాన్యంగాదు. మన అందర్నీ తరింపచేయటానికి వచ్చింది. ముందు ముందు తెలుస్తుందంటారు. చిదంబరరావుగారు ఏది చెప్పినా సుబ్బయ్యగారికి నమ్మకం. తరువాత తాను అలారాసినందుకు పశ్చాత్తాపపడతారు. అది కూడా అమ్మాయే రాయించుకొని వుంటుంది. సుబ్బయ్యగారిచేత ఎందుకు రాయించుకుందో అనుకుంటారు.

జాతకం ప్రకారం చాలా గొప్ప జాతకంరా! కానీ ఒక ప్రక్క పీడింపబడుతుందని వుంది అంటారు సుబ్బయ్యగారు బాధగా. మానసికంగానా? శారీరకంగానా? అని చిదంబరరావుగారు అన్నగారిని అడుగుతారు. రెండూ కనపడుతున్నాయంటారు. గొప్ప జాతకమయితే ఇవన్నీ ఉండటమేమిటని తనలో తానే తర్కించుకుంటారు చిదంబరరావుగారు.

చిదంబరరావుగారు "మీ అత్తయ్య అడగమంది. సీతాపతి వట్టి వైషమ్యాన్ని పెంచుకుంటున్నాడే గాని వాడు సమర్థుడు కాదు. అమ్మాయిని కనుక్కొని మనమే చెద్దాం పెళ్ళి" అందని అమ్మతో చెప్తారు.

ఇక్కడా ఇరవైనాలుగు గంటలు ఇదేగోల. మీ ఇష్టం వచ్చినట్లు చేయండి? వారంతా కలిసి తన్ను బాధించలేకపోయినా, తాను ఒక్కతే ఎంతమందిని

బాధపెడ్తున్నానో అంటుంది. "అట్లా అనకమ్మా! ఎవరినీ నీవు బాధపెట్టటంలేదు. బాధపడ్తున్నామని బాధ పడకమ్మా అని గడ్డం పుచ్చుకుని బతిమాలుతారు" అమ్మ తల వంచుకుని అవతలకు వెళ్ళిపోతుంది.

ఇంతలో జానకమ్మగారు పంపు దగ్గర రెండు బిందెలు నీళ్ళు పట్టమని అడిగింది. అమ్మ పంపుదగ్గర నీళ్ళు పడుతుంటే తాతగారు అమ్మ దగ్గరకు వచ్చి రెండు రూపాయలు అమ్మచేతిలో పెట్టి ఎందుకైనా వాడుకో అని చెప్పారు. డబ్బుతో తనకు పని లేనిదని స్కూల్లో మౌలాలీకి ఇవ్వమని అమ్మ తాతగారితో చెప్పింది.

సుబ్బయ్య తాతగారికి సుస్తీగా వుందని మరిడమ్మ తాతమ్మ చూడటానికి వస్తుంది. వెళ్ళేటప్పుడు అమ్మనూ తీసుకువెళ్తుంది.

ఆ రోజు వుండ్రాళ్ళ తద్దె అవుతుంది. పిల్లలంతా కలిసి లక్ష్మీకళ్యాణం అనే ఆటను ప్రారంభించటానికి ముందుగా పెళ్ళికూతురు ఎవరు అనే సమస్య ఎదురైయింది. సరిగా ఆ సమయానికి అమ్మ వెళుతుంది. నిజమైన పెళ్ళికూతురు అరుణోదయం కంటే మించిన కాంతితో, లక్ష్మీదేవి వైకుంఠంనుంచీ వచ్చింది అంటారు. వైకుంఠం నుంచీ కాదు. జనకుని దగ్గరనుంచీ పెళ్ళి కాని సీత స్వయంవరకు బయలుదేరినట్లుగా వుందనుకుంటారు కొందరు.

ఆలస్యం అయిపోతోందంటూ పిల్లలంతా రెండు జట్లగా చేరి ఒక పక్క పెళ్ళికూతురు తాలూకు వాళ్ళందరూ ఒకరిచిటికినవేలు మరొకరు పట్టుకుని లైనుగా అందరూ "చిన్నికి పొన్నికి ఎన్నేఏడు. శ్రీ మహాలక్ష్మికి ఎన్నోఏడు. తామర మొగ్గకు ఎన్నోఏడు" అంటూ పాడుతూ పెళ్ళికూతురు దగ్గకు వస్తారు. దానికి సమాధానంగా పెళ్ళికూతురు వాళ్ళు "చిన్నికి పొన్నికి అయిదోఏడు. శ్రీమహాలక్ష్మికి ఐదో ఏడు, తామర మొగ్గకు అయిదో ఏడు" అట్లా ఆ పాటలతోనే పెళ్ళి కలాపంతో అంతా అడగటం చెప్పటం జరుగుతుంది. కట్నాల దగ్గర పేచీలు కూడా పాటలతోనే ఆడే ఆట లక్ష్మీకాళ్యాణం. పెళ్ళికొడుకుగా నాగేంద్రమ్మ అనే అమ్మాయినే వుంచారు. ఆ నాగేంద్రుడే ఈ నాగేంద్రమ్మగా అనిపించింది అనుకుంటూ నవ్వుతూ వస్తుంది. తాతమ్మ అమ్మ ముఖం వంకచూస్తూ ఏమిటమ్మా నవ్వుతూ వస్తున్నావు అని అడిగింది.

అమ్మ నవ్వుతూ జరిగిందంతా చెపుతుంది. మెల్లిగా చెప్పు ఆ పేరు వింటేనే

మీనాన్న మండిపడతారని తాతమ్మ అంటుంది. తనమీద అత్తయ్య మీదే ఆయనకు కోపమని చెప్తుంది. అమ్మ మీద కోపం లేదని తాతమ్మ అంది. ఏమీ లేకపోతే చిక్కేలేదు. ప్రేమ వున్నదిగా దానితో పాటు రెండవది వుండక తప్పదు. కోపమంటే వేరేమున్నది? ప్రేమ ప్రకోపించినప్పుడు ముద్దు పెట్టుకుంటాడు. దగ్గరకు రాకపోతే కోపం వస్తుంది. ప్రేమే కోపానికి మూలం అయిందని అమ్మ తెలియజేస్తుంది.

అమ్మ, తాతమ్మ, కామేశ్వరమ్మ గారు గుంటూరు వెళతారు. మౌలాలీ తెనాలి నుంచీ గుంటూరు చేరతాడు. అమ్మా వాళ్ళు వచ్చేప్పటికి నాన్నగారు వచ్చి వుంటారు. నంద్యాల నాటకాలకు పోతూ రాఘవరావు మామయ్య వస్తాడు. గుంటూరు కుగ్లర్ ఆసుపత్రి దగ్గర రాజగారి సత్రంలో వుంటుంది భారతీదేవి.

మౌలాలీ ముసుగు వేసుకొని ఎప్పుడూ ఆ సత్రం వాకిట్లోనే వుంటాడు. వంట అయింది బోజనానికి రమ్మంటారు. ఆ వంటమనిషి ఒకే బారున విస్తళ్ళు వేస్తుంది. మొదట సీతాపతిగారు, కామేశ్వరిగారు, భారతీదేవి, అన్నపూర్ణమ్మగారు, చిదంబరరావుగారు కూర్చుంటారు. ఆ తరువాత రాఘవరావు మామయ్య అమ్మ, నాన్నగారు కూర్చుంటారు. భారతీదేవి తలవంచుకొని విస్తట్లో చీమ వుంటే మధ్య వేలుతో కొడుతూ చీమ చిక్కిందిలేఅంటూ కొడుతుంది.

అందరికీ అర్ధమయింది. కానీ ఎవరిమటుకువారు అర్ధం కానట్లు అన్నాలు తింటున్నారు. అమ్మ తల వంచుకొని అన్నంలో వడ్లు మట్టిగడ్డలు ఏరుతుంటుంది. అవి చూచి అమ్మ చుట్టూ కూర్చుంటే మేము కూడా అలా వున్నామా అని చిదంబరరావు గారు అంటారు. భారతిగారికి కష్టం తోచి మీ మనమరాలు అన్నము మేము మట్టిగడ్డలమా అంటుంది. తన ఉద్దేశం అది కాదని వారిలో ఉన్న దుష్టత్వాన్ని తీసేయమన్నానని చెప్పారు. ఆమె మనలో ఉన్న దుష్టత్వాన్ని తీసివేయగల స్థితే వుందంటారా అక్కసుతో భారతీదేవి అన్నది. సీతాపతిగారు కళ్ళు పెద్దవి చేసి అన్నం ముందురనుంచీ లేచి పొమ్మని సంజ్ఞ చేస్తారు. అమ్మ వెంటనే లేచి చేయ్యి కడుక్కుంటుంది. అది చూచి చిదంబరరావుగారు అమ్మను దగ్గరకు తీసుకొని "ఏమమ్మా ఈ జీవితం ఇట్లా జరగవలసిందేనా? ఏనాటికైనా మార్పు వుంటుందా" అని బాధతో అంటారు.

ఇప్పుడే ఏమయింది? ప్రారంభదశేగా అంటుంది అమ్మ. బాధలే ఆధ్యాత్మిక సాధనగా చూపిస్తున్నావా అమ్మా బాధలు, సాధన, అమ్మదేవుడేనా, అమ్మా ఇప్పుడు నీవు పడుతున్న బాధలు అందరూ పడవలసిందేనా? అమ్మ యొక్క ఆధ్యాత్మిక శక్తి ఎవరికీ వద్దని అంటారు. అమ్మకు బాధలు లేకపోవచ్చు అమ్మే బాధకావచ్చు. అందరికీ నేర్పటం కొరకయినా అమ్మ బాధలు మన కంటపడుతున్నాయి కదా! అమ్మ భగవంతుడో, అవతారమో ఆయనకు అనవసరం, అమ్మ బాధల్లోని ఆనందాన్ని చూచి ఆనందపడే స్థితి తనకొద్దు అని అమ్మను చూచి ఆనందపడేస్థితి కావాలని అమ్మను మనవరాలిగానే చూచుకోవాలని, అమ్మ సుఖమే కావాలని, అమ్మ కాఫీ ఆలస్యంగా తాగినా భరించలేనని చిదంబరరావుగారు అనుకుంటారు.

సీతాపతిగారికి అమ్మ మీద చాలా కోపం వచ్చిందని, తెనాలిలో దింపుతానంటున్నారని, కొడతాడేమో వస్తేపిచ్చి కోపం చచ్చేది బ్రతికేది తెలియదని అన్నపూర్ణమ్మగారు బాధపడ్తుంది. అమ్మను భారతి పురుడు అయ్యేవరకూ వుంచమని సీతాపతిగారిని అడగమంటుంది. చిదంబరరరావుగారు తాను అడగనని అంటారు. నాగేశ్వరరావు ఎందుకు వాడిని వెళ్ళమని చెప్పు వాడి పక్కనే కూర్చుందని సీతాపతికి కోపం వచ్చి వుంటుందని అంటారు. అదేమయినా కావాలని కూర్చుందా. నోట్లో నాలుక లేనిది. తల్లి లేనట్లుగానే ఒక దానమ్మట ఒకటి వచ్చిపడుతున్నాయి అని అన్నపూర్ణమ్మగారు అంటుంది.

ఇంతలో సీతాపతిగారు వచ్చి తనకు ఇష్టంలేని వాడి పక్కన ఎందుకు కూర్చోవాలని అంటారు. వరసలో కూర్చున్నారు. అమ్మాయి వచ్చి కూర్చున్న తరువాత కదా వాడు వచ్చి కూర్చుంది. దానిలో దాని తప్పేమున్నదని చిదంబరరావుగారు జాలిగా అమ్మ వంక చూస్తారు. అమ్మ తాతగారి వంక చూస్తుంది. అమ్మ చూపు సరాసరి తాతగారి హృదయంలో గుచ్చుకుపోయినట్లుగా వుంటుంది. తాతగారు అలానే నుంచుంటారు.

చూడరా సీతాపతి ఆ లేతకళ్ళల్లో నీళ్ళు తిరుగుతుంటే ప్రపంచమంతా తిరుగుతున్నట్లుంది. ఆ లేత బుగ్గలు వణుకుతుంటే చందమామ వణకుతున్నట్లున్నదని అంటారు కళ్ళు మూస్తే దేవాలయం తలుపులు మూతపడినట్లు కనిపిస్తోందంటారు.

అమ్మ కళ్ళలో నుండీ ఒక్క చుక్కనీరు బుగ్గ మీదరాలుతుంది. అది చూచి

చిదంబరరావుగారి శరీరమంతా గడగడా వణుకుతుంది. ఆ నీటిబొట్టులో ప్రపంచమంగా గిరగిరా తిరిగి పోతున్నట్లు కనపడుతుంది. ఒక రెక్కభూమి, ఒక రెక్క ఆకాశంలా మధ్యలో ప్రపంచం అమ్మ గుమ్మంలోకి వచ్చి రెండు రెక్కల్నీ రెండు చేతలతో పట్టుకొని తాను లోపలికి వెళ్ళి తలుపు మూసినట్లుగా కనబడుతుంది. వెంటనే తాతగారు ఎన్ని దివ్య దర్శనాలు తల్లీ అని గుండెలమీద చేయి పెట్టుకుని పడిపోతారు. ఆ ధ్వనికి పక్కగదిలో ఉన్న నాన్నగారు, భారతి, బయటకు వస్తారు. వీధిలోంచి మౌలాలీ కూడా పరిగెత్తుకు వస్తాడు. నాన్నగారు డాక్టరు కోసం పరిగెత్తబోతారు.

ఎందుకులే అయ్యా! కాసిని నీళ్ళు చల్లండని మౌలాలీ చెప్పాడు. పో అవతలికి అని నాన్నగారు డాక్టరు దగ్గరకు వెళ్తారు. తాతగారు కళ్ళు తెరిచి అమ్మ వంక చూస్తారు. అంతులేని వరిపిళ్ళు తెచ్చి పెట్టుకుని, అంతర్ధానమవుతావా? ఈ దృశ్యం భయమేస్తున్నది అని కళ్ళవెంట నీళ్ళు కారుస్తూ పెద్ద పెద్ద కేకలు పెడ్తారు. అమ్మ అవతలకు వెళ్ళిపోతుంది.

ఆరోజంతా అన్నపూర్ణమ్మగారు భారతీదేవి అమ్మ గురించి తాతగారి గురించే ఎక్కువగా చెప్పుకుంటారు. అమ్మ వుంది కదా అని వంట మనిషిని, పనిమనిషిని తీసేస్తారు. పదిరోజుల్లో పని వొత్తిడి వల్ల బడలిక చెంది అమ్మ పంపుకింద బిందెపెట్టి గోడమీద తలపెట్టినిద్రపోతుంది. అది చూచి మౌలాలీ బాధతో తాను నీళ్ళు తెచ్చి పెడ్తానంటాడు వద్దు నాయనా వాళ్ళు తెమ్మనలేదు నేనే వూరికే వుంటే తోచక వచ్చానని చెప్తుంది.

నాన్నగారు, భారతీదేవి అమ్మను పిలుస్తారు. బావను చేసుకుంటానన్నావు గదూ! అని గదిమినట్లుగా అడుగుతారు. అలా ఒక గంటసేపు అడిగినా అమ్మ జవాబు చెప్పదు. దానితో నాన్నగారికి అనసూయ తన్ని చేసుకుంటానన్నదని భారతీదేవి వాళ్ళే కల్పించారనుకుంటారు. భారతీని అవతలకు వెళ్ళమని తానే అడిగి తేల్చుకుందామని అనుకుంటారు. “నన్ను చేసుకుంటానని సుందరీ వాళ్ళతో అన్నావా?” అంటారు. అనలేదంటుంది అమ్మ. పేరు పేరునా అడుగుతారు వాళ్ళతో అన్నావా అని దానికి అమ్మ తానెవరితోనూ అనలేదంటుంది.

అసలు పెళ్ళి చేసుకునే ఉద్దేశం వుందా? అంటారు నాన్నగారు. ఇంతకుముందు

తనకు ఆ ఆలోచన లేదని, ముహూర్తాలు పెట్టి శుభలేఖలు వేయించిన తరువాత పెళ్ళి అయిపోయిందని పించిందని అని అంటుంది. తాను అమ్మను చేసుకో కుండా ఇంకో అమ్మాయిన చేసుకుంటేనో అని నాన్నగారు అడిగారు. తనకు మానసికంగా వివాహం అయి పోయిందంటుంది అమ్మ, తాను ఇంకెవరినైనా చేసుకుంటే వివాహం చేసుకోవా అని అడుగుతారు.

మానసికంగా తాను ఎవరినైతేచేసుకుందో? ఆ శక్తే తనకు శక్తి ఇవ్వాలంటుంది అమ్మ. ఆ మాట అర్ధం చేసుకోక ఇంతుకుముందే ఎవరినైనా చేసుకున్నావా అని అమ్మను అడిగారు. శుభలేఖలో వున్ననామాన్ని చేసుకున్నాని ఆ నామం చేస్తే ఆ రూపం దగ్గరకు చేరుతానని అమ్మ అంటుంది. అమ్మకు మనస్పూర్తిగా ఇష్టం వుంటే ఒక పూట మంగళగిరి వెళ్ళి పెళ్ళి చేసుకువాద్దామని ఆ తరువాత ఎవరేమి చేస్తారు? అని అంటారు నాన్నగారు ఆవిధంగా తాను రానని, ఎప్పటికైనా సీతాపతిగారే ఇష్టపడి చేయాలని, చేస్తారని అది తన విశ్వాసం అని చెప్తుంది.

తన చేతిలో డబ్బు లేదని వాడుకోవటానికి నగ ఏదైనా ఇమ్మని అమ్మని అడుగుతారు. అమ్మ వెంటనే తలలోని నాగరం తీసి ఇస్తుంది. తనకు ఏమీ లేదని, ఆస్దిలేదు, అమ్మను సుఖపెట్టలేనని ఇష్టమేనా అని అమ్మను అడుగుతారు.

తాను చేసుకునేది ఆస్తిని కాదని మనస్సుని అంటూ తనకు శరీరంతో కూడా సంబంధం లేదంటూ అమ్మ వచ్చేస్తుంది.

భారతీదేవికి నొప్పులు వస్తుంటే ఆసుపత్రికి తీసుకువెళ్తారు. ఎంతసేపటికీ బాధ నివారణ కాలేదు. ఆ తరువాత అమ్మ కాఫీ తీసుకువెళ్తుంది. ఆ కాఫీ తాగిన వెంటనే పురుడు అవుతుంది. ఆడపిల్ల అక్కడ వున్న నర్సులందరూ ఆశ్చర్యపోతారు. ఈ అమ్మాయి రాగానే కాన్పు అయిందంటారు.

అమ్మ వెంటనే పసిబిడ్డను ఎత్తుకుంటుంది. కని పెంచిన వాళ్ళకుమల్లే ఎత్తుకుందే అనుకుంటారు నర్సులు అమ్మ తరవాత పిల్లలు లేరుగదా పిల్లలరంది ఎక్కువ అని అంటుంది. అన్నపూర్ణమ్మగారు.

అమ్మ వున్న పదిరోజుల్లో దాదాపు వందమంది ప్రసవించుతారు. అంతా కులాసాగా వుంటారు. పదకొండవ రోజున భారతిదేవికి పురిటి స్నానం అయిన

తరువాత అమ్మకు జ్వరం వస్తుంది. ఆస్పత్రిలో చేరుస్తారు. అమ్మకు అన్నం తెచ్చి పెట్టేవాళ్ళు ఎవరూ వుండరు. మౌలాలీ కనిపెట్టి వుంటాడు. నెలాపదిహేనురోజలున్నా భాద నివారణ కాదు బాపట్లనుంచీ తాతగారు వస్తారు. డాక్టర్ని కలుసుకొంటే మానసికవ్యాధిగా వుంది హీస్టీరియా రావచ్చు అంటారు.

ఒక బ్రహ్మణస్త్రీ మతం పుచ్చుకుని, అక్కడ బోధకురాలుగా ఉంటుంది. అమె ఎక్కువగా అమ్మ గదికి వస్తుండేది. అమ్మ దగ్గర ఎప్పుడూ ఎవరూ వుండేవారు కాదు. ఏమ్మా "నీకు బంధువులు ఎవరూ లేరా? నీ జబ్బేంటమ్మ?" అని అడుగుతుంది. అమ్మ సమాధానం ఇవ్వదు. పక్కమంచం మీద వున్నామె అమ్మాయి ఎప్పుడూ పరధ్యానంగానే వుంటుంది. మతిస్తిమితం లేనట్లుంది అన్నది. ఆహారం ఏమి తీసుకుంటుంది? అని అడిగింది బోధకురాలు. ఈ గదిలో మంచినీళ్ళుకూడా తాగినట్టు చూడలేదంటుంది పక్కమంచంమీద ఆమె.

వీళ్ళు బ్రహ్మలా, కోమట్లా అని బోధకురాలు అడుగుతుంది. తెల్లగా వుంటే మార్వాడీ పిల్లయేమో, ఆ సొమ్ములూ అవీ అలాగే వున్నాయి అని పక్కవాళ్లు చెప్తారు.

ఆ అమ్మాయిని చూస్తే కడుపు తరుక్కుపోతుంది. ఆ చూపుల్లో ఎంతో ప్రశాంతతవుంది. ఎవరు గదుల్లో మూలుగుతున్నా వచ్చి చిన్న చిన్న చేతులతో మెత్తగా పిసుకుతుంది. మొన్న నర్సుకూడా పోట్లాడింది. ఎప్పుడూ ఆ అమ్మాయినే చూడాలనిపిస్తుంది. చూద్దామంటే మంచం మీద వుండదు. ఎటో అటు వెడుతుంది.

తాతగారు వచ్చి ఇంటికి వెళ్దామంటూ ఎక్కడున్నా సుఖపడేది ఏమున్నది అనుకుంటారు. పడేదంతా సుఖమే తాతగారు అంటుంది. అమ్మ బాధలను సుఖాలుగా అనుభవించగలదని తాతగారు అంటారు. సుఖంగా బాధనుభవిస్తే బాధ బాధ కాదుగా అంటుంది. బాధ అని ఎవరన్నారమ్మ గాధ అనే అనుకుంటున్నా, అగాధమైన గాధల్లో ఆయన నిలువలేనని తన్ని అమ్మ హృదయంలోకి తీసుకోమని కోరుకుంటారు.

ఇంటికొచ్చినా అందరిచేతో మెట్టికాయలు తింటామేగా! అని అమ్మను అక్కడే వుంచి, పాలవాడికి, రొట్టెలవాడికి డబ్బులు ఇచ్చి షష్ఠు తారీఖుదాకా ఇవ్వండని చెప్పి భారతీదేవిని తీసుకువెళ్ళి పోతారు.

అమ్మ ఆసుపత్రిలోనే రెండు నెలలు వుంటుంది. అన్నమ్మ బ్రాహ్మలు, బాల్యంలో

భర్తపోతాడు. ఇంటర్ పాస్ అవుతుంది. ఆమె కన్యాకుమారి భక్తురాలు బీదవాళ్ళవటం చేత డాక్టర్ చదవాలన్నా తన కోరికకు తిలోదకాలు ఇచ్చి పూజలు చేసుకుంటూ కాలం గడుపుతోంది. ఆమెకు నలుగురుఅన్నదమ్ములు తల్లి చిన్నప్పుడే చనిపోయింది. తండ్రిపోయిన తరువాత వుండటానికి తావులేక స్వతంత్రించి మద్రాసు వస్తుంది. అక్కడ ఏరైలు ఎక్కాలో తెలియక బజార్లవెంట తిరుగుతుంటే పది సంవత్సరాలపిల్ల యాభైరూపాయలు చేతిలో పెట్టి గుంటూరు కుగ్లరు ఆసుపత్రికి వెళ్ళమని చెప్తుంది. నాకెందుకమ్మ డబ్బు అని చెయ్యి పట్టుకుని చెతిలో పెట్టబోతుండగా అదృశ్యమైపోతుంది. తను కొలిచే కన్యాకుమారే ఇట్లా వచ్చిందని పూర్తిగా కనబడకూడదా అని రోడ్డుమీద పడి దొర్లుతూఏడుస్తుండగా తన వీపు తట్టిలే ఎందుకేడుస్తున్నావు బయలుదేరు అని వినపడుతుంది. వెంటనే లేచి కాళ్ళు చేతులు కడుక్కొని రైలు స్టేషన్‌కు వెళుతుంది.

ఎన్నడూ వీధిలోకి వెళ్ళిన పిల్ల కాకపోయినా ఎవరో కూడా వుండి తీసుకువెళ్తున్నాట్లుగా సరాసరి కుగ్లర్ ఆస్పత్రికి వచ్చి తన సంగతి స్వయంగా చెప్పుకుని ఆస్పత్రిలో చేరుతుంది. చదువుకున్న పిల్లకావటంతో చురుకుగా నేర్చుకొని అన్నమ్మ నర్సుగా చేరుతుంది. అమ్మను చూడగానే మద్రాసులో తనకు కనబడ్డ అమ్మాయిలా కనబడుతుంది.

బోధకురాలు అమ్మను చర్చికి రమ్మని అడుగుతుంది. ఆరోజు ఆదివారం అవటంతో అన్నమ్మ, అమ్మ చర్చికి వెళతారు. వచ్చేటప్పుడు బోధకురాలు కలుస్తుంది. అమ్మ ఆమెను ఏఊరు అని అడుగుతుంది. అమ్మను చూచినప్పటినుంచీ తన గురించి చెప్పుకోవాలనిపించిందనంటుంది అమ్మను చూస్తుంటే వాళ్ళ ఇలవేల్పు కన్యాకుమారిగా అనిపించిందని, వాళ్ళు ఆంధ్రులేఅని, ఇంటిపేరు మల్లాదివారని తనకు నలుగురు మొగపిల్లలు, ఒక ఆడపిల్ల, ఆ పిల్లకు చిన్నప్పుడే భర్త చనిపోతాడు. ఇంతమంది పిల్లల తల్లి అని కూడా ఆలోచించకుండా, ఆమె మీద అనుమానంతో రోజు కొట్టి చంపుతాడు భర్త విసుగుపుట్టి రైలు కింద తలపెట్టి చచ్చిపోవాలని ప్రాణ మొప్పక రైలు ఎక్కి అక్కడాక్కడా తిరుగుతూ నాలుగు సంవత్సరాలు నాడు ఆ వూరు చేరింది. తాను ఇల్లు వదిలి పెట్టి వచ్చేనాటికి ఆ అమ్మాయికి పదకొండు సంవత్సరాలు అని చెప్తుంది.

"భర్త బతికి వుండగానే వచ్చారు కదా వైధవ్యవేషం ఎందుకు వేసుకున్నారని" అమ్మ అడుగుతుంది. ఇల్లు వదిలిన నాటినుంచీ అలాగే వుండాలనిపించింది అంటుంది ఆమె. వాళ్ళ అమ్మాయిని ఏవూరు ఇచ్చారంటుంది అమ్మ వూళ్ళోనే ఇచ్చామని పెళ్లి అయిన ఆరునెలలకే కూతురు భర్త చనిపోయాడని చెప్తుంది. మీ అమ్మాయి పేరేమిటని అమ్మ అడుగుతుంది. లక్ష్మీజ్ఞాన ప్రసూనాంబ అని చెప్తుంది బోధకురాలు ఆ పేరు వినగానే అన్నమ్మ అమ్మా అంటూ కౌగిలించుకొని ఏడుస్తుంది. అట్లా గంటసేపు వుండిపోతారు. అక్కడ శిలారూపంలో ఉన్న కన్యాకుమారిని కొలుస్తే ఇక్కడ చైతన్యంతో రక్షణ ఇచ్చిందని పరిపరివిధాల అమ్మను స్తోత్రం చేస్తారు. అమ్మా మా తల్లి బిడ్డలను కలిపి మహోపకారం చేసావమ్మా భరతమాతవమ్మా అని బోధకురాలు అంటుంది.

కలియుగమాత, అమృత మూర్తి జగదేకమాత ప్రేమవాహిని అంటూ తనకు వర్ణనకు నోరు తిరగటంలేదని, తనకు వ్యాసాలు, పాద్యాలు రాయటం వచ్చని, ఇంట్లో గొడవల వల్ల రెండు సంవత్సరాలనుంచీ రాయటం లేదని అన్నమ్మ చెప్తుంది. మౌలాలీని 'లాంకు' కు రమ్మని తాను వెళ్తుంది అమ్మ.

మౌలాలీకి జరిగిన విషయమంతా చెప్తుంది. ఏదో కారణం లేకుండా అమ్మ వెళ్లదని తాను అనుకున్నానంటాడు. చాలా గొప్పపని చేశావమ్మా తల్లీపిల్లను కలిపి అంటాడు. అమ్మ వున్నన్నాళ్ళు వాళ్ళు వుండి అమ్మ బయలు దేరగానే వారు పండరీపురం వెళతారు. చిదంబరరావు తాతగారు వచ్చి అమ్మను తెనాలి తీసుకువెళ్తారు.

సుబ్బయ్య తాతగారికి కాలికి కురుపులేస్తుంది. డాక్టరు చంద్రమౌళి సత్యనారాయణ గారి దగ్గర అమ్మ మందు తెస్తూండేది. ఒక రోజు ఆస్పత్రిలో నాన్నగారు కలుస్తారు. అమ్మ కళ్ళతో నమస్కారం చేస్తుంది. అమ్మ నాన్నగారు కలిసి ఇంటికి వస్తారు. దారిలో నాన్నగారు "మీ నాన్న నిన్ను నా కిచ్చి పెళ్ళి చేస్తానంటున్నాడా?" అని అమ్మను అడుగుతారు. తనతో ఏమీ అనటం లేదంటుంది అమ్మ.

తనకు మంచి సంబంధం వచ్చిందని చేసుకోమంటావా అని అడుగుతారు. చేసుకోమంటుంది. నీవు ఇంకోకరిని చేసుకుంటావా అని అమ్మను అడుగుతారు. శుభలేఖలు కొట్టించిన నాడే తన పెళ్ళి అయిందంటుంది అమ్మ. తనకు పెళ్ళి కాలేదని నాన్నగారు అంటారు. నాన్నగారికి పెళ్ళి కాలేదు కాబట్టి ఆదుర్దాపడుతున్నారని, తన పెళ్ళి అయింది కనుక తాను ప్రశాంతంగా వున్నానని అమ్మ అంటుంది.

సీతాపతిగారు తన ఇష్టప్రకారమే శుభలేఖలు కొట్టించారు. అందులో ఫలానా ఆయన కొడుకుని ఫలానా ఆయన కూతురికి ఇస్తున్నామని అచ్చు వేయించారంటే ఆనాడే అయిందనుకున్నాని తన నిశ్చయాన్ని తెలియచేసింది.

అమ్మను తనకు నమస్కారం ఎందుకు చేశావని అడుగుతారు నాన్నగారు. మా నాన్నగారు దయ తలచి మీ పాదాలమీదనే పడవేస్తే తన జీవితం ఆనందంగానే గడిచిపోతుందని, మనోవాక్కాయ కర్మల అంటున్నమాట 'మీ పాదసేవ' అని కాసేపు ఆపి రెండు పాదాలు పట్టుకొని 'సర్వార్ధసాధకం' అంటుంది. రెండు కన్నీటి చుక్కలు నాన్నగారి పాదాలమీద పడతాయి. నాన్నగారు వులిక్కిపడి తలవంచి పాదాలవంక చూచుకుంటారు. ఆ రెండునీటి బొట్టులు క్రిందకు జారకుండా ఇంకి పోకుండా నిల్చి వుంటాయి.

అమ్మ తలవంచగానే నాన్నగారి ముఖం ఆ బిందువుల్లో కనిపిస్తుంది ఇట్లా ప్రతి పదార్థంలో ప్రతి ఫలించాలి అనుకుంటుంది. అంతకు ముందు పాదాలు తప్ప ముఖం ఎప్పుడూ చూడలేదు. నీటి బిందువులోనే ప్రథమంగా నాన్నగారి ముఖాన్ని చూస్తుంది. పంచభూతాల్లో అన్నింటివలె జలం ప్రధానం. క్షాళనం చేస్తుందని అమ్మ అనుకుంటుంది. కన్నీటిబొట్టులో కన్నమూర్తిని సర్వత్రాచూడాలి అని అనుకుంటుంది.

దోవలో సీతారామయ్య మామయ్యగారు కలుస్తారు. ఆ పిల్లి కళ్ళవాడిని చేసుకో, బాగానే వున్నాడంటారు. ఆయనకు కనబడినట్లు తనకు కనబడాలని అయినా చక్కదనమెందుకు, చల్లని తనముంటే చాలదూ అంటుంది. వాడికి జీవకళతక్కువ అంటారు. చక్కని వాడని, బాగ్యవంతుడని జీవకళ వుందని ఇస్తే అత్తయ్యను ఏం సుఖపెడ్తున్నావు అని, తన మనస్సుపెట్టుకుచూడమంటుంది.

ఆయన మాదిరి జీవకళతనకక్కరలేదని, జీవంలేని శిలలకు జీవం కలవారందరుపోయి మొక్కుతారు. ఈ జీవం కలవారందరినీ ఆ చైతన్యంలేని శిలా రూపం రక్షిస్తున్నది. అలాగే వారుకూడా అందర్ని రక్షిస్తారని, ఒకనాటికి అందరూ ఆయనకు మొక్కేరోజు వస్తుందని ఘంటాపథంగా చెప్తుంది.

ఇంకా నయం వాడినే అన్నావు, నీకే మొక్కుతారనలా బ్రతికించావు అన్నారు. ఎప్పుడు ఏం జరుగుతుందో ఎవరు ఎవరికి మ్రొక్కవలసివస్తుందో అన్నది అమ్మ.

ఆయన అమ్మ మనస్సు మార్చాలని పరిపరివిదాల ప్రయత్నించారు. కుంకుడు కాయలో నురుగు ఇమిడి వున్నదనుకోండి. నీళ్ళు పోస్తేకాని బయటకు రాదు. ఇట్లా ప్రతి వస్తువులో గుణభేదం వుంటుంది. ఆ గుణ భేదమే మంచి చెడ్డలు అని తెలియపరుస్తుంది.

మౌలాలీకి అన్నం పెడ్తుంది. అమ్మా! నీకు పెళ్ళి కాకపోతే ఏం? ఇన్ని గోలలెందుకు మనం ఏ అడవుల్లోనో వుందామా అని అడుగుతాడు. ఇప్పుడు ఉన్నది అడవి కాకపోతేగదా! అంటుంది అమ్మ. ఈ జనం ఈ బాధలు వుండవుగా అంటాడు. అక్కడ ఇంకోరకమైన బాధవుంటుంది. ఎక్కడకు పోయినా తప్పదు. అక్కడ చెట్లు, పక్షులు, పాములు, తేళ్ళు, మృగాలు ఉంటాయి అన్నింటికి మనసు వుంది ఒకళ్ళనొకళ్ళు స్వజాతి కూడా అర్థం చేసుకోలేనప్పుడు ఎంతదూరం పోయినా బాధ తప్పదంది అమ్మ.

పరమాన్నం గిన్నెలోని తెడ్డుకుపరమాన్నంరుచి ఎలా తెలియదో, అర్థం చేసుకోలేకపోవటంతో ప్రపంచమంత ఇట్లాగే నడుస్తుంది. అది సృష్టి నైజం అని తెలియచేస్తుంది. మౌలాలీ అన్నం తినకుండానే విస్తరి మడిచేస్తాడు. "ఏమిటోనమ్మా! నా స్వల్పబుద్ధికి నీదంతా అగాధంగా వుంది ముందు నుయ్యి వెనక గొయ్యి మధ్యలో నీవు, ఒకపక్క అగ్నిగుండం చుట్టూ సుడిగాలి, పాదాల క్రింద సముద్రం, నెత్తిన హిమాలయాపర్వతాలు గుండెల్లో శులాలు ఇటువంటి వాటితో దర్శన మిస్తున్నావు నీ స్థితిని అర్థం చేసుకోలేని నా స్థితికి భయమేస్తోంది. నీవు రాకపోతే నేనైనా వెళ్ళిపోతా ఏ అడివికైనా" అంటాడు.

కంటికి కనబడితేనే భయపడితే ఎట్లా నాయనా? నిజంగా జరిగితే ఎట్లా వుంటుందని అమ్మ అన్నది. తనకు అవి అన్నీ నిజంగా జరుగున్నట్లే వున్నది ప్రత్యక్షంగా కనబడుతుంటే కాదని ఎట్లా అనుకునేది. అన్నీ నేనేనని ఏదోచ్చినాఓర్చుకోవాలని చూపిస్తున్నావో, ఆ వోర్పే ఆధ్యాత్మిక సాధన అని చూపిస్తున్నావో, ఇదే ఆధ్యాత్మిక సాధన అయితే ఎవరికీ ఇటువంటి ఆధ్యాత్మిక సాధన వద్దని వేడుకుంటానన్నాడు మౌలాలి.

"నల్లని నాగేంద్రుడు మూడుచుట్లు, వేసుకుని కంఠానికి ఒక మూరెడు పొడుగున ఇవతలకు వచ్చి నీ ముఖం వైపుకు పడగతిప్పి నీ భృకుటివైపు చూస్తున్నట్లు, మధ్య

మధ్య కాటువేస్తున్నట్లు, కాటువేసినప్పుడల్లా ఆ విషాన్ని అమృతంగా నీవు స్వీకరిస్తున్నట్లు కనిపించిందని" చెప్పాడు.

నాగేంద్రుడిలోని విషతత్వం పోయి అమృతతత్వం కలిగినట్లు కనపడలేదా నాయనా అని అడుగుతుంది. ఆ దివ్య దర్శనభాగ్యం కలుగలేదమ్మా అన్నాడు. కాటువేసినప్పుడల్లా అమృతమే కక్కుతుంది అన్నది అమ్మ జరగబోయే కాలం చాలా భయంకరంగా కనపడుతుందమ్మ అంటే "నీకు అభయమే జరుగుతుంది" అని చెప్పింది.

ఏది ఏలా వున్నా ఎక్కడున్నా నీ మూర్తి కనబడేటట్లు చెయ్యి వెళ్ళిపోతానంటాడు మౌలాలీ. మెడలో దారం అనే ఆధారం పడేదాకా వుండు అంటుంది అమ్మ.

★ ★ ★

# 38. శ్యామల

అమ్మ, పూలు ఆకులు తెచ్చి పార్కులో వున్న నాన్నగారి పాదాలమీద వుంచి నమస్కారం చేస్తుంది. శ్యామల ఆశ్చర్యంతో పెళ్ళికాని పిల్లఏమిటి ఇలా చేస్తోందనుకుంటుంది. ఏదైనా లోపముంటే నమస్కారం ఎందుకు చేస్తుంది. అ నమస్కారం కూడా మామూలు నమస్కారంలా లేదు. జగమంతా వచ్చి పాదాల మీద పడ్డట్టుగా, రెండు చేతులు రెండు పాదాల మీద సూర్యచంద్రులు ఉన్నట్లుగా వుంటుంది. ఉభయుల మధ్య ఉన్న కాంతి మెరిసి పోతూ వుంటుంది. ఈ దృశ్యం శ్యామల చూచి ఎట్లా అర్థం చేసుకోవాలో తెలియక నిశ్చేష్టురాలౌతుంది.

నాన్నగారు మొగవారు కూర్చునవైపుకు వెళ్తారు. అమ్మ, శ్యామల పార్కులోనే ఒక చెట్టుకింద కూర్చుని మాట్లాడుకుంటుంటారు. నాన్నగారు అమ్మనే చూస్తూ కూర్చుంటారు. శ్యామల "ఆయన ఎవరమ్మా?" అని అడుగుతుంది. "నన్ను అమ్మా అని పిలుస్తున్నావు కాబట్టి ఆయన నాన్నగారు" అంటుంది. "నీకు పెండ్లి కాలేదుగా" అంటుంది. తనకు పెళ్ళి అయిందని తన సూత్రం అందరికీ కనపడేది కాదని, తన సూత్రం అన్ని సూత్రాలను తెలియపరచేసూత్రం అని చెప్తుంది. అన్ని సూత్రాలు తెలుసుకున్న తరువాత మంగళసూత్రం అవుతుంది. తెలుసుకుండేది నేనే. సూత్రం తెలియపరచేది కనుక సూత్రంతో సూత్రాన్ని సూత్రం గుర్తిస్తుంది. అది అందరికీ అర్థమయ్యే సూత్రంకాదు. అదే మహాసూత్రం అని అమ్మ వివరిస్తుంది.

సూత్రం అంటే ఇముడ్చుకునేది. దారం బంగారంతో చేసిన తాళిబొట్టుతో యిమిడి వుంటుంది. దారంతో తాళిబొట్లు ఇమిడి వుంటాయి. ఇముడ్చుకునే శక్తి రెంటికీ వున్నది. అదే అర్ధనారీశ్వరి. అర్ధనారీశ్వరుడు అంటే ఒక దానిలో ఒకటి ఇమడటమే. అట్లా ఇమిడిన శక్తిని ఆరాధించాలంటే ప్రత్యక్షంగా మెడలో కట్టిన సూత్రాన్నే ఆరాధించాలి.

దారము బొట్లు కలిస్తేనే సూత్రం. దారం లేకపోయినా సూత్రం కాదు. బొట్లు లేకపోయినా సూత్రం కాదు. ఆ రెండు బొట్లు భర్త పాదాలు. ఆ పాదాలను ప్రేమ అనే పాశంతో మూడు ముళ్లు వేసుకుని వుంటుంది. ఆమూడు ముళ్ళే త్రిపుటి. ప్రేమ అంటే భక్తి. భర్తమీద ప్రేమ భక్తి, బిడ్డలమీద ప్రేమ వాత్సల్యం, ప్రేమ ఒకటేగాని

స్థానాలను బట్టి పేర్లు మారుతూ ఉంటాయి. ఆరెండు పాదాలే శరణ్యం ఇహానికి, పరానికి ఆచరణాలే అచరణీయం. త్రిపుటి అంటే సృష్టి. సృష్టి అంతా త్రిపుటిమీదే ఆధారపడి వుంటుంది.

శ్యామలకు చిన్నతనంలోనే భర్త పోతే చేసుకున్నది గుర్తుంది కదా. ఆ గుర్తునే ఆరాధించమంటుంది అమ్మ. "ధ్యాసే ధ్యానం" అంటే సర్వకాల సర్వావస్థలందూ గుర్తుంచుకోవటం.

మర్నాడు అమ్మ నాన్నగారు పార్కులో కలుసుకుంటారు. తాను చాలా పేదవాడినని, పేదరికాన్ని అనుభవిస్తావా అడుగుతారు. పెనిమిటి దగ్గర ధనం ఉన్నా ధనాన్ని అనుభవించదుగా. పెనిమిటి అయినంతమాత్రన పేదరికం, భాగ్యం లేదంటావా ఏమిటి? అంటారు నాన్నగారు. "పెనిమిటే పెన్నిది" అంటుంది అమ్మ శ్యామల వచ్చి ఆమె పిన్నికి చాలా జబ్బుగా వుందని, కులాసాగా వుంటే రేపు వస్తానని కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ వెళ్ళిపోతుంది.

ఆ అమ్మాయి ఎందుకు ఏడుస్తోందని అడిగారు నాన్నగారు. వాళ్ల పిన్నికి బాగాలేదని అంటుంది. పిన్నికి బాగుండకపోతే ఈ అమ్మాయి ఏడవటం ఎందుకు అంటారు నాన్నగారు. "అవతల బాధ్యత వుంది కదా! బాధలేని బాధ్యతలు అందరికీ లభ్యపడవు" అంటుంది. "దానికీ, దీనికి, తేడా ఏమిటని అడుగుతారు" నాన్నగారు, "నేను చేస్తున్నాను, నాది, నాకు అనేదే బాధ్యత. అంతకంటే రెట్టింపు చేసినా నేను చేస్తున్నాననేది లేకుండా మనం నిమిత్తమాత్రులం అనుకునేది బాధలేని బాధ్యత" అని వివరించింది. మన వివాహ విషయం తొందరగా తేల్చమంటారు నాన్నగారు. కాలం వస్తే నాన్న అడ్డుపడతాడా? లగ్నం పెట్టుకుని, కాలం కలసిరానిది కళ్యాణమేమిచేయగలిగాడు. శుభలేఖలు వేయించకపోతే ఆ ఉద్దేశం వుండేదా అని అంటారు నాన్నగారు. విధి మహా బలీయమైనది, విధి అంటే నాన్నగారేనని చెపుతుంది. అమ్మ.

శుభలేఖలు వేయించి సంవత్సరం అయిందని అప్పటి నుంచీ భర్తమాట వినాలని అనుకుంటున్నాని తనకు పదమూడు సంవత్సరాలు నిండి పద్నాలుగు ఏళ్ళు వస్తాయని చెప్తుంది. తనకు ఇవ్వకుండా వేరెవరికి చేసినా ఇట్లాగే అనుకండే

దానివా అంటారు. వీరు, వారనే విచక్షణ ఏముంది భర్త అనే గాని, భర్త అంటే కర్త, కర్మ క్రియలు రెండూ కర్తమీదే ఆధారపడి వున్నాయి.

ఇందాక తనతో అమ్మ అన్నది ఏమిటంటారు నాన్నగారు నా ఇష్టానికీ నా అయిష్టానికి కర్తగా అంటుంది. నీ యిష్టం అంటే ఏమిటి? అయిష్టమంటే ఏమిటి? అని అడుగుతారు అయిష్టం అంటే కష్టం. ఇష్టమంటే సుఖం. కష్టసుఖాలు రెండూ మీమీదే ఆధారపడి వున్నాయి. ఆ ద్వంద్వమే ప్రకృతిని జయించటానికి మీరే ధ్యేయమూర్తులు. ఆ ద్వంద్వాన్ని జయించాలి అని చెప్పింది. ఎంత వరకూ అడిగితే అంత వరకే సమాధానం చెప్పు. ఎక్కువ మాట్లాడవద్దంటారు. 1936 ఫిబ్రవరి 5 నుండి 1947 సెప్టెంబరు 17 వరకూ ఏది అడిగినా ఊ, సరే అనటం తప్ప అమ్మ ఎక్కువగా మాట్లాడేది కాదు.

అమ్మ పెద్ద తల్లి అన్నమ్మగారు భాగవతం చదువుతుంది. అది పూర్తి అయిన తరువాత కొబ్బరికాయ తీసుకురా కొడదాం అంటుంది. అమ్మ కొబ్బరికాయ కర్పూరం తెచ్చి ఇస్తుంది. అన్నమ్మ గారు అమ్మను వెలిగించుకోమంటుంది. అమ్మ కర్పూరాన్ని వెలిగించి తన చుట్టూ తాను తిప్పుకుంటుంది. అయ్యో! అయ్యో! ఏమిటి నీవు చేస్తున్నది అంటూ అమ్మ నెత్తిన ఒక్కటేసి నీచుట్టూ నువ్వు తిప్పుకోవటమేమిటి ఆ పుస్తకానికి హారతి ఇమ్మంటుంది.

పుస్తకాన్ని రాసింది మానవులేగా, మానవత్వాన్ని గుర్తిస్తే మాధవుడే. అటువంటి మానవుడి చరిత్ర ఎన్నిసార్లు చదివావని అమ్మ అడుగుతుంది. ఇప్పటికి ఏ ముప్పయిసార్లో చదివుంటానంది అమె. ఒక్కసారి అయినా కనిపించాడా అమ్మ అడుగుతుంది. అన్నమ్మగారు అమ్మ ముఖం వంక చూచేటప్పటికి అ ముఖంలో ఏదో మార్పు కనపడి ఎనిమిది సం॥ల పిల్లవాడిలాగా పకపకా నవ్వుతూ కృష్ణపరమాత్మను చూద్దురుగాని రండని పెద్దగా కేకపెట్టి నమస్కారం చేస్తుంది. అమ్మ సామాన్యమైన పిల్లకాదని అందరూ అనుకుంటారు.

విన్న కోట వెంకటరత్నశర్మ గారు భగవద్గీత చెప్తున్నారు వెళ్దాం అంటుంది అమ్మ పెద్దతల్లి అన్నమ్మగారు మౌలాలీ ని కూడా రమ్మంటుంది. రమ్మంటే వస్తాఏముంటుంది గుళ్ళో రాళ్ళేగా అంటాడు. రాళ్ళు అంటే మనస్సు సిమెంట్ అంటే భక్తి ఈ భక్తి చేత భగవంతుణ్ని గుర్తిస్తామని తెలియచేస్తుంది.

8గం।నుంచి 10.30గం। వరకూ గీతోపన్యాసం జరుగుతూంటుంది శర్మగారు ఆ గుడికి సంభంధించిన సత్రంలోనే ఉంటారు. ఆ సత్రాన్ని సుబ్బయ్య తాతగారి మామగారు కట్టించినదే ఉపన్యాసాలు కూడా సుబ్బయ్యతాతగారు చెప్పిస్తున్నారు.

అమ్మ ఎక్కువకాలం శర్మగారి దగ్గరే వుండేది. శర్మగారు స్నానం చేస్తుండగా అమ్మ బావి చుట్టూ వున్న చామాకు కోయటానికి వెళ్ళి బురదలో కాలు దిగబడుతుంది. స్నానం చేస్తున్న శర్మగారు అమ్మ పాదాల మీది బురదను చేత్తో కడిగి తన గుడ్డతో తుడుస్తారు. నీ బుజ్జి బుజ్జి చేతులతోకోస్తే చేతులు కందిపోతాయని అంటారు.

శర్మగారు అనుష్టానం చేసుకోవటానికి అమ్మ వాళ్ళువున్నగదిలోకి వస్తారు. అన్నమ్మగారు, అమ్మ సుబ్బయ్యగారి కుమార్తె మనుమరాలు అని తెలుసుకొని ఇంకా ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తుంటారు. అమ్మ జాతకం కావాలి అని అడుగుతారు. సుబ్బయ్య తాతగారు వచ్చాక అడిగి ఇస్తామంటారు అన్నమ్మగారు. భగవంతుడు మనతో పాటే తిరుగుతుంటాడు. మనుషుల్లో పసిబిడ్డల్లో పెద్దవారిలో అనేక రకాలుగా మూర్తీభవించి వుంటాడు. కృష్ణుడు అర్జునునికి చెప్పినట్లుగా అనుభవంతో విశ్వాసం కలుగుతుందా? లేక విశ్వాసంతో అనుభవం కలుగుతుందా? ఆ రోజు కృష్ణార్జునుల సంగతి ఎలా వున్నా అనుభవంతోనే విశ్వాసం కలుగుతుందని నిరూపణ అయిందని శర్మగారు తన ఉపన్యాసంలో చెప్తారు.

రాత్రి పదిగంటలప్పుడు అమ్మ సత్రం పక్కనున్న కాలవ దగ్గరికి వెళ్ళి పడవలు చూస్తుంటుంది. పెద్దగాలి దుమారం వస్తుంది. నీటిలో పడవలు వూగిపోతుంటాయి. ఎక్కడ చెట్లు అక్కడ వొరిగిపోతున్నాయి. అమ్మలేచి కాలువ వైపుకు వెళ్ళటం శర్మగారు చూచి అమ్మను పలకరిద్దామనుకున్నా దగ్గరకు రాలేక పోతారు. మొత్తం రెండున్నర అడుగులు లేదు ఈ బిడ్డ అంతచిన్నపిల్ల మహాగంభీరంగా వుంది అతి మృదుత్వం, అతిప్రేమ, అతి లావణ్యంగా వుంది. ఎన్ని ఉపన్యాసాలలో పొందని ఆనందం, ఎన్ని శాస్త్రాలు చదివినా రాని ఆనందం ఈ శాంత మూర్తితో పొందుతున్నామనుకుంటారు శర్మగారు.

ఆ గాలిదుమారంలో నాన్నగారు కాలవ దగ్గరకు వెళ్తారు. అమ్మ ఆ చీకట్లో వారికి కనబడదు. నాన్నగారు కేకలు వేస్తారు. అమ్మ వచ్చి నాన్నగారికి నమస్కరించగానే తలవంచి చూస్తారు.

కారు తీసుకువచ్చానని, భారతి, ప్రభాకరరావు, అమ్మ తనూ తిరుపతి వెళ్ళి పెళ్ళిచేసుకువద్దామంటారు. పెళ్ళి చేసుకున్నాక ఎవరూ ఏమీ చేయలేరంటారు. అమ్మ మీ ఇష్టం అంటుంది. ముగ్గురు కలసి సత్రంలోకి వెళ్తారు. శర్మగారు వారి గదిలో మెలుకువతోనే పడుకుంటారు.

అన్నమ్మగారు మెలుకువతోనే వుంటుంది. అమ్మ గుడ్డలు సవరించుకోవటం చూచి ఆమె రకరకాల అనుమానాలు పడుతుంది. ప్రభాకరరావుగారు మనము వచ్చిన వేళ బాగాలేదు. గాలి దుమారం, వర్షం మరొకసారి వచ్చి తీసుకు వెళ్దామని అంటారు. నాన్నగారు కారు దిగివచ్చి కారు బాడుగకు డబ్బు కావాలని అడుగుతారు. అమ్మ తన నాలుగు వేళ్ళ ఉంగరాలు తీసి ఇస్తుంది. అవి తీసుకుని ఈ మాటు తను వచ్చే సరికి సిద్ధంగా వుండమని వెళ్ళిపోతారు.

అన్నమ్మగారు అమ్మ లోపలికి రాగానే ఎవరితో నీవు మాట్లాడిందని అమ్మను కేకలేస్తుంది. శర్మగారు లేచి వస్తే మహాభక్తురాంటిరే చూచారా! ఏమిజరిగిందో? అంటుంది. తను చూడలేదని అంటారు. ఎవరు చూచారు ఎవరు చూడలా అంటాడు మౌలాలీ. నేను చూచానని అన్నమ్మగారు అంటుంది చూస్తే అనటం జరిగేది కాదేమో అంటాడు మౌలాలీ. ఆ కారులో వచ్చిన వారు ఎవరో తాను చెపుతానని కాబోయే మా నాన్నగారు అంటాడు మౌలాలి. కాబోవటమేమిటి నాన్నగారని చెప్పు అంటుంది అమ్మ. శర్మగారు, అన్నమ్మగారు ఒకరి ముఖం ఒకరు చూచుకొని ఆశ్చర్యపోతారు. అందరం గుడ్డివాళ్ళమే అంటారు. నీవెవరివి నాయనా? ఆ అమ్మాయి తోనే వున్నావా అని మౌలాలిని అడుగుతారు తాను బిక్షకుడు అని, ఆమె రక్షకురాలు అని మౌలాలి అంటాడు. సర్వ భక్షకుడు అయినప్పుడు బిక్షకుడు అవుతాడు. వాడు సర్వభక్షకుడు నాయనా అంటుంది అమ్మ

అమ్మతో ఒంటరిగా మాట్లాడాలని వుందమ్మ అని మౌలాలీతో అదృష్టవంతుడివి నాయనా మాకు ఉపనయన కాలంలో చెప్పే భవతీబిక్షాందేహి నీయందు ప్రస్ఫుటమై ప్రత్యక్షమవుతోంది అంటారు శర్మగారు.

మౌలాలీ మామూలుగా పంచలోనే పడుకొని నిద్రపోతాడు. తెల్లవారు జామున లేచి "ఎప్పుడు కృప కల్గునోయినకుల తిలకా" అని పాడుతుంటాడు. లోపలనుంచీ

"రామభక్తి సామ్రాజ్యం" పాడుతూ మౌలాలీ దగ్గరకు వస్తుంది. అమ్మ పాట విని అందరూ వచ్చి కూర్చుంటారు.

అన్నమ్మగారు అమ్మ పాట వినటం ఇదే కొత్త ఆమె ఆ ఆనందం పట్టలేక వింటూ గుండెల్లో చెయ్యి వేసుకుని మా అమ్మ పాడేది. ఇంకా ఎవరో అనుకుంటున్నా చూడగా చూడగా భాగవతంలో కృష్ణ లీలలు జ్ఞాపకం వస్తున్నాయి అనుకుంటుంది.

శర్మగారు అమ్మే-కృష్ణుడు కృష్ణుడే- అమ్మ అని కేక వేశారు ఎవరు అమ్మా అని అన్నమ్మ గారు ప్రశ్నిస్తారు. శర్మగారు అమ్మ పాదాలు పట్టుకుంటారు. కొంతమంది వీరికి మతి చెడిపోయింది లేకపోతే ఈ చిన్నపిల్ల కాళ్ళు పట్టుకోవటమేమిటని అనుకుంటారు.

అన్నమ్మగారు రాత్రి అమ్మను తను అనరాని మాటలన్నానని బాధపడింది. "అన్నదాని గురించి ఆలోచన ఎందుకు", అని వినిపిస్తుంది. ఎవరన్నారామాట అని ఆమె అందరినీ అడుగుతుంది. ఎవరూ అనలేదంటారు. ఏ శక్తి అయితే మీ చేత అనిపించిందో ఆ శక్తే మీకు వినిపించిందిలెండి అని మళ్ళీ వినిపిస్తుంది. సుబ్బయ్య తాతగారు వస్తారు. ఆరోజు ఉపన్యాసంలో కృష్ణుడు అమ్మరూపంగా వచ్చాడని తెలియచేస్తారు శర్మగారు. శర్మగారు చెప్పిన మాటలు విన్న అన్నమ్మ గారికి తనకు కలిగిన అనుభవాలు గుర్తుకు వస్తాయి. అమ్మకు టెంకాయ కొట్టి హారతి ఇచ్చి నమస్కారం చేసుకొని, లోగడకంటే అమ్మని జాగ్రత్తగా చూసుకుంటుంది అన్నమ్మగారు.

అన్నమ్మగారి చెల్లెలు ప్రసవించిందని కబురు వస్తుంది. ఈ పూట గీత విని వెళ్దామంటుంది ఆమె. ఎన్నిసార్లు గీతను విన్నా మన గీతను బట్టే జరుగుతుంది. మన గీతే ఆగీత అంటుంది అమ్మ కబురు తెచ్చిన మనిషి తొందరగా తీసుకురమ్మని చెప్తాడు

అమ్మ వింటూ లోపలికి వెళుతుంది. అందరినీ ఒకసారి చూచి శ్యామల ఇంటికి వెళ్తుంది. ఆమె పిన్ని చనిపోయిందని బాబాయి పెళ్ళి చేసుకుంటే తప్ప లేకపోతే పిల్లల్ని తానే పెంచవల్సివుంటుందని బాధపడ్తుంది. అటువంటి అవసరం వస్తే ఆమెనే తల్లియై పెంచమంటుంది అమ్మ. ఆ రకం మనస్సు ఇవ్వమ్మా అని కోరుకుంటుంది. శ్యామలను భయపడకని ఏది ఉన్నదో అది జరుగుతుంది. దిగులు పడవద్దని చెప్పి వస్తుంది అమ్మ

నాలుగు రోజులు శర్మగారు రాత్రిపూట సుబ్బయ్యగారిఇంటికి వస్తారు. అమ్మాకాత్యాయనీ, కరుణామయి, కల్పలతా, ప్రేమ వాహిని నిన్ను ఏ పేర్లతో పిలవాలో అర్ధం కావటంలేదంటారు. మౌలాలీ చెప్పిన విషయాలు వింటుంటే వేదాలు, ఉ పనిషత్తులు పురాణాలు అమ్మే సృష్టించిందనిపిస్తోందని, ఈ ప్రపంచమంతా అమ్మే అని, ఆ ఉద్దేశ్యం కూడా మౌలాలీయే కల్పించాడని అంటారు. అతను కారణజన్ముడు తల్లీ వాడు మహమ్మదీయుడు కాదమ్మా అంటారు. మతాలు, సిద్ధాంతాలు సంఘానికి సంబంధించినవా? లేక ఆధ్యాత్మిక స్థితికి సంబంధించినవా? అని శర్మగారిని అడుగుతుంది అమ్మ. సంఘానికి సంబంధించినవేనమ్మ అంటారు. శర్మగారు. ఆయన్ని ఒక్క మారు ఖురాన్, బైబిల్ చదవమని చెప్పింది. బైబిల్ సారాంశమేమిటమ్మ? అని అడుగుతారు. “మమాత్మ సర్వ భూతాత్మ” అంటుంది. ఖురాన్ “అహంబ్రహ్మాస్మి” అంటుంది అని చెప్పింది. గీతాసారం ఎవరు చెప్తారు గీతాసారం చెప్పేదేముంది అనుభవించటమే అంటుంది అమ్మ.

గీత ఒక్కటే కాదు. ప్రతీదీ అంతే అనుభవిస్తేనే తెలుస్తుంది. గీత కంఠస్థం చేసారు కదా! మీరు ఒక్కొక్క శ్లోకం ఒక్కో జ్ఞాన కణిక అన్నారు. ఆ జ్ఞాన కణికల్ని చేసిన వారిలో, చూసిన వారిలోను, నూరుకుతాగిన వారిలోనా లెక్క ఇది కాస్త వివరించి చెప్పండి బాబూ అంది అమ్మ.

శర్మగారు తన్నిబాబు అనవద్దని మౌలాలీ తో మాట్లాడినప్పటినుండి అమ్మగా చూచుకుంటున్నాను తన్ని అబ్బాయి అని పిలవమంటారు. తాను ఎన్నోచోట్ల తిరిగానని తనకి అటువంటి అనుభవం ఎక్కడా లేదని తాను ఎక్కడా జడిసి వుండలేదని, సాక్షాత్ అమ్మ ఆ పరమాత్మ స్వరూపం కాకపోతే ఆ రకమయిన అనుభూతి కలుగదు అని తెలియచేస్తారు.

కలియుగానికి కావలసిన అవతారామా అమ్మా? నీవు అని ప్రశ్నిస్తారు. ఏం కాదని అందరూ కలియుగానికి అవసరమయ్యే అవతారమెత్తామని చీమ, దోమ, నక్క, కుక్క, పాము అన్నీ అవసరమయ్యే వచ్చాయి అంది అమ్మ.

అదెలా అమ్మా! మాదంతా ప్రారబ్ధంతో కూడిన జన్మలు,. మీరు కారణజన్మలు అది కూడా చాలదనుకోండి అంటారు. అమ్మను గుర్తించిన తాను అక్కడా అక్కడా చెప్పుకుంటాను! పోనీ కొన్ని సందేశాలు ఇవ్వమ్మా అని అడుగుతారు. నేను చెప్పే

సందేశాలు మీరు చెపుతారా నిజంగా చెప్పండి చూద్దాం చీపురు, రోలు, రోకలి, పొయ్యి, కత్తి పీట నాలుగు వేదాలు. పంచమవేదంచేట. ఆ వేదాలతోనే స్త్రీలు నిత్యజీవితాలు గడుపుతారు అంటుంది. తప్పకచెప్తానంటారు శర్మగారు. మొగవారి వేదాలు ఏమిటని అడుగుతారు. అమ్మ పకపకానవ్వి వాటి ఫలితాన్ని అనుభవించటమే వారి వేదాలు అంటుంది. వేదమాత కదా! అందువల్ల వేదాలు ఆడవారి సొమ్ము అంటాడు మౌలాలి. నిజంగా ఆడవారి సోమ్ము అంటుంది. ఆడవారు ఆ-డవారే, మగవారూ ఆ-డవారే అంటారు శర్మగారు. ఆడవారంటే ఆడవారని కాదండి. ఈడనంతా ఆడవారేనని, ఆ ఉన్నప్పుడు ఈ వుందని, ఈ ఉన్నప్పుడు - ఆ వుందని వివరిస్తుంది.

మాతృమూర్తి ఒడిలో చేరానంటూ, శర్మగారు తనకు కలిగిన అనుభవాలన్నీ సుబ్బయ్య గారికి చెప్తారు. ఇవన్నీ తనకు అర్థం కావని మా చిదంబరానికి ఉత్తరం రాస్తాను. వాడు సంతోషిస్తాడు అంటారు.

★ ★ ★

# 39. వివాహనిర్ణయం

ఇంతలో చిదంబరం ఉత్తరం రాశాడని సుబ్బయ్యగారు అమ్మతో చెప్తారు. మీ నాయన నాగేశ్వరరావుకే ఇవ్వటానికి నిశ్చయించుకున్నాడుట. చిదంబరాన్నే పెళ్ళి చేయమన్నట్లు తాను బస్తా బియ్యం వంద రూపాయలు ఇస్తానన్నాడు అందుకు లగ్నాలు పెట్టమని రాసాడు.

శర్మగారు అమ్మకు పెళ్ళా? అమ్మకు పెళ్ళా? పుట్టుకతోనే అమ్మ అయిన అమ్మకు ఇంక పెళ్ళేమిటి తొలే అమై కూర్చుంటేనూ అంటారు. మా ఇంట్లో నాకున్న వుద్దేశ్యం మా ఆడవాళ్ళకు వుండదంటారు సుబ్బయ్య తాతగారు. నిజమే లెండీ ఇన్ని చెబుతూ అమ్మకు పెళ్ళి ఏమిటని నేను బాధపడటంలా! అంటారు తెలియక, తెలిసి, తెలియక అది ఎప్పుడు వుంటుందని అమ్మ చెప్పింది.

"నీవు పెళ్ళి చేసుకోవలసిందేనా" అంటారు శర్మగారు చేసుకోవటమెంతో చేసుకోపోవటంకూడా అంతే అంటుంది. అమ్మ సంసారానికి తగిన బాధలు వుంటాయిగా అంటారు. సంసారంలేని బాధలు గూడా వుంటాయిగా అంటుంది అమ్మ.

సంసారమంటే ఏమిటి? అని శర్మగారిని అడుగుతుంది. తనకు తల్చుకుంటేనే బాధ సంసారం అంటారు. ఆ తల్చుకోవటమే సంసారం అంటుంది. తల్చుకోక పోతే వుండకూడదా అమ్మా? అంటారు అంటే సంకల్పమే సంసారం ద్వంద్వంగాతోచే సంకల్పమే దైవత్వం అంటుంది అమ్మ.

బ్రహ్మచర్యానికి గొప్ప స్థితి ఇస్తారుగదమ్మా అంటారు. ఆ స్థితి ఇచ్చేది కాదు. వచ్చేది. మనం ఎక్కడ నుంచీ వచ్చామో అక్కడ నుంచీ వస్తుంది అంటుంది. మేము "నీ పొట్టలోంచి వచ్చావమ్మా" అంటారు. "ఆ వచ్చేది కూడా నా పొట్టలోంచే వస్తుందని" చెప్పింది.

బ్రహ్మ చర్యాని గురించి నీ ఉద్దేశమేమిటంటారు. బ్రహ్మతో చరించే వాడిని గురించి మన ఉద్దేశాలేమిటి? ఎవరు ఎందుకు పుట్టారో ఆ పని చేస్తారు. వొద్దొన్నామానలేరు. చెయ్యమంటే ఎట్లా చేయలేరో. మానమంటే అట్లా మానలేరు

అంటుంది అమ్మ. ఇదేనా బ్రహ్మ చర్యమంటే అంటారు ఇపుడు మీ చర్య ఏమిటో చెప్పండి అంటుంది. అమ్మతో చర్చిస్తున్నాను. అమ్మ అయినా బ్రహ్మఅయినా ఒక్కటేనంటారు. తనవి అనుభవం లేని మాటలంటారు శర్మగారు. "విన్నవాడు విమర్శిస్తాడు. కన్నవాడు వివరిస్తాడు వినటం శాస్త్రం. కనటం అనుభవం, అసలు పెళ్ళి అంటే ఏమిటి నాయనా?" అంటుంది. వివాహం, కళ్యాణం ఇట్లా ఒకేదానికి అనేక పేర్లు రాసారమ్మ అంటారు. అమ్మ చెపితే బాగుంటుందని చెప్పమంటారు శర్మగారు.

తనకొకటే తెలుసు "ఒక పెన్నిధి అండను చేరటమే పెళ్ళి" అనుకుంటున్నాను. అదే పరిణయం. కళ్యాణమంటే కళంకరహితంగా మనో వాక్కాయకర్మలను మరోక వ్యక్తికి అర్పణచేయటమే కళ్యాణం. వివాహమంటే వి-వా అంటే ఒక రకంగా వివాదరహితమేనటువంటి వివాదం అంటే రెండు బిన్నాభిప్రాయాలు ఒకచోట కలిసి ఏకత్వంగా కాలం గడపటం అదీ చాలకపోతే ఆ రెండు భిన్నాలు ఏకమైనపుడే వైవాహికం కావచ్చు అంటుంది.

పెళ్ళి ఎపుడో అయిపోయింది. వివాహం కావాలి. వివాహంలో అన్నీ ఇమడివున్నాయి. సర్వాన్ని అనుభవిస్తున్నా, సర్వాన్ని విడిచి పెట్టేదే వివాహం అంటుంది. అటువంటి వివాహాన్ని చేసుకోబోతున్నావా అమ్మ! అంటారు శర్మగారు.

అర్జునుడు యుద్ధానికి వెళ్లేముందు ఎలా వుందో నీవు పెళ్ళిచేసుకోబోతుంటే తనకు అలా వుందని శర్మగారు అంటారు. "అయితే నేను జయిస్తానన్నమాట, నేనేమైనా యుద్ధానికి వెళ్తున్నానా" అంటుంది. లేకేమమ్మా ధర్మమనే ఖడ్గాన్ని చేతబట్టి యుద్ధానికే వెళ్తున్నావు అంటారు. "సత్యమైన ధర్మాన్ని చేతబడితే నిత్యమైన వస్తువేదో తెలుస్తుందని చెప్తుతుంది". అమ్మ

తనకు తోచినట్లు పద్యాలు రాసుకురమ్మంటావా పెళ్ళికి అంటారు. పద్యాలు రాసుకువచ్చే రోజంటూ వస్తే అమ్మను గురించి ఉపన్యాసాలే చెప్పుకుందురుగాని పెళ్ళికి కూడా తెలియని వాళ్లు ఎందుకో వచ్చినట్లుగా రండని చెప్తుంది.

చిదంబరరావుగారు లగ్నం తొందర్లో పెట్టమని, ఆలస్యమయితే సీతాపతి మనస్సు మరిపోతుందేమో అన్నారు. జీవితంలో ఏఏ ఘట్టాలు ఎలా జరగాలో అవి జరిగిపోతున్నాయి. వాటికి ఎవరూ అడ్డురాలేరు కదా! అనుభవించే యోగ్యత

వున్నప్పుడు అది బాధగాని, సుఖంగాని తన చేతులతో తను తెలుసుకోకుండా చేసుకోవటం జరుగుతుంది. ప్రతి ఫలం తెలియదు తెలిపినా తెలియదు. తెలిసినా తప్పదు. అంటే "అనుకున్నది జరగదు తనకున్నది తప్పదు" అనేది సర్వకాల సర్వావస్థలయందు ప్రత్యక్షమవుతూనే వుంది.

ఎంతమంది వున్నా అమ్మ మంచి చెడ్డలను చూచేవాళ్ళు ఎవరూ లేరని సుబ్బయ్య తాతగారు బాధపడ్డారు. "మంచి-చెడూ రెండూ చూడకపోతే ఇబ్బందే లేదు. ఏదో ఒక భాగం చూడకుండా వుండలేరు మంచి చెడూ  అంటే వేరే ఏముంది లెండి ఒకరికి ఇష్టమయినది మరొకరికి అయిష్టం అంటుంది. అమ్మ చూడగా అగ్నిగుండంలో దూకబోతున్నట్లుంది అంటారు తాతగారు. "నా బాటే నిప్పులబాట. నిప్పులబాటలో నడక సాగించ బోతున్నాను. నా నడకతో చరమదశకయినా చల్లారుతుందో, అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లుతాయో" అని అమ్మ అంది. ఇప్పుడు కొత్తగా ఏనిప్పుల బాటేముంది లేమ్మ. పుట్టినప్పటినుండీ నిప్పులలోనే తిరుగుతున్నట్లే వుందని తన బాధను వ్యక్తం చేస్తారు చిదంబరరావుగారు.

ఇది వరకు హిమాలయపర్వతం లాంటి మీ అండన్నావుంది. మరికముందు అదికూడా వుంటుందన్న నమ్మకం లేదు. ఒకమాట వుంది. ఆ మాటను తూచా తప్పకుండా నడవాలంటే ఆ నడక నిప్పులబాటలో నడిచినట్లే. ఆ మాట ఒకనాటి బాటకాదు కదా! జీవితానికి సంబందించి కలకాలం మిగిలేమాట. ఆ మాట ఒక మహామంత్రం. ఆ మంత్రం పఠించిన తరువాత గదా గమ్య స్థానానికి చేరేది. జీవితంలో ఎటువంటి స్థితిలోవున్నా సుడిగుండాలు వస్తుంటాయి. మంత్రం అంటే 'సరేమంత్రం'. చిదంబరరావు తాతగారి కళ్ళు గంగాయమునలు ఆనకట్టలు తెగినట్లుగా నీళ్ళు కారుతూనే వున్నాయి. ఈ ప్రవాహం తన నిప్పుల బాటను చల్లార్పుతాయి అంటుంది అమ్మ. త్రివేణి సంగమం అన్నట్లుగా తల్లోంచి చెమట బొట్లు పడి శరీరమంతా మంచుకొండలా వుంటుంది.

పైనుంచి చెమట నీటి బొట్ల రూపంలో ప్రవహిస్తు వుంటుంది. చిదంబరరావు గారు అమ్మ పెళ్ళి చేసుకోకుండా వుంటే లోకకళ్యాణం చేస్తుందని తన ఉద్దేశాన్ని తెలియచేసారు, "నేనే కళ్యాణం చేసుకోకపోతే లోకానికి ఏమి కళ్యాణం చేస్తానని" అంటుంది అమ్మ.

★ ★ ★

# 40. వివాహం

అమ్మ పెళ్ళి మే 5వ తారీకు తెల్లవారు జామున 5.30ని॥లకు నిశ్చయం చేయబడుతుంది. సీతాపతి తాతగారు వందరూపాయలు ఒక బస్తా బియ్యం ఇస్తానంటారు తనకు పెళ్ళికి రావాలని కూడా లేదంటారు.

చిదంబరరావుగారు "నీ కూతురు పెండ్లి నీకే అవసరం లేకపోతే మా అందరికీ ఏమి అవసరం" అని సీతాపతిగారితో అంటారు. "నీవు మాత్రం వూరికే చేస్తున్నావా, నీ అన్న మనుమరాలిని, నీ అన్నకూతురు నీ చేతిలో పెట్టి పోయిందని చేస్తున్నావు. అవసరం లేకపోతే అక్కడ పారేసిపోండి. ఎట్లా జరిగితే అట్లా జరుతుతుంది" అని సీతాపతిగారు అంటారు.

మే ఒకటో తారీఖున అమ్మను పెళ్ళి కూతుర్ని చేయటానికి సుబ్బయ్య తాతగారు తెనాలి తీసుకు వెళ్తారు. నాల్గవ తారీఖున సాయింత్రం అందరూ కలసి బాపట్ల వస్తారు.

నాల్గవ తారీఖు ఉదయం రేటూరులో స్నాతకం చేసుకుని సాయింత్రంకు మొగ పెళ్ళివారు బాపట్ల చేరుతారు. స్నాతకానికి రాఘవరావు మామయ్య రేటూరు వెళ్ళి వస్తారు. పెళ్ళికి మౌలాలీ, శ్యామల, శర్మగారు వస్తారు.

పెళ్ళివారు మేళాలు తెచ్చుకోరు. విడిది రాయప్రోలు సుబ్బారావుగారింట్లో. చిదంబరరావుగారు మాట్లాడారనుకుంటారు. వాకిట్లో వీధి భాగవతం కోసం మేళాలు వాయిస్తుంటారు. వాటితో వెళ్ళి పెళ్ళి వారిని విడిడిలో దింపి వస్తారు.

అమ్మకు తలంటి పోసి గౌరీ పూజకు కూర్చోబెడతారు. తెనాలి వారంతా తల్లి లేదని కంట తడిపెడ్తుంటారు. సీతాపతిగారు పెళ్లి పీటల మీదకు రానంటారు. అందరూ తలా ఒక మాట అనటం విన్న అమ్మ సీతాపతిగారి పాదాలకు నమస్కారం చేసి "నాన్నా ఏదైనా జాతక ప్రకారం జరుగుతుందని చెబుతారు కదా! నలుగురిలో నీవెందుకు అమర్యాద పాలవటం. అమ్మ లేనేలేదు. మీరుకూడా ఇట్లా అంటే ఎట్లా అని ఆయన ముఖంలోకి చూచి" వెళ్తుంది.

అందరూ అదేమిటి పూజచేస్తూ అవాచకంగా లేచి పోయావేంటి? అంటారు. తాను పుట్టడమే ప్రపంచానికి అవాచకం అంటుంది అమ్మ. ఆ మాటకు ఆరోజంతా దుఃఖపడుతూనే తిరుగుతారు చిదంబరరావుగారు. గౌరీ పూజకు కూర్చున్న అమ్మ పెళ్ళి వారికి ఫలహారాలు అందలేదనీ చిదంబరరావుగారి దగ్గరకు వెళ్ళి అడుగుతుంది. అవన్నీ తాను చూచుకుంటానని కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ చెప్తారు. "నీవు లేకపోతే ప్రపంచమే లేదు నా దృష్టిలో నీకు పూజ ఏమిటి? నలుగురూ అనుకొని పోతారని గాని వెళ్ళి కూర్చోమ్మా నీవు చేసేదంతా నలుగురికోసమేగా" అని అంటారు.

అమ్మ గౌరీదేవి అని పూజించే గుండ్రాయి మీద నాన్నాగారి రెండు పాదాలు వుంటాయి. గుండ్రాయి భూమి అయితే పాదాల క్రిందకు చాలలేదు. సర్వ వ్యాప్తమయిన ఆ పాదాలు మీద, ఎక్కడెక్కడో పూజ చేసినా ఆ పాదాల మీదే పడుతున్నాయి గదా! అనుకుంటుంది గుండ్రాయికి పూజ ఏమిటి అనుకున్న అమ్మ ఆ పాదాలే లేని చోటు లేదనుకుని ప్రతి వస్తువులో ఆ పాదాల్నే చూస్తుంది. గౌరీపూజ అయిపోతుంది.

మేనమామ చంద్రమౌళి సీతారామయ్యగారు గంపలో అమ్మను కూర్చోబెట్టుకుని కళ్యాణమండపంకు మోయలేక మోయలేక తీసుకెళ్తారు. మామయ్యకు ప్రపంచమంతా మోస్తున్నట్లుంది అని అంటుంది అమ్మ. ఆ మాట వినగానే ఆయనకు నవ్వువస్తుంది. నవ్వుతూ తట్టపడేసేవు అంటారు. తట్ట, దించబోయేవేళకు తేలిక అయి పెద్ద గుమ్మడి పండు దింపినట్లు అమ్మను తెలికగా యెత్తినట్లు పీటమీద కూర్చోబెడతారు. దానితో ఆయన మేనమామ తనం సార్ధకమయింది.

తెరచాటున పెళ్ళికొడుకు తెర ఇవతల సీతాపతిగారు కామేశ్వరమ్మ గారు మధ్యలో అమ్మ. తెరచూడగానే అమ్మకు త్యాగరాయకృతి "నాలో తెరతీయగారాదా" అని గుర్తువస్తుంది. తెరతొలిగితే, కనపడేది భగవంతుడేగా అనుకుంటుంది అమ్మ. అమ్మా నాన్న ఇద్దరూ కలసి తెరచాటునున్న భగవంతుని సాన్నిధ్యంలోకి చేరుస్తున్నారు. అది వారి కర్తవ్యం అని అనుకోవటంతో ప్రతి తల్లి దండ్రులకు వారి బాధ్యతను గుర్తు చేస్తోందా అని అనిపిస్తుంది. సీతాపతి గారు, కామేశ్వరమ్మ గారు పాలుబోసి నాన్నగారి కాళ్ళు కడుగుతుంటే "వీళ్ళ పాలబిడ్డ నన్ను వాళ్ళ పాల బడేస్తున్నారనుకుంటుంది అమ్మ"

కళ్యాణ కలాపమంతా జరుగుతుంది. అమ్మను నాన్నగారి పక్కన చేర్చి కాడినెత్తిన పెట్టి ఆవుపాలు, ఆవునెయ్యి వదిలి పెడతారు. ఆరంధ్రమే సుషుమ్నా నాడి అనుకుంటుంది. ఆ చిన్న రంధ్రం గుండా బాట తప్పక కాడిని నెత్తిన వేసుకుని జీవనయాత్ర సాగించాలి. పెళ్ళి కూతురు, పెళ్ళి కొడుకు ఇడా పింగళా నాడులనుకుంటుంది. కుడి ఎడమలు రెండూ ఒకటిగా నడవవలసిందే ఒకకాలు వేసినప్పుడు మరోకాలు తీస్తుండాలి. రెండు కాళ్ళు సమానంగా నడవవలసిందే.

జీలకర్ర బెల్లం కలిపి నూరిన ముద్దను పెళ్ళికూతురి చేత పెళ్ళి కొడుక్కు పెళ్ళికొడుకు చేత పెళ్ళి కూతురుకు పెట్టిస్తారు. నాన్నగారి చెయ్యి అమ్మ నెత్తిన పెట్టగానే మంచుకొండ తగిలినట్లు అనిపిస్తుంది. నాన్నగారి నెత్తిన అమ్మ అతిసుకుమారంగా పెడ్తుంది. జీలకఱ్ఱ బెల్లం వాటంతటవే తలలో ఇరుక్కుంటాయి.

నరాలు లాగుతున్నట్లు, నరాలు పట్టుకున్నట్లు, శరీరంలో ఇంకేదో చేరినట్లు నాన్నగారు భావిస్తారు. శరీరం బరువెక్కుతుంది. శరీరం మనస్సు స్థంబించి పోతాయి. ఏది చెప్పినా త్వరగా చేయటానికి చేతులురావు. ఏదో ఆలోచిస్తుంటారు. అమ్మ నాన్నగారి పాదాల వంకే చూస్తుంటుంది.

నాన్నగారు అమ్మ సహాస్రారంలో పెట్టిన బెల్లం జీలకఱ్ఱ చూస్తువుంటారు. సూత్ర ధారణకు మేళాలు వాయిస్తారు. చుట్టుపక్కల చెట్లు, చేమా, పందిళ్లు సర్వం సూత్రధారణ చూడటం కోసం ఉవ్విళ్ళురుతుంటాయి. సూత్రధారణకు నాన్నగారు నడుం వంచుతారు. అమ్మ మోకాటి మీద అన్చిన తలను కొంచెం పక్కకు వంచి నాన్నగారు ముడి వేయటానికి వీలుగా పెడుతుంది. నాన్నగారు అమ్మ మెడలో మూడుముళ్ళు వేస్తారు. "నడుం వంచి నాన్నగారు కట్టారు. తలవంచి తాను కట్టించుకున్నాని" అమ్మ అనుకుంటుంది. అమ్మకే కాదు కళ్యాణం లోక కళ్యాణం కోసమే. అంతా అక్షతలు వేస్తారు. దానికర్థం క్షరం కాకుండా అక్షయంగా వుండటమే వారి ఉద్దేశం అనుకుంటుంది. పళ్ళాలతో తలంబ్రాలు తెస్తారు. మూడు దోసిళ్ళు, మంత్రరూపంగా బ్రాహ్మలు ఒకరిచేత ఒకరికి పోయిస్తారు. ఒకరికి తోచిన తలంపులు మరొకరికి చెప్పుకోవాలని అనుకుంటుంది. తరువాత పెళ్ళికొడుకు పెళ్ళికూతురు పళ్ళెంలో ఒక్క గింజ కూడా మిగలకుండా పోసుకున్నారు.

పెద్దముత్తైదువులంతా కలసి కళ్యాణ హారతి ఇస్తారు. బ్రాహ్మలులేచి సదస్సు

జరుపుతారు. బ్రాహ్మణులంతా కలిసి వేదం పఠిస్తారు. దైవంశ సంభూతులై యెల్లప్పుడూ సుఖంగా వుండమని దీవించటం కాబోలు అని అమ్మ అనుకుంటుంది. తాతగారు దక్షిణ తాంబులాలు ఇస్తారు. వారిని దైవసమానంగా భావించి ఇవ్వటం యీ సంభావన అని అమ్మ భావిస్తుంది.

స్తాలీపాకం అంటే అగ్నిహొత్రాన్ని ప్రజ్వలింపచేసి, దాని మీద కొత్త గిన్నెలో నీరు బియ్యం వేసి నాన్నగారు, పెడ్తారు. స్తాలీపాకం జరుగుతుంది. నాన్నగారి చేతిలో నెయ్యి అన్నం పెడ్తుంది. దానిని నాన్నగారు అగ్నిహొత్రంలో వేస్తూ వుంటారు. ఆ రోజునుంచీ అన్నం వండి పెట్టే అధికారం వచ్చిందనుకుంటుంది. ఇకనుంచీ నాన్నగారు ఏ పని చేస్తున్నా తను వుండాలి కాబోలు దానినే గృహస్థాశ్రమం అంటారని అనుకుంటుంది. పెళ్ళిలో అమ్మ పరధ్యానంగా వుండటం చూచిన వారు అమ్మకు ఈ పెళ్ళి ఇష్టం లేదేమో అనుకుంటారు.

నాగబలి, నవధాన్యాలు మూకుళ్ళలో పోయించి మట్టిపోసి, నీళ్ళు పోయించి అమ్మ నాన్నలచేత బ్రాహ్మణులకు దానాలిప్పించి, అమ్మ మెళ్ళో నాన్నగారి చేత నల్లపూసలు కట్టిస్తారు.

ఒక బిందెలో నీళ్ళుపోసి వుంగరం, మట్టెలు అందులో వేసి పెళ్ళికూతుర్ని పెళ్ళికొడుకుని తీయమంటారు. బంగారమంటే ఎక్కువని వెండి తక్కువని అంటారు. ఒకే బిందెలో రెండు చేతులు ఆడుకోవటం. గెలుపు-ఓటమి, మంచి-చెడు, హెచ్చుతగ్గుల జీవిత యాత్ర చెయ్యాలి. యీ బిందెలతో నీళ్ళు తెచ్చుకుని ఆ గిన్నెలతో అన్నం వండుకుని ద్వంద్వాలను కాళ్ళ చేతుల తన్నుకుంటూ ప్రకృతి పురుషులిద్దరూ యీ ప్రకృతిని నడుపుతారు అని అమ్మ అనుకుంటుంది.

బిందెలోకి చేయి పెట్టినప్పుడల్లా న్నాగారి చేతిని స్పర్శిస్తూందే గాని వస్తువులను తాకదు. నాగబలి పూర్తి అవుతుంది.

అమ్మా సత్రంలో మీతో వచ్చిన మీ భక్తుడు మౌలాలీ ఇంకో అమ్మాయి వచ్చారు. వాళ్ళను లోపలికి తీసుకురానా అని శర్మగారు అడుగుతారు. తానే వాళ్ళ లోపల వున్నానని వాళ్ళను ఈ లోపలకు తీసుకురానక్కరలేదంటుంది. పెళ్ళివారు వస్తారు. భోజనాలకి అనుకోకుండా రైలుకు వెళ్ళే జనం, రైలు దిగే జనం పెళ్ళి చూడటానికి

పందిట్లోకి వస్తారు. అమ్మ అందరినీ ఫోంచేసి పొమ్మని లోపలకు వెళ్ళేటప్పుడు చెప్పింది. ఎంత మెల్లిగా చెప్పినా ఎవరికి వారే ప్రత్యేకంగా వాళ్ళను ఉండమన్నట్లు వినబడుతుంది. అంతా సంచులు పట్టుకుని నిలబడిపోతారు. బంధువులు పదిమంది. ఆ వచ్చిన జనంతో పందిరి పట్టలేదు రెండు బంతులలో లేపినా ఇంకా మిగిలేవున్నారు.

చిదంబరరావు తాతగారు ఎవరమ్మా? ఈ జనమంతా మన వుళ్ళో పిల్చిన వాళ్ళు అట్లానే నిలిచిపోయారు. చేయించిన వంట చాలదు. ఇప్పుడేం చేయాలి? వీరందరినీ ఎవరుండమన్నారు అని విసుగూ, కోపం మిళితం చేసి బస్తా బియ్యం ఏం సరిపోతాయని అంటారు.

ఇప్పుడు ఎన్ని వండించారని అమ్మ అడుగుతుంది. ఇరవై మానికలు వండించానమ్మా! పెళ్ళివారు వస్తున్నారు తొందరగా చెప్పమంటారు. ఎందుకలా గాభరాపడతారు పెళ్ళయిన పెళ్ళివారేగా కొత్త పెళ్ళివారు కాదుగా అంటుంది. పందిరి చిన్నది కావటంతో జనం ఎక్కువగా ఉన్నట్లు కనపడుతున్నారు. మొత్తం ఐదారు వందల జనంకంటే ఎక్కువ లేరు. ఫలహారాలు తిన్నవారు యేం తింటారు. ఏమి ఆదుర్దా వద్దు. వడ్డించండి అని అమ్మ చెప్తుంది. అమ్మ చెప్పిన మాటలతో ధైర్యం చాలక వంట బ్రాహ్మల చేత ఎసర్లు వేయిస్తారు.

మొదటి బంతి లేస్తుంది. అన్నం మిగిలేవుంటుంది. ఎప్పటికప్పుడు చాలనట్లు వుంటుంది. అధైర్యంతో వంట చేయిస్తారు. అయినా ఆ రాశే అందరికీ సరిపోయింది. వేసిన గుండిగలు దించకుండానే బంతులు లేచాయని నవ్వుతారు చిదంబరరావుగారు. వేసవికాలం ఏం తింటారు? నీటితో కడుపు నింపుకుంటారు. జరిగేది కళ్యాణం కనక కళ్ళమంటలు, దేహమంత వేడిగాలికి కాలిపోతున్నా ఆ బాధను, వాళ్ళ ప్రయాణాలను మరిచి నుంచున్నారు అంటుంది అమ్మ. పిలిచిన బంధువులకు ఈ పెట్టు చాలదు అంటుంది. మీరు చెప్పినట్లుగానే పిలవాపెట్టనివారు. మనం పెట్టకుండానే మాటతోనే కడుపు నిండివుంటుంది. మూడు దాటింది ముప్పై మానికలు వండించాను. మొత్తం యాభై మంది కూడా జనం లేరనుకుంటారు. కానివ్వండి యేదో ఒకటి జరుగుతుంది. వీళ్ళంతావస్తారు అనుకోలేదు కదా! అంటుంది.

చేతిలో పైకం లేదమ్మా ఏంచేయాలనీ అంటారు. వెంటనే తన చేతికున్న

నాగవత్తులను తీసి ఇస్తుంది. అప్పికట్ల కరణం గారైన కొండముది సుబ్బారావుగార్ని బ్యాంకులో పెట్టిడబ్బు తీసుకురమ్మంటారు చిదంబరరావుగారు.

సుబ్బారావుగారు చిదంబరరావు గారి దగ్గరకు వెళ్ళి "ఇందాక నా చేతికి ఇచ్చినవి ఎవరివి?" అని అడుగుతారు. ఎవరివో అయితే ఎందుకిస్తానురా, అమ్మాయివే నీకు తెలియని పరిస్థితులా" అంటారు చిదంబరరావుగారు. ముందు చెప్తే డబ్బు సర్దుబాటు చేసేవాడిని, కనీసం కళ్యాణం రోజన్నా అమ్మ చేతినుంచీ తీయకుండా వుండవలసిందంటారు సుబ్బరావుగారు. తనకప్పుడు తోచలేదని అదీకాక వాళ్ళ నాన్న సొమ్ము అమ్మి చేయిండన్నమాట ఒకటే గుర్తుందని బాధపడ్డారు. తనకు అవి బ్యాంకులో పెట్టి తిరిగి వస్తున్నపుడు కానీతోచలేదని సుబ్బారావుగారు అంటారు జరిగిపోయిన దానికి బాధ ఎందుకని చిదంబరరావుగారు అంటారు.

సాయింత్రం ఏడుగంటలకు బంతులాడిస్తూ ముత్తైదువలు పాటలు పాడుతూ వేడుకచేస్తారు. అమ్మ, నాన్నలచేత పేర్లు చెప్పిస్తారు. అమ్మను పాటపాడమని అడుగుతారు. అమ్మ, పినతల్లి కూతురు సావిత్రి కలిసి "వెడలెనుకోదండపాణి" అనే కృతి పాడతారు. ఇంకోకటి పాడమని అడుగుతారు. "రామపాదమానీకృపచాలు" అనే కృతి అమ్మ ఒక్కతే పాడుతుంది. "మరుగేలరా ఓ రాఘవా" అనే కృతిని ఇద్దరూ కలిసి పాడుతారు.

రాత్రి పదిగంటలకు పాన్పు వేసి అమ్మను, నాన్నను కుర్చోబెట్టి దంపతులకు తాంబూలాలు ఇప్పిస్తారు. అమ్మ చేతులు పాలలో పెట్టించి నాన్నగారి తాతగారు బ్రహ్మండం శేషయ్యగారికి ఆయన భార్య రత్తమ్మగారికి మిగిలినవారి కుటుంబసభ్యులకు అద్దించి, బట్టలు పెట్టించి పిల్లను అప్పజెప్పుతారు.

అమ్మకు వడిగంటిబియ్యం కట్టి పెద్దలందరికీ నమస్కారాలు చేయిస్తారు. నాన్నగారికి కొంగులు ముడి వేసారు. భజంత్రీ వాళ్ళు "పోయిరాగదమ్మ జానకీ" అని పాడుతూ వుంటారు. ఆ పాటకు స్త్రీలకు, పురుషులకు కూడా కంటివెంబడి నీళ్ళు కారుతుంటాయి. జిల్లెళ్ళమూడి నుండి రెండెడ్లబళ్ళు వస్తాయి. వాటిలో బయలుదేరి అమ్మ అత్తవారింటికి రేటూరుకు పయనమైంది.

**- శుభం -**